శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

ఆంధ్రవచనము.

నాల్గవభాగము. (1011 - 1360)

---

బ్రహ్మశ్రీ, కేతవరపు - వేంకటశాస్త్రిగారిచే

ప్రణీతము.

శ్రీదేవరాజసుధీమణీపరిశోధితము.





ఆనంద ముద్రణాలయ ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర అన్డ్ కంపెనివారిచే

ప్రకటితము.

1926

---

VI. విషయసూచిక.



## షష్ఠస్కంధము.

## సప్తమస్కంధము

# పటముల పట్టిక.

(భాగవతము 4-వ భాగము.)

---

ఓరాజేంద్రా ! భూమండలపరిమాణ మిదియె. నేను దత్ప్రమాణమును, దానియందలి విభాగములను వివరించి చెప్పితిని. భూమండలపరిమాణమును బట్టి యోజించి మండలపరిమాణ విదులు ద్యుమండలపరిమాణము నైత మేఁబదికోట్ల యోజనముల పరిమితి గల దనియే చెప్పుచున్నారు. ఒకదానిపరిమాణమును బట్టి రెండవదానిపరిమాణమును జెప్పుట కెట్లు వలనుపడు నని యడుగవచ్చును. భూమండల ద్యుమండలములు తిరుగలి చాలవలె నుండును. కావునఁ గ్రిందిచాతిపరిమాణము తెలిసినతోడనే మీఁదిచాతి పరిమాణము తెలియవచ్చినట్లు భూమండలపరిమాణముచే ద్యుమండలపరిమాణము తెలియ నగును. ఆ రెండుమండలములకును మధ్యమున నంతరిక్షము గలదు. అదియే భూమండలముల సంధించుచున్నది. ఆ యంతరిక్ష మధ్యమున నుండియే తేజస్సులలో శ్రేష్ఠుఁ డయిన సూర్యుండు తన ప్రభాసంతతిచే ముల్లోకంబులను బ్రకాశింపఁజేయుచున్నాఁడు; మఱియుఁ దపింపఁజేయుచున్నాఁడు. "ఓయీ! సూర్యుఁ డొక్కచో నుండునా? లేక సంచరించునా? సంచరించుచుండిన సర్వకాలములందు నొక్కరీతిగా సంచరించునా? లేక వివిధగతులతో సంచరించునా? క్రిందికి సంచరించునా? లేక మీఁదికి సంచరించునా? లేక రెండువైపులను సంచరించునా? ఏ యేస్థానములందు సూర్యుఁడు సంచరించును ? అతని గతివలన నహోరాత్ర విభాగమె ట్లేర్పడుచున్నది? వీనిఁ దెలిసికొన నీవు కుతూహలపడుచుండవచ్చును. కావున వానిని సాకల్యముగా వివరించెదను వినుము. ఓరాజా ! భగవదాత్మకమై శింశుమార మను పేరు గల కాలచక్రము కలదు. అది సమస్తగ్రహములకును , నక్షత్రములకును

నాధార మయినది. అది నూటయెనుఁబదిమూఁడుమండలాకార రేఖలచే నొప్పుచున్నది. అంతర్వలయ మనియు, బహిర్వలయ మనియు, మధ్యవలయ మనియు మూఁడుభాగములు విభజింపఁ బడినది. ఈ వలయత్రయమును బట్టియే సూర్యునికిఁ గతిభేద ములు గలుగుచున్నవి. మఱియు సూర్యున కారోహణ మనియు, నవరోహణ మనియు,సమ మనియు మూఁడవస్థలు గలవు. అందు సూర్యుండు బహిర్వలయము నుండి యంతర్వలయమున కరు గుట యారోహణ మనఁబడును. దానినే యుత్తరాయణ మం దురు. అట్లె యంతర్వలయమునుండి బహిర్వలయంబున కరు గుట యవరోహణ మనఁబడును.దానినే దక్షిణాయన మందురు. మధ్యమండల గమనము సమావస్థ యనఁబడు. అదియె సమ కాల మనఁబడును. దానినే వైషువతసమని యందురు. ఆ సూ ర్యుఁడు భగవంతుఁడు నియమించిన కాలము నతిక్రమింపక సదా వర్తించుచుండును. అం దారోహణమందుఁ జిరకాలము పట్టు టచే నహంబులు దీర్ఘంబులుగను, రాత్రులు హ్రస్వంబులుగను నొనర్పఁబడును. అవరోహణమందు శీఘ్రగతి యుండును గాన తద్రూప మయిన దక్షిణాయనమునందును రాత్రులు దీర్ఘంబులు గను, బవళ్లు హ్రస్వంబులుగను నొనరించు. రెండయనముల లోను సంధికాలము కొంతవఱకు సూర్యుండు సమగతి నవలం బించుటచే నప్పు డహోరాత్రములు సమములై యుండును. ఓ నరపాలా! శింశుమారచక్రమందు మకరాద్యాకార రేఖారూప మగుమండలముల నక్షత్రాభిముఖిమై వర్తించుచు నహోరా త్రముల దైర్ఘ్యాదుల నొనర్చుచున్నాఁడు.ఏయేరాసులందు సూ ర్యుఁడున్నప్పుడు దైర్ఘ్యాద్యవస్థలు సంభవించుచున్నవో చెప్పె

దను వినుము. సూర్యుండు వృషభ మిథున కర్కాటక సింహ కన్యారాసులందున్నప్పుడు పవళ్లు దీర్ఘములగును. అప్పుడురాత్రులు హ్రస్వము లగును. పై నుదాహృతము లగురాసులందు రవి వర్తించినప్పుడు ప్రతిమాసమందును రాత్రులం దొక్కొక గడియతఱిగి పవళులం దొక్కొకగడియ యధిక మగుచుండును. *అట్లే సూర్యుఁడు వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము,

* ఇందులకు వేఱువిధముగా వైష్ణవపురాణమునఁ జెప్పబడినది. సూర్యుఁడు మకరరాశిని బ్రవేశించినప్పు డుత్తరాయణము ప్రారంభించును. మకరకుంభమీనములందు వర్తించునప్పుడు రాత్రిందివంబులు సమములయి యుండును. పిమ్మట మేష వృషభ మిథునములందుఁ బ్రతిదినంబును దినంబులు వర్ధిల్లుచు రాత్రులు తఱుగుచుండును. అందులో మిథునాంతమునఁ బవళ్లు మిక్కిలిదీర్ఘము లగును. అట్లె సూర్యుఁడు కర్కాటకరాశిని బ్రవేశించి దక్షిణాయనంబును జేయుచున్నాఁడు. అప్పుడు కర్కాటకసింహకన్యారాసులం దున్నప్పుడుసమముగా నుండి తక్కినతులావృశ్చికధనూరాసులందు రాత్రులు దీర్ఘము లయి పవళ్లు హ్రస్వ మగుచుండును. కులాలచక్రముయొక్క యంతమువలె శింశుమార మతివేగముగాఁ జరించును. కాన నందున్న సూర్యుఁడు దక్షిణాయనమున మిక్కిలి శీఘ్రముగాఁ జరించుచు నధికదూర మతిక్రమించును. కావుననే సూర్యుఁడు పంద్రెండుముహూర్తములచేత నే పదుమూఁడునక్షత్రములను బదునాల్గవదానిలో సాభాగమును నతిక్రమించుచున్నాఁడు. కులాలచక్రము నాభిసమీపభాగము మిక్కిలి మందముగాఁ దిరుగును. అట్లె యుత్తరాయణమున శింశుమారముచక్రముయొక్క నాభికి సమీపస్థుఁడై సూర్యుఁడు మందగతి కలవాఁ డగును. కావుననె తక్కువదూర మైన నధికకాలముచేఁ గాని యతిక్రమింపలేకున్నాఁడు. అప్పుడు పదునెనిమిది ముహూర్తములకాలముచేతఁ గాని పదుమూఁడునక్షత్రములను బదునాల్గవదానిలో సాబాలును నతిక్రమింపలేకున్నాఁడు. ఉత్తరాయణమునందు రాత్రిఁ బంద్రెండుముహూర్తములచేత నే

మీనము నాఁబడు నీయైదు రాసులందును వర్తించునప్పుడు రాత్రులం దొక్కొకగడియ యెచ్చి దీర్ఘము లగును. పవళులు హ్రస్వము లగును. మేషతులా రాసులందు సూర్యుఁ డున్నప్పు డహోరాత్రంబులు సమములై యుండును. మానసోత్తర గిరి యందు మేరుపరిధి దొమ్మిదికోట్ల యేఁబదియొక్క యోజనముల దూర మునుండును గాన సూర్యుం డింతదూర మతిక్రమింపవలసి యుండును. ఆ మానసోత్తరమునందు మేరువునకుఁ బూర్వ భాగమున దేవధాని యనుపురం బున్నదని చెప్పుదురు. అట్లె మేరువునకు దక్షిణమున సంయమని యను పురంబును, బడ మట వారుణి యను నగరంబును, నుత్తరమున సుందర మగు విభావరీపురంబును, గల దని చెప్పుదురు. అందు సూర్యుండు దేవధానియం దున్నప్పుడు భూలోకవాసు లుదయం బని చెప్పు దురు. అట్లె సూర్యుండు సంయమనిని బొందినప్పుడు మధ్యాహ్న మనియు, వారుణిని బొందినప్పుడు సాయంసమయ మనియు విభావరిని బొందినప్పుడు నిశీథ మనియుఁ గల్గుచున్నది. అందుద యము మొదలుకొని యస్తమయాంతమును భూలోకవాసులు వ్యాపార మొనరించుకొని యదిమొదలు వ్యాపారనివృత్తు లగు దురు. మఱియు సూర్యుండు మేరువును జుట్టివచ్చును గాన మేరు వుదక్షిణమున నున్నవారికైంద్రిని బట్టి తూర్పు మొదలుగాఁ గల దిక్కు లగుచున్నవి. తత్క్రమముగానే యుదయాదిసమయము

---

యతిక్రమించును. సూర్యుఁ డొక్కయహోరాత్రముచే సమస్తరాసులను నతి క్రమించును. అతండు రాత్రియాఱురాసులను బవ లాఱురాసులను నతిక్రమిం చును. ఆరాసులన్నియు సమములుగా నుండక యెచ్చుతగ్గులు గలవై యుం డును అని ఇత్యాదు లూహింపవలయును.

లును గల్గును. మేరువునకుఁ బడమట నున్నవారికి దక్షిణము మొదలుకొనియే పూర్వాది దిక్కులవిభాగమును నుదయాది సమయములును గలుగును. ఉత్తరమున నున్నవారికిఁ బ్రతీచి మొదలుకొనియే దిగ్విభాగమును నుదయాదిసమయములును గలుగును. అట్లే తూర్పున నున్నవారి కుత్తరము మొదలు దిగ్విభాగాదులు గలుగును. ఇది భూలోకవాసులకే కాని మేరువునం దున్నవారికిఁ గాదు. సూర్యుఁ డచ్చట సర్వదా ప్రకాశించుచుం డును గాన యచ్చటివారి కెప్పుడును బట్టపగలేగాని రాత్రి గలుగదు. ఓరాజేంద్రా! సూర్యుఁడు మేరువున కెప్పుడును సవ్యముగాఁ దిరుగుచుండుటచేతను, దానినిబట్టియే దిగ్విభాగము గలుగుటచేతను, సర్వవర్షములకును మేరు వుత్తరముగానే యుండును. మఱియు సూర్యుఁ డైంద్రపురంబున నుదయించినప్పు డచ్చటికి కన్యూనాతిరిక్తదూరము కాని వారుణీపురంబునను, సంయమినియం దుదయించినప్పుడు విభావరియందును, వారుణియం దుదయమందినప్పుడు దేవధానియందును, విభావరియం దుదయమందినప్పుడు సంయమనియందును, నస్తమయము కలుగుచుండును. సూర్యుం డెచ్చట నస్తంగతుం డగునో యచ్చటికిఁ బశ్చాద్భాగంబున నున్నవారికి సూర్యుండు గానరాఁడు. మేరువునకు నాల్గుదిక్కులందును గల పురంబులకుఁ బరస్పరమును రెండుకోట్ల ముప్పదియేడు లక్షల యిరువదివేల యోజనంబుల దూరముండును. ఇంత దూరంబును సూర్యుండు పదునైదుగడియల కాలములో నతిక్రమించును. అట్లే తారాగణముతో వర్తించు చంద్రాది గ్రహంబులును, నశ్విన్యాది నక్షత్రములతోఁ గూడుకొని యింద్రాది పురములందుఁ గ్రమముగా నుదయించుచు,

న స్తమించుచు నుందురు. సూర్యుండు వేదరూపమున నుపాస నీయమగు రథముతో నానాల్గుపురంబులందును ముహూర్త కాలమునకు ముప్పదినాల్గు లక్షల యెనిమిదివందల యోజనముల చొప్పునఁ బరిభ్రమించు చుండును. అతని రథమున కొక్కటియె చక్రము గలదు. దానికి మాసరూపము లగు పండ్రెండరములును ఋతువులనెడి నేమియు, మూఁడుకాలము లనెడి నాభియుఁ గలవు. ఆచక్రమునే సంవత్సరంబుగా నుపాసించుచుందురు. ఆ రథసంబంధి యగు నిరుసు మేరుపుమూర్ధభాగమం దున్నది. అది వాయువుచే సంబద్ధమై యున్నది. చక్రసహితమగు రెండవకొన మానసోత్తరమున నున్నది. ఆచక్రము మానసోత్తరమునందుఁ దైలయంత్రమువలెఁ దిరుగుచున్నది. ఆచక్రప్రాంతమం దిరుసు పూర్వభాగము నిబద్ధమై యున్నది. రెండవభాగము ముప్పదితొమ్మిదిలక్షలును, ముప్పదియేడువేలును నేనూఱుయోజనముల పరిమితిగలదై వాయుపాశముచేదృఢమూలమయి తైలయంత్రాక్షమువలెఁ దనరుచున్నది. ఆరథమం దుపవేశస్థానము ముప్పది యాఱులక్షలయోజనములయాయామము గలది. ఆరథయుగము తొమ్మిదిలక్షల యోజనముల వైశాల్యము గలది. ఆరథమున నేడుహయంబులు గలవు. అవి గాయత్రి, బృహతి, యుష్ణిక్కు, జగతి, త్రిష్టుప్పు, ననుష్టుప్పు పంక్తి యను ఛందోనామములచే వ్యవహరింపఁబడు చున్నవి. సూర్యునకు సూతుం డగునరుణుం డతనికిఁ బురోభాగమందుండినను బశ్చాన్ముఖుం డయి యశ్వము లను రథమునకుఁ బూనింప నవి కాంతిబహుళుండగు నాదిత్యుని వహించుచున్నవి. వాలఖిల్యాదు లగు నఱువదివేవురుఋషు లంగుష్ఠ పర్వమంతప్రమాణము గలవారై సూర్యున కెదుట నుండి

భగవంతునియాదేశముచొప్పున నతని నుతించుచున్నారు. *మఱియు మఱికొందఱు ఋషీశ్వరులును, గంధర్వులును; నచ్చ

---

* ఇందు భగవదాత్మకుఁ డయిన సూర్యునిఁ బదునల్వురుచొప్పునఁ బ్రతి మాసమందును నుతించుచున్నారని చెప్పఁబడినది. ఇది విష్ణుపురాణోక్తమగు రీతికి విరుద్ధముగానున్నది. ఎట్లన అందు 'సతదాధిష్ఠితో దేవై రాదిత్యైర్మునిభిస్తదా। గంధర్వాప్సరసాభిశ్చ గ్రామణీసర్పరాక్షసైః। ధాతాకృతస్థలీచైవ పులస్త్యో వాసుకిస్తథా। రథకృద్గ్రామణీశ్చైవ తుంబురుశ్చైవ సప్తమః॥ ఏతే వసంతి వై చైత్రే మధుమాసే సదైవ హి। మైత్రేయస్యందనే భానోః సప్త మాసాధికారిణః। అర్యమా పులహశ్చైవ రథౌజాః పుంచికస్తథా। ప్రహేతిః కచ్ఛనీరశ్చ నారదశ్చ రథే రవేః।మాధవే నివసంత్యేతే శుక్రసంజ్ఞే నిబోధ మే। మిత్రోఽత్రిస్తక్షకశ్చైవ పౌరుషేయోథ మేనకా। హాహారథస్తనశ్చైవ మైత్రేయైతే వసంతి వై।' అనఁగా దేవతలును మునులును, గంధర్వులును, నచ్చరలును, యక్షులును, నాగులును, రాక్షసులును, నాఁబదుగురను లాదిత్యుని సేవింతురు. అందుఁ జైత్రమాసమున ధాతయుఁ గృతస్థలియుఁ, బులస్త్యుండును, వాసుకియు, రథకృత్తును, గ్రామణియుఁ, దుంబురుండును, నాఁబదు నీరేడ్వురును మాసాధికారు లయి భానునిరథమున నెదుట నివసించి సేవించుచుందురు. వైశాఖమునం దర్యముండును, బులహుండును, రథౌజసుండును, బుంచికుండును, బ్రహేతియుఁ, గచ్ఛనీరుండును, నారదుండును, మాసాధికారులై, సూర్యరథమున నెదుట నిల్వబడి సేవించుచుందురు. జ్యేష్ఠమాసమున మిత్రుండును, నత్రియుఁ, దక్షకుండును, బౌరుషేయుండును, మేనకయును, హాహారథుండును స్తనుండును మాసాధికారు లయి సూర్యుని సేవించుచుందురు'' అనిభావము. దీనివలనఁ బ్రతిమాసమందును నేడ్వురేసి మాసాధికారు లయి సేవించుచుందురని చెప్పఁబడెనట్లు తెల్లమగుచున్నది. ఇందుఁ బదునల్వురని చెప్పఁబడినది. ఇది దానితో విరోధింపలేదా? అని యడుగవచ్చును. విష్ణుపురాణమందుఁ జెప్పిన "ఏడ్వురు" అనుదానికి మాసాధికారి యగుగణమందుఁ బ్రధానులగు నేడ్వు రని యర్థము చెప్పఁకొనవలె. అట్లయినచోఁ బ్రధా

రులును, నాగులును, యక్షులును, రాక్షసులును, దేవతలును నాఁబడునప్తవిధగణంబులును, బ్రతిమాసమందును, బదునలువు రేసిపోయి భగవదాత్మకుఁడయి,మాసభేదముచే నానావిధనామములతోఁ బిలువఁబడుచుఁ బరస్పరము విలక్షణ మయిన నామములు గలవాఁడయి, యున్న సూర్యుని నృత్యము, స్తోత్రము, గానము మొదలగు భిన్నకార్యములచే నుపాసించుచుందురు. ఇట్లందఱిచే నుతింపఁబడుచు సూర్యుండుతొమ్మిదికోట్లయేఁబదియొక్క యోజనములపరిమితి గల భూమండలమందు క్షణమునకు రెండువేల రెండుక్రోసులదూరముచొప్పున నతిక్రమించుచున్నాఁడు. ఇది యిరువదియొకటవయధ్యాయము.

---

అని చెప్పినశుకమహామునిం గాంచి రాజేంద్రుం డిట్లనియె. "ఓయోగివర్యా ! నీవు మొట్టమొదట సూర్యుండు నక్షత్రాభిముఖుం డయి మకరాదిరాసులందుఁ జరించుచున్నాఁడని చెప్పితివి. తరువాత సూర్యుండు మేరువును, ధ్రువమును జుట్టివచ్చునట్లు చెప్పితివి. మేరుధ్రువములను వలగొని వచ్చుసూర్యునికి రాసుల కభిముఖముగాఁ బోవుట యెట్లు సంభవించును? ఒక్కనికొక్కపర్యాయము గతిద్వయము సంభవించుట యనుభవవిరుద్ధము" అని ప్రశ్నింప విని శుకుం డిట్లనియె. "ఓరాజా! తిరుగుచున్న కుమ్మరిసాన నాశ్రయించి యున్నపిపీలికాదుల గమనము చక్రభ్రమణముకంటె వే ఱగుచున్నది. అచ్చటఁ జక్రగతి

---

నులను చేర్కొన్నట్టును దక్కిన మఱికొందఱు గూడ సేవించుచున్నట్టును స్పష్టమగును. ఇం దట్లు గాక ప్రధానాప్రధానులను గూడఁ జేర్కొనఁబడుచున్నవి కాన విరోధము లేదు.

కంటెఁ బిపీలికాది గతిభిన్నమైనది.పిపీలికాదు లట్లు తిరుగుచున్న కుమ్మరిసాన నాశ్రయించియుండి తిరుగుచునే తమంతఁ దాము నడిచి యాచక్రమందే వేఱొకస్థలమం దున్నమఱికొన్ని పిపీలికాదులను గలిసికొనవచ్చును. అట్లె గ్రహములకును,నక్షత్రములకు నాధారభూత మగుశింశుమారచక్రము మేరువును, ధ్రువంబును జుట్టివచ్చుచున్నవి. ఆకాలచక్రము నాశ్రయించి పరిభ్రమించుచున్న సూర్యాదిగ్రహములకును, నక్షత్రములకును స్వకీయ మగుగమన ముండవచ్చును.ఆచక్రమున నున్నమకరాది రాసులను నక్షత్రములను స్వకీయగమనముచేఁ జేరి కలిసికొనవచ్చును. చక్రము నాశ్రయించుటవలన సూర్యాదులకు మేరుధ్రువములను జుట్టివచ్చుట సంభవించుచున్నది. స్వకీయ మగు గమనముచే నందే యున్నమకరాదిరాసులను జేరుటయు సంభవించుచున్నది. ఇట్లు సూర్యాదులకు గతిద్వయంబు సంఘటించుటలో ననుభవవిరోధ మేమియును లేదు. * ఓరాజా! జగ

* భగవంతునను ప్రవేశమువలననే సూర్యున కట్టి సామర్థ్య మలవడుచున్నది. అంతియు కాని యతనికి స్వతస్సిద్ధ మగుశక్తి లేదు. ఇందులకు విష్ణుపురాణము ప్రమాణము. అందు "మాసిమాసి రవిర్యోయ స్తత్ర తత్రభిదాపరా। త్రయీమయా విష్ణుశక్తి రవస్థానం కరోతివై। విష్ణుశక్తి రవస్థానం సదాఽఽదిత్యేకరోతి సా। నకేవలం రవే శ్శక్తి ర్వైష్ణవీ సా త్రయీమయా। ఏవం సా సాత్త్వికీశక్తి ర్వైష్ణవీయా త్రయీ మయీ। అత స్సప్తగణోపేతం భాస్వంత మధితిష్ఠతి। తయాచాధిష్ఠిత స్సోతి జాజ్వలీతి స్వరశ్మిభిః। తమ స్సమస్తజగతాం నాశం నయతి చాఖిలం" అనఁగా సూర్యుడు ప్రతిమాసమందును భేదమును బొందుచున్నాఁడు. వేదమయ మగువిష్ణుశక్తి తాదృశవిభాగమును జేయుచున్నది. ఆవిష్ణుశక్తి సర్వదా సూర్యునియందు నివసించుచున్నది. అంతియే కాని రవికి స్వతస్సిద్ధముగా నట్టిశక్తిలేదు. వేదమయ మగునా

త్కారణుండగు నారాయణుం డాదిత్యుండను పేరుగల జీవునియం దుఁ గాలవిభాగముఁ జేయ నుపయుక్తమగుసంకల్పరూపజ్ఞానము చే ననుప్రవేశించి శీతము,వాతాతపాదులును,గలిగి లోకమునకు సుఖము గలుగుటకయి స్వకీయమగు శక్తిచేఁబండ్రెండువిధంబు లుగాఁ దన్ను విభజించి పిమ్మట వసంతాదిఋతువులను జేయుచు వేదచోదితుం డయి జ్ఞానులచే నుపాసితుఁ డగుచున్నాఁడు. ఈ లోకమందలిపురుషు లందఱును వర్ణాశ్రమాచారానువర్తులై యాదిత్యరూపమునఁ బ్రకాశించు భగవంతుని వేదవిద్యచే శ్రద్ధాళువులయి యుపాసించుచున్నారు. మఱియు వారు,నానా విధములును, వేదోక్తములును, నగుయాగాదికర్మముల చేతను, భగవంతు నారాధించుచు, సుఖముగా మోక్షాదిరూప మగు శ్రేయస్సును బొందుచున్నారు. సమస్తలోకముల కంతరాత్మ యైన భగవంతుఁ డాదిత్యరూపుఁడై భూమ్యంతరిక్షములమధ్య నున్న శింశుమారచక్రమును బొంది యందున్న మేషాదిరాసు లందు నక్షత్రాభిముఖముగా సంచరించుచుండుటం జేసి సంవత్సర మున కవయవము లయిన మాసము లేర్పడుచున్నవి. అవి చాంద్రమానముచేఁ బక్షద్వయ మనియు, సౌరమానముచే సపాద నక్షత్రద్వయమనియుఁ,బితృమానముచే నక్తందివంబు లనియుఁ జెప్పుచున్నారు. ద్వాదశభాగాత్మకమగు సంవత్సరమునందాఱవ

శక్తి విష్ణువునిదే. వేదమయ మగునావిష్ణుశక్తి సప్తగణసముపేతుఁ డగుసూర్యు నధిష్ఠించుచున్నది. తాదృశశక్తి తన కలవడుటచేత నే సూర్యుండు తనకిరణ ములచేఁ బ్రకాశించుచు సమస్తలోకములచీఁకటిని బాపుచున్నాఁడు" కా వున నారాయణునిశక్తివలన నే సూర్యుఁ డట్లు ప్రకాశించుచున్నాఁడు కాని స్వతస్సిద్ధశక్తిచేఁ గాదని యెఱుంగునది.

పాలగు రెండురాసుల నెంతకాలములో సూర్యుఁ డతిక్రమించు నో యాకాలమును సంవత్సరావయవ మైన ఋతు వని చెప్పుచున్నారు. సూర్యుం డెంతకాలములో మకరాదిరాశిషట్కము నతిక్రమించునో, యాకాలమున కయన మని పేరు. ద్యావాపృథివీ మండలముల నంటియున్న ద్వాదశరాశ్యాత్మక మయిన నభోమండలమును సూర్యుఁడు, మందగతిచేతను, శీఘ్రగతిచేతను, సమగతిచేతను నెంతకాలములో నతిక్రమించునో యాకాలమునకు * సంవత్సర మనియుఁ, బరివత్సర మనియు, నిడావత్సరమనియు, నిద్వత్సరమనియు, ననువత్సర మనియుఁ జెప్పఁబడుచున్నది. ఇట్లె చంద్రుండు సూర్యునికంటె లక్షయోా

* ఇచ్చట నిట్టిభేదములు కలుగుట యె ట్లనఁగా, జ్యోతిశ్శాస్త్రమునందు సౌరమాన మనియుఁ, జాంద్రమాన మనియు రెండువిధములు గలవు. సూర్యగమనమునుబట్టి కాలమును బరిమాణముచేసినచో సౌరమాన మనియుఁ, జంద్రగమనమునుబట్టి కాలమును బరిమాణముచేసినచోఁ జాంద్రమాన మనియు నామములు గలుగుచున్నవి. రవి రాశిప్రవేశ మైనదినమే సౌరమానమాసమున కారంభము. శుక్లపక్షప్రతిపత్తు చాంద్రమానమాసమున కారంభము. శుక్లపక్షప్రతిపత్తునాఁడే రవిసంక్రమణమై చాంద్రమానముచేతను, సౌరమానముచేతను నప్పుడు మాసమారబ్ధ మైనచో దానికి సంవత్సరమని నామము గలుగుచున్నది. ఆసంవత్సరమందు సౌరమానముచే నాఱుదినంబులు హెచ్చి చాంద్రమానముచే నాఱుదినంబులు తఱుగును. అట్లె యైదువత్సరంబులు గతించినచో మధ్యమున రెండుమలమాసములు వచ్చును. ఈయైదుసంవత్సరంబులనే క్రమముగా నవాంతరభేదముచే, సంవత్సర మనియుఁ, బరివత్సర మనియు, నిడావత్సర మనియు, ననువత్సర మనియు, నిద్వత్సరమనియుఁ జెప్పఁబడును. ఇట్లయినపిమ్మట మగుడ నాఱవవత్సరము సంవత్సర మగుచున్నది.

## శుకుండు గ్రహాదుల గతివిశేషములు చెప్పుట.

జనములదూరముమీఁదుగా వర్తించుచుఁద్వరితగతిగలవాఁడై, సూర్యుండు ద్వాదశరాసుల నతిక్రమించుటవలనఁ గలిగిన సంవత్సరమును శుక్లకృష్ణపక్షములచేఁ జేయుచున్నాఁడు. సూర్యుఁడు రాశిప్రవేశము చేయుటవలనఁగల్గినమాసమును సపాదనక్షత్రద్వయము నతిక్రమణముచేతనే చేయుచున్నాఁడు. మఱియుఁజంద్రునికళలు పూర్తిచేయుపక్షమునకు శుక్లపక్ష మనియు, వానిని క్షీణింపఁ జేయుదానికిఁ గృష్ణపక్ష మనియు,నామములు కలిగె. చంద్రుఁడు తన కళల వృద్ధిక్షయములవలన విభక్తము లయిన శుక్లకృష్ణపక్షములచేతఁ బితృదేవతల కహోరాత్రమును జేయుచున్నాఁడు. అతఁడు సమస్తజీవుల ప్రాణంబులకును దనకిరణములచేఁ జల్లదనంబు నిచ్చి హాయి గల్గించుచున్నాఁడు. అతఁ డొక్కొక్క నక్షత్రమును ముప్పది ముహూర్తముల కాలముచే నతిక్రమించుచున్నాఁడు. పదునాఱుకళలు గలచంద్రుఁడే శరీరముగాఁ గల భగవంతుఁడు మాసమున కధిదేవతయగుటవలన మనోమయుం డనియు, నోషధీశుఁ డగుటవలన నన్నమయుం డనియు, సమస్తప్రాణి జీవనంబులకును హేతుభూతుం డగుటవలన నమృతమయుం డనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. మఱియు జంద్రశరీరకుఁ డయినయాభగవంతుఁడు దేవతలకును, బితృదేవతలకును, మనుష్యులకును, బశువులకును, బక్షులకును, సరీసృపములకును, వీరుత్తులకును, సుఖము గల్గించు సౌఖ్యము గలవాఁ డగుటచే సర్వమయుండని విద్వాంసులు వర్ణించుచున్నారు. ఓరాజా!చంద్రమండలమున కూర్ధ్వభాగమందు మూఁడులక్షల యోజనముల దూరమున నభిజిత్తుతోఁ గూడిన యిరువదియెని

మిది నక్షత్రములును నంతరాత్మ యగు భగవంతునిచేఁ బ్రేరితము లయి కాలచక్రమున వర్తిల్లుచు మేరువునకుఁ బ్రదక్షిణము చేయుచున్నవి. ఆనక్షత్రమండలమున కుపరిభాగమున రెండులక్షల యోజనముల దూరమున శుక్రమండలము కలదు. అతండు సూర్యుండు ముందుగా నతిక్రమించి చన్ననక్షత్రమును దరువాత నతిక్రమించుచుండును. వేఱొకప్పుడు సూర్యునికంటె ముందుగానే యతిక్రమించును. ఒకప్పుడు సూర్యునితో సమముగాఁ జరించుచుండును. అతఁడు శీఘ్ర మంద సమగతులచే సూర్యుని కింతయేనియుఁ దీసిపోక ప్రవర్తించుచుండును. అతఁడు లోకముల కెల్లప్పుడు ననుకూలుఁ డయి వర్తించును. అతఁడు వరుసగానున్న నక్షత్రాదుల నతిక్రమించుటను బట్టియే ప్రజలు తెలుచుగా వర్షము ననుమానించుచున్నారు. అతఁడు వర్షప్రతిబంధము నుపశమింపఁ జేయువాఁ డని యందురు. ఓరాజా! శుక్రగతిభేదముఁ జెప్పుటచే బుధగతిభేదమును జెప్పినట్టే చుమా! బుధుండును శుక్రునివలె సూర్యున కొకప్పుడు కొంచెముముందుగాను, నొకప్పుడు సమముగాను, వేఱొకప్పుడు వెనుకభాగమునను సంచరించుచుండును. అయిన బుధునిగమనమున నొకవిశేషము కలదు. బుధుండు శుక్రమండలముకంటె మీఁదుగా రెండులక్షలయోజనములదూరమున నుండు. అతఁడు లోకముల కశుభకారియని చెప్పుదురు. అతఁడతిచారముచే సూర్యునికంటె ముందుగాఁ జరించుచుండినసమయమున మహావాయువు విజృంభించు ననియు దట్టముగ మేఘములు వ్యాపించియున్నను ననావృష్టిదోషము సంభవించు ననియుఁ బెద్దలు చెప్పుదురు. అంగారకుండు బుధమండలముకంటె మీఁదుగా రెండులక్షలయోజన

ములదూరమునఁ జరించుచుండును. అతఁడు మూఁడేసిపక్షముల కాలముచే నొక్కొక్కరాశిచొప్పునఁ బండ్రెండురాసులను మీఱుచుండును. కుజుఁడశుభగ్రహమైనను వక్రగమనము లేక వర్తించినచో లోకమునకు శుభకరుండే యగును. ఆకుజమండలమున కుపరిభాగమున రెండులక్షల యోజనముల దూరమున బృహస్పతి వర్తించుచుండును. అతఁడొక్కొకరాశిలో నొక్కొక సంవత్సర ముండును. అతఁడు వక్రగతుండు కానిచో బ్రాహ్మణకులమునకు శుభకారియై యుండు. ఆబృహస్పతిమండలమున కుపరిభాగమున రెండులక్షల యోజనముల దూరమున శనైశ్చరుండు వర్తించుచుండును. అతఁడు మందగతుండై యొక్కొక రాశియందు ముప్పదేసిమాసములు చరించుచుఁ గ్రమముగా ద్వాదశరాసులను ముప్పదివత్సరంబుల కతిక్రమించును. అతఁడు తఱుచుగా నందఱకు నశుభకారియై యుండు నని చెప్పుదురు. ఆశనిమండలమున కుపరిభాగంబునఁ బదునొకండులక్షల యోజనముల దూరమున సప్తర్షులు చరించుచున్నారు. వారు లోకములకు సుఖము గల్గించుచు సర్వోత్కృష్ట మగు ధ్రువమండలమునకుఁ బ్రదక్షిణముగాఁ బరిభ్రమించుచున్నారు. ఇది యిరువదిరెండవయధ్యాయము.



ఓ నరపాలా! సప్తర్షిమండలమున కుపరిభాగమునఁ బదుమూఁడులక్షల యోజనముల దూరమునందు ధ్రువమండలము గలదు. అది విష్ణువునకభివ్యక్తిస్థానమగుటవలనఁ బరమపదంబని చెప్పుదురు. పరమభాగవతోత్తముండును నుత్తానపాదునికుమారుండు నగుధ్రువుండు తన్మండలంబున వెలయుచుండును. అగ్ని

యు, నింద్రుండును, బ్రజాపతియుఁ, గాశ్యపుఁడును, ధర్ముండును, సకాలమున సగౌరవముగా ధ్రువునికిఁ బ్రదక్షిణము చేయు చుందురు. ఇప్పటికి ధ్రువుండు స్వీయకాంతులతో నొప్పుచు న్నాఁడు. అతనిప్రభావమును బూర్వము (చతుర్థస్కంధమున) చక్కఁగా వర్ణించి చెప్పితిని. స్పష్టముకాని వేగము గలభగవదా త్మక మగు కాలచక్రమువలనఁ దిరుగు చున్న తారాగణంబుల కును, సూర్యాదిగ్రహంబులకును, నశ్విన్యాదినక్షత్రములకును, నాధారముగా స్థాపితుండయి స్థాణువువలె సర్వదా యొక్కస్థల మున నే వర్తించుచుండును. ఓనరేంద్రా! లోకమున దృఢస్తంభ మునకు ముప్పిరిత్రాళ్లచే సంబద్ధములైనవృషభాదులు కొంచెము దూరమున నున్నధాన్యాదుల నాక్రమింపవలె నన్నతలంపుతో స్తంభంబునకుఁ జుట్టును స్వస్థానము నతిక్రమింపక యే వలయా కారముగాఁ దిరుగుచుండును. అట్లె నక్షత్రగణములును, సూ ర్యాదిగ్రహములును నీకాలచక్రమునందుఁ గొన్ని బయటను, మఱికొన్ని లోపటను గూర్పఁబడి వాయుపాశముచే ధార్యమా ణములగుటచేతను, గర్మవశములగుటచేతను, ధ్రువు నవలంబిం చియుండుటచేతను నేలఁగూలకుండఁ గల్పాంతముదాఁకఁ బరిభ్ర మించుచుండును. మఱియు డేగ మొదలగు పక్షులును, మేఘ ములును,నిజకర్మములే యూఁతగాఁగలవయి వాయుపాశసంబద్ధ ములై యాకసంబున నెట్లు సంచరిచుచున్నవో యట్లె జీవు లును గర్మాధీనమైనప్రకృతిసంబంధమువలన నక్షత్రరూపు లయి యగ్నిహోత్రాదుల కూర్ధ్వగమనాదులవలె కర్మాధీనము లైన నభోగతి గలవారయి భూమియందుఁ బడరు. ఓరాజా! కొందఱు యోగులు శింశుమారచక్రమే శరీరముగాఁగలవాఁడును, చిదచి

దాత్మకజగంబును ధరించువాఁడును, నగుభగవంతుని నుద్దే శించి యోగధారణము చేసి యాజ్యోతిర్గణమునకు భగవద్రూప శింశుమార మాధార మైనట్లు దెలిసికొనుచున్నారు. మఱియు దక్షిణావర్తశంఖమువలెను, సర్పమువలెను భగవంతుఁడు తనదే హమును గుండలీకరణము చేసి క్రిందికి శిరంబును మీఁదికిఁ బుచ్ఛంబును నుండునట్లు చేసెను. ఆపుచ్ఛాగ్రమునందు ధ్రువుం డున్నట్లును, నంతకంటెఁ గొంచెము క్రిందుగాఁ బ్రజాపతియు నత నికిఁ గ్రిందుగాఁ గ్రమంబున నగ్నియు, నింద్రుండును, ధర్ముండును, నుందురనియుఁ, బుచ్ఛమూలంబున బ్రహ్మయున్నట్లును, గటియం దు సప్తర్షిమండల మున్నట్లును, యోగీంద్రులు యోగమహిమ చేఁ దెలిసికొనుచున్నారు. మఱియు దక్షిణావర్తమువలెఁ గుండలీ భూత మగుశరీరము గలశింశుమారము దక్షిణపార్శ్వమునందు నభిజిత్సహితము లయి శ్రవణాది పునర్వస్వంతము లయినపదు నాల్గునక్షత్రము లున్నట్లును, పుష్యమి మొదలు ఉత్తరాషాఢ వఱకుఁ గల పదునాల్గునక్షత్రములును, నుత్తరపార్శ్వమం దున్నట్లులు యోగీశ్వరు లుపాసించుచున్నారు. కావుననే కుండ లాకారము గలసర్పమువలె నున్నశింశుమారమున కుభయ పార్శ్వములందును సమసంఖ్య గలయవయవము లేర్పడుచున్న వి. ఆశింశుమారము పృష్ఠభాగమున శీఘ్రగతి గల సూర్యుని దక్షిణాయనరూపమార్గవిశేషము కలదనియు, దానియుదరమం దు గంగానదిగలదనియుఁ బండితులూహించుచున్నారు. ఓరాజేం ద్రా! శింశుమారమునకు దక్షిణముననున్న నక్షత్రముల మొదల టిదగు పుష్యమియు, నుత్తరమున నున్నవానిలోఁ గొనన నున్న పునర్వసువును, శింశుమారరూపుఁ డగుభగవంతుని కుడియె

పను పిఱుందులందును, నార్ద్రాశ్లేషనక్షత్రములఁ గుడియెడమ పాదములందును, నభిజి దుత్తరాషాఢల దక్షిణవామలోచనములందును, ధనిష్ఠామూలనక్షత్రములను గుడియెడమ కర్ణములందును, శతభిషగ్జ్యేష్ఠలను గుడియెడమస్కంధములందును, మృగశీర్షయు రోహిణియుఁ గృత్తికయు, నశ్వినియు, రేవతియు, నుత్తరాభాద్రయుఁ, బూర్వాభాద్రయు నను నీయెనిమిదియు దక్షిణపార్శ్వమందును, మఖయుఁ, బూర్వాఫల్గునియు, నుత్తరయు, హస్తయుఁ, జిత్తయు, స్వాతియు, విశాఖయు, ననూరాధయు ననునీయెనిమిదియు వామపార్శ్వమందును యోగీశ్వరు లనుసంధానము చేయుచున్నారు. మఱియు దక్షిణోత్తర కపోల ప్రాంతదేశములందు వరుసగా నగస్త్యయములను, ముఖమందుఁ గుజుని, గుండెలందు శనైశ్చరుని, గళమునకుఁ గ్రింది భాగమునందు బృహస్పతిని, వక్షఃస్థలంబున సూర్యుని, హృదయమున నారాయణుని, మనంబునఁ జంద్రుని, నాభియందు శుక్రుని, స్తనములం దశ్విదేవతలను, ప్రాణాపానములందు బుధుని, గళమందు రాహువును, సర్వాంగములందుఁ గేతువును, రోమకూపములందు సమస్తతారాగణములను ననుసంధానము చేయుచున్నారు. ఓనరపాలా! ఇది సర్వదేవతామయమై శింశుమార మనుపేరు గల విష్ణుశరీరము. భగవంతునిరూప మగు శింశుమారమునందు ప్రతిదినమును సంధ్యాసమయములందు మనంబునుగూర్చి మౌనావలంబియై చూచుచు, "ఓదేవా! జ్యోతిర్గణరూపుఁడవయి, కాలమున కాధారభూతుఁడవయి బ్రహ్మాదుల కధిపతి వయి, పరమపురుషుఁడ వయిననీకు నమస్కార మని నుతింపవలయును. ఓరాజేంద్రా! గ్రహనక్షత్రాదిరూపమై దేవ

తలకంటె నుత్కృష్ట మయి పాపాపహారక మయిన హరిరూప మగుశింశుమారమును మూఁడుకాలములందును నమస్కరించి నను స్మరించినను మూఁడుకాలములను నుక్తం బగుమంత్రమును జపించినను నప్పటికాలమునను, మఱి భూతభవిష్యత్కాలము లందును బుట్టినపాపములు శీఘ్రముగా నశించిపోవును. ఇది యిరువదిమూఁడవ యధ్యాయము.

---

## రాహుగ్రహణాదిస్వరూపము.

సూర్యునికిఁ బదివేల యోజనముల క్రింద రాహువు నక్షత్రమువలెఁ జరించుచున్నాఁడని కొందఱు చెప్పెదరు. ఆరాహువు భగవదనుగ్రహముచేత దేవత్వమును గ్రహత్వమును లభించినవాఁడయ్యె. నాయనా! వాఁడు సింహికకొడుకయిన యసురాధముఁడు గాన యట్టి భగవదనుగ్రహమున కెంతమాత్ర మర్హుఁడు గాఁడు. ఆ యనుగ్రహమును బొందుట కయిన వాని జన్మకర్మములను మీఁద (నష్టమస్కంధమునఁ) జెప్పెదము. ప్రకాశించుచున్న ప్రసిద్ధమగు సూర్యమండలము విస్తారము పదివేల యోజనము లని చెప్పెదరు. సూర్యునకుఁ బయినున్న చంద్రమండలము విస్తారము పండ్రెండువేల యోజనములు. సూర్యునికిఁ గ్రిందుగానున్న రాహుమండలము పదుమూఁడువేల యోజనములు. సూర్యచంద్రమండలముల కంటె రాహుమండలము విరివిగలిగియుండుటచే నొకప్పుడు నారెంటి నది యాచ్ఛాదించున దగుచున్నది. ఆరాహు వమృతపానసమయమున వారినడుమఁ

జొచ్చుటచే వారి కెడ తెలిపి గలిగించి వారిచేఁ జూపఁబడుటవ
లనఁ గలిగిన వైరానుబంధమున నా సూర్యచంద్రుల పయికి
బాఱు తెంచు చున్నాఁడు. అట్లు వాఁడు పాఱు తెంచుటను జూచి
వారిరువురను రక్షించుకొఱకు పరమపురుషుఁడు భగవంతుఁడు
తనదై తనకుఁ బ్రియంబునయిన సుదర్శనంబనెడి యస్త్రమును
బ్రయోగించుచున్నాఁడు. తేజంబున నెట్టివారికి సైఁపరాని యా
సుదర్శనము వారిచుట్టును మాటికిఁ దిరుగుచుండఁగా రాహువు
దానికెదురఁ గొంత సేపుండి భయముతో మనసు చంచలింప
దూరముననే తొలఁగి పోవుచున్నాఁడు. అట్లు వాఁడు సూర్యచం
ద్రులను సమీపించితనమండలముచేఁ దన్మండలముల నాచ్ఛాదిం
చుటకే జనులు గ్రహణ మని చెప్పుదురు.అందు రాహువు బుజు
నక్రగమనములం బట్టి యర్ధగ్రాస మనియు, సర్వగ్రాస మనియుఁ
జెప్పుదురు. రాహుమండలమునకును, సూర్యచంద్రమండలముల
కును, మిక్కిలిదూర ముండుటచే నాచ్ఛాదనమే కాని గ్రాస మె
ప్పుడును సంభవింపదు. ఆరాహుమండలమునకుఁ బదివేలయోజ
నముల క్రింద సిద్ధచారణ విద్యాధరుల నివాసమందిరంబులును,
వానికిఁ గ్రింద యక్షపిశాచప్రేతభూతగణంబుల విహారస్థానము
లును, గ్రహహీన మగునంతరిక్షమును గలదు. అది వాయు
వెంతవఱకుఁ బ్రసరించునో, మేఘము లెంతవఱకుఁ జరించునో,
యంతవఱకును వ్యాపించియున్నది. యక్షాదులకు విహారస్థాన
మగునంతరిక్షమునకు నూఱుయోజనములు క్రిందుగా భూలోక
ము వర్తించుచున్నది. బలముగల హంసాదిపక్షివిశేషము లెంత
దవ్వోగురఁగలవో యంతవఱకది వ్యాపించి యున్నది.ఓరాజా!
ఇంతకుఁ బూర్వ మాభూమండలమునుగూర్చి యవయవవిన్యాస

పూర్వకముగా వర్ణించి చెప్పితిని. భూలోకమునకుఁ గ్రిందుగా నేడు భూవివరములు గలవు. అం దొక్కొకటి పదివేలయోజనములయౌన్నత్యమును నంతియదైర్ఘ్యమును, నంతియ వైశాల్యమును గలవయి యొప్పుచున్నది. భూలోకాదులకంటె నావివరములందు భోగాధిక్యము కలదు. అవి క్రమముగా నతల మనియు, సుతలమనియు, రసాతలమనియు, తలాతలమనియు,మహాతలమనియుఁ,బాతాళమనియుఁ జెప్పఁబడుచున్నవి. ఈ బిలస్వర్గములందు స్వర్గాదులకంటె నధికముగ కామభోగము కలదు. వానియందున్న యైశ్వర్యము స్వర్గాదులందు లేదు. వానియందున్నయానందసమృద్ధియు విభూతియుఁ దక్కిన వానియందు లేవు.అది సర్వవస్తుసమృద్ధము లగుమందిరములచేతను; నుద్యానవనములచేతను, క్రీడాస్థానములచేతను, విహారస్థానములచేతను, బొల్చుచున్నది. వానియందు దైత్యులును, దానవులును, గద్రూసంతతివారును, వసించుచుందురు. వారు సంతతానందంబును, ననురాగంబును గల్గిన, భార్యాజనమును, నపత్యములును, బంధువులును, మిత్రులును, ననుచరులును, బలిసి కొలుచుచుండఁగా గృహపాలకు లయి యుందురు. వారలకోర్కు లీశ్వరునకైనఁ బ్రతిహతములు కానేరవు. వారు సర్వదా మాయావినోదు లయి వర్తించుచుందురు. ఓ మహారాజా ! మాయావియైనమయుం డావివరములందుఁ బురంబులను నిర్మించె. ఆపురములు నానావిధరత్నశ్రేష్ఠములచే విరచితము లగువిచిత్రభవనములచేతను, ప్రాకారములచేతను, గోపురములచేతను, సభామందిరములచేతను, రథ్యావృక్షములచేతను, నాలుగిళ్లవాకిళ్లచేతను, నాగమిథునములచేతను, రాక్షసమిథునములచేతను,బా

పురములకును, శుకశారికాది పక్షులకును, నాటపట్టగుకృత్రిమ భూములచేతను, దత్తద్బిలాధిపతులయుత్తమగృహములచేతను, నలంకృతములయి విరాజిల్లుచున్నవి. ఆవివరములందు సుందరములగునుద్యానవనంబులు గలవు. అందలి వృక్షములు కుసుమగుచ్ఛములచేతను, ఫలగుచ్ఛములచేతను, జిగుళ్లబరువుచేతను, వంగిన వై సువర్ణలతలచే నాలింగితము లయి సుందరము లయి ప్రకాశించుచున్నవి. అందున్నపద్మాకరములు జతలు గట్టి విహరించుచున్న నానావిధ విహంగకోలాహలధ్వనులచే నొప్పుచు, నిర్మలజలపూరితము లయి, మత్స్యాదులవిహారములచేఁ జలించుచున్నజలములం దున్నపద్మములును, గలువలును, తెల్లగలువలును, నెఱ్ఱఁగలువలును,నీలోత్పలములును, నెఱ్ఱనిపద్మములును మొద లగువానిసమూహములశోభాసంపదచే శోభితము లయి, యాపద్మవనములందుఁ బలువిధములుగా విహరించుచున్న మధుకరబృందములఝుంకారములచే మనోహరము లయి, సకలేంద్రియముల కానందము గొల్పుచు, విలసిల్లుచున్నవి. అట్టియుద్యానంబులచే నవి స్వర్గాదులను మీఱుచున్నవి. ఓరాజేంద్రా! అచ్చటివారు చిరకాలజీవు లయి యుండుటచేఁ గాలమున కవయవభూతము లగునహోరాత్రాదులచే భయపడ నవసరము లేదు. అచ్చట నహోరాత్రముల విభజించుచు వెలుఁగు నిచ్చు సూర్యాదులు లేకపోయినను, మహాసర్పముల ఫణామండలములందు వెలయురత్నములు కాంతిసంతతులచేఁ జీకట్లను దఱుముచున్నవి. అచ్చటివారు దివ్యౌషధముల సేవించి రసాయనములఁ దిని త్రావి స్నానాదుల నాచరించినవా రగుటచేవారికి మనఃపీడయు, రోగములును, శరీరము ముడుతలుపడుటయుఁ దల నెఱి

యుటయు,ముదుసలితనము మొదలగునవి కాని, దేహవైవర్ణ్యము, చెడువాసన, చెమ్మట, శ్రమ, యనుత్సాహము మొదలగునవి కాని సంభవింపనేరవు. మఱియు భగవంతుని కస్త్రభూతమైనచక్రము తప్ప మఱెద్దియును వారికి మృత్యువు నీయఁజాలదు. కావున నాచక్ర మన్నవా రెంతయో భయపడుదురు. ఒకప్పుడాచక్రమువివరములఁ బ్రవేశించెనేని భయాతిరేకముచే నచ్చటిస్త్రీలగర్భములు నేలఁబడుచుండును. ఓరాజేంద్రా! యతల మనువివరమందు మయపుత్త్రుఁడు బలుండనువాఁడు నివసించుచున్నాఁడు. వాఁడు మహామాయావి. వాఁడు సృజించినతొంబదియాఱుమాయలలోఁ గొన్నింటిని మాయావులిప్పుడునుధరించుచున్నారు. వాఁ డావులింపఁగా వానినోటినుండి మూఁడు స్త్రీగణములు పుట్టినవి. వారు స్వైరిణు లనియుఁ, గామినులనియుఁ, బుంశ్చలు లనియు, నామములు గలవారు. అందు స్వజాతివారితోఁ గ్రీడించువారు స్వైరిణు లనఁబడుదురు. స్వేతరజాతిసంభవులతోఁగూడ విహరించువారు, కామిను లనఁబడుదురు. అట్లు విహరించుటలో నతిచాంచల్యము గలవారు పుంశ్చలు లనఁబడుదురు. ఆస్త్రీగణములు బిలమును బ్రవేశించి వచ్చినపురుషుని హాటక మనురసాయనముచే సంభోగసమర్థునిఁగాఁ జేసికొనితమ విలాసావలోకములచేతను, ననురాగసూచక మగుమందహాసముచేతను, రహస్యసంభాషణములచేతను, నాలింగనాదులచేతను, స్వవశునిఁ గావించుకొని వానితో రమించుచుందురు. ఆహాటకరసము నిరుపమ ప్రభావము గలది. దాని నుపయోగించినపురుషుఁడు తన్నుఁ బదివేలయోజనముల దిగ్గజములబలము గలవానిఁగాఁ దలంచుకొనుచు మదాంధుఁడై. "నేనే యీశ్వరుఁడను"

"నేనే సిద్ధుఁడను" అనిశ్లాఘించుకొనుచుండును. దానికిఁ గ్రిందుగా నతల మున్నది. అందు భగవంతుం డగురుద్రుఁడు హాటకేశ్వరుఁ డనునామము ధరించి తనభక్తులగు ప్రమథగణములచే సేవింపఁబడుచుండును. అతనికి హాటకేశ్వరుఁ డనునామము గల్గుటకుఁ గారణంబు చెప్పెదను వినుము. బ్రహ్మ ప్రజాభివృద్ధిచేయుమని రుద్రుని కాజ్ఞాపించెను. అంత రుద్రుఁడు తదాజ్ఞ శిరసావహించి సృష్టి వర్ధింపఁగోరి భవానీదేవితోఁ గ్రీడించుచునుండెను. వారట్లు మిథునకర్మ మొనర్చుచుండగా వారివీర్యము ప్రవాహరూపముగాఁ జాఱి హాటకినియను నది యయ్యె. ఆనదియం దగ్నిహోత్రుఁడు వాయుప్రసారమువలనఁ బ్రదీప్తుండయి స్వబలముచేనానదిని బానముచేసి యుమిసెను. అంతనది హాటకమనెడిపేరుతో సువర్ణమయ్యెను. వితలనివాసు లగు స్త్రీపురుషులాసువర్ణముతో నాభరణములు చేయించుకొని ధరించుచున్నారు. ఇట్లు రుద్రుండు హాటకను నుత్పాదించుటంజేసి హాటకేశ్వరుం డనెడినామమును దాల్చెను. ఆవితలమునకుఁ గ్రిందిభాగమున సుతల మనువివర మున్నది. భాగవతాగ్రగణ్యుండును విపులకీర్తియును విరోచనునికుమారుండును నగుబలిచక్రవర్తి యందు నివసించి యింద్రాదులకు నైనను లేని యైశ్వర్యములతో వెలయుచు భయరహితుండై స్వధర్మముచే భగవంతు నారాధించుచు నిప్పటికిని వర్తించుచున్నాఁడు. బలిచక్రవర్తి యం దుండుటకుఁ గారణంబు చెప్పెద విను. పూర్వము బలి త్రిలోకముల జయించి నిరర్గళముగాఁ బరిపాలించుచుండె. అంత భగవంతుం డగువిష్ణువు దేవేంద్రునకుఁ బ్రియ మొనర్పఁ దలంచి తానదితిగర్భమున వామనుఁ డయి యుదయించి బ్రహ్మచారివేష

ముఁ దాల్చి లోకత్రయము నతనివలనఁ దీసికొని యతనియందలి దయాతిశయముచే నతనిఁ జంపనొల్లక సుతలమును బ్రవేశింపఁ జేసెను. అది మొదలతఁ డాభగవంతు నారాధించుచు నందే యుండెను. ఓరాజా ! సకలసంపత్సమృద్ధ మయినసుతలమునకు బలియాధిపత్యము వహింపఁగల్గుట తా నొనర్చినభూదానమువలననేయనికొందఱూహింతురు. కానియదియు క్తముకాదు. భగవంతుఁడుసమస్తైశ్వర్యసంపన్నుఁడు. అతఁడశేషభూతజాలములకును జీవాత్మలకును నంతరాత్మయై ధారకుఁడై యొప్పుచున్నాఁడు. అతఁడు మిక్కిలి పవిత్రత్వము గలవాఁడు. ఎవఁడయినను దుమ్మినప్పుడును, బడినప్పుడును, నావలించినప్పుడును నింద్రియనిగ్రహము లేనివాఁ డయినను భగవన్నామము నొక్కమారైనను స్మరించినచో వాఁడు ముముక్షువులు కర్మజ్ఞానయోగములచే నిరసింపఁదగిన కర్మరూపబంధనమును సుఖముగా నిరసించుచున్నాఁడు. తన్నొక్కమారైనను స్మరించినంతమాత్రముననే సమస్తవృజినములను నిరసింపఁజాలిననామము గలభగవంతునికి నిరవధిక శ్రద్ధాసముపేతుఁ డయి సమాహితమనస్కుఁడయిలోకత్రయము నొసంగినబలిచక్రవర్తి కీబిలాధిపత్యమా సాక్షాత్కారఫల మగును ? అట్టిపాత్రమునందట్టిదానముగావించిన యతనికి నిరతిశయాపవర్గమే ముఖ్యఫలముకాని యిది ఫలము కానేరదు. ఇంతియకాక సమస్తభక్తులకుఁదన్నైన నొసంగుచున్నంతవదాన్యుఁ డయి నిరతిశయప్రీతివిషయుఁ డయినభగవంతుని యందు నిరవధికభక్తిసముపేతుం డగుటయే కాక, నిర్మలచిత్తంబుతో బలి లోకత్రయంబు నొసంగియుండ, నతఁ డతని కిట్టిసామాన్యఫలము నొసంగుట యయుక్తముకాకమానదు. ఓయీ! ఈదా

న మపవర్గమునకు ద్వారభూతమేమైనచో బలి మహాభాగవతుఁ డే నైనచో భగవంతుఁడు తనభక్తులకుఁ దన్నైన నిచ్చెడిదాత యే నైనచో భగవంతుఁడు బలికపవర్గమునే యొసంగి యేలయ నుగ్రహింపరా దని యడుగఁబనిలేదు. ప్రారబ్ధకర్మ మనుభవము చేతనే నశింపవలెను. కాని జ్ఞానముచే నశింపదు. భగవంతుఁ డపవర్గ మొసంగఁజాలినవాఁడైనను బలి యందులకర్హుండేయైనను బ్రస్తుతము ప్రారబ్ధము ప్రతిబంధకముగా నుండుటచే నా బలి నట్లనుగ్రహింపక ప్రారబ్ధక్షయమున కుపయుక్తమై యాత్మానుస్మృతికి విఘాతుక మయి నిజమాయాప్రకటిత మైనభోగ రూపైశ్వర్యము ముందుగా నొసంగెను. ఇంతేకాక మహాభాగ వతుఁ డగుటవలనబలినిలోఁకువగావించుకొనుటకు యాచించుట దక్క వేఱొకయుపాయంబు లభింపమిచే దానినే యవలంబించి యుతనిశరీరము తక్కఁ దక్కినలోకత్రయము నపహరించి వరుణ పాశములచే బంధించి పర్వతగుహలోనికిఁ దఱుమఁగా నప్పుడు బలి “అక్కటా! ఇంద్రుఁడు పురుషార్థములతారతమ్య మెఱుంగని వాఁడు. మహాబుద్ధిమంతుఁ డయినబృహస్పతి యాయింద్రున కా లోచన చెప్పువాఁడఁట. అతఁ డయిన నుపదేశింపలేదేమి? లేక బృహస్పతి గూడఁ బురుషార్థతారతమ్యము నెఱుంగనివాఁడే యేమో. ఒకవేళనతఁడు చెప్పినను వినకయింద్రుండు స్వతంత్రుఁ డయి ప్రవర్తించెనో, అట్లు కానిచోఁ బరమపురుషార్థభూతుఁడ యిన భగవంతుని సోదరునిఁగా బడసియు నతనియనుగ్రహంబు నకుఁ బాత్రుం డయ్యు ననంతసుఖఫలంబును సమకూర్చునతని దాస్యమును గోరుకొనక సుఖముకంటె మిక్కిలిస్వల్పమైనదియు మన్వంతరపర్యంతము మాత్రమే యుండెడిదగుటచే నతివేగము

గల కాలమునకు వశమైనదియు నగు త్రిలోకాధిపత్యమునుగోరు కొనునా? ఇట్లుండ నింద్రునకుఁ బురుషార్థతారతమ్యజ్ఞాన మేది? అట్టిపురుషార్థజ్ఞానము గలవాఁడు మాతాతయగుప్రహ్లాదుం డొక్కఁడేకలండు. అట్టిడులోకమునమఱియొకండేడీ? తనతండ్రియగు హిరణ్యకశిపుఁ జంపి పిమ్మట నరసింహమూర్తి తండ్రియైశ్వర్యమును దయతో నొసంగుచున్నను బ్రహ్లాదుండు పరిమితఫలదాయక మగుటచే, నాయైశ్వర్యమును గోరక యెప్పటికిని దఱుఁగనిఫలము గలదాసానుదాసత్వపురస్సరముగా దేహావసానమున ముక్తిని గోరుకొనెను! అయారే! ప్రహ్లాదుని వివేకసంపద నుతింపఁ దగినది కదా! కర్మబంధమును దొలఁగించుకొన నేరక భగవదనుగ్రహంబును సంపాదింపఁజాలక యున్ననావంటివాఁ డెవఁడు మహానుభావుఁ డగుప్రహ్లాదునిమార్గము ననుసరింపఁగలఁడు?" అని తలపోసెను. ఇట్టియోగ్యతగల బలి మహాభాగవతుఁడగుటకు సందియమేమి కలదు? నిఖిలజగద్గురుఁడును భగవంతుండునగు నారాయణుండుగదాపాణియై తనభక్తుఁడయినబలియందనుగ్రహంబు గలవాఁడయి యాతనిద్వారమును సర్వదా కాచుచు దిగ్విజయార్థము రావణుండచ్చటికివచ్చి యాద్వారము చొరఁబడుచుండగాఁ దనకాలిగోటిచేఁ బదివేలయోజనములదూరము పడునట్లు మీటివైచెను. భగవంతుఁ డగునారాయణుని స్వవశము గావించుకొన్నయాబలిచరిత్రమును బూర్తిగాఁ దరువాత వర్ణించి చెప్పెదను. ఓరాజేంద్రా! ఆసుతలమున కధోభాగమునఁ దలాతలమనెడివివరము గలదు. అందు మయుఁ డనుదానవేంద్రుఁడు గలఁడు. వాఁ డాలోకవాసులచేఁ బూజింపఁబడుచుండును. వాఁడు త్రిపురముల కధిపతియైయుండెడివాఁడు. ముల్లోకములను సుఖం

పఁజేయఁదలంచుచున్న భగవంతుం డగురుద్రుండు పురత్రయ మును బూర్వము దహించె. అప్పుడు మయుండు మిక్కిలి వేఁడు కొనఁగా నతనియం దనుగ్రహముంచి రుద్రుం డతని కాతలాతల ము నొసంగిచక్రమువలనిభయమును బాపె. దానం జేసిమయుండు నిర్భీకుండయి సుఖవంతుఁడయియందు నివసించుచున్నాఁడు. దాని కధోభాగమున మహాతలమున్నది. అందుఁ గద్రూసంభూతులును ననేకశిరస్కులు నగుసర్పములసమూహము గలదు. అది క్రోధ వశ మను పేరితో నొప్పుచున్నది. ఆసర్పగణమందుఁ గుహకుఁడు, తక్షకుఁడు, కాళియుఁడు, సుషేణుఁడు, మొదలగువారు ప్రధా నులు. వారు దీర్ఘకాయములతో నొప్పుచున్నారు. వారు పరమ పురుషుం డగువాసుదేవునకు వాహన మగుగరుడునివలన నెల్ల ప్పుడును భయ మందుచుఁ, దమభార్యలందును, సంతానములం దును, స్నేహితులందును, నధికాసక్తి గలవారయి యొకప్పుడు ప్రమత్తులయి విహరించుచుందురు. ఆమహాతలమున కధోభా గమున రసాతల మున్నది. అందు దితిసంతతివారును, దనుసంత తివారును వసించుచున్నారు. వారు ఫణు లనునామమున నొప్పు చున్నారు. వారు నివాతకవచు లనియుఁ, గాలకేయులనియు, హి రణ్యపురవాసు లనియు, మూఁడుతెగలవారై యుందురు. వారు దేవతలకు శత్రువులై వర్తించుచుందురు. వారు పుట్టువుచేతనే మహాబలవంతులు. వా రెక్కుడుసాహసము కలవారు. వారు సర్వలోకములందును బ్రభావము గలనారాయణుని చక్రముచేఁ బ్రతిహతబలులయి సర్పములచందమున వర్తించుచుందురు. ఇం తియకాక యింద్రదూతిక యగు సరమ పలికినమంత్రవర్ణరూప ము లగువాక్కులకును, నింద్రునకును భయమందుచుందురు. ఆర

పాతలమున కధోభాగమునఁ బాతాళమున్నది. ఆపాతాళమున వాసుకియు, శంఖకులికుఁడు, మహాశంఖుఁడు, శ్వేతుఁడు, ధనంజయుఁడు, ధృతరాష్ట్రుఁడు, శంఖచూడుఁడు, కంబళుఁడు, నశ్వతరుండు మొదలగు సర్పరాజులును, మహాకోపవంతము లయి మహాఫణములు గల దేవదత్తాదు లగుసర్పములును, నివసించుచున్నారు. ఆమహాసర్పములందుఁ గొన్ని యైదుశిరస్సులుగలవి. కొన్నియేఁడుశిరస్సులు గలవి.కొన్ని యేఁడుశిరస్సులుగలవి. కొన్ని పదిశిరస్సులుగలవి. కొన్ని నూఱుశిరస్సులుగలవి. కొన్ని సహస్రశిరస్సులు గలవి. వానిఫణములం దున్నమహామణులు సర్వదా ప్రకాశనశీలము లయి తమకాంతులచేఁ బాతాళమం దున్న చీఁకట్లను దఱుమఁచుండు. ఇది యిరువదినాల్గవయధ్యాయము.

---

## పాతాళముక్రింద నున్న సంకర్షణానంతాది నామకునిమహత్త్వము.

ఓరాజేంద్రా! ఆపాతాళమున కధోభాగమున ముప్పదివేల యోజనములవైశాల్యము గలయంతరమొకటి కలదు. అందుఁ దామసాహంకారమున కధిష్ఠాతయు, ననంతసంజ్ఞగలదియునగు భగవత్కళ యొకటి సుప్రసిద్ధమై యున్నది. సంకర్షణప్రోక్తము లగు సాత్వతములందుఁ బరాయణులై భగవత్కళాయాథాత్మ్యమును దెలిసిన మహాత్ములాభగవత్కళను సంకర్షణుఁడని చెప్పుచున్నారు. అతని కాపేరు యాదృచ్ఛికముగా వచ్చినది కాదు. అతఁడు జ్ఞాతకును జ్ఞేయమునకును, నతీంద్రియవిషయక మగు జ్ఞానము నాపాదించుటంజేసి యట్లు చెప్పఁబడుచున్నాఁడు.ఇంతి

యు కాక యతఁడు జీవవర్గమున కభిమాని దేవత యగుటవలన సహాఙ్మనెడి బుద్ధివృత్తికి హేతుభూతుఁ డగుచున్నాఁడు. ఇతనికిఁ గల యనంతనామము గూడ యాదృచ్ఛికమైనది కాదు. సహస్రఫణములు గలయాసంకర్షణుని యొక శిరంబున సమస్తభూమండల మావగింజవలెఁ గానవచ్చుచున్నది. ఇట్లితఁ డపరిచ్ఛిన్నుఁ డగుటవలననంతుఁడనిపించుకొనుచున్నాఁడు. రెండుపరార్థముల కాలము గడచినపిమ్మట నతఁడు సమస్తప్రపంచమును సంహరింపఁదలంచి కోపమున బొమముడివేయఁగా నాభ్రూమధ్యమునుండి సాంకర్షణనామము గలయేకాదశరుద్రసమూహము మూఁడు నేత్రములతోను, త్రిశూలముతోను నుదయించి ప్రపంచమును సంహరింతురు. అచ్చటిసర్పరాజు లందఱును,నతనిపాదపద్మముల నఖకాంతిసమూహమునం దవ్యభిచరితభక్తి గలవారయి నమస్కరించుచు, భాసురకుండలముల కాంతిమండలములచే నలంకృతములగు గండస్థలంబులు గలవై, మిక్కిలిసుందరము లయిన తమవదనంబు లానఖకాంతులందుఁ బ్రతిఫలించుచుండఁగా మనంబులు సంతసింప నధికసుఖము గల్గునట్లుగా నతని విలోకించుచుందురు. అచ్చటినాగకన్యకలును నతనివలనఁ బురుషార్థముల నభిలషించుచు,సుందరములగునంగదములచేతను,వలయములచేతను, బ్రకాశితములై, నిర్మలములై,దీర్ఘములై,కోమలములై సుందరములై, వెండిస్తంభంబుల బోలుచు, నున్నయతనిభుజములం దగరుకుంకుమచందనములఁ బూయుచు దదీయభుజస్పర్శనముచేఁ దమహృదయంబులు చంచలంబులు కాఁగా మన్మథావేశముచే సుందరమందహాసము వదనంబులందొలయ, ననురాగమదాతిశయముచే ఘూర్ణితములై యరుణములయి దయా

పూరితములై యున్న నరుణనయుగములు వెలయునాసంకర్షణుని వదనారవిందమును సవ్రీడముగా నాలోకించు చుందురు. అనంతుండును, ననంతకల్యాణగుణములకు సముద్రమువంటివాఁడును జగత్కారణ భూతుండును, నగుసంకర్షణుండు స్వీయ తేజస్సుచేఁ బ్రకాశించుచు, జగత్సంహారవిషయమగు ససహనక్రోధము నుపసంహరించి లోకములకు మంగళములు గల్గించుచు వర్తించుచున్నాఁడు. మఱియు సురులు, నసురులు, నురగులును, సిద్ధులును, గంధర్వులును,విద్యాధరులును, మునిగణములును,సర్వదా యామహానుభావుని ధ్యానించుచుండ, స్వానుభవజనితమగుమదము చేముదితుండయి, ఘూర్ణితములై పరవశము లయిననేత్రములు గలవాఁడై ,సుందరభావగర్భితములై మందహాసపూర్వకముగా వెలువడువచనామృతముచే నిజసేవకులను, విబుధనాయకులను సంతసింపఁజేయుచు, నధికమగురక్తినుగల నూతనకృష్ణతులసీసంబంధియును నామోదము గలదియునగు మకరందములను ద్రావి మదించినతుమ్మెదలమధురఝంకారములనొప్పునై జయంతి యను నామము గలవనమాలచేఁ బ్రకాశించుచు, నల్ల నివస్త్రము కటీమండలమునఁ బ్రకాశింప నొకటి యగుమకరకుండలము చెలువార సుందరసుకుమారభుజమున హలాయుధము వెలుఁగొంద, భగవంతుం డగునాసంకర్షణుం డైరావతముమాడ్కి శ్వేతాంశువుల నలరారుచు, నద్దిగ్గజముచర్మమయపట్టికనుంబోలెఁగాంచనసూత్రమును దాల్చుచున్నాఁడు. మఱియు భగవంతుం డగు ననంతుండు తనచరిత్రములు విని తన్ను ధ్యానించుచున్నముముక్షువులం దపారప్రేమగలవాఁడై వారిహృదయములందుఁ బ్రవేశించి యనాది యగుకాలనుచేఁ బ్రవృత్తమైనకర్మవాసనలచేఁ

గూర్పఁబడి, యవిద్యామయ మై, సత్వరజస్తమోగుణప్రచుర మై యున్నహృదయగ్రంథిని విడిపించుచున్నాఁడు. అట్టిసంకర్షణుని ప్రభావమును దుంబురునారదులు బ్రహ్మసభలో నిట్లు గానముచేసిరి. "జంగములు సృష్టిస్థితిలయములకు స్వయముగా నసమర్థములయినరజస్సత్త్వతమోగుణంబులేమహాత్మునిసంకల్పముచేఁ దత్తత్కార్యసమర్థము లగుచున్నవియో, యట్లె ప్రకృతియు స్వయముగా మహదాదికార్యవర్గమునకు హేతుభూతయయ్యు, సృష్టి కసమర్థయై యుండ నెవ్వనిసంకల్పము దానికట్టిసామర్థ్య మొసంగెనో, యెవఁడు తనయందు దేవమనుష్యాది రూపములు లేకపోవుటచే నొక్కఁడై వఱలుచున్నాఁడో, యెవని రూపము ప్రకృతిపురుషాత్మక మగుచున్నదో, కార్యావస్థయందెవ్వనిశరీరము నామరూపవిభాగములచే నానావిధము లగుచున్నదో యట్టి భగవంతునిస్వరూపము మే మెట్లుగాఁ దెలిసికోఁగలము? మఱియు, నే మహానుభావునియం దీ చిదచిదాత్మక జగంబు కానవచ్చుచున్నదో, యేపరమేశ్వరుఁడు భక్తుల ననుగ్రహింపఁగోరి యీదివ్యమంగళవిగ్రహమును ధరించెనో, యెవఁడు బ్రహ్మాదిదేవతలకైన వెతకఁదగినవాఁడై యుండెనో, యాపరమాత్మ నిజభక్తజనులమనంబులను వశీకరించుకొనఁ గర్మనిమిత్తముకాని భూమండలభరణాదిలీలలను భరించుచున్నాఁడు. అతనిస్వరూపము స్వభావముచే దుర్జ్ఞేయ మైనను లోకానుగ్రహార్థ మీదృశదేహముఁ దాల్చినవాఁడు కావున నే మీవంటివారు కొంచెమైన నతని వర్ణించుట కధికారము గల్గుచున్నది. ఇంతియ కాక యాభగవంతునినామప్రభావము నిను

పమానమైనది. రోగాదిపీడితుఁడైనను, మహాపాతకియైనను బరి హాసమునకైన నాభగవంతునినామమును గీర్తించినను, నొరులు కీర్తించినదాని విన్నను, వారు సమస్తదురితములకును దూరు లగుచున్నారు. పరమాత్మను సంస్మరించుచున్న వారిపాపము లన్నియు నవలీలగనే నశించుచున్నవి. కావున నాయనంతుని కంటె నన్యుండగువాని నేముముక్షు వాశ్రయింప నెంచును? ఏమహాశక్తి మహాపర్వతములతోను, నదులతోడను, సముద్ర ములతోడను గూడియున్న భూమండలమును లీలగాఁ దనసహ స్రశిరంబులలో నొకదానియం దణువువలెఁ దాల్చెనో, యపరి చ్ఛిన్నుండును, నమేయప్రభావుండును నగు నాయనంతుని కల్యా ణగుణరూపములను వేయినాల్కలుగలవాఁడైన నెవఁడు లెక్కిం పఁగలఁడు? ఇట్లపరిచ్ఛిన్నప్రభావము గలయనంతుఁ డపార వీర్యుఁడై యమేయగుణుఁడై యసహాయుఁ డయి రసాతల మూలమున వర్తించుచుఁ బాలనమునకయి యీ భూమండల మును ధరించుచున్నాఁడు". ఓరాజేంద్రా! సమస్తకామము లను నాకాంక్షించుచున్ననరులకుఁ బొందఁదగినదై, తత్తత్క ర్మానుసారముగా నీశ్వరునిచే సృష్టములయిన లోకము లివియే. ఈ బ్రహ్మాండమందుఁగలవాని నన్నిటిని సంప్రదాయమునకవిరుద్ధ ముగా వర్ణించి చెప్పితి. ఓరాజా! సంసారు లాచరించు సకా మమయిన ధర్మమునకు ఫలరూపము లగుగతులు సుఖదుఃఖ తారతమ్యముచే నానావిధములయి యున్నవి. వానిని నీ వడిగి నట్లుగానే పూర్ణముగా వర్ణించితిని. ఇఁక నీకేమి చెప్పవలయు నని శుకుం డడిగెనని సూతుండు శౌనకాదులకుఁ జెప్పె నెండియు ని ట్లనియె. ఇది యిరువదియైదవ యధ్యాయము.

ఓమునులారా! రాజది విని సంతసించి శుకున కిట్లనియె. 'ఓ మహర్షీ! నీవుక్క రీతిగా నాచరింపఁబడు ప్రవృత్తిధర్మమునకు భూరాదిలోకములందు ఫలము నానావిధములనియు, నందుఁ గొందఱకు దుఃఖమనియుఁ, గొందఱకు సుఖమనియు మఱికొందఱకు మిశ్రఫలమనియుఁ జెప్పితివి. నీవు చెప్పినవ్యవస్థ యెట్లు సరిపడు నని సందేహించుచున్నాను. అది మిక్కిలి విచిత్రముగా నున్నది. దానింగూర్చి చెప్పు మనఁగా శుకుం డి ట్లనియె. *ఓరా

* ఇచ్చట నీయంశను గ్రహింపవలయును. "న తదస్తి పృథివ్యాంవా దివి దేవేషువా పునః। సత్వంప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభి ర్గుణైః" అని చెప్పిన ట్లందఱకును గుణత్రయయోగము తప్పదు. ఆగుణములొకప్పుడు సంకుచితములై వేఱొకప్పుడు వికాసమును బొందుచుండును. అట్లు సత్వాదిగుణములకు సంకోచవికాసరూపపరిణామము ప్రాచీనకర్మవాసనల కనుకూలముగా నుండును. ప్రాచీనకర్మవాసనలచేఁ గలిగినగుణత్రయపరిణామమువలననే ధర్మకార్యకర్తలును, శ్రద్ధాబుద్ధులును, వన్నిమిత్తము లగుకర్మములును, మూఁడేవిధము లగుచున్నవి. ఈవిషయము గీతలలో నిట్లు చెప్పఁబడినది. అందు సాత్వికుని లక్షణంబు-"ముక్తసంగో నహంవాదీధృత్యుత్సాహసమన్వితః। సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తాసాత్విక ఉచ్యతే" అనఁగా నెవఁడు ముక్తసంగుఁడై సర్వము నేనేచేయుచున్నానని తలంపక సంతోషోత్సాహములు కలవాఁడయి కార్యసిద్ధియందును, నసిద్ధియందును వికారమునొందక వర్తించునో వాఁడుసాత్వికుఁడని చెప్పఁబడు" నని భావము. పిమ్మట రాజసలక్షణ మిట్లుచెప్పఁబడియె. "రాగీకర్మఫలప్రేప్సుర్లుబ్ధోహింసాత్మకోఽశుచిః। హర్షశోకాన్వితఃకర్తా రాజసః పరికీర్తితః" అనఁగా నెవఁడు వస్తువులం దనురాగముగల్గి ఫలాభిసంధితోఁ గర్మములాచరించుచు, లుబ్ధుఁడై, హింసాస్వభావముగలవాఁడై కార్యసిద్ధ్యసిద్ధులందు హర్షశోకములు గలవాఁడై, యుండునో, వాఁడు రాజసుఁడనఁబడునని వక్కాణింపఁబడినది. అందే తామసలక్షణంబు, "అయుక్తః ప్రా

జేంద్రా ! జీవులు సత్త్వాదిగుణత్రయయుక్తులగుటచేతను, సత్త్వా

కృత స్తబ్ధశ్శఠో నైకృతికోలసః। విషాదీదీర్ఘసూత్రీచ కర్తా తామసఉచ్యతే'' అనఁగా నెవఁడయోగ్యుఁడై యవివేకియై, స్తబ్ధుఁడై, ధూర్తుఁడై, యపకారకారియై మందుఁడై దుఃఖభాగియై, ముందువచ్చున దాలోచింపక వర్తించునో, వాఁడు తామసుఁ డనఁబడునని చెప్పఁబడినది. అని యిట్లుసత్త్వాదిగుణభేదములచేఁ గర్తృభేదమును జెప్పిపిమ్మటగుణత్రయముచేభిన్నమయినబుద్ధులనుగూర్చి యిట్లుచెప్పెను. ''ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే,బంధంమోక్షంచయోవేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ'' అనఁగా, ఓ యర్జునా! ఏ బుద్ధి,ప్రవృత్తిధర్మములేవో నివృత్తిధర్మములేవో, కార్యమేదో, యకార్యమేదో, భయమేదో యభయమేదో, సంసారమేదో, మోక్షమేదో,చక్కఁగా దెలిసికొనునో యది సాత్త్వికబుద్ధి యనఁబడునని భావము. ''యయా ధర్మమధర్మంచ కార్యం చాకార్యమేవచ। అయథావత్ప్రజానాతి బుద్ధి స్సాపార్థ రాజసీ'' అనఁగా దేనిచేత ధర్మాధర్మములను, గార్యాకార్యములను యథార్థముగాఁ దెలియఁజాలమో యది రాజసబుద్ధి యనఁబడుచున్నదనిభావము ''అధర్మం ధర్మమితి యామన్యతేతమసావృతా। సర్వార్థాన్విపరీతాంశ్చబుద్ధిస్సాపార్థ తామసీ''అనఁగా నేది తమోగుణావృతమై యధర్మమును ధర్మముగాను సమస్తకార్యములను విపరీతములుఁగాను దలపించునోయది తామసబుద్ధియనిభావము. ఇట్లు సత్త్వాదిగుణములచే బుద్ధులకుఁ గల్గిన భేదము చెప్పఁబడెను. ఓ రాజా ! యిట్లు బుద్ధులకు భేదముగల్గుటచేత జీవులు వారివారికిఁ దోఁచినట్లు కర్మములాచరించుచుందురు. వారివారి బుద్ధుల వర్తనముచేతనే యుత్తమమధ్యమాధములగు దేవతలను గొల్చుచుందురు. ఈయంశము భగవద్గీతలలోఁ జెప్పఁబడినది.''యజంతే సాత్త్వికా దేవాన్ యక్షాన్ రక్షాంసి రాజసాః। ప్రేతాన్భూతగణాం శ్చాన్యే యజంతేతామసాజనాః।అనఁగాసాత్త్వికులుదేవతలను, రాజసులు యక్షరాక్షసులను, దామసులు భూతప్రేతగణములను గొల్చుచుందురని భావము. వీరలిట్లు తత్తద్దేవతలను గొల్చుట సత్త్వాదిగుణభేదముచే భిన్నమగుబుద్ధికలననే సంభవించుచున్నదని యెఱుఁగుము. రాజేంద్రా! సత్త్వాదిగుణములచే

దిగుణములచే శ్రద్ధ మూఁడుభేదములు కలదగుటచేతను, ధర్మాదికార్యము లాచరించువారును వారిశ్రద్ధాబుద్ధులును దాదృశ

---

భిన్నులయిన కర్తలు తాదృశబుద్ధులచే భిన్నకర్మము లాచరించుచున్నారు. అందు సాత్త్వికులు నియమయుతమైనదియు, సంగరహితమైనదియు, రాగద్వేషములు లేకుండ, ఫలమును గోరకుండఁ జేయఁబడినదియు నగుకర్మము లాచరించుచుందురు. అది సాత్త్వికకర్మమనఁబడును. సాహంకారుఁడై ఫలాభిలాష కలవాఁడయి యున్నవాఁడు చేసినదియు నధికాయాసము కలదియు నగుకర్మము రాజసమనఁబడును "అనుబంధమును, నాశనమును, హింసను, పౌరుషమును నపేక్షింపకుండ నజ్ఞానమువలన నేకర్మ మారంభింపఁబడునో యది తామసమనఁబడును. ఈయంశము గీతలలోఁ జెప్పఁబడినది. "నియతం సంగరహితమరాగద్వేషతః కృతం। అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే। యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః। క్రియతే బహుళాయాసం తద్రాజసముదాహృతం । అనుబంధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషం, మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే' అని యిట్లు కర్మము మూఁడువిధంబులగుచున్నది. సాత్త్వికుఁడయిన యేపురుషుఁడు సత్త్వగుణయుక్తమైన బుద్ధిశ్రద్ధలతో ధర్మముల నాచరించుచున్నాఁడో, వాఁడు తారతమ్యరహితమై, యనంత సుఖముగల మోక్షము నొందుచున్నాఁడు. రజోగుణయుక్తుఁ డయినవాఁడెవఁడు రజోగుణయుక్తములగు బుద్ధిశ్రద్ధలతో ధర్మముల నాచరించునో, వాఁడు భూరాదిలోకములను బొంది పరిమిత సుఖమును బొందుచున్నాఁడు. అందులోఁ శ్రద్ధాతారతమ్యమును బట్టి సుఖతారతమ్యమును బొందును. తామసుఁడయిన వాఁడెవఁడు తమోయుక్తములగు బుద్ధిశ్రద్ధలతో ధర్మముల నాచరించునో వాఁడీలోకములను బొందినను గేవలము దుఃఖమునే పొందుచున్నాఁడు. తామసరాజసులకు భూరాదిలోకములను బొందించు ప్రవృత్తిరూప ధర్మము సమానమె యైనను నందు రాజసులు పరిమితసుఖమును, తామసులు గేవలము దుఃఖమును బొందుదురు.

కార్యములును, వేలువేలువిధము లగుచున్నవి. ఆవిధము లన్నియుఁ గర్తృశ్రద్ధాది తారతమ్యమువలననే కలుగుచున్నవి. వానిననుసరించియే భిన్నలోకప్రాప్తియును భిన్నఫలములును గలుగుచున్నవి. ఓరాజా ! ధర్మములు కర్త్రాదితారతమ్యమును బట్టి సుఫలతారతమ్య మెట్లు కల్గించుచున్నవో యట్లే ప్రతిషిద్ధరూపమగు నధర్మములును, దమోగుణయుక్తములగు శ్రద్ధాబుద్ధులు గల తామసులచే నాచరింపఁబడి దుఃఖతారతమ్యమును గలిగించుచున్నవి. ఓరాజా! అజ్ఞానము తమోగుణమూలకమయి యనాదియై యున్నది. తాదృశాజ్ఞానప్రయుక్తములగు కామ్యకర్మరూపము లయినపాపములు వాసనారూపము లొందియున్నవి. ఆపాపము లవాంతరభేదముచే సంఖ్యాతీతము లయి యున్నవి. తాదృశపాపము లనుభవించువారిగతులకును లెక్కలేదు. వారు పొందఁదగినస్థానములకును మేరలేదు. అవి యన్నియు లెక్కకు మీఱియున్నవి. వానిని బూర్తిగా వర్ణింపఁదరముకాదు. కావున నధికదుఃఖము లనుభవించువారికిఁ గల్గుగతులను, వారికిఁదగిన స్థానములను గొన్నిమాత్రమే వర్ణించిచెప్పెదను' అనవిని రాజ తని కిట్లనియె. "ఓమునీంద్రా! అట్లె సెలవిమ్ము. కాని నరకములుగలవని చెప్పుదురు. అవి కొన్నిదేశవిశేషములా? కాక యితరములా? అవి మూఁడులోకములకు వెలుపల నున్నవా? లేక యీలోకముల కంతర్వర్తులైయున్నవా? అట్లున్న నేలోకములకు మధ్యమున నున్నవి? వానిం గూర్చి సవిస్తరముగాఁ దెలుపుము" అన విని శుకుం డిట్లనియె! "ఓరాజచంద్రమా! ఆనరకములు బ్రహ్మాండమున కంతర్గతములై యున్నవి. అవి భూమికిఁ గ్రిందుగాను నండజలమునకు మీఁదుగా నున్నవి. ఏదిక్కున నగ్నిష్వాత్తాది

పితృదేవతలు నిరుపమాన మగుసమాధి నవలంబించి తమగోత్రములవారికి సత్యము లగునాశీర్వచనముల నొసంగుచు నివసించుచున్నారో, దేనియందుఁ బితృదేవతల కధిపతియు సూర్యపుత్రుఁడు నగుయముఁడు భగవదాజ్ఞ నతిక్రమింపనివాఁ డయి పరిచారకపరివృతుఁ డయి తనదూతలచే తనలోకమునకుఁ గొనిరాఁబడిన జీవులకుఁ దత్తత్కర్మానుగుణమగుదండనమును జేయుచున్నాఁడో యాదక్షిణదిక్కునం దానరకము లున్నవి. ఓరాజా! కొందఱచ్చట నిరువదియొక్కవిధము లగునరకము లున్నవని చెప్పుచున్నారు. ఆనరకముల నామములను, వాని స్వరూపములను, జెప్పెద వినుము. అందుఁ దామిస్రంబును, నంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును, గుంభీపాకంబును, గాలసూత్రంబును, నసిపత్రవనంబును, సూకరముఖంబును, నంధకూపంబును, గ్రిమిభోజనంబును,సందంశంబును, దప్తసూర్మియు, వజ్రకంటకశాల్మలియును, వైతరణియుఁ, బూయోదంబును, బ్రాణరోధంబును, విశసనంబును, లాలాభక్షంబును, సారమేయాదనంబును, నవీచిమంతంబును, నయఃపానంబును, నను నామంబులు గల యేకవింశతి నరకంబులును గలవు. మఱియు క్షారకర్దమనియు, రక్షోగణభోజన మనియు, శూలప్రోత మనియు,దందశూక మనియు, నవటనిరోధన మనియుఁ, బర్యావర్తనమనియు, సూచీముఖమనియు నను పేళ్లు గలయీయేడింటితోను గలిసి యవి యిరువదియెనిమిదినరకంబు లయ్యె. ఈనరకంబులు దుఃఖము లనుభవింపఁ దగినస్థలంబులు. ఓరాజా! ఏకర్మము లాచరించిన వా రాదుఃఖభూములను జెందుదురో యాయాకర్మములను, వానినాచరించిన వాఁడుండ వలసిననరకమును

దెల్పెదను వినుము. ఎవఁడు పరధనంబును, బరులయపత్యము లను, బరభార్యలను నపహరించునో, వానిని భయంకరు లయిన యమదూతలు గాలపాశబద్ధుం గావించి కొనిపోయి బలాత్కారముగాఁ దామిస్రంబునఁ బడవైతురు. తమఃప్రచుర మయిన యాతామిస్రమం దున్నజంతువున కన్నపానాదు లొసంగరు. పర్వతము నెక్కించి క్రిందికిఁ బడఁద్రోయుదురు. దండముతోఁ దాడింతురు. భయపెట్టుదురు. ఇట్లు పలువిధము లగుహింసాకృత్యములచే యమభటులు బాధించుచుండ జంతు వాబాధలను బడుచు దుఃఖాతిశయమున వెంటనే మూర్ఛిల్లును. ఓరాజా! ఏవాఁడు భర్తను వంచించి యతనిధనమును, భార్యాదులను, స్వోపయోగార్థము చేయునో, యమదూతలు వాని నంధతామిస్రంబునఁ బడవైతురు. అందుఁ బాతితుఁ డయినశరీరి దుస్సహబాధలచేఁ బీడింపఁబడును. ఆతీవ్రవేదనచే వాఁడు మతిసెడి నష్టదృష్టియై నిర్మూల నగుతరువుచందంబునఁ గూలును. తామిస్రముకంటె నిది మహాతిమిరావృతమై జంతువు దృష్టిని నశింపఁజేయుటచే దీని కంధతామిస్ర మనునామము గల్గినది. ఎవఁడు "ఈశరీరము నేను; ఈయపత్యకళత్రాదులు నాయవి." అని యహంకార మమకారములతో వర్తిల్లుచుఁ, గేవలము భూతద్రోహముగావించి స్వకుటుంబము ననుదినమును బోషించుచున్నాఁడో, వాఁ డీలోకమందే యాకుటుంబమును విడిచి యసహాయుఁడై పూర్వము తా నాచరించుకొన్న పాపకర్మ మనుభవింప రౌరవ మనునరకంబునఁ బడును. అప్పుడు వీఁడు పూర్వ మేభూతములకు ద్రోహము చేసెనో, యవి యమయాతన ననుభవించు వానిని జేరి రురుమృగము లయి వానిని మిక్కిలి బాధించును.

సర్పముకంటెఁ గ్రూరతరము లయి దీర్ఘశృంగములు గలజంతువులకు రురువు లనునామము గలదు. ఆ రురువు లందలిజంతువులను బాధించుటంబట్టియే దానికి రౌరవ మనునామము గల్గె. అట్లె మహారౌరవమందును రురువులు హింసించును; కాని యందు రౌరవముకంటె నచ్చట మఱియొకవిశేషము కలదు. మహారౌరవమం దున్న రురువు లందుఁబడినవాని మాంసమునే భక్షించును. రౌరవమునందు హింసామాత్రమే యుండును. ఇచ్చట జంతువుమాంసమును దినుట యధికము. ఎవఁడు కేవలమును శరీరపోషణమాత్రపరుఁడయి క్రూరుఁడయి, పశువులు, పక్షులు మొదలగు ప్రాణులను దహించునో, యా దయావిహీనుఁడు రాక్షసులచే సైతము నిందితుండై కుంభీనసమునఁ బడును. అచ్చట వానిని యమభటులు తప్తతైలపూరిత మగుపాత్రమునఁ బచనము చేయుదురు. జంతువులను దప్తతైలకుంభమునఁ బచనముచేయుటచేతనే దానికిఁ గుంభీపాకం బనునామము గల్గినది. ఓరాజా! కాలసూత్ర మనునరక మందుఁ బదివేలయోజనములవై శాల్యము గలదయి తామ్రవికార మైనపెన మొకటి కలదు. క్రింద నున్న యగ్ని జ్వాలలచేతను మీఁద నున్న సూర్యుని వేఁడికిరణములచేతను, నది మిక్కిలి తప్త మగుచుండును. ఎవఁడీలోకంబునఁదండ్రినిగాని తల్లినిగాని బ్రాహ్మణునిఁగాని జంపునో వాని నా పెనమందుఁ బడవైతురు. వాఁడచ్చట క్షుత్పిపాసాపరిపీడితుఁడై "అయ్యో! చచ్చితిని. నన్నుఁ బైకిఁ బోనిం" డని ప్రార్థించుచున్నను యమభటులు వానినిఁ గరుణింపక పశువునకు రోమము లెన్ని యుండునో యన్నిసంవత్సరములదాఁక నుంతురు. ఆశరీరి యందుచే లోపలను వెలుపలను గలశరీరము

దగ్ధము కాఁగా దానికిఁ దాళఁజాలక యొక్కొకమాఱు శయ
సించు. ఒకమాఱు నిలువఁబడు. ఒకమాఱు పరువెత్తును. వేఱొక
మాఱు దన్ను రక్షింపఁ బ్రార్థించు. * అధికమగు దుఃఖానుభవ
కాల మిందుఁ దెలియఁబడుచుండుటచే దీనికిఁ గాలసూత్ర మను
నామము గల్గినది. ఎవఁ డాపదాదులు లేకయే దేశకాలవైపరీ
త్యమువలనఁ గల్గినయశక్తిచేత వేదవిహితము లయి స్వవర్ణాశ్ర
మోచితము లైనధర్మములను విడిచి వేదవిహితము కానిపాషం
డమతము నవలంబించునో, వాఁడు మృతిఁ జెంది యసిపత్రవనము
ప్రవేశించి యమభటులు గొట్టుకశాఘాతములఁ దినుచు వానికిఁ
దాళఁజాలక యావనమందుఁ బర్వెత్తఁబోయి రెండుప్రక్కలను
వాడిగల యాఖడ్గధారలచే సకలాంగములును ఖండితములు
గాఁగా "అయ్యో చచ్చితి" నని హాహాకారములు సల్పుచు
నాబాధాతిశయముచే నడుగడుగున మూర్ఛిల్లును, స్వధర్మముల
విడనాడినవాఁ డిట్లు పాషండధర్మానుగుణ మగుఫల మనుభవించు
చుండు. అసి(ఖడ్గ)సదృశము లగుపత్రములు గలవృక్షములందుఁ
గ్రిక్కిఱిసియుండుటచే దాని కసిపత్రవన మను పేరు గల్గినది. ఏ రా
జుగాని రాజభటుఁడుగాని దండనార్హుఁడు గానివాని దండించునో,
దండింపఁ దగియున్నవాఁడని బ్రాహ్మణుని దండించునో, యా
పాపాత్ముఁడు సూకరముఖ మనునరమునఁ బడుచున్నాఁడు. అచ్చ
ట వాఁడు మిక్కిలిబలము గల్గి సూకరముఖమువంటి ముఖము
గలజంతువులచే మిక్కిలి పీడితుఁ డయి యేనుఁగు నమలినచెఱకు

---

* భూయాన్ దుఃఖానుభవకాలోఽసూత్ర్యతే జ్ఞాయతేయస్మిన్నితి కాలసూ
త్రః॥ కాలఃసూత్ర్యతేఇతి కాలసూత్రః॥ అని వ్యుత్పత్త్యర్థము. అనఁగా బహు
కాలానుభవ మిందుఁ గలదుగాన గాలసూత్ర మనఁబడుచున్నది.

గడవలె సర్వావయవములును బిప్పిగాఁగా నార్తధ్వనిఁ జేయుచు నొక్కొక్కప్పుడు మూర్ఛితుఁడై మోహపరీతుఁడై యీలోకమందు దోషరహితులు వానిచే నెట్లు హింసింపఁబడిరో యట్లె వాఁడును హింసింపఁబడుచుండు. సూకరముఖములు గలజంతువు లచుండుటచే సూకరముఖమను నామము దానికిఁగల్గినది. పరుల బాధ నెఱింగినవాఁ డెవఁడు భగవంతునిచే జీవనవృత్తిగా నేర్పఱుపఁబడి మనుష్యరక్తపానాదులనుసల్పుచుఁ బరులు తమకొనరించినదుఃఖంబుల నెఱుంగక వర్తించునల్లులు, దోమలు మొదలగుజంతువులకు దుఃఖ మాచరించుచున్నాఁడో, వాఁడు పరమందు భూతద్రోహ మొనరించినపాప మనుభవింప నంధకూప మనునరకంబునఁ బడును. దానియందు వాఁడు పూర్వము తనచే హింసితము లైనపశుపక్షిసరీసృపాదులచేతను, మశకమత్కుణ మక్షికాదులచేతను, మిక్కిలి హింసింపఁబడుచు, నిద్రాసుఖ మెఱుంగఁజాలక యొక్కచో నిలువనేరక యా యంధకారమందు సంచారాదులకసమర్థమగుశరీరంబును భేదించుజీవునివలె భేదించుచు నచ్చోటనే పరిభ్రమించుచుండు. అది యంధకారముచే నావృత మగుకూపమగుటచే నంధకూపమను నామము గల్గినది. ఓనరపాలా! భిక్షాదులవలనఁగాని దైవమువలనఁగాని ప్రాప్త మగునన్నమును నతిథుల కీయక యెవఁడు స్వయముగా భుజించునో, యెవఁడు పంచమహాయజ్ఞము లాచరింపక భుజించునో, వాఁడు పరలోకమందుఁ గ్రిమిభోజనమనునరకమందుఁ బడును. అది వేయియోజనములపరిమితి గల క్రిమికుండమై యున్నది. దేహి యందుఁ బడితా నొకపురుగువలె వర్తించుచు నందున్న పురువులచే భక్షింపఁబడుచు నాక్రిమికుండ మెన్నియోజనము

లున్నదో యన్నిసంవత్సరములు దుఃఖము లనుభవించుచు "అకటా! యతిథుల కీయఁగా మిగిలినదాని నేల తినకపోయితిని. పంచ మహాయజ్ఞాదు లొనరించి తచ్ఛేషము నేల తిననైతి" నని పశ్చాత్తాపతప్తుఁ డగుచుండును. రాజేంద్రా! ఎవఁ డాపదలఁ బొరయ నప్పుడు దొంగతనమునఁ గాని బలాత్కారమునఁ గాని బ్రాహ్మణుని వైనను, నితరుని వైనను, రత్నములను, హిరణ్యమును, మొదలగువస్తువుల నపహరించునో, వానినిఁ బరలోకమున యమభటులు సందంశ మను నరకమునఁ బడఁద్రోసి సంతాపాతిశయముచే నగ్నిహోత్రవర్ణము గలపట్టుకార్లచే ఛేదింతురు. శూలములచే సందంశనము (ఛేదనము) చేయుదురు కాన నానరకమునకు సందంశన మను నామము గల్గినది. ఏపురుషుఁడు పొందఁదగని స్త్రీని బొందుచున్నాఁడో, యేస్త్రీ పొందఁదగని పురుషునిఁ బొందుచున్నదో, యట్టివారిని బరలోకమునఁ దప్తసూర్మి యనునరకంబున వైచి కశాఘాతము లర్పించుచు, నగ్నితప్తమై స్త్రీరూపము గల్గినలోహప్రతిమను బురుషునిచేత నట్లే పురుషాకార మొందియున్న లోహప్రతిమను స్త్రీచేతను, గాఁగిలించుకొనునట్లు చేయుదురు. తప్తమగు సూర్మి (లోహప్రతిమ) యిందుఁ గలదు గాన దీనికిఁ దప్తసూర్మి యను పేరు వచ్చినది. ఓరాజా! ఎవ్వఁడీలోకమున లోభగుణముచే నీచకార్యము లాచరించునో, వానినిఁ బరలోకమున యమభటులు వజ్రకంటకశాల్మలివృక్షము నెక్కించి బాధించుదురు. వజ్రమయము లగుముండ్లు గలబూరుగువృక్షమందుఁ గలదు గాన దాని కాపేరు గల్గినది. ఈలోకమున రాజులు గాని, తద్భటులు గాని ధర్మమర్యాదల నతిక్రమించి ధర్మమర్యాదలను నాశనము చే

యుచున్నారో వారున్మృతినొంది పరలోకమున కేఁగి వైతరణీనది యందు నివసింతురు. ఆవైతరణీనరకలోకమున కగడ్తవలెనొప్పు చున్నది. అది యెల్లప్పుడును జీముచేతను మలమూత్రాదుల చేతను నిండియుండును. దేహులందు నివసించుచు నం దున్న మత్స్యాదులచే మిక్కిలి హింసింపఁబడియు దేహముల విడువక సజీవులై తమకర్మఫలపాకమును స్మరించుకొనుచు సంతత మత్యంతానుతాపము నొందు చుందురు. మలమూత్రములును బూయము, శోణితము, కేశములు,నఖములు, నెముకలు, మెదడు మాంసము, నరములు మొద లగువానితోఁ బ్రవహించు దానికే వైతరణీనది యందురు. లోకమున నెవ్వరు బ్రాహ్మణు లయ్యు శూద్రస్త్రీలను వరించి శౌచమును, నాచారములను, నియమములను, విడిచి, లజ్జావిహీను లయి, యథేష్టముగా సంచరించుచుందురో,వారు మృతినొంది పూయోదం బనునరకమునఁ గూలుదురు. అది పూయము,మలమూత్రాదులు శ్లేష్మము రేతస్సు మొదలగువానితో నిండి యుండును. వా రందు నివసించుచు మిక్కిలి యసహ్యము లయినవానినే తినుచుందురు. పూయమే యుదకముగాఁ గలది గనుక దానికిఁ బూయోదమను నామము లభించెను. బ్రాహ్మణాదు లెవ్వరైనను కుక్కలను గాడిదలను బెంచుచు మృగయాసక్తు లయి, లోకోపకారము కాక పోయినప్పుడు మృగములను వధింతురేని, యమభటులు వారిని బ్రాణనిరోధము గలుగునంతవఱకును బాణములచే శరీరముల ఖండించి బాధించుచుందురు. ప్రాణముల కచ్చట నిరోధము కల్గినది కావుననే దాని కాపేరు గలిగినది. ఎవఁడీలోకమున దాంభికుడయి పరుల వంచించి "ఇతఁడు యజ్ఞము చేసినవాఁ" డని నలు

వురచే మెప్పు వడయుటకై యజ్ఞము లాచరించి పశువధ చేయు చున్నాఁడో వానిని యమభటులు గొనిపోయి వైశసన మను నరకమునఁ గూలవైచి మిక్కిలి హింసింతురు. పాపులకు విశస నము (హింస) అచ్చటఁ జేయఁబడును గాన దాని కాపేరు గల్గి నది. ఈలోకమున బ్రాహ్మణుఁడు కామమోహితుఁడయి స్వజా తికిఁ జెందినభార్యచే రేతఃపానము చేయించునో పాపాత్ముఁ డగు నాబ్రాహ్మణుని లాలాభక్ష మనునరకమునం ద్రోయుదురు. య మభటులువానికి లాలాభక్షణమును(రేతోభక్షణమును)నొసం గుదురు. కావుననే దానికి లాలాభక్ష మనునామము గల్గినది. ఎవరు దొంగతనము చేయుదురో,యెవరు గ్రామములు దహిం తురో, యెవరు విషము పెట్టి చంపుదురో,యెవరు రాజభటులయి పురవాసులను, దదితరజనములను బాధింతురో, వారిని యమ భటులు సారమేయాదనమనెడి నరకమునఁబడవైచి వజ్రమయ ము లగుకోఱలు గల్గి యేడువందలసంఖ్య గలకుక్కలచే సరభస ముగాఁ గఱపించుచుందురు. సారమేయములు (కుక్కలు)తినుట యిం దుండుటచేదానికి సారమేయాదనమను నామము గల్గినది. ఈలోకమున నెవఁడుసాక్ష్యమిచ్చునప్పుడుగాని, క్రయవిక్రయాది రూపవ్యవహారము చేయుచున్నప్పుడు గాని,యసత్య మాడినచో వాని నవీచిమంత మనునరకంబునకుఁ గొనిపోయి నూఱుయో జనములపొడుగుననుండి తలక్రిందుగాఁ జేసి పర్వతశిఖరమునఁ బడవేయుదురు.వాఁ డచ్చటఁబడి నుఫుగింజలం తేసి ముక్క లుగా నూఱియు మృతిచెందక మగుడ నట్లె బాధింపఁబడుచుండును. అచ్చట శిలామయ మగుస్థలము జలమయ మగుస్థలమువలెఁ గానవచ్చు. కావుననే దాని కవీచిమంత మనునామము గల్గినది.

ఈలోకమున బ్రాహ్మణుఁడు కాని తత్కళత్రము గాని సురాపానముచేయునో, నియమము నవలంబించి రాజుగాని కోమటి కాని ప్రమాదము వలననైనను సోమపానము చేయునో వారంద అయఃపాన మను నరకమును బొందుదురు. అచ్చట యమభటులు వారిని నేలఁబడఁద్రోసి వక్షఃస్థలమునఁ గాలు మోపి, యగ్నిచేద్రవరూప మయినయినుమును నోళ్లలోఁ బోయుదురు. అయఃపానమం దుండుటచే దానికాపేరు గల్గినది. ఎవఁడీలోకమున జన్మముచేతను, విద్యచేతను, నాచారములచేతను, వర్ణాశ్రమధర్మములచేతను, నికృష్టుఁడయ్యును,దన కధిక గౌరవమును గోరుచు, జన్మాదులచే వరిష్ఠులగు వారి నవమానించుచున్నాఁడో వాఁడు మృతుఁడయి క్షారకర్దమ మనెడినరకమునఁ బడును. అచ్చట వానిని యమభటులు క్షారకర్దమమునఁ దలక్రిందుగాఁ బాఁతి హింసింప నాబాధలనన్నింటి ననుభవించుచుండును.ఉప్పుబురద యందుఁగలదు గావున దాని కాపేరు గల్గినది. ఏపురుషులు భద్రకాళ్యాదుల ప్రీతికై స్త్రీలను జంపుదురో, యేస్త్రీలు పురుషులను జంపుదురో, యెవరిచే నెవ్వరు హతులైరో వారు యమసదనము రక్షోగణము లయియుండి తమ్ము భూలోకమునఁ జంపినవారిని జేరి బాధించి శస్త్రములచే ముక్కలుగావించి వారి రక్తమును ద్రావుదురు. అట్లుచేసి యాడుదురు; కూయుదురు. రక్షోగణములు భోజనము చేయుదురు గాన దాని కాపేరు గల్గినది. ఎవరు గ్రామములందును, నరణ్యములందును, నిరపరాధులయి జీవించుజంతువులను బెంచినమ్మించి విలాసార్థము వానిని శూలాదులకుఁ గ్రుచ్చి చంపుదురో, వారు మృతి నొంది యమలోకమున కరిగి యచ్చట యమభటులశూలములకుఁ గ్రుచ్చఁ

బడి క్షుత్పిపాసాపీడితులై వాఁడిముక్కులు గల కాకులచేతను, కొంగలచేతను, గృధ్రాదులచేతను, ఖండింపఁబడుచుఁ దమపూర్వకర్మములఁ దలంచుకొని విచారింతురు. ఎవ రీలోకమున సర్పములవలె నత్యుగ్రస్వభావులై భూతములకు భయము కల్గింతురో, వారు మృతినొంది దందశూక మనునరకంబునఁ బడుదురు. అచ్చట నయిదేసిముఖములు గలవియు, నేడేసిముఖములు గలవియునగు సర్పములు వారిని సమీపించి యెలుకలను మ్రింగునట్లు మ్రింగును. దందశూకములు గల దగుటచే దాని కాపేరు గల్గినది. ఎవరు బాలకులను, నంధులను, నితరము లయినభూతములను గర్తములు కుసూలములు, గుల్మములు మొదలగువానియందు నిరోధించి చంపుదురో, వారు చచ్చి యచట నిరోధ మనునరకమును బొందుదురు. యమభటు లచ్చట వారి నవటాదులందుఁ ద్రోసి విషయుక్తము లగువహ్నిధూమముచే నిరోధింతురు. అవటాదులందు నిరోధమందుఁ గలదుగాన దానికవటనిరోధ మనునామము వచ్చినది. ఎవఁ డీలోకమునఁ దన యింటి కరుదెంచినయతిథులను, నభ్యాగతులను, మహాకోపియై పాపీయ మగుచూపుతో మాటిమాటికిఁ జూచునో, వాఁడుచచ్చి యత్రిపర్యావర్తన మనునరకమును జేరును. భయంకర నేత్రములును, వజ్రతుండములును గల గ్రద్దలు, రాపులుఁగులు, కాకములు మొదలగునవి మహాబలము కలవై యచ్చట వారిపైఁబడి హింసించును. ఎవఁ డీలోకమునఁ దానే ధనాఢ్యుఁడని గర్వించి యహంకారవంతుఁడై చుక్కలు చూచుచు దొంగలు తనధనమును హరింతురేమో యని సర్వదా భయపడుచు వ్యయనాశములవలనఁగల్గుచింతాతిశయముచేశుష్కహృదయుఁ

డై సుఖమన్న నెట్టిదో యెఱుంగక, పిశాచమువలె ధనమును సంతతమును రక్షించుచుండునో, వాఁడు మృతినొంది మూల ధనము సంపాదింపను, దరువాత దాని వర్ధింపను, బిమ్మట దాని రక్షింపను జేసినపాపము లనుభవించుటకు సూచీముఖమను నరకమును బొందును.అచ్చటియమభటులు సూదితో వస్త్రములను గుట్టినట్లు లాధనవంతుని సర్వాంగములను సూదులతోఁ గుట్టుదురు. సూచీముఖములచే బాధించుట దానియందుఁ గలదు గాన దానికి సూచీముఖమను నామము గల్గినది. ఓరాజేంద్రా! యమలోకమున నిటువంటినరకములు వేలకొలంది గలవు. అధర్మవర్తులైన దేహులు నేనిప్పుడు వర్ణించిననరకములందును, దక్కినవానియందును బర్యాయముగాఁ బ్రవేశించుచుందురు. అధర్మవర్తనులు నరకములందుఁ బ్రవేశించినట్లె అర్మానువర్తనులును, ధర్మవర్తనులును, నరక స్వర్గలోకములందుఁ దమతమ కర్మఫలముల ననుభవించుచు నుండి యనుభవింపఁగా మిగిలిన ధర్మాధర్మములను బురస్కరించుకొని మగుడ జన్మింప భూలోకమునఁ బ్రవేశింతురు. ఓరాజా! ప్రవృత్తిధర్మవర్తనుల ప్రాప్యస్థానములను జెప్పితిని. నివృత్తిధర్మవర్తనుల ప్రాప్యస్థానము నింతకుఁ బూర్వమే వివరించితిని. త్రైలోక్యాత్మకమగు బ్రహ్మాండ మిదియె పదునాల్గుభువనములుగా విభక్తమైనట్లు పురాణములందు వర్ణింపఁబడు చున్నది. భగవంతుఁడును మహాపురుషుండు నగు నారాయణుని ప్రకృతిగుణప్రచుర మైనస్థూలరూపమును వర్ణించితిని. ఎవఁడు దీని నాదరపూర్వకముగాఁ బఠించునో, యెవఁడు వినునో, యెవఁడు వినిపించునో, వాఁడు శ్రద్ధాభక్తిసముపేత మగుబుద్ధి గలవాఁడై

మిక్కిలి సూక్ష్మమును, నుపనిషద్వాక్యగమ్యమును, నగు భగ వంతుని దివ్యరూపమును దెలిసికోఁ గలఁడు. ఓరాజా! స్థూల రూపజ్ఞానము సూక్ష్మరూపమును దెలిసికొను సాధన మగుచు న్నది. కావున భగవంతుని స్థూల సూక్ష్మరూపములను రెంటిని గూర్చియు ముందుగా నెఱింగి భగవంతుని స్థూలరూపమునం దుఁ దమ చిత్తమును మొదలు మెల్లగాఁ బొందించి పిమ్మట స్థూలస్వరూపవిషయక జ్ఞానాసక్తమగు బుద్ధిసాయమున మ నంబు నాభగవంతుని సూక్ష్మరూపము నందుఁ బొందింప వల యును. ఓరాజా! భూమి,ద్వీపములు, వర్షములు, నదులు, పర్వ తములు, గగనము, సముద్రములు, పాతాళములు, దిక్కులు, నరకములు, నక్షత్రములు మొదలగువానిచే నిండి సమస్త జీవ రాసులకును స్థానభూతమై, యాశ్చర్యకరమై, యున్న భగవం తుని స్థూలరూపమును వర్ణించితి నని శుకుండు చెప్పె నని సూతుండు శౌనకాదులకుఁ జెప్పి వెండియు నిట్లనియె. ఇది యిరువదియాఱవ యధ్యాయము.

పంచమస్కంధము సమాప్తము.

---



శుభమస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్ర భాగవతము

## షష్ఠస్కంధము.

—·····✱·····—

ఓమునీంద్రా! కామాది నివృత్తి పూర్వకమగునది నివృత్తి ధర్మమనియు, దానివలనఁ బొందఁదగినది మోక్షమనియు, జ్ఞాన యోగకర్మయోగములచే ననుగృహీతమయిన భక్తియోగముచే బ్రహ్మలోకమును బొంది పిమ్మట బ్రహ్మతోఁగూడ ముక్తి చెందుదురనియు, నీవు మొదటఁ దెలిపితివి. సుఖదుఃఖాది సాధన ధర్మములు ప్రవృత్తి ధర్మములనియు దాదృశ ధర్మములచేఁ బ్రాప్తమగునది ప్రవృత్తి మార్గమనియు, సాత్త్వికరాజసతామసులను త్రివిధములవారగు పురుషులకును దానియందధికారము గలదనియు, మాటిమాటికిని సుఖదుఃఖముల ననుభవించుటకు సత్త్వాదిగుణపరిణామ మగు దేహసంబంధము గలుగుటయే ప్రవృత్తిలక్షణ మార్గమనియును నీవు వక్కాణించితివి. మఱియు నధర్మపరులు పొందఁ దగిన నానావిధనరకములను గుఱించి చక్కఁగాఁ దెలిపితివి. దేనియందుఁ బ్రప్రథముఁడగు స్వాయంభువమనువును, నతనికుమారులగు ప్రియవ్రతోత్తానపాదులును, దదీయ వంశజులును భూమండలమును బరిపాలించిరో,

యామన్వంతరవృత్తాంతమును, ద్వీపములను, వర్షములను, సముద్రములను, బర్వతములను, నదులను, నుద్యానములను, వృక్షములను, భూమండల ప్రమాణమును, దానియవాంతర విభాగమును, దాని యసాధారణాకారమును, నక్షత్ర సూర్యాది గ్రహములను, నతలాది భూవివరములను, జెక్కెలఁ? భగవంతుని చే సృష్టములగు నన్నింటిని వర్ణించి చెప్పితివి. ఓమహాభాగా! యుగ్రదములగు నానావిధ బాధలుగల నరకములను నరుఁ డేయుపాయమునఁ బొందఁడో, దేనిచే శీఘ్రముగా వాని నుత్తరింపఁ గలఁడో యాయుపాయములను నాకుపదేశింపనర్హుండ'వనియడిగిన రాజునకు శుకుండిట్లనియె. 'ఓరాజేంద్రా! మనోవాక్కాయములచే నొనరించిన పాపము నీలోకమునఁ బ్రాయశ్చిత్తాదులవలనఁ దొలంగించుకొననిచో యాపాపి మృతినొంది నేనిదివఱకు వర్ణించిన నరకములను బొందును. అచ్చటఁ బలువిధములగు యాతనలను బొందును. రాజా! లోకమునఁ బలువిధములగు రోగములు గలవు. అవి నరులను బాధించునప్పుడు నిదానజ్ఞుఁడా యారోగముల కనుగుణ మగు నౌషధము నిచ్చి చికిత్సను జేయుచున్నాఁడు. అట్లె నరుఁడొనరించు పాపములు పెక్కులున్నవి. అట్టివానినిఁ జేసినచో నరుఁడు వాని తారతమ్యమును జక్కఁగాఁ గన్పెట్టి యీలోకమునందే వానికిఁ దగిన ప్రాయశ్చిత్తమును జేసికొని తొలంగించుకొన యత్నింప వలయును' ననినవిని రాజేంద్రుండు మునీంద్రున కిట్లనియె. 'ఓమునీంద్రా! ప్రత్యక్షముగాఁ జూచుటవలనఁగాని, పెద్దలవచనములవలనఁగాని పాపమని తెలిసియు, విషయవశుండై పాపముల నాచరించినచో వానికిఁ బ్రాయశ్చిత్తమెట్లు? ఇంతియకాక యొకఁడొక పాప

కార్యమొనరించి దానికిఁ బ్రాయశ్చిత్త మొనరించి పాపనిరా
సముఁ జేసికొనియు నింద్రియచాపల్యముచే మగుడఁ బాపము
లొనరించు చున్నచో సర్వదా ధూళి శరీరమునం దలందుకొనెడి
యేనుఁగునకుఁ జేయించిన స్నానమువలె నాప్రాయశ్చిత్తము వ్య
ర్థమేయగునని తలంచెద. కావుననిందుల కుపాయాంతర మేదయి
నను దెలుపుమని ప్రార్థించుచున్న రాజునకు శుకుండిట్లనియె. 'ఓ
రాజేంద్రా! ప్రతిపదోక్తములగు ప్రాయశ్చిత్తాదికర్మములవలనఁ
బాపకర్మములు పూర్తిగా నివర్తింపవు. ఆప్రాయశ్చిత్తము
జ్ఞానమువలెఁ బూర్వోత్తరకాల పాపములను సమూలముగా
నున్మూలింపఁజాలదు. అది తాత్కాలికరోగముల నౌషధమువలె
నాపాపమును మాత్రము వారించు. అందువలనఁ బ్రాయశ్చిత్త
విధులకు నైయర్థ్యములేదు. మఱియుఁ బరమాత్మోపాసనము
చేయనివారికి మాత్రమే పాపములుగొన్ని నశించుటకై ప్రాయ
శ్చిత్తములు విధింపఁబడినవి. పథ్యమగునన్నమును దినుచున్న
వారిని రోగములు చేరలేవు. కావున వారు సుఖముగా జీవిం
తురు. అట్లనే ముందు చెప్పఁబోయెడి నియమములు గలవాఁడ
యినచోఁ బాపాదులవలన బాధింపఁబడక నిరతిశయ సుఖమను
భవించుచున్నాఁడు. చేయవలసిన నియమములను వినుము. దేహ
ధారణమునకుఁ దగినంతమాత్రమే యన్నమును గైకొనుటయు
ఋతుకాలమునఁ దప్ప నితరకాలముల స్త్రీలపొం దపేక్షింప
కుండుటయు, నంతరింద్రియ నిగ్రహంబును, తనధనాదికమును
సత్పాత్రవినియోగము చేయుటయు, భూతములకు హితమొన
ర్చుటయు, సదాచారంబును, గామ తిరస్కారమ్మును, వర్ణాశ్రమ
ధర్మములును, నివి నియమములు. సుఖదుఃఖాది ద్వంద్వముల

సహించువారును,నిరతిశయ సుఖసాధనములగు ధర్మముల నెఱిఁగిన వారును, నగు పండితులు శ్రద్ధాసముపేతులై వెనుకటి నియమములచేత, నగ్నిహోత్రుండు వెదురుపొదనుంబోలెఁ గరణత్రయజన్యమగు పాపమును దహించుకొందురు. మఱికొందఱు మహాత్ములు వాసుదేవునియందుఁ దమచిత్తముల నెలకొల్పి తపము మొదలగు నియమములచే నుద్భూతమగు భక్తిచే సూర్యుండు మంచుమాయించునట్లు వాసుదేవప్రాప్తికిఁ బ్రతిబంధములగు పాపములను బూర్తిగాఁ దొలంగించుకొందురు. ఓ రాజా! ఇందొక్క విశేషము గలదు. కృష్ణాయత్తచిత్తులై తదీయభక్తులను సేవించుటవలనఁ బాపవిముక్తులైనట్లు శమాదినియమములవలనఁ బాపి పాపవిముక్తుండు కానేరఁడు. కావునఁ బాపనిరసనము చేసికొని పవిత్రుండగుటకు భక్తియోగమును మించిన సాధనములేదు. శ్రేయస్సాధనమును గూర్చి యాలోచించినచో లోకంబున భక్తిని మించిన సాధనములేదు. దానినవలంబించువారి కెందునుండియు భయములేదు. అది మోక్షాత్మకమగుచున్నది. కావుననే సదాచారులగుసాధువులాభక్తియోగము నవలంబించియే నిరతిశయక్షేమంకరుఁడయిననారాయణునిఁ జేరి సుఖించుచున్నారు. పెక్కులు ప్రాయశ్చిత్తము చేసికొన్నవాఁడయినను. నొకానొకప్పుడయిన నారాయణుని సంస్మరింపని వాని నాప్రాయశ్చిత్తములు గంగాదినదులు కల్లుకుండనుంబోలెఁ బవిత్రునిఁగాఁ జేయలేవు. ఎవఁడీలోకమున భగవద్గుణములందు సక్తమగుచిత్తమును నొకమాత్రైనను విష్ణుపదారవిందములందుఁ జేర్తురో, వారు యమునిని పాశపాణులగు యమభటులను గల యందయినను జూడరు. అందులకుఁ గాఁ

ణము మనంబును భగవత్పాదారవిందములందుఁ జేర్చుటయె. ఓరాజేంద్రా! మనంబును భగవంతునిపై నొక మాఱు చేర్చిన వారే యిట్టిఫలమును బొందుచుండ నిష్పన్న భక్తియోగము గలవారు నరకప్రాప్తికి హేతుభూతము లగుపాపములను దొలఁగించుకొని నిరతిశయానంద రూపుఁడగు భగవంతునిఁ బొందుదు రని వేఱచెప్పవలయునా? ఈ విషయమై పురాతనమై విష్ణుదూతయమదూతసంవాదరూప మైనయొక యితిహాసమును జెప్పెద విను. ఓనరపాలా! కన్యాకుబ్జ మను దేశంబున నజామిళుఁడను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. వాఁడు దాసిని బత్నిగాఁ జేకొని వర్ణాశ్రమాచారములనువిడిచి తత్సంపర్కముచేమిక్కిలి పతితుఁడయ్యె. వాఁ డార్యజననింద్య మగువృత్తి నవలంబించి జూదమాడియుఁ బరుల వంచించియుఁ, దస్కరించియుఁ దెచ్చిన ధనముచేఁ గుటుంబమును బోషించుచు సర్వదా యశుచియై, పశుపక్షి మృగాదులను హింసించుచుండెను. ఇట్లజామిళుఁడు దాసితోఁ గ్రీడించుచు దానియందుఁ గుమారులను బడసి వారిని లాలించుచు నెనుబదియెనిమిది సంవత్సరములు కడపెను. అతనికిఁ గల పదిమంది పుత్త్రులలోను నారాయణుఁ డనువాఁడు కడపటి వాఁడు. వాఁడు తల్లిదండ్రులకు మిక్కిలి ప్రేమాస్పదుఁడయ్యె. ముదుసలివాఁ డగునజామిళుఁడు ముద్దుపలుకులు గల నాబాలునియందు సక్తచిత్తుం డయి వానిచేష్టలను జూచుచు, మిక్కిలి సంతసించుచుండె. మఱియు వాఁడు పుత్త్రప్రేమకలితుం డయి తాను భుజించునప్పుడు బాలకుని భుజింపఁ జేయుచుఁ, దాఁ ద్రావుచున్నప్పుడు వానిఁ ద్రావింపఁజేయుచుఁ, దా నితరవస్తువులను దినుచున్నప్పుడు వానికిఁ దినిపిం

చుచు, బుద్ధిహీనుఁడై తన్నుఁ బొదవిన మృత్యుదేవత నెఱుంగకపోయెను. ఆ యజామిళుఁ డిట్లు వర్తించుచు, మృత్యుకాలము సమీపించినతోడనే, తన ముద్దులపట్టి యగునారాయణునియందుఁ దన మనంబును నిల్పెను. ఆసమయంబున వానికి ముగ్గురు యమభటులు గానవచ్చిరి. వారు భయంకరము లగునాకారములును గుటిలము లగుముఖములును, నూర్ధ్వముఖము లగురోమములును గలవారై పాశపాణులై వాని యమాలయమునకుఁ గొనిపోవవచ్చిరి. వాఁ డాయమభటులను జూచి వ్యాకులచిత్తుఁడై దూరమున నాడుచున్న నారాయణునిఁ దన సమీపమునకు రప్పింపనెంచి "నారాయణా" యని వాని సంబోధించి యుచ్చైస్స్వరంబుతోఁ బిలిచెను. ఓరాజేంద్రా! చావనున్ముఖుఁ డయియున్న వాని నోటనుండి వెలువడిన భగవన్నామమును విని విష్ణుభటులును సరభసయుక్తులై యచ్చటి కరుదెంచిరి. అట్లు వచ్చి విష్ణుదూతలు హృదయాంతరమునుండి దాసీపతి యైనయజామిళుని లాగుచున్న యమదూతలను వలదు వల దని బలాత్కారముగా నివారించిన, వారిం గని యమదూతలిట్లనిరి. 'ఓయీ! ధర్మరాజు శాసనమును బ్రతిషేధించుచున్న మీరెవ్వరు? ఎవ్వని దూతలు? ఎక్కడనుండి వచ్చితిరి? ఇతనిఁ బ్రతిబంధించుటకుఁ గారణమేమి? మీరు దేవతలరా? లేక యుపదేవతలరా? లేక సిద్ధశ్రేష్ఠులరా? మీరందఱును బద్మపలాశములవంటి నేత్రములు గలవారై, పచ్చని పట్టువస్త్రములను ధరించి, తలలందుఁ గిరీటము లొప్పుచుండ, గణ్ణములందు మకరకుండలములు ప్రకాశింప, వక్షస్సలంబులఁ బద్మమాలికలు తుఱుంగలించుచుండ, నవవయస్సంపన్నులరై, సుందరము లగునాల్గేసి



1064. అజామీళుని యమదూతలు పాశములఁ గట్టి యీడ్చునప్పుడు నారాయణనామమంత్రోచ్చారణవలన విష్ణుదూతలు వచ్చి యమదూతలను అడ్డగించుట.

భుజములతో నొప్పుచు, వానియందు, జాపతూణీరములును, ఖడ్గములును, గదలును, శంఖచక్రములును,లీలాపద్మములును, రాణింప, స్వకీయదేహకాంతులచే దిక్కులను, లోకములను నిస్తిమిరములంగాఁ జేయుచు వెలయుచున్నారు. ధర్మరాజకింకరులమగు మమ్మేల నిషేధించుచున్నారో చెప్పుఁ'డనియడుగుచున్న యమకింకరులను గాంచి మందహాసముచేయుచు, విష్ణుదూతలు మేఘగంభీరవచనంబుల నిట్లనిరి. 'ఓయీ ! మీరు ధర్మరాజు శాసనమును మన్నించు సేవకులేయైనచో ధర్మ మననెట్టిదియో, యధర్మమననెట్టిదియో, మాకుఁ దెలియఁ జేయుఁడు. ధర్మరాజు దూతలకు ధర్మాధర్మములు తెలియకుండునా? మఱియు నరులదండన మేరీతిగా విధింపఁబడుచున్నది?, వీఁడు దండనార్హుఁ డెట్లయ్యె? నరు లందఱును దండనీయులా? లేక కొందఱే దండనీయులా?'' అని యడిగిన యమదూతలు వారి కిట్లనిరి. ''ఓయీ! వేదముచే బోధిత మగునది ధర్మము. దానికి విరుద్ధముగా నున్నది యధర్మము. ధర్మబోధక మగువేదము * నారాయణుని నిశ్వాసరూపమయినది. కావున నది నారాయణునివలన నావిర్భవించిన దని చెప్పవచ్చు. అది స్వయముగాఁ బూర్వానుపూర్వికగాఁ బ్రాదుర్భవించె. అయిన నది స్వయంభువుగాన ఘటాది కార్యములవలె నశింప దని వినుచున్నాము. ఆవేదముల నుద్భవింపఁ జేసిన నారాయణుఁడే తన స్వరూపమునందు రజస్సత్త్వతమోగుణమయము లయిన వేద, దేవమనుష్యాది పదార్థములను శాంతి క్షమాదిగుణంబులను, వేద మని దేవుఁడు ననెడినామము

---

* శ్రు. ''తస్య హవా ఏతస్య మహతో భూతస్య నిశ్వసిత మేత దృగ్వేదః'' అనుశ్రుతి యిందులకుఁ బ్రమాణము.

లను, ద్రవ్యప్రత్యానయనాదు లగుక్రియలను, శబ్దాత్మకము లును, ద్రవ్యాత్మకములు నగురూపములను, నేర్పఱుచుచు న్నాఁడు. అట్టినారాయణునివలన నావిర్భవించిన వేదమువలననే ధర్మము బోధింపఁబడుచున్న దని చెప్పితిమి. సంసారులు ప్రతి క్షణమును నాచరించు చున్నధర్మాధర్మము లనంతములై యుం డఁగా వాని నెట్లు తెలిసికోఁ గలుగుదుమని యడుగవచ్చు. నరుఁ డాచరించు చున్నధర్మాధర్మములకు సూర్యుండును, నగ్నియు, నాకాశమును, దేవతలును, గోవులును, చంద్రుఁడును, సంధ్య లును, నహర్నిశంబులు, దిక్కులును, జలమును, భూమియును, గాలమును, ధర్మరాజును, సాక్షిభూతు లయియుందురు. వీరి వలన నెవఁ డేక్షణమున నధర్మమాచరించెనో, యేక్షణమున ధర్మమాచరించెనో తెలిసికొనవచ్చును. వీరెవ్వని నధార్మికుఁ డని యందురో, వాఁడు దండనార్హుఁ డగును. అట్లధార్మికు లగు వారుమాత్రమే కర్మానుసరణముగా దండింపఁబడుదురుగాని నరు లందఱును దండింపఁబడరు. ఓపాపరహితులారా! శరీరులు శబ్దాది విషయములం దధికాసక్తిగలవా రగుటచేఁ బరవశు లయినవా రికిఁ బుణ్యంబులును, బాపంబులును సంభవింపవు. కావున దేహి యెప్పుడును గర్మకారియే యని చెప్పవచ్చు. వాఁ డొనరించిన పుణ్యాపుణ్యకర్మములలో నపుణ్యకర్మ మనుభవించునప్పుడే దం డింపఁబడును. ఏరీతిగా దండింపఁబడుదు రని యడిగితిరి. దానికి సమాధానము వినుఁడు. గుణత్రయసృష్టుఁ డయిన జీవుఁడు తన గుణము ననుసరించి ధర్మమునో, యధర్మమునో, యాచరించును. అట్లాచరించినవాఁడు తన కర్మముల కనుగుణ ముగా స్వర్గనరకములను బర్యాయమునఁ బొందును. అంతియు

కాని ధార్మికునకు నరకము లేదు. అధార్మికునకు స్వర్గము లేదు. అల్పపాపునికి మహాదుఃఖముగాని స్వల్పపుణ్యునికి మహాసుఖము గాని కలుగనేరదు. ఎంతెంత పుణ్యాపుణ్యము లొనరించునో యంతంతే సుఖదుఃఖము లనుభవించును. జీవులకుఁ గర్మానుసరణముగాఁ బరలోకమునందే తత్తత్ఫల మనుభవించుట గాదు; ఈలోకమందును ననుభవించును. ఓ దేవశ్రేష్ఠులారా! సత్వరజస్తమోగుణముల వికాసమువలనఁ గల్గు ప్రాచీనసాత్వికాది కర్మముల వైచిత్ర్యమునలన నీలోకమున భూతములందు, సుఖులనియు, దుఃఖు లనియు, మూఢు లనియు, భేద మెట్లు కలుగుచున్నదో యట్లె యిచ్చట నాచరించిన సాత్వికాది కర్మములను బట్టి పరలోకమందును జీవులందు మూఁడుభేదములుగల్గుచున్నవనియూహింపఁబడుచున్నది. ధర్మము, నధర్మము,ధర్మాధర్మము నాఁబడు త్రివిధకర్మములకునుసత్వాదిగుణముల వికాసమేకారణమని తెలియునది. ధర్మాదులవలనఁగలిగి వర్తమానకాలమున ననుభవింపఁబడుసుఖదుఃఖమోహములుదమకునిమిత్తభూతములగుధర్మాదులకు సత్వాదిగుణోన్మేషము కారణమని తెలుపుచున్నవి. ఇట్లె వర్తమానకాలమందలి సుఖదుఃఖమోహములు పూర్వోత్తరజన్మములందలి ధర్మాధర్మములకు నిదర్శనములగుచున్నవి. సత్వాదిగుణములు ధర్మాధర్మముల నాపాదించుచున్నవి. అవి దమకు ఫలము లగుసుఖదుఃఖ మోహంబులఁ గల్గించుచున్నవి. సత్వాదులు సుఖదుఃఖాదులను గర్మద్వారకముగానిచ్చుచున్నవి కాని ప్రత్యక్షముగా నీఁజాలవు. సుఖాదులు సత్వాది గుణములకుఁ గార్యభూతము లగుటచేవానింబట్టి తమకునిమిత్తభూతము లగుధర్మాదులు సత్వాదులవలనఁ గల్గుచున్నటు లను

మానింపంబడుచున్నది. దీనివలనఁ గర్మములే తమ కనురూప మగుసుఖదుఃఖాదులకుఁ గారణ మయినట్లు స్పష్టమగుచున్నది కదా? కర్మము లనిత్యము లయియుండఁగా నవి కాలాంతర మందుఁ బ్రవర్తిల్లు సుఖాదుల కెట్లు కారణము లగునని సందేహింపఁ బనిలేదు. దేహమున స్వయంప్రకాశుఁడయి వెలుఁగొందువాఁడును, జీవునకంతరాత్మయై యుండువాఁడునగుపరమాత్మ నిత్యాసంకుచితజ్ఞానముచేఁ బ్రాక్తనజన్మకృత్యము లగుపుణ్య పాపకర్మములను జూచి తదనుసారముగా వారియం దనుగ్రహం బును నిగ్రహంబును గలవాఁడై సుఖదుఃఖాదిఫలంబుల నిచ్చుచుండును. అట్లయినచో జీవులు పరమాత్మానుగ్రహంబుసంపాదించికొని శుభకర్మముల నాచరించి సుఖమునే పొందరాదా? యని యడుగవచ్చు. అట్లు పరమేశ్వరుని నారాధించి యతని యనుగ్రహము సంపాదించుకొనుట సముచితకార్యమే. కాని జీవుఁడు దేహాభిమానముచేతను స్వతంత్రాభిమానముచేతను గూడికొని యజ్ఞుండై కర్మాదులచే సంకోచావస్థను బొందిన జ్ఞానముగలవాఁడై పూర్వాపరజన్మముల సంబంధి యగు స్మృతి లేకపోవుటచేఁ బ్రకృతదేహమున కుచితము లగుకర్మములనే యాచరించును. కాని పరమాత్మానుగ్రహము సంపాదింపఁజాలిన శుభకర్మము నాచరింపఁజాలఁడు. ఇట్లనాది యగునవిద్యచే స్వస్వరూపమును మఱచి సత్త్వాదిగుణసృష్టులయి తత్తద్గుణోన్మేషనిమిత్తములై పుణ్యాపుణ్యమిశ్రము లగుకర్మములు గల వారయి దేవమనుష్యాది రూపములు దాల్చుచున్న జీవులకు, ధర్మాదినిమిత్త మగుపరమేశ్వరానుగ్రహముసుఖము గల్గించునని చెప్పితిమి. ఇప్పుడా జీవుఁడెట్లు సంసారమునఁ బడుచున్నాఁడో,

డాని దాఁటుటకుఁ దగినయుపాయమేదో వక్కాణింతుము; వినుడు. జీవుఁడు పాణ్యాదికర్మేంద్రియములచే శమనాది కర్మములనైదింటిని జేయుచున్నాఁడు. అయిదగు శ్రోత్రాదీంద్రియములచే శబ్దాదు లగునైదుగుణములను గ్రహించుచున్నాఁడు. జీవుఁడు స్వయముగా భూతపంచకదశేంద్రియ మనంబులకంటె వివిక్తమగు పదునేడవ తత్త్వమై సుఖదుఃఖమోహము లనుభవించుచున్నాఁడు. ఓ దేవతలారా! పదునాఱుకళలుగల్గియవిద్యయుఁ గర్మము, వాసన యనుశక్తిత్రయముతో నొప్పుచుఁ గార్యావస్థయందుస్థూలాకారము నొందుచు నున్నలింగశరీరము జీవులకుసంసారబంధము గల్గించుచున్నవి. ఇట్లు లింగశరీరము సంసారమును గల్గించుచుండఁగా దేహి దేహాత్మాభిమానవంతుఁడుకావునమనంబును జ్ఞానేంద్రియములనుజయింపనేరక చేయవలెనన్నతలంపు లేకపోయినను శక్తిత్రయాత్మకమగులింగశరీరముచేఁ బుణ్యకార్యములను, పాపకార్యములను మిశ్రకార్యములను జేయుచున్నాఁడు. ఇట్లాచరించుచుఁ గర్మములచే దేహి కోశాకార మనుపురువువలెస్వస్వరూపమును గప్పిపుచ్చికొని మోహమును జెందుచున్నాఁడు. శరీరి సర్వకాలములందును దృణచ్ఛేదనాదు లగుకార్యము లొనర్చుచునే యుండునుగాని యూరకుండఁజాలఁడు. అనాదిసిద్ధము లగుసత్వాదిగుణములు వానిని స్వాధీనునిఁ గావించికొని బలాత్కారముగాఁ గర్మములఁ జేయించుచుండ నెట్లు విరమించి యుండఁగలడు. ఇట్లు శరీరి తెలియకుండఁగనే చేసికొన్నదియు, విడువఁ దరముగానిదియు నగుకర్మవాసనల నాశ్రయించి లింగదేహ ముత్పత్తిదశయందు స్థూలాకారముఁదాల్చి మరణదశయందు మగుడ సూక్ష్మరూపమును బొం

దును. అట్లు జన్మించుటలో బలీయ మగుకర్మానుసారముగా మాతృసదృశమై పితృసదృశమై యుద్భవించు. ఓమహాత్ములారా! జీవునకుఁ బ్రకృతిసంబంధముచే నిట్లు సంసారము సంభవించుచుండు. ఇఁక నట్టి సంసారసాగరమును దరించుట కుపాయ మేమో చెప్పెద వినుడు. ప్రకృతికార్యరూప మగునాసంసారము పరమేశ్వర భక్తిచే శీఘ్రముగానే నశించును. ఈయజామిళుఁడు మొదట వేదాధ్యయనము చేసిన యోగ్యుఁడు. వీని స్వభావము మిక్కిలి మంచిది. వీఁడు సదాచారమునకును శాంత్యాదిగుణములకును నిలయమైనవాఁడు. వీఁడు స్త్రీసంపర్కాదుల విడిచి బ్రహ్మచారియై యుండెడివాఁడు. వీని హృదయము మిక్కిలి కోమలమయినది. వీఁడు బాహ్యేంద్రియముల జయించినవాఁడు. వీఁడు సంతతమును సత్యమునే పల్కుచు సావిత్ర్యాది మంత్రముల నుపాసించి పవిత్రుఁడై యుండెడివాఁడు. మఱియు వీఁడు గురువులను, నగ్నులను, నింటికి వచ్చినయతిథులను, వృద్ధులను సేవించుచుండెడివాఁడు. ఇన్నిసద్గుణము లున్నప్పటికిని వీనికిఁ దజ్జనిత మగుగర్వము లేకుండె. సర్వభూతములకును హితము గోరుచుండెడివాఁడు. మఱియు వీఁడు పరకార్యములను సాధించుచు, మితభాషియై యొరుల గుణములందు మచ్చరములేక వర్తించుచుండె. అట్టి సద్గుణుం డగువీఁ డొకనాఁడు జనకాజ్ఞచొప్పున వనంబునకరిగి ఫలములను, బుష్పములను, సమిధలను, దర్భలను సంపాదించి వచ్చుచుండె. ఆసమయంబున వీఁ డావనమం దొక కామినితో వర్తించుచున్నయొకశూద్రునిఁ జూచెను. ఆశూద్రుఁడు మిక్కిలి కామాంధుఁడై యుండెను. ఆకామినియు మద్యపానమదముచే నేత్రములఁ బరిభ్రమింపఁ జేయుచు మత్త

యైవిడిపోవుచున్న నీవీబంధముగలదై, సన్మార్గమును విడిచి త్రపా విహీనుఁడై క్రీడించుచు, పాడుచు, నవ్వుచుఁ దనసమీపమున నున్నయా శూద్రునిచే నాలింగితయై యుండెను. ఆకామినిని జూచినతోడనే యీయజామిళుఁడు మన్మథునకు వశుండై దురదృష్టవశమున మోహితుండై వేదాధ్యయనాదులవలనఁగల్గిన బలముచేతను, వివేకముచేతను, మనంబును నిర్బంధించియు మదనపీడిత మగుదాని స్వవశము గావించుకొనలేక పోయెను. పిమ్మట వీఁ డాదాసీనిమిత్తక మగుమదనపిశాచముచేఁ బూర్వస్మృతి విడిచి సంతత మాదాసీనే మనంబునఁ జింతించుచు సంధ్యావందనాది ధర్మములను విడిచిపుచ్చెను.తరువాత వీఁడు తన తండ్రిసంపాదించిన ధనములచే నచ్చటచ్చట నున్నమనోహర వస్తువులఁ గొనితెచ్చి దానికిచ్చి సంతసింపఁజేయుచుండె. మఱియు వీఁడు దాసీచంచలాపాంగములచే వివేకము గోల్పోయి పాపాచారుఁడై మహాకులంబున నుద్భవించినదియు, రజస్వలకానిదియు, సౌందర్యవతియు నగుభార్యను విడిచిపెట్టెను. మందబుద్ధి యగువీఁడు పిత్రార్జితధనము వ్యయమైన పిమ్మట న్యాయాన్యాయములఁ బరిశీలింపక యన్నివైపులనుండియు ధనంబు దెచ్చి దాసిని, దానియందుఁ బుట్టినపుత్త్రాదులను బోషించుచుండె. ఈయజామిళుఁడు శాస్త్రపథ మతిక్రమించి స్వేచ్ఛాసంచారియై సత్పురుషులచే నిందితుండై, పాపాభివర్ధిత మగునాయువుఁ గలవాడై, దాసీసంగమముచే నపవిత్రుడై, చిరకాలము గడపెను. కావున మహాపాపియైయాపాపములఁ బ్రాయశ్చిత్తాదులవలనఁ దొలగించుకొనక వర్తించుచున్నవీనిని యముని సన్ని

ధికి గొనిపోదుము. అచ్చట వీఁడు యమదండముచే శుద్ధుం డగును.

ఇది ప్రథమాధ్యాయము.

అని యమదూతలు పలికినవాక్యములు విని న్యాయనిపుణు లగు విష్ణుదూత లిట్లనిరి. 'ఓయీ! అకటా! ధర్మపరుల సభలో నైతమధర్మము ప్రవర్తిల్లుట మిక్కిలికష్టకార్యముగదా! అట్టి యధర్మమేమనియందురా! యమసభయందుఁ బాపరహితులైనదండనార్హులకుఁగూడ వృథా దండము విధింపఁబడుచున్నది. ఇంతకంటె నధర్మ మేమికలదు? మీరు ధర్మాధర్మముల శాసించువారు. మీరు వైషమ్యమును విడిచి పరుల పాపముల దొలంగించుచుఁ బ్రజలకు హిత మొనర్చుచునున్నవారు. అట్టి మీయందును వైషమ్య మున్నచోఁ బ్రజలింక నెవరిని శరణు జొత్తురు? మీవంటి శ్రేష్ఠులు సమస్తమును దెలిసినవారు. వారే కర్మము నాచరింతురో తక్కనయల్పజ్ఞులు నాకర్మమునే యాచరింతురు. వారేమి శాసింతురో యల్పజ్ఞులకదియే ప్రమాణము; దానినే యాచరింతురు. కావున ధర్మప్రవర్తకులై వేదానువర్తులయినమీరును నదండ్యులను దండించుట మిక్కిలియనుచితము. ఓయమభటులారా! సాపరాధులనుమాత్రమే యముఁడు దండించునుగాని నిరపరాధులను దండింపఁ డనుప్రతీతి యందఱకును విశ్వాస విషయమై యున్నది. అట్లుండ యముఁడు నిరపరాధులను గూడ దండించినచో విశ్వాసఘాతుకుఁ డని యనుపించుకొనకమానునా? లోకములో విశ్వాసపాత్రుఁ డని విశ్వసించి

యొకనితోడఁ బైఁదలనిడికొని సుఖనిద్ర వోవుచుండెను. ఆజనుఁడు పశువువలె వర్తించుచు ధర్మముగాని యధర్మముగాని యెఱుంగఁడు. వాఁడు నాకీపురుషుఁ డెల్లప్పుడును హితమేచేయునని తలంచి విశ్వసించి బద్ధస్నేహుండయి తన్ను వాని కధీనునిఁగాఁ జేయును. అట్టిసమయమునఁ దన్ను విశ్వసించిన జనుని, భూతములకు విశ్వసనీయుఁడయి దయాళుఁడయి యున్నవాఁ డెట్లు ద్రోహము చేయఁగలఁడు? కావున దయామయుండయి భూతవిశ్వాసపాత్రుఁ డయినయముఁడు తన్నుహితకారినిగా నమ్మిన నిరాపరాధుని దండింప నెట్లర్హుఁడగును? ఆయజామిళుఁడు కోటిజన్మములచే సంపాదించుకొన్న పాపములకుఁ బ్రాయశ్చిత్తముగా బరవశుఁడయ్యును శుభావహమగు హరినామమును నుచ్చరించెను. ప్రాణప్రయాణసమయమున నాల్గక్షరములు గల "నారాయణ" యని యుచ్చరించుటె వీనిసమస్తపాపములకుఁ బ్రాయశ్చిత్తము. అట్లు స్మరించుటవలన వీని పాపములు పూర్తిగా నశించినవి. భగవన్నామము కంటెఁ బాపనిరాసకమగు* ప్రాయ

* ఓయీ! "నాన్యః పంథా అయనాయ విద్యతే" అనఁగా మోక్షప్రాప్తికుపాసనము కంటె వేఱొక మార్గములేదని యర్థము. ఇట్లుండ నెవఁడేని సగపాపుఁడయి యొకనికి సంకేతముగా నేర్పఱిచిన భగవన్నామమునుచ్చరించినంతమాత్రమున సకల పాపములు నశించి ముక్తిసాధకమగుట యెట్లు? ఇదియే ముక్తిసాధన మయినచో వెనుకటి శ్రుతికి విరోధమురాదా? అని యందు రేని, వినుఁడు. అంత్యకాలమున భగవన్నామోచ్చారణమువలన మనస్సు భగవదాయత్తమగును. ఇట్లు భగవన్నామస్మరణము మనంబు భగవదాయత్తమగుటకుఁ బ్రతిబంధకములగు పాపములను నిరసించును. కాన భగవన్నామస్మరణయు దాని వలన నుదయించిన హరివిషయక మనంబును- భగవత్ప్రాప్తికిఁ

ప్రతిబంధకము లయినవాని నిరసించి ముక్తికి హేతువులగును. ముక్తిప్రాప్తికుపాసనముతప్పవేఱుమార్గములేదన్నశ్రుత్యర్థముగూడ దీనికి సరిపోవుచున్నది. "యంయం వాపి స్మరన్ భావం త్యజత్యంతేక ళేబరం" అనఁగా నేయేభావమును స్మరించుచు జీవనము విడుచునో, వానికాయుత్తరజన్మమున నారూపమువచ్చునని యర్థము. కావున నంత్యకాలమున భగవన్నామము నుచ్చరించుచు జీవనము బాసినచో, వానికుత్తర జన్మమున భగవద్రూపము లభింపకమానదు. సంతతము భగవదుపాసనచేయవలయు నన్నవారియభిప్రాయ మేమనఁగా నరుల ట్లుపాసనముచేసినచో హరినామోచ్చారణమం దభ్యాసముగల మనస్సంత్యకాలమున భగవన్నామమును స్మరింపక మానదనియు, దానివలన భగవత్ప్రాప్తి కుపాయ మగుచున్నదనియు తలఁచియే, భగవన్నామోచ్చారణము వలన ముక్తిగల్గినచో నుపాసనాశాస్త్రము వ్యర్థమగునన్న సంశయము దీనిచే నిరస్తమగుచున్నది. ఆయుపాసనాశాస్త్రము మనంబునకు భగవన్నామమందభ్యాసము గల్గునట్లు చేయుటచే మనంబంత్యకాలమున భగవంతు నుచ్చరించు. దానివలనఁ దద్రూపము లభించుచున్నది. అట్లు నామోచ్చారణము చేయఁగలుగుట ప్రాచీనకర్మవాసనాబలములేకుండ నాకస్మికనామస్మరణముసంభవింప నేరదు. అది 'పంగూపరి గంగానిపతన' న్యాయముచే సంభవించుచుండు. ఒకకుంటివాఁడుగంగాస్నానముచేయఁదలంచి వెళ్ల నేరకయుండఁగాఁగంగానదియే వచ్చి వానిమీఁదఁబడి పవిత్రుంగావించినది. అట్లైనరుఁడంత్యకాలమున నామోచ్చారణముచేయనసమర్థుండయినను ప్రాచీనకర్మవాసనాబలముననదియాకస్మికముగా సంభవించి ముక్తికిఁగారణ మగుచున్నది. ఓయీ! అంతిమస్మరణమే ముక్తికిసాధనముగాని తక్కినవి కాదనుచుంటివి. అట్లయిన జీవనదశయందల వలుచు కొనుచున్న భక్తియోగము వ్యర్థమనవచ్చునా? యని ప్రశ్నింపనవకాశములేదు. అది యెప్పుడును వ్యర్థముకాదు. జీవనదశయందలి భక్తి నామోచ్చారణమం దభ్యాసము గల్గించుచున్నది. కానఁగ ర్మజ్ఞానయోగములు ముక్తికిఁ

చేయువారును, మిత్రద్రోహము చేయువారును, బ్రహ్మహత్య గావించినవారును, గురుభార్యపొందుగావించినవారును స్త్రీహత్య చేసినవారును, దండ్రిని జంపినవారును, రాజును సంహరించిన వారును, మొదలగు మహాపాతకులకును, దక్కిననానావిధ పాపులకును దదీయపాపములను దొలంగించునట్టి యుత్కృష్ట ప్రాయశ్చిత్తము ప్రాణప్రయాణసమయమున మనంబున హరిని దాల్చి భగవన్నామమును స్మరించుటయే. అంతకంటె

---

బరంపరాకారణము లయినట్లె యిదియుఁ గారణమగుచున్నది. అనుష్ఠింపఁబడుచున్నకర్మయోగాదులు ప్రబలప్రతిబంధకములుండుటచేఁగాని, భక్తియోగాధికారములేకపోవుటచేఁ గాని, విచ్ఛిన్నములగుచున్నను నవి వ్యర్థములుకాక, నరక పరిహారకత్వమును, జన్మాంతరమందు భక్తియోగ జనకత్వమును గల్గించుచున్నవి. కర్మాదులు వెంటనే భక్తియోగము గల్పింప సమర్థములు కాకపోయినను, జన్మాంతరములందుఁ బ్రాచీన కర్మవాసనా వశమువలన భక్తియోగమును గల్గించుచున్నవి. అట్లుజీవనదశయందుఁ జేసిన నామోచ్చారణము వెంటనే ఫలమీలేకపోయినను వ్యర్థముగాక యుత్తరజన్మములందుఁ దత్ఫలితములిచ్చుచున్నవి. కర్మయోగాదులు కామనచే ననుష్ఠింపఁబడినచో నైశ్వర్యాదుల సాధించును. నిష్కామనచే ననుష్ఠితములయినచో భక్తియోగమునకుఁ గారణము లగుచున్నవి. అనేకపర్యాయము లావృత్తమైన భగవన్నామోచ్చారణమో, ఫలమపేక్షింపక చేయఁబడిన కర్మయోగాదులవలె భక్తియోగోత్పత్తికిఁ గల ప్రతిబంధముల నిరసించి భక్తిని గల్గించు. కావున నజామిళుఁడు తనకుమారునిఁ బిలిచినను, నది భగవన్నామోచారణమే కాన యతనికి సమస్త దురితములను దొలంగి ముక్తిలభించుచున్నది. వాఁడు పూర్వజన్మములందు నిష్కామనతో నొనరించిన కర్మాదు లప్పుడు ఫలము లీఁజాలకపోయినను, నవి వాసనారూపమున నాత్మసంతతియుండి యీజన్మమున నంత్యకాలమున భగవన్నామస్మరణమునునుచ్చరించునట్లుచేసి ముక్తిగల్గించెనని యెఱుంగునది.

వేఱొక ప్రాయశ్చిత్తములేదు. స్వాయంభువాదులగు బ్రహ్మవాదులు పాపములకుఁ గృచ్ఛ్రము, చాంద్రాయణము, ప్రాజాపత్యము, మొదలగు ప్రాయశ్చిత్తములు విధించినారు. వాని నాచరించిన పురుషుండు పాపములఁ దొలంగి శుద్ధుండునగును. కాని భగవంతుని యుత్కృష్టగుణములఁ దెలుపునామము నుచ్చరించుటవలనఁ బురుషుండు శుద్ధుండైనట్లుచాంద్రాయణాదులచేశుద్ధుండు కానేరఁడు. ఇంతియకాక మన్వాదులు విధించిన ప్రాయశ్చిత్తములత్యంత పాపశోధకములు కావు. వానినాచరించిపాపములఁదొలంగించుకొనినను, మనస్సుమగుడఁ బాపమార్గముననే పోవచ్చును. అవితాత్కాలిక పాపశుద్ధిని జేసినను మనశ్శుద్ధిని జేయఁజాలవు. కావునఁబూర్తిగాఁ బాపనాశనమును జేయఁదలంచినవారు, భగవంతుని గుణానువాదమగు నామోచ్చారణమునే చేయవలయును. అట్లు చేసిన పాపములు పూర్తిగా నశించుటయేకాక జ్ఞానముదయించి మనశ్శుద్ధినిగల్గించును. ఓయమదూతలారా! ఈయజామిళుఁడు మరణకాలమున భగవన్నామస్మరణమును జేసి సమస్తపాపములను నిరసించుకొనెను; గాన యితని యమాలయమునకుఁ గొనిపోకుఁడు. నిష్పాపుఁడగు నితఁడు దండనార్హుఁ డెట్లగును? వీఁడు తన కుమారునిఁ బిలిచెనుగాని భగవంతునిఁ బిలువలేదు కాన నిష్పాపుఁ డెట్లగునను సందియము విడువుఁడు. పురుషుఁడు పుత్త్రాదులఁ బిలుచునుద్దేశముతో నైనను, బరిహాసముచేత నైనను, బిశాచావేశముచేత నైనను, నిందాదులచేత నైనను భగవన్నామము నుచ్చరించె నేని, యది సమస్తదోష పరిహారకమగు గావున నీయజామిళుఁడు పుత్త్రునియందు సంకేతితమగు నామము నుచ్చరించినను దానిచే వాని పాపములు పూర్తిగా నశించినవి.

ఇంతియకాక ప్రాసాదాదులనుండి పడుచుండికాని, వర్ణాశ్ర మాదులఁ దప్పిపోయికాని, ఖండింపఁబడిన పాదాద్యవయవములు గలవాఁడై కాని, సర్పదష్టుఁడై కాని, జ్వరాది పీడితుఁడై కాని, దండింపఁబడికాని, పురుషుఁడు "శ్రీహరి" యని యన్నచో వాఁ డెప్పుడును దండనార్హుండు కాఁడు. మహాత్ములు మహాపాపములకుఁ బెద్దప్రాయశ్చిత్తములును, జిన్నపాపములకుఁ జిన్నప్రాయశ్చిత్త ములును, పాపప్రాయశ్చిత్తముల తారతమ్యంబు నరసియే విధించి నారు. వారు విధించునట్లుగాఁ దపోదానాది ప్రాయశ్చిత్తములచేఁ బాపములు నివర్తించుచునే యున్నవి. కాని వానిచే నధర్మమును బుట్టించెడి హృదయము నిర్మలము కాదు. తాదృశపాపనివారణ మును జిత్తశుద్ధియును రెండును భగవంతుని పాదసేవచేఁ దక్క వేఱొక్కదానిచేఁ గలుగవు. జ్ఞానముచేతనైన నజ్ఞానముచేతనైన భగవంతుని నామమును స్మరించినచో నది పాపాత్ములపాపము లను నగ్నిహోత్రము శుష్కవనమువలె దహింపక మానదు. అగ్నిహో త్రము నను గాలునని యెఱిఁగి ముట్టుకొన్నను గాలును; ఎఱుఁగక ముట్టుకొన్నను కాలును. అట్లె భగవన్నామస్మరణ మెఱిఁగి యుచ్చరించినను నెఱుఁగక యుచ్చరించినను బాప నివారణము చేసి మనశ్శుద్ధిని గల్గింపక మానదు. దివ్యౌషధము జ్ఞానముచేతఁ ద్రావినను నది నియతముగా నారోగ్యమును నిచ్చి తీఱును. అట్లె భగవన్నామాత్మకమగు మంత్రము తన్నామప్రభావ మెఱింగి యుచ్చరించినను నెఱుఁగక యుచ్చరించినను బురుషులపాప ముల హరింపకమానదు. ఓభటులారా! ఈయజామిళుఁడు పాపముక్తుఁడగుటచే వైకుంఠమును బొందుటయే ధర్మము. ఈ ధర్మమునందు మీకు సందియమున్నచో మీప్రభువు నడిగిరండు.

భగవంతుఁ డగుయముఁడు ధర్మరహస్యముల నన్నింటిని జక్కఁగా నెఱుఁగును.'' అనియిట్లు విష్ణుదూతలు భాగవతధర్మములను నిశ్చయించి చెప్పఁగా విని యాయమదూత లాయజామిళుని యమపాశములనుండి విడిచిపుచ్చుటచే మృత్యువు తప్పిపోయెను. ఓనరేంద్రా! అనంతరము యమదూతలు యమ సన్నిధానమున కేఁగి యచ్చటివృత్తాంతమును సర్వమును నివేదించిరి. అంత నిట నజామిళుఁడు యమపాశమునుండి విముక్తుండగుటచే భయరహితుండై మగుడజీవించి విష్ణుదూతలనుజూచి తద్దర్శనమువలన నధికానందము చెంది వారికిఁ దలసోఁకునట్లు నమస్కరించె. విష్ణుదూతలు తమ్ముంగూర్చి యేదియోచెప్ప నుద్దేశించుటజూచి యాయాజామిళుఁడు చూచుచుండగనే శీఘ్రముగా నంతర్ధానము చెందిరి. ఆయజామిళుఁడు విష్ణుదూతయమదూతలు పర

---

* ఇచట 'మృత్యువుతప్పించి' రనుట కభిప్రాయ మేమనఁగా.—ఆయజామిళుఁ డధికపాపము లాచరించుటచే నాయువు తఱిగిపోయెను. మృత్యువు సమీపించినది. మృత్యువు సమీపించినదని తెలిసికొని యమదూతలు వచ్చిరి. అంత నతఁడుఁ బూర్వ పుణ్యవశమున నంత్యకాలమున భగవన్నామ స్మరణము చేసెను. అదియామహాపాపములందుఁబడి మొదలంట నశింపంజేసినది. పాపాధిక్యమువలన నాకస్మికముగాఁ దారసిల్లినమృత్యువు పాపనివృత్తియైనతోడనే యది నివర్తించెనని తెలియఁదగినది. ఈయభిప్రాయ మంగీకరించుటచేతనే "సఏవంవర్తమానోఽజ్ఞో మృత్యుకాలఉపస్థితే। మతించకారతనయే'' అనుగ్రంథమునకును, "ద్విజఃపాశాద్వినిర్ముక్తో గతభీః ప్రకృతింగతః'' అనునుత్తరగ్రంథమునకును దీనికిని విరోధము లేదు. మఱియునట్లు చెప్పకపోయినచో ప్రసక్తమైనమృత్యువు నివారింపకపోవుటవలన మగుడ నజామిళుఁడు జీవించెననియుఁ నతనికి భక్తియోగ మలవడినదనియుఁ జెప్పుట యసంగతము కాకమానదు;

స్వరమును జెప్పఁగొన్న భాగవతధర్మములను సత్త్వాది గుణత్రయ మునకును వశ్యులగు జనాధికారములను విన్నవాఁడగుటచేతను నారాయణమాహాత్మ్యమునువిన్నవాఁడగుటచేతను,భగవంతుని యం దధికభక్తిగలవాఁడాయెను. మఱియుఁ దానాచరించిన

## అజామిళుఁడు పశ్చాత్తాపపడుట.

మహాపాపముల స్మరించికొని మిక్కిలి పశ్చాత్తప్తుఁడయి మనం బున నిట్లనుకొనియె. 'అకటా! నేను నామనంబును జయింప లేక గొప్పకష్టము తెచ్చి పెట్టుకొంటిని. ఈశూద్రస్త్రీతో వర్తించి బిడ్డలనుగని నాబ్రాహ్మణత్వమును బూర్తిగా నాశనము గావిం చుకొంటిని. సత్పురుషులచేనిందింతుఁడ నగునాజన్మంబుకాల్పనా? నేను బవిత్రకులమునకుఁ బాప మార్జించి కళంకము గల్గించిన దుష్టుఁడను. మఱియుఁ గామాంధుండనై పవిత్రురాలగు భార్య నువిడిచి సురాపానముచే దుష్టురాలగు నీశూద్రస్త్రీని బొందితి. నేను వివేకహీనుండనై వృద్ధులును, ననాథులును, దీనులును, నితరబంధులులేనివారును నగునాజననీజనకులనుబరిత్యజించితిని. నావంటికృతఘ్నుండు వేఱొకఁడుండునా! అకటా! నీచునివలె నెంతపనిచేసితిని. అయ్యో! నేను దప్పక నరకకూపమునఁ బడు దును. అచ్చట ధర్మజ్ఞులగు యమాదులచేఁ బరీక్షింతుడనై నా వంటికాముకు లనుభవించుచున్న నరకబాధలపాలు గావింతురు. ఆలోచింప నిది స్వప్నమా? లేక నేను మేల్కనియుండియే య ద్భుతమును జూచుచున్నానా? నన్నుఁ బాశములతో బంధించిన యాటూత లెచ్చటికిఁ బోయిరి. మఱియు సుందరవిగ్రహు లగు నలువ్వురుసిద్ధులు పాశములచేబంధించి నన్ను నరకలోకమునకుఁ గొనిపోవుచుండ విడిపించి యెచ్చటికేఁగిరి. యోజింప నట్టిమహా

త్ములసన్నిధినిబడసియు మంగళముపొందలేక పోయిన నేను మంద భాగ్యుండననుటకు సందియమున్నదా? అయినను నావిబుధోత్త ముల సందర్శనమువలనఁ గల్గిన మంగళముచే నాయాత్మ నిర్మల మగుచున్నది. అట్లు కానిచోఁ జావసిద్ధపడివృషలీసాంగత్యముచేఁ బాపినై యున్న నాజిహ్వ నారాయణనామము నుచ్చరించుట కెట్లర్హమగును. బ్రాహ్మణ్యహీనుఁడను, నిర్లజ్జుండను, నగు నేనె క్కడ? మంగళావహమగు భగవన్నామ మెక్కడ! పాపాత్ముఁడ నగు నాకంత్యకాలమున భగవన్నామము నుచ్చరింపఁగల్గుట మహాపుణ్యము లేక సంభవించు టెట్లు? తాదృశసిద్ధ దర్శన పుణ్యముగల నేను మనంబును నింద్రియంబులను, బ్రాణమును నియమించి దేనిచే నరకకూపమ్మునఁ గూలనో, యట్టియుపాయము కయి యత్నించెదను. దేహాత్మాదులమూలమగు నజ్ఞానమువల నను, విషయాభిలాషవలలను, ధర్మముచేతను గలిగిన యీసం సారబంధమును విప్పుకొని సర్వభూతహితుండనై యంతరింద్రియ ముల నిగ్రహించి భూతములందు దయాళుండనై ప్రశస్తమన స్కుండనై, దేనిచే నేను జ్ఞానశూన్యుండనై క్రీడామృగమువలె సంచరించితినో, స్త్రీరూపముననున్న యామాయనుండి తప్పిం చుకొనెదను. దేహమునందును దదనుబంధుల యందును "నాది" "నేను' అను మిథ్యాజ్ఞానమునువిసర్జించి, భగవంతునియందుఁ దదీ యనామములనుచ్చరించుచునామనంబును జేర్చెదను" అనియిట్లు జామిళుండు పశ్చాత్తాపతప్తుఁడై సాధుసంగముచే సమస్తాను బంధములను భేదించుకొని గంగద్వారమున కేగెను. భగవంతు నికినివాసభూతమగు గంగాద్వారమందు ప్రవేశించి భగవద్భక్తి యోగము నాశ్రయించి యంతరింద్రియ బహిరింద్రియముల

జయించి, ముందుగాఁ బ్రత్యగాత్మను గుణపరిణామము లగు దేహాదులనుండి విభాగించి దానియందు మనంబును జేర్చెను. అనంతరము జీవాంతరాత్మయగుపరమాత్మను ధ్యానించి స్వరూపముచేతను నిరతిశయుఁడై, జ్ఞానస్వరూపుఁడై భగవచ్ఛబ్దవాచ్యమగు తేజమునందాత్మను స్థిరముగా నిల్పెను. ఇట్లు భగవంతునియందు స్థిరచిత్తుఁడై శబ్దాదివిషయములనుండి బుద్ధిని మరలించినకాలమందె యతనికిఁబూర్వము గానవచ్చినవిష్ణుదూతలు గానవచ్చిరి. అంత నజామిళుఁడు వారినిఁ బూర్వమందు వచ్చినవారిఁగా నెఱింగి శిరస్సు వారిపాదములకుసోఁక మ్రొక్కెను. అనంతర మతఁడు గంగాద్వారక్షేత్రమున గళేబరమును విడిచి వెంటనే భగవత్పార్శ్వవర్తులతో సమమగు రూపమునుధరించి యామహాపురుషులతోఁగూడ గనకవికారమైన విమానము నధిరోహించి యర్చిరాదిగతిచే నారాయణుని కాస్పదమై వెలయు వైకుంఠమున కేఁగెను. ఓ నరేంద్రా! ఆయజామిళుఁడు సర్వధర్మముల నతిక్రమించి దాసీసాంగత్యముచేఁ బతితుఁడై, యార్యనింద్యమగు కర్మము నాచరించి వేదాధ్యయనాదివ్రతములను విడిచి, నిరయమందుఁద్రోయఁబడియు భగవన్నామసంస్మరణము చేయుచుఁ దత్కాలమందె ముక్తుఁడయ్యె. సంసారబంధమును విడిపించుకొనఁ దలంపుగలవారికిఁ దన్మూల కర్మబంధనమును ఛేదింపఁజాలినది భగవన్నామముకంటెమఱియొకయుపాయము లేదు. రజస్తమోగుణములచేఁ గలుషితమగుమనంబును సంసారహేతువులగు కర్మములందు సక్తముగాకుండఁజేయుటకు భగవన్నామస్మరణమును మించినయుపాయము వేఱొక్కటి యేది? ఓరాజా! మిక్కిలి గోప్యమై సమస్తపాపహారమై యున్న యీ

యితిహాసమును శ్రద్ధాళువై వినినవాఁడును భక్తియుక్తుఁడై చెప్పినవాఁడును, యమకింకరులచే వీక్షితులయినను నరకమున కెంతమాత్రమును బోరు. మహాపాపియైనను మనుష్యుఁడు దీని విన్నచో వైకుంఠమును బొందుచున్నాఁడు. అజామిళుఁడు ప్రాణములవిడుచువాఁడై పుత్రునియందు సంకేతితమగు భగవన్నామమును నుచ్చరించినమాత్రముననే వైకుంఠమును జేరినప్పుడు శ్రద్ధాసముపేతుఁడై హరిగుణగణప్రతిపాదకములగు నారాయణనామస్మరణ మొనర్చువాఁడు వైకుంఠమును బొందఁగలండని వేఱుగాఁ జెప్పవలయునా?' అని చెప్పిన విని రాజేంద్రుఁడు శుకున కి ట్లనియె. ఇది రెండవయధ్యాయము.

---

యముండు దూతలకు నారాయణ మహిమను దెల్పుట.

"ఓమునీంద్రా! యమధర్మరాజు తన భటులవలన నావృత్తాంతము విని వారితో నేమిచెప్పెను? ఆలోచింప నాయజామిళుఁడు సంసారియగుటచే యమవశవర్తియై యున్నవాఁడు గదా! అట్లు తనకు వశుం డయినయాతనినిఁ దనభృత్యులు గొని వచ్చుచుండఁగా విష్ణుదూతలు వారించి తనయాజ్ఞాభంగమును గావించిరి. అందులకు యముం డేమనెను? ఓఋషిచంద్రమా! యమునియాజ్ఞ ప్రతిబద్ధమైనట్లు నేనెప్పుడును గని విని యుండ లేదు. మావంటి సామాన్యుల నంశయమును నీకంటె నితరుఁ డెవ్వాఁడును దొలంగింప లేఁడు" అని యడిగిన రాజుంజూచి శుకయోగి యి ట్లనియె. ఓనృపాలా! విష్ణుదూతలచే నివారితులైన యమదూతలు తమప్రయత్నము మాని సంయమనీపురాధిపతి

యగు యమునిఁజేరి యిట్లు విన్నవించుకొనిరి. "ఓదేవా! యీ లోకమునఁ బుణ్యకర్మమును, పాపకర్మమును, బుణ్యపాపకర్మమును, జేయుచున్న జీవలోకమును శాసించి తత్తత్కర్మఫల మందఁజేయు వార లెంద ఱున్నారు? జీవలోకమును శాసించువారు పెక్కురుండినచో దుఃఖమెవనికో, సుఖమెవనికో, దుఃఖసుఖము లెవ్వనికో వ్యవస్థచేయుటెట్లు? పరస్పరము విరోధకులగుశాసకులుండి తలకొక శాస్త్రమును బురస్కరించుకొని జీవలోకమును శాసింప సమకట్టినచో,నొకఁడు విధించినదాని మఱియొకఁడు నివారించుచుండును. ఇందువలన జీవలోకము తత్తత్కర్మఫల మనుభవింపక యుండవలసివచ్చును. వివిధములగు కర్మముల నాచరించు జీవులు పెక్కురు కలరు. కాన వారిని శాసించువారు నొకవేళఁ బెక్కురుండిన నుండవచ్చును. కాని వారి శాసనములు పరస్పరవిరోధము లేకుండ నేకానుగతము లై యుండవలెను. మఱియు సామాన్య దేశాధిపతుల కందఱకు నధిపతి యగుచక్రవర్తినలెనీశాసకుల కందఱకును ముఖ్యుఁడొకఁడుండవలెను. ఆముఖ్యపురుషుని శాసనము నిరంకుశమై యుండవలెను. అట్లయినప్పుడే జీవలోకమునకుఁ గర్మానుసారియగు ఫలము గలుగనేర్చు. కావున నీవొక్కఁడవే సమస్తభూతముల కధిపతివై, యాయాభూతముల శుభాశుభ కర్మములఁ జక్కఁగ విమర్శించి హితాహితములను దెలిపి యందులోఁ బాపులకు దండము విధించుచు దండధరుఁడ వగుచున్నావు. ఇంతవఱకు నీశాసన మప్రతిహతమై వర్తించుచుండెఁ. కాని నీశాసన మిప్పుడు మానవలోకమున నద్భుతరూపముగల నల్వురు సిద్ధపురుషులచేఁ బ్రతిహతమైనది. మేము నీశాసనమును దలఁదాల్చి యొక పాపా

త్ముని నరకమునకుఁ గొనివచ్చుచుండఁగా నాసిద్ధులు బలాత్కారముగా నీపాశములను ఛేదించి విడిపించిరి. ఆపాపి చచ్చునప్పుడు "నారాయణ" అని పలుకగా నాసిద్ధులు వచ్చిరి. మమ్ము నీవు శిక్షించితివేని యాసిద్ధు లెవ్వరో, వారి యధిపతి యెవ్వరో, వారి బలమెట్టిదో సాంతముగాఁ దెలుప వేఁడుచున్నాము" అని యిట్లడుగఁగాఁ బ్రజాశాసకుఁ డగుయముండు మిక్కిలి సంతసించి నారాయణునిపాదకమలముల మనంబున స్మరించుకొనుచు, దూతలకిట్లనియె. ఓభటులారా! ఎవనియం దీవిశ్వమంతయుఁ దంతువులు పటమునందువలె నంతటను వ్యాపించియున్నదో, యెవని యంశము వలన నీవిశ్వమునకు సృష్టి స్థితిలయములు గల్గుచున్నవో, నాసికారజ్జువుగల వృషభము తదధిపతికివలె నెవ్వని కీవిశ్వమంతయు స్వాధీనమయి యున్నదో, యట్టి పరమేశ్వరుఁ డొకఁడు గలఁడు. అతఁడు నాకంటె గొప్పవాఁడు. నాకంటె నననేల? బ్రహ్మమొదలుకొని స్తంబపర్యంతము గల చరాచరాత్మక ప్రపంచము కంటెఁ గూడ గొప్పవాఁడు. ఆభగవంతుఁడు దృఢమగు రజ్జువులచే వృషభాదులను బంధించునట్లు వేదరూపమగు తన వాగ్దామమున బ్రాహ్మణాది జాతులు, బ్రహ్మచర్యాద్యాశ్రమములు నాఁబడు నామములచే నీవిశ్వమును బంధించి తన కధీనముగాఁ జేసికొనుచున్నాఁడు. ఈవిశ్వస్థులందఱును నామకర్మములచే బద్ధులయి భయపడుచు నతనికిఁ బూజల నర్పించుచున్నారు. నేనును, దేవేంద్రుండును, నిరృతియును, వరుణుండును, సోముండును, వహ్నియు, శంకరుండును, వాయువును, సూర్యుండును, బ్రహ్మయు, ద్వాదశాదిత్యులును, విశ్వావస్వాదులగు నష్ట దేవతలును, సాధ్యులును, దేవతలును, నేకాదశరుద్రులును,

సిద్ధులును, మఱియు దక్షాది నవబ్రహ్మలును. సత్త్వప్రధానులయ్యు మాయామోహితులై యతని యభిప్రాయమును దెలిసికొనలేరు. తక్కినవారి సంగతి చెప్పనేల? శరీరులందఱును నింద్రియముల చేతను, మనస్సుచేతను, ప్రాణాయామములచేతను, చిత్తము చేతను, వాక్కౌశలముచేతను, జీవుల హృదయమం దంతరాత్మ రూపుఁడయి తమకంటె విలక్షణుఁడైన పరమపురుషుని, రూపాదులు తమకంటె విలక్షణమై, తమ్ముఁ బ్రకాశింపఁజేయు చక్షురింద్రియమును వలెఁ జూడలేరు. ఓభటులారా! సర్వజ్ఞత్వాది గుణములచే నపరిచ్ఛిన్నుఁడయి, కావుననే చిదచిదాత్మకమగు జగంబునకంటె విలక్షణుఁడై, స్వతంత్రుఁడై మాయకు నియామకుఁడై, సమస్తమున కధిపతియై, బ్రహ్మాది దేవతలకంటెఁ బరుఁడై, నిరతిశయ ప్రభావము గలవాఁడై, యున్న నారాయణుని దూతలు, నారాయణుని వంటివగు గుణరూపములు గలవారై మనోహరాకారులై లోకమునఁ జరించుచుందురు. ఆలోచింప విష్ణుదూతలు బ్రహ్మాదిసురలకు సైతము పూజనీయులు. వారుజ్జ్వలములగు రూపములు గలవారు. అద్భుతాకారములు గలవారు. వారు భగవద్భక్తితోఁ దులదూగుజనులను మృత్యువునుండియు, సమస్త భూతములనుండియు సర్వదా రక్షించుచుందురు. నిరతిశయ పాపము లొనరించి భగవద్భక్తి శూన్యుఁడగునీయజామిళుఁ డెట్లు రక్షణీయుఁడగు? అని యడుగవచ్చు. ప్రత్యక్షముగా భగవంతునిచే నభిహితములగు, భాగవతధర్మములతిసూక్ష్మములు. అట్టి ధర్మములను ఋషులు తెలిసికొనలేరు. దేవతలైనను, సిద్ధశ్రేష్ఠులైనను, నసురులైనను, విద్యాధరులైనను, జారణులైనను దెలిసికోలేరు. అట్లుండువానిని మానవు

లెట్లు తెలిసికొనఁగలరు? కావున నాయజామిళునియందతిసూక్ష్మములగు భగవద్ధర్మము లుండవచ్చును. కావుననే విష్ణుదూతలు వచ్చి రక్షించిరి. ఓ సేవకులారా? ఆ భాగవతధర్మము మిక్కిలి గోప్యమైనది. కేవలము సత్వగుణ ప్రధానమైనది. అది తెలిసికొన మిగుల నసాధ్యమయినది. అయిన నాధర్మమును, నేనును, బ్రహ్మయు, నారదుండును, శంకరుండును సనత్కుమారుఁడును, కపిలుండును, స్వాయంభువ మనువును, బ్రహ్లాదుండును, జనకుండును, భీష్ముండును, బలియు, శ్రీశుకుండును మేము పన్నిద్దఱము నెఱుంగుదుము. ఆభాగవత ధర్మ మెఱింగినవారు తప్పక ముక్తి చెందుదురు. ఆధర్మమేదియని యడుగుదురేని చెప్పెద వినుఁడు. నారాయణుని నామముల నుచ్చరించుటవలన భగవంతునియందుఁ గల్గిన భక్తియోగమే యాధర్మమని యెఱుంగుఁడు. అదియే లోకమున ముఖ్యమగు ధర్మము. ఆయుత్కృష్ట ధర్మమే పురుషులచే సాధింపఁదగినది. భక్తియోగ ప్రభావము నిరుపమానమైనదే. దానికేమి యటుండనిండు. భగవంతుని నామోచ్చారణము గూడ నిరుపమానమైనదే. నామోచ్చారణ మట్టిదని చెప్పుటకు ముక్తికనర్హుఁడైనను, నజామిళుఁడు భగవన్నామము నుచ్చరించి సంసార బంధమునుండి ముక్తుండగుటయే ముఖ్య నిదర్శనము. హరినామోచ్చారణ మెంత మాహాత్మ్యము గలదియో చూడుఁడు. పాపాత్ముఁడగు నజామిళుఁడును మరణోన్ముఖుండయి నారాయణనామముచేఁ దనపుత్రునిఁ బిల్చి ముక్తిని జెందెను. దీని నాలోచింప భగవంతునిగుణములను, చేష్టలను, దెలుపు నామములను నుచ్చరించుటయే సమస్తపాపములను దొలఁగించుకొనుటకు ముఖ్యమార్గము. ఇదియే నారాయణుని

మాహాత్మ్యాదికమైనచో బ్రహ్మాదులవలె వేదాంతశాస్త్రములెఱింగిన యితరులుగూడ నేల తెలిసికోలేరు! అని సంశయింపఁబని లేదు. వేదములు స్వల్పములగు స్వర్గాదిఫలములను మనోహరముగా వర్ణించుచుండును; ఆఫలములు మధుపుష్పములవలె జనులచిత్తము లాకర్షించుచుండును. కావున జనులు భగవన్మాయామోహితులై కర్మనిరూపకమగు వేదములందే మనంబులఁ బ్రవేశింపఁజేసి కేవలము కర్మాసక్తులై యుందురు. కావున వారు నారాయణమాహాత్మ్యాదికమును దెలియఁజాలక కష్టపడుచుందురు. అకటా! యెంతకష్టము! ఏమానవులు బుద్ధికుశలులై భగవన్నామమాహాత్మ్యమును దెలిసికొని యపరిచ్ఛిన్నుఁడును, షాడ్గుణ్యపరిపూర్ణుఁడును, నగు వాసుదేవునియందు భక్తియోగమును జేయుచున్నారో వారు నిష్పాపులుగాన నా దండనమున కర్హులుగారు. వారికొకవేళ కొంచెముపాపమున్నను నది భగవన్నామోచ్చారణమువలన నశించును. ఓభటులారా! ఏమానవులు సాధుగుణసంయుతులో, సమస్తమును భగవదాత్మకమని తలంచు భగవద్భక్తులో, భగవంతుఁడే దిక్కని నమ్మియున్నారో, వారు దేవతలచేతను, సిద్ధులచేతను నుతింపఁబడు పవిత్రచరిత్రములుగలవారు. అట్టిమహాత్ముల చెంత కెప్పుడును బోకుఁడు. వారిని వాసుదేవుని గదయునునాయుధమును సర్వదా సర్వభూతములనుండియు రక్షించుచుండు. కావున వారికి సంసారభయ ముండదు. వారిని దండింప మాకు సామర్థ్యము లేదు. నిష్కాములయిన పరమహంసలచే సేవింపఁబడుచున్న వాసుదేవపాదారవిందము లందలి మకరందమును ద్రావ విముఖులై, కావుననే పాపాత్ములై నరకద్వారమం దుండ నధికారులయి

యున్నవారిని మాత్రమే సతతంబును నాచెంతకుఁ గొనిరండు. ఇంతియకాక యెవరినాలుక గుణ ప్రతిపాదకములగు వాసుదేవ నామములను బలుకదో, యెవరిమనస్సువాసుదేవునిపాదారవింద ములను స్మరింపదో, యెవరిశిర స్సొకమాఱైనను భగవంతునికి నమస్కార మాచరింపదో, యెవరు విష్ణువు నారాధింపరో, యా పాపాత్ములను నాచెంతకుఁ దీసికొనిరండు.'' అని తనభటులకాజ్ఞా పించి నారాయణునిఁ దలంచి 'పురాణపురుషుండును, భగవంతుం డును నగు వాసుదేవుండు నాభటులొనర్చిన యపరాధమును సహించుఁగాక. తనభక్తులమును, నజ్ఞానులమును, దనకునమస్క రించుచున్నవారము నగు మమ్మును భగవంతుఁడు మిక్కిలి క్షమించు. కాన మాభటులు చేసినదానిగూడ క్షమించుఁగాక. సర్వాంతరాత్మయగు నతనికి నమస్కారము' అని నారాయ ణుని స్మరించుకొనెను. ఓనరేంద్రా! యముఁడు భటులకొనర్చిన యుపదేశముచేతను, నజామిళుని చరిత్రముచేతను, విష్ణుసం కీర్తనము లోకములకు మంగళావహమనియు, నుత్కృష్టమగు పాపములను సైతము నిరసించుననియు, పాపనిరసనమందుదాని మించిన ప్రాయశ్చిత్తము లేదనియుఁ, దెలిసికొనుము. వాసు దేవునివిపులము లయిన చేష్టలను వినుచున్నవారికిని, జెప్పుచున్న వారికిని, నాశ్రవణాదుల వలన భక్తియుదయించి చిత్తముల నిర్మలములనుగాఁ జేయును. భక్తిచేఁ జిత్తములు నిర్మలము లైనట్లు వ్రతాదులచే నిర్మలములు కానేరవు. విష్ణునిపాదార విందమకరంద మాస్వాదించినవారు దురితాపాదకములగు శబ్దా దివిషయములందు సక్తులు కానేరరు. వారు పాపప్రాయశ్చిత్త ములు చేసికొన నవసరములేదు. అట్లు భగవంతుని పాదారవింద

మరంద మెఱుంగనివారు తమ పాపము దొలఁగించుకొనఁ బ్రాయశ్చిత్తము చేసికొనవలయు. ప్రాయశ్చిత్తముచేఁ బాపమును దొలంగించుకొన్నచో నాపాపము వారికి మగుడ సంభవింప నేరదు. ఓనరేంద్రా! ఇట్లు చెప్పిన తమనాయకుని యుపదేశమువలనను విష్ణుదూతల యుపదేశమువలనను, భగవన్మాహాత్మ్యము నెఱింగి యది మొదలు యమభటులు భగవద్భక్తుని సమీపించుటకే కాక దూరమునుండి చూచుటకుఁగూడ భయపడుచుందురు. ఓరాజేంద్రా! మలయపర్వతమున నివసించి యగస్త్యమహర్షి సర్వదా హరినారాధించుచుఁ బరమగుహ్యమగు నీ యితిహాసమును జెప్పెను" ఇది మూఁడవయధ్యాయము.

---

చంద్రుఁడు ప్రచేతసులకు హితముబోధించి మారిషయను కన్యక నొసంగుట. దక్షుఁడు హంసగుహ్యమను స్తోత్రము చేయుట. నారాయణుండు దక్షునికి సాక్షాత్కరించుట.

అనిన విని రాజు శుకున కిట్లనియె. "ఓమునీంద్రా! స్వాయంభువమన్వంతరమునఁ బ్రవర్తిల్లిన దేవరాక్షసమనుష్యమృగపక్ష్యాదుల సృష్టిని సంక్షేపముగాఁ జెప్పితివి. ప్రకృతివిలక్షణుం డగు పరమపురుషుఁడు తనశక్తిచేఁ జేసినవ్యష్టిసృష్టిని సవిస్తరముగాఁ దెలియఁ జేయుము." అని యడిగిన రాజు ప్రశ్నమువిని యానందించి మెచ్చుకొని మహాయోగి యైనశుకమహాముని యిట్లనియె. "ఓరాజా! ప్రాచీనబర్హి యనురాజునకుఁ బ్రచేతసు లనెడి పదువురు పుత్త్రులు గలరనియు, నాప్రాచీనబర్హి నారదోపదేశమువలన నివృత్తిమార్గ మవలంబించె ననియుఁ జెప్పితిని.

ఆ ప్రచేతసులు జనకాజ్ఞఁ దలఁదాల్చి సముద్రమధ్యమునకుఁ బోయి ద్రుమములచే దుష్ప్రవేశ మగు నా భూమినిజూచి కోప పరీతమానసులయి యావృక్షములను దహింపఁ దమ వదనముల నుండి యగ్నిని వాయువును సృజించిరి. అట్లు సృజించి వృక్షము లను దహించుచున్న యవసరమున వాని కధిపతియగు చంద్రుఁ డరుగుదెంచి వారి కోపమును శాంతి నొందించుచు నిట్లనియె. 'ఓ మహాభాగులారా! దీనము లగునీ వృక్షములకు ద్రోహము చేయఁదగదు. మీరు లోకముల వర్ధింపఁ దలంపుతో నున్నవారు. కావుననే మీరు ప్రజాపతులరని పిలువఁబడుచున్నారు. లోక వివర్ధమాను లగుప్రజాపతులకు వనస్పతులను దహించుటయను చితము. ఈవనస్పతులవలన నేమిప్రయోజనమని సంశయింపఁ బనిలేదు. బ్రహ్మాదులకుఁ బ్రభువై సమస్తము దంతరాత్మరూప మున వెలయుచు నవ్యయుండై యున్న భగవంతుఁడు జగదాది యందు దేవతల నుద్దేశించియుఁ, బితృదేవతల నుద్దేశించియు వనస్పతులను, నోషధులను సృజించెను. కావున దేవ పితృదేవ తల కుపజీవ్య మగుచున్నదిగాఁ బరిణమించిన వీనిని దహించుట యుక్తముగాదు. దేవతలకు వృక్షాదు లన్నమగుచున్నట్లె పాద చారులగు చరములకు నపాదచారులగు నచరములును, హస్త యుక్తు లగుమనుష్యాదులకుఁ జతుష్పాత్తులును భుజింపఁదగిన వయి యున్నవి. ఇట్లు భగవంతునిచే సర్వోపభోగ్యములుగా సృజించిన పదార్థములకు ద్రోహముచేయరాదు. ఓపాపరహితు లారా! మీరు మీజనకుఁ డగు ప్రాచీనబర్హి చేతనుమీతపంబు నకు సంతసించిన భగవంతునిచేతనుఁ బ్రజాసృష్టి నొనరింప గదా నియమింపఁబడితిరి. అట్టి మీ రీ వృక్షములను దహింపఁ

డగరు. కావున మీరు కోపమును విడువుఁడు. మీజనకుఁడును, మీపితామహుండును, బ్రపితామహుండును ద్రొక్కినసన్మార్గము నవలంబింపుఁడు. బాలకులకుఁ దలిదండ్రులును, గన్నులకు ఱెప్పలును, స్త్రీలకుఁ బతులును, బ్రజలకు రాజును, భిక్షులకు భిక్షయు బ్రయోగకుశలులకు మీాఘూంసాభిజ్ఞుఁడు, నెట్లు రక్షించుచుందు రో,యట్లైసమస్తభూతముల హృదయములందుఁ బ్రవేశించి నియమనము చేయుచు భగవంతుఁడున్నాఁడు. కానభగవంతునికి జగంబంతయు శరీరమనియెఱుంగుఁడు. మీరిట్లుతలంచి భూతద్రోహము ను ద్యజింతు రేని భగవంతుఁడు మిక్కిలి సంతసించును. ఇంతియకాక కోపశమనము మిక్కిలి యభ్యుదయకారి. కావునఁ బండితుఁడు హృదయవివరమునుండి సముత్పన్నమగు దుస్సహకోపమును స్వాత్మపరమాత్మయాథాత్మ్యవిచారముచే సంహరింపవలయును. అట్లు చేసినవాఁడు క్రమముగా సంసారవిముక్తుండగుచున్నాఁడు. కోపత్యాగము మీకు మిక్కిలి హితకరము. ఇప్పటికి దగ్ధమయిన వృక్షములతోఁ జాలింపుఁడు. మిగిలిన వృక్షములకును మీకును శుభమగుఁగాక. ఈవృక్షములచేఁ బాలితయై శుభలక్షణములు గలిగి వర్తించు మారిషయను నీకన్యను భార్యనుగా స్వీకరింపుఁడు.” అని చంద్రుండు పలికి యచ్చరగర్భమున ఋషివీర్యమువలన నుదయించి వివాహయోగ్యయై యున్నయాకన్యను వారికొసంగి వెడలిపోయెను. అనంతరము ప్రచేతసులాకన్యను విధియుక్తముగా వివాహము చేసికొనిరి. పూర్వము బ్రహ్మయంగుష్ఠమున నుదయించి రుద్రాపరాధవశమున నాదేహమును విడిచి దక్షుఁడా ప్రచేతసులకును మారిషకును నుదయించి ప్రచేతసుఁడను నామము వహించెను.

తలచుగా నీ లోకత్రయమందున్నవా రందఱు నతని సంతతి వారే. ఆ దక్షుఁడు, దుహితృవత్సలుండై వీర్యముచేతను మన స్సంకల్పముచేతను భూతముల నెట్లు సృజించెనో దాని వివరించి చెప్పెదను. నీవు సావధానుండవయి వినుము. మొట్టమొదట నా దక్షుఁడు నభమందును, భూమియందును, జలమందును నివసించుచున్న దేవ మనుష్య రాక్షసాదు లగు ప్రజలను మనస్సు చేతనే సృజించెను. కాని మనంబున నొనర్పఁబడిన ప్రజాసృష్టి వర్ధిల్లినదికాదు. అది తెలిసికొని యతఁడు వింధ్యప్రత్యంతపర్వతమునకుఁ బోయి యితరు లొనర్పఁదరముకాని తపంబొనర్చెను. ఆ వింధ్యపాదమం దున్న యఘమర్షణ మనెడిపుణ్యతీర్థమున మూఁడుకాలములందును స్నానముగావించుచు దక్షుండు తపంబున హరి నారాధించెను. ఓరాజా! దక్షుఁడట్లారాధించి హంసగుహ్యాక మనుస్తోత్రముచే భగవంతుఁ డగుహరిని నుతింపఁగా నతని కాతఁడు ప్రసన్నుండయ్యె. ఆతండొనర్చిన యాస్తోత్రమును నిరూపించెదను, వినుము. అట్లు దక్షుండు సమాహితచిత్తుఁడయి "ఎవఁడు చిదచిత్తులకు విలక్షణుండయి వర్తించునో, యెవని సంకల్పరూపజ్ఞానము జీవులసంకల్పజ్ఞానమువలె వ్యర్థముకాదో, యెవఁడు సత్త్వరజస్తమోగుణముల యున్మేషమునకుఁ గారణభూత మగుప్రకృతియే శరీరముగాఁ గలవాఁడో, యెవని స్వరూపము గుణత్రయమునకుఁ గార్యభూతములగు పృథివ్యాదితత్త్వముల నెఱింగినవారికిఁగూడ గోచరము కాదో, యెవఁడు సర్వకారణుఁడో యట్టిపరమేశ్వరునకు నమస్కారము. దేహమందు జీవాంతరాత్ముఁడై యుండి కేవలము హితమాచరించుచున్నయే పగమాత్మునకుఁ దాను రత్నాదిద్రవ్యములకుఁ బ్రభాదిగుణములు

వలె నపృథక్సిద్ధుం డయియుండియు జీవుఁడు దేహాగోచరజ్ఞానము వలనఁ దెలిసికొనలేఁడో, యాపరమపురుషునకు నమస్కారము లొనర్చెద. మఱియు, దేహమును, ప్రాణములును, మనోవృత్తులునుఁ బృథివ్యాది భూతములును, గంధాదితన్మాత్రలును, దమకంటె వ్యతిరిక్తుఁడయి తమ్మును దెలిసికొనుచున్న జీవాత్మను దెలిసికోలేని విధమున, జీవుండు, తన్నును, దనగుణములను, దనదేహాదులను నెఱింగి తనకంటె వ్యతిరిక్తుఁడై యున్న యే సర్వజ్ఞుని, నతనిగుణములను నెఱుంగఁజాలఁడో, యట్టి పరమేశ్వరుని నుతించుచున్నాను. దేవమనుష్యాది నామరూపములు గల మనస్సునకు స్వప్నావస్థ నివర్తించినసుషుప్త్యవస్థ సంప్రాప్తమగుచున్నప్పు డేపరమాత్మ*పొందఁబడుచున్నాఁడో, రాగాదులచేఁ గలుషితముకానియుపాసనాత్మకమగుజ్ఞానమున నెవఁడుప్రాప్యుఁడగుచున్నాఁడో, యెవఁడు నిత్యాసంకుచితజ్ఞానముచే శుద్ధుండో, యెవఁ డుపాసనాజ్ఞానముచేఁ బరిశుద్ధమగు నంతఃకరణమునకు సన్నిహితుఁడయి యుండునో, యట్టి పరమపురుషునికి నమస్కారము.పరమాత్మయాథాత్మ్య మెఱింగినబుద్ధిమంతులు కార్యోపయోగులై యపృథక్సిద్ధములై యున్న † పండ్రెండుశక్తులతోను హృదయాంతరమునుఁ ‡ ప్రవేశించియు నరణికాష్ఠము

* ఈచెప్పుటచే "ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించనవేద నాంతరమ్" "ఏషసుప్తేషుజాగర్తి" యనెడి శ్రుత్యర్థము చెప్పఁబడినవి.

† ఆశక్తు లేవనఁగా, "శ్రియాపుష్ట్యాగిరాకాంత్యా కీర్త్యాతుష్ట్యేలయోర్జయా, విద్యయా విద్యయా శక్త్యా మాయయా చ నిషేవితః" అనునవి యని యెఱుంగునది.

‡ ఈచెప్పుటచే "తందుర్దర్శంగూఢమనుప్రవిష్టం గుహాహితంగహ్వరేష్ఠం పురాణం। అధ్యాత్మయోగాధిగమేనదేవంమత్వా"అనెడి శ్రుతి చెప్పఁబడినది.

లందున్న యగ్నివలె నిగూఢుండై బాహ్యేంద్రియములకు గోచరుండుకాని యేమహాత్ముని యోగపరిశుద్ధ మగుబుద్ధితోఁ బ్రకృతిపురుషవిభిన్నునిఁగా నెంచుచున్నారో, యెవఁడు సమస్తవికారములు గల మాయ నశించినపిమ్మట నిర్వాణసుఖంబు గల్గించువాఁడో, యెవఁడు మనంబునకును, వాక్కునకును, పరిచ్ఛేద్యములు గాని విచిత్రశక్తులు గలవాఁడగుటచే విశ్వరూపుఁ డయ్యుఁ దద్గతదోషములు వైరయఁడో, యా భగవానుండు నన్ననుగ్రహించుఁగాక. ఎవని స్వరూపము శబ్దాదులచే బోధితమగునదియు, బుద్ధిచే నిశ్చిత మగునదియు, నింద్రియంబులచే గృహీతమగునదియు, మనస్సున సంకల్పించునదియుఁ గాదో, యెవ్వని స్వరూపము జగదుత్పత్త్యాదులకుఁ గారణత్వరూపమగు నసాధారణధర్మముచేఁ దక్కఁ దన కసాధారణధర్మములుకాని సత్త్వాదికార్యములచే నుపలక్షితము కాదో, యట్టి పరమేశ్వరునకు నమస్కారము. మఱియు, నేవస్తువునం దీజగం బుత్పన్నమగుచున్నదియో యదియు, దేనివలన జగంబు వెడముచున్నదియో యావస్తువును, దేనిచేత జగంబు జేయింపఁబడుచున్నదియో యావస్తువును, నీజగంబు యత్సంబంధి యగుచున్నదయో యావస్తువును, దేనికొఱకీ ప్రపంచము చేయింపఁబడుచున్నదియో యావస్తువును, నేది జగంబును జేయుచున్నదియో యావస్తువు నిట్లధికరణాపాదానాది కారక శక్త్యాశ్రయవస్తువు లన్నియు నేవానికి శరీరభూత మగుచున్నదో.

యెవఁడు కార్యావస్థకుఁ బూర్వము కారణుఁడయి యున్నట్లు ప్రసిద్ధుఁడగుచున్నాఁడో, యెవఁడు విశ్వశరీరకుఁడయ్యు విశ్వ ముకంటె నన్యుఁడుగాఁడో, యెవఁడు సృష్టికిఁ బూర్వ మేర్పడని నామరూపములుగల సూక్ష్మ చిదచిత్తులు శరీరముగాఁగలవాఁ డగుటచే నొక్కఁడయి వరలుచున్నాఁడో, యాపరమేశ్వరుఁడు నాకు దిక్కగుఁగాక. * గ్రంథనిబంధనముచే శాస్త్ర ముపదే

---

ఓయీ! కారక శక్త్యాశ్రయ వస్తువు లన్నియు భగవంతునికి శరీర భూత ములగుచున్నవి. కాన నతఁడే ముఖ్యుఁడై యాధారశక్త్యాశ్రయుఁ డగుటవలన సర్వకారకవ్యాపారమును భగవదాయత్తమే యగుచున్నది కదా. భగవం తుఁడు గారకశక్త్యాశ్రితుఁ డయినచోఁ గ్రియాసహితుఁడు కాక మానునా? క్రియాసహితుఁడయినచోఁ దత్ప్రియుక్తమగు కార్యత్వము ప్రసంగింపకమా నునా? ప్రసక్తమైన కార్యత్వమువలన "యజ్జన్యం తన్నశ్య" మనునట్లుగా నతని కనిత్యత్వము సంభవింపక విడుచునా? దానినంగీకరించినచో, "నిష్క్రి యంనిష్కలం" అనుశ్రుతికిని, "నిత్యంవిభు" మనుశ్రుతికిని విరోధముఁగలుగు చున్నదని ప్రశ్నింప నవకాశములేదు. "తత్సృష్ట్వా త దేవానుప్రావిశత్। తద నుప్రవిశ్య సచ్చాఽసచ్చాభవత్॥" "అంతః ప్రవిష్టశ్శాస్తాజనానాగ్ం సర్వా త్మా॥ ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అనెడి శ్రుతిస్మృ తుల బలమువలనఁ గార్యమయినజగత్తు చిత్తుతోనునచిత్తుతోను, నీశ్వరునితోను నైయున్నది. కార్యమగుజగముతత్త్వత్రయాత్మక(అనఁగాఁబ్రకృతిపురుషేశ్వ రాత్మకమగుచున్నదికావునను, గార్య మెప్పుడునుగారణమునకు సజాతీయమై యుండును గావునను, గార్యమువలెఁ గారణమును బ్రకృతిపురుషేశ్వరులనెడి తత్త్వత్రయమే యనితెలియఁదగినది. సృష్ట్యాదియం దున్నకారణముగూడఁ దత్వత్రయాత్మకమై యున్నదనుట "సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్" అను శ్రుతిచేతను "ప్రకృతింపురుషంచైవవిద్ధ్యనాదీ ఉభావపి' అను గీతావచనము వలనను స్పష్టమగుచున్నది. అట్లు తత్త్వత్రయము సృష్ట్యాది యందున్నప్పటికిని

శించి జగత్కారణత్వమును గుఱించి వివాదము సలుపుచున్న వైశేషికాదిమతస్థుల కేవని పృథివ్యాదిశక్తులు పరస్పరము విరు

---

"య ఆత్మనితిష్ఠన్, యఃపృథివ్యాంతిష్ఠన్ యోఽక్షరమంతరే సంచరన్। యస్యాక్షరం శరీరం। యోఽవ్యక్తమంతరే సంచరన్। యస్యావ్యక్తం శరీరం॥" ఇత్యాది శ్రుతి ప్రమాణమువలన వానిలో నీశ్వరునికి విశేష్యత్వమును, ప్రకృతి పురుషులకుఁ బదియు శరీరత్వమును సిద్ధమగుచున్నది. కావునఁ జిదచిచ్ఛరీరకుఁడయిన యీశ్వరుఁడు కారణమని స్పష్టమగుచున్నది. కావున సూక్ష్మచిదచిద్విశిష్టమగుబ్రహ్మము కారణమయియుండి కార్యావస్థయందు స్థూలచిదచిద్విశిష్టమగుచున్నదని తెలియఁదగినది. ఇట్లు చెప్పకొనుటచేఁ బరమాత్మకుఁ గారకశక్త్యాశ్రయత్వము శరీరభూతమగుచిదచిత్తులవలనసంభవించుచున్నది కాన గారకత్వాశ్రయుఁడగుటవలన సంభవించెడిసక్రియత్వాదికముగూడశరీరభూతమగు ప్రకృతిపురుషులమూలముననేసంభవించుచున్నదికాని ప్రత్యక్షముగా నతనికట్టివి సంభవింపవు. కారకత్వాదులును దత్ప్రయుక్తములగుసక్రియత్వాదులును ప్రకృతిపురుషగతములగుటవలన శరీరియయిన పరబ్రహ్మము నిష్క్రియుండు కావచ్చునుగాన "నిష్క్రియం" అనుశ్రుతికివిరోధము లేదు. మఱియుఁ గారణావస్థయందును గార్యావస్థయందును జిదచిచ్ఛరీరుఁడగు పరబ్రహ్మమే యున్నదనిచెప్పుటచే 'ఒకఁడయినపరమేశ్వరుఁడేకకాలమున సమస్తములగు దేవమనుష్యాది శరీరములందుండుటయు నందువలన విశ్వరూపుఁడని చెప్పఁబడుటయు' ననెడిశంకకవకాశము లేదు. ఏమన 'ఏషోఽణురాత్మా' అనెడిశ్రుతివలనజీవుఁడణుపరిమాణుఁడగుటవలన నేకకాలమున నేకశరీరములందుండుటయసంభవమేయైనను, 'సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ' అనుశ్రుతిచొప్పున బ్రహ్మస్వరూపమపరిచ్ఛిన్నమైయుండుటసమస్తశరీరములందును నేకకాలమునజీవాంతరాత్మరూపముగానుండుటసంభవించుచున్నది. "ఓయీ! విశ్వరూపుఁడనఁగాఁ నర్థమేమి? విశ్వము శరీరముగాఁగలవాఁడని చెప్పరాదు. అట్లు చెప్పినచో ఈ సమస్తము బ్రహ్మమేకదా, యను 'సర్వంఖల్విదంబ్రహ్మ'యనుశ్రుతికిని, ఈ

ద్ధావిరుద్ధములగువాదములకు విషయములగుచున్నవియో, యెవ
నికి శక్తులైన పృథివ్యాదులను దెలిసికొనుచున్నప్పటికిని జగము
పరమాణువులవలనఁ గల్గుచున్నదా? ప్రధానమువలనఁ గల్గు
చున్నదా? నిత్యమా? యనిత్యమా? భిన్నమా? యభిన్నమా?

---

ప్రపంచమంతయు బ్రహ్మమయమే యనునర్థముగల "ఐతదాత్మ్యమిదగ్ంసర్వం" అనుశ్రుతియు 'ఈజీవుఁడే బ్రహ్మము' అనునర్థముగల "అయమాత్మా బ్రహ్మ" అను శ్రుతియును, "నీవే యా బ్రహ్మవు" అనునర్థముగల 'తత్త్వమసి" యనుశ్రుతియు విరోధించుచున్నవి. ఏమన ఆశ్రుతులన్నియుఁ బ్రపంచమునకును బ్రహ్మమునకును జీవబ్రహ్మములకును నభేదము బోధించుచున్నది. ఇట్లుండ నీవు చెప్పినయర్థము నే స్వీకరించినచో భగవంతుఁడు విశ్వముకంటె వేఱయినట్లు గానవచ్చుచున్నది. శ్రుతు లభేదమును బోధించుచుండఁగా నీవు భేదమును జెప్పుచుంటివి. ఎట్లు సరిపడును? అని ప్రశ్నింప నవకాశము లేదు. భగవంతుఁడు విశ్వశరీరకుఁడని చెప్పినను నతఁడు విశ్వముకంటె వేఱయినవాఁడు కాఁడని యెఱుంగునది. సృష్టికిఁ బూర్వమందుఁ బ్రసిద్ధమైన సూక్ష్మ చిదచిద్విశిష్టమగు బ్రహ్మమే, కార్యావస్థయందు, స్థూల చిదచిద్విశిష్టమగుచున్నది. కారణావస్థయందు సూక్ష్మ చిదచిత్తులనుబొందిన యీశ్వరుఁడే, కార్యావస్థయందు స్థూల చిదచిత్తులను బొందుచున్నాఁడు. పరబ్రహ్మముయొక్క చిదచిద్రూపము వికాసము నొంది విశ్వముగా బరిణమించుచున్నది కాని ప్రత్యేకముగా జనింపలేదు. స్థూలత్వమునుబొందినచిదచిత్తులే విశ్వమగుచుండుటచేతను, కారణావస్థయందు భగవంతుఁడు సూక్ష్మ చిదచిచ్ఛరీరకుఁడగునట్లుగా, గార్యావస్థయందు స్థూల చిదచిచ్ఛరీరుఁడని చెప్పుటకు వలనుపడియుండుటచేతను, భగవంతుఁడు విశ్వశరీరుఁడయ్యు విశ్వముకంటె నభిన్నుఁడై యున్నాఁడని చెప్పఁదగియుండుటచేతను నభేదము బోధించెడి శ్రుతులకు విరోధము లేదు. కారకత్వాదులు చిదచిద్వారకముగా భగవంతునికి సంప్రాప్తములగుటవలన నిష్క్రియత్వనిత్యత్వాదులకసంగతము లేదనియుఁ దెలియఁదగినది.

సద్రూపమా ? అసద్రూపమా ? యని మతస్థులకే యవి మాటిమాటికి మోహముఁ గల్గించుచున్న వ్రో, యాపరమపురుషు నకు, నాయనంత కల్యాణగుణునకు, నా పరబ్రహ్మమునకు నమస్కారములు. లోకమున " ఉండుట " "లేకపోవుట" యనెడి విరుద్ధ ధర్మములు ఘటపటాదివస్తువులందు భిన్నకాలములఁ గాన వచ్చుచున్నవి. యోగసాంఖ్యమతములలో నా విరుద్ధధర్మములు రెండింటి నీశ్వరనిష్ఠములుగాఁ జేసి "ఈశ్వరుఁడున్నాఁడనియు, లేఁడనియు" వాదింపఁదొడఁగిరి. ఇట్లీశ్వరునియం దస్తిత్వానాస్తిత్వ రూపములను విరుద్ధధర్మములు వ్యవహరింపఁబడుచుండఁగా నట్టి సమయముల నతీంద్రియుఁడయిన యాశ్వరుఁడున్నాఁడని నిర్ణయించుటకుఁ బ్రమాణముగాఁ గైకొనబడుచున్న వేదాంతవాక్యముల నేపరమాత్మ యేకరూపుఁడనియు, నానందరూపుఁడనియు, సర్వముకంటె విలక్షణుఁడనియు, నపరిచ్ఛిన్నుఁడనియుఁ, దెలుపఁబడుచున్నాఁడో, యాతఁడు మాకు దిక్కగుఁగాక. ఇట్లు భగవంతుఁడు దుర్జ్ఞేయములగు స్వరూపగుణములుగలవాఁడైనను తాను గర్మకృతములగు నామరూపములు లేనివాఁడయినను, దన్ను భజించుచున్నవారి ననుగ్రహించుటకు దురితక్షపణ సమర్థములగు రామకృష్ణాదినామములను, స్వేచ్ఛచే నుపాత్తములగు నప్రాకృతశరీరములను బొంది, యత్యద్భుతములగు నవతారచేష్టలను జేయుచున్నాఁడో, సమాభ్యధికరహితుఁ డయిన యాతఁడు నాకుఁ బ్రసన్నుండగుఁగాక. ఏ పరమాత్మ ప్రాకృతార్థగోచరము లగునింద్రియముల చే, మనోవృత్తి కనుగుణముగా స్వదేహమగు చిదచిద్వస్తువులందుండి పృథివీవిలక్షణుఁ డయిన వాయువు, పార్థివగుణమగు పుష్పరాగముచే సంస్పృష్టుఁడై గంధవహుఁడని ప్రకాశించు

చున్నట్లు, తాను జగద్విలక్షణుఁడయ్యును, దన్నామరూపములను బొంది ప్రకాశించుచున్నాఁడో యాపరమేశ్వరుఁడు నామనోరథమును సమకూర్చుఁగాక' అని యిట్లు ప్రాచేతసుండు నుతింప భక్తవత్సలుఁడయిన భగవంతుఁ డాయఘమర్షణక్షేత్రమునం దతనికి సాక్షాత్కరించెను. అట్లతనికి సాక్షాత్కరించునప్పుడు భగవంతుండు గరుడునిస్కంధముపయిఁ బాదములనుంచి యాజానులంబులగు నెనిమిదిభుజములుగలవాఁడయి శంఖమును, జక్రంబును, ఖడ్గమును, డాలును, బాణములను, జాపమును, బాశమును, గదను, ధరించి, పచ్చనివస్త్రమును గట్టికొని, మేఘమువంటి శ్యామలకాంతిగల కాయముగలవాఁడై వదనమును, నేత్రంబులును బ్రసాదగుణమును సూచించుచుండ, వనమాల కంఠమున వ్రేలాడ, శ్రీవత్సమును, గౌస్తుభంబును, వక్షస్స్థలమున నిజకాంతులతోఁ దోలఁకాడఁ బూజనీయ మగుకిరీటమును, గంకణములును, బ్రకాశించు మకరకుండలములును, బంగారుమొలత్రాడును, ముద్రికలును, పాదభూషణములును, నూపురములును, నాయాయవయవములందుఁ బ్రకాశించుచుండఁగా, ముజ్జగంబులకు మోహముగల్గింపఁజాలు సుందరరూపమునుధరించి నారదుఁడు, నందుఁడు, మొదలగు సేవకులచేతను, సురశ్రేష్ఠులచేతను, గానముచేయు సిద్ధులచేతను, గంధర్వులచేతను, జారణులచేతను, బరివృతుండై, నుతింపఁబడుచునుండెను. అట్లు సాక్షాత్కరించిన నారాయణుని యత్యాశ్చర్యకరరూపమును జూచి దక్షుండు సంతుష్టచిత్తుండై

త్రేలంగి యతనికి దండప్రణామ మొనర్చెను. కాని నిండినసదులవలె నిరతిశయసంతోషంబున నింద్రియము లయియుండుటచేఁ దన మనోరథమునింతయే

నియు వెల్లడింపలేకపోయెను. అంత సమస్తభూతముల యభిప్రాయమెఱింగిన జనార్దనుండు తన కట్లు నమస్కరించి తనయభిప్రాయమును దెలుపనేరక సంతానకాంక్షియై భక్తుండైయున్న దక్షునింజూచి యిట్లు పలికెను. 'ఓ ప్రాచేతసా! నీవు మహాభాగ్యవంతుఁడవు, బుద్ధిమంతుఁడవు, నిరతిశయ మగుశ్రద్ధ నవలంబించి నాయం దుత్కృష్టభక్తిభావమును చూపితివి. కావున నీవు తపంబున సిద్ధుండవైతివి. మఱియు నీచేయు తపంబుజగదభివర్ధకంబగుటచే నే నీకు మిక్కిలి ప్రీతుఁడనైతిని. నేనెప్పుడును భూతసమృద్ధులచేజగంబునిండియుండవలయునని కోరుచుందును. నీతపంబా నాకోర్కితో నేకీభవించినదిగాన మఱిమఱి సంతసించితిని. చతుర్ముఖుండును, శంకరుండును, మీవంటి ప్రజాపతులును, స్వాయంభువమన్వాదులును, నింద్రాదిదేవతలును, నా కంశభూతములగుభూతముల సంవర్ధింపఁ గారణులు. ఓయీ బ్రహ్మ! తపము నాహృదయము; మంత్రజపము నాశరీరము; స్మార్తక్రియలు నాయవయవ సంస్థానము; యాగములు నాయంగములు; దానాదిరూపధర్మము నామనంబు. దేవతలు నాప్రాణములు. సృష్టికిఁ బూర్వమున నేర్పడని నామరూపములు గల చిదచిత్తులు శరీరముగాఁగల నే నొక్కఁడనే యుంటిని. అప్పుడు కార్యావస్థనుబొందిన చిదచిద్రూపద్రవ్యము నుంతేనియు లేదు. నామరూపవిభాగరహితమగు నవ్యక్తమువాత్రమే నిద్రించినట్టుండెను. ఇట్లుండ సూక్ష్మచిదచిచ్ఛరీరుఁడనైన నాకు శరీరభూతమును, త్రిగుణాత్మకమును, మహదాదిక్రమముచే బ్రహ్మాండాత్మకమగునాశరీర మావిర్భవించెను. ఆ నా శరీరమునుండియే సమష్టిపురుషుఁడగుచతుర్ముఖుం

యించెను. అట్లుదయించి బ్రహ్మ మత్సంకల్పరూపజ్ఞానముచే నుపబృంహితుండయి సృష్టికర్మమందుఁ బ్రవృత్తుఁడయ్యుఁ దన్ను సమర్థునిగాఁ దలంచుకొని విరమించియుండె. అదిచూచి నే నతనిఁ దపం బొనర్పుమంటిని. అతఁ డట్లుత్కృష్ట మగుతపం బొనర్చి యాతపోబలముచేఁ బ్రజాపతులగుమిమ్ము సృజింపఁగల్గెఁ గావున. దపము విశ్వవర్ధకమని యెఱుంగుము. పంచజనుఁ డనుప్రజాపతికి నసిక్ని యనుకుమారిక కలదు. ఓదక్షా! నీ వా యువతిని భార్యగాఁ బరిగ్రహింపుము. మిథునకృత్యమేధర్మముగాఁగలనీవు, మిథునకృత్యమే ధర్మముగాఁగల యసిక్నియందు బహువిధములుగాఁ బ్రజాసృష్టిని వర్ధింపఁగలవు. నీకంటెఁ దరువాతివారగు ప్రజలందఱును నాసంకల్పమువలనమిథునకర్మముచేనుద్భవింపఁగలరు. వారుమదీయారాధనరూపము లగుయోగాదికర్మములను జేయుదురు.'' ఓనరేంద్రా! జగదుత్పాదకుఁ డయిన భగవంతుఁ డిట్లుపల్కి దక్షుఁడుచూచుచుండఁగా నచ్చటనేకలలోఁగాంచిన వస్తువునలె నంతర్ధానము చెందెను. ఇది నాల్గవయధ్యాయము.

---

**హర్యశ్వులకు నారదుండునివృత్తిమార్గముపదేశించుట.**

ఓరాజా! అనంతరము దక్షుఁడు భగవత్సంకల్పముచే వ్యాప్తుండై యాపాంచజనియందు హర్యశ్వు లనునామముగల పదివేవురుపుత్త్రులం బడసెను. ఆపదివేవురు దక్షపుత్త్రులును, సమానధర్మముల నాచరింపఁ దలంపుగలవారై ప్రజాసృష్టిచేయవలయునన్న జనకాజ్ఞను దలఁదాల్చి పశ్చిమాభిముఖులై పోయి సింధునదీసాగర సంగమమం దున్ననారాయణసరస్సును బొందిరి.

ఆనారాయణసరస్సు మిక్కిలి పుణ్యదాయకమైనది. పెక్కండ్రు మునులచే నది సేవింపఁబడుచుండెను. ఆపుణ్యతీర్థ సంస్పర్శము వలన సమస్తపాపములును నశించును. ఆహర్యశ్వులాసరస్సును జేరి తదీయజల సంస్పర్శమువలన సమస్తపాపములను దొలంగించుకొని చిత్తము నిర్మలముగాఁ జేసికొని నివృత్తిధర్మపరాయణులైరి. వారట్టివారలయ్యు జనకాజ్ఞను దాఁట నిష్టపడక యింద్రియములజయించి ప్రజావృద్ధికుపయుక్తమగుతపంబునే యాచరించిరి. అట్లు తపంబొనరించి ప్రజాభివృద్ధి నొనర్పఁబ్రయత్నము సలుపు చున్నయాహర్యశ్వులంగాంచి నారదుఁడు సమీపించి యిట్లనియె. "ఓహర్యశ్వులారా! ఓ బాలకులారా! మీరు నట్టి యజ్ఞానులు. పార్థివదేహము నశించుచుండుటనాలోచింపక ప్రజల సృజింప నేల పూనుకొందురు? మీరీ దేహమవసానము నొందునని తెలియనివారగుటచే సృష్టిప్రయత్నమునకున్ముఖులైతిరి. అది మీకుఁ దెలిసినచోఁ దప్పక మీ రాయత్నమునుండి నివృత్తులై యే యుందురు. మఱియు నీశ్వర నియామ్యమగు జగంబును, సంసార బంధమునుండి తప్పించుకొనఁ దగిన యుపాయమును, జీవాత్మ కధిష్ఠానమగు హృదయబిలమును, నానారూపములు గలబుద్ధిని, దాదృశ చపలబుద్ధితో సంబంధముగల జీవ స్వరూపమును, సృష్టిని, దల్లయమును నొనర్చెడి మాయారూపమును, పంచవింశతి తత్త్వరూపమగుజీవశరీరముతోఁ గూడి బంధమోక్షములను దెలుపుకథలే ఱెక్కలుగాఁ గలదయి వజ్రనిర్మితమగుటచే మిక్కిలి దృఢమై, స్వయముగా భ్రమించుచునుండెడి కాలచక్రమును, ననేకజన్మములందు హితోపదేశము చేసి రక్షించు శాస్త్రానుకూల్యమును, దెలిసికొనమిచే నపండితులగు

మీరకటకటా! సృష్టినెట్లుగా నాచరింతురు?' అని యిట్లు పలికిన నారదుని వచనంబులువిని హర్యశ్వులు స్వభావసిద్ధ మగువిచార శక్తిగలబుద్ధిచే నమోఘమువలె దుర్భేద్యములయినతద్వచనము లను విచారపూర్వకముగా విమర్శించి తదభిప్రాయమును నిశ్చయించిరి. "అవురా! జీవునికిఁ దెలియఁదగినదై యనాదులగు పుణ్యపాప కర్మములచే నిబద్ధమైన, యీ దేహము పార్థివమని చెప్పఁబడుచున్నది. జన్మ జరామరణాదులు గలదేహములను గల్గించు కర్మబంధమును నివర్తింపఁజాలక మీఁదు మిక్కిలి సంసారమును గల్గింపఁజాలు కర్మములచే నేమి పురుషార్థము లభించును? జాగరాద్యవస్థల నతిక్రమించి, తనకుఁ దానే యాధారుఁడై, ప్రకృతిపురుషులకంటె విలక్షణుఁడై జ్ఞానాదిషడ్గుణములకుఁ బూర్ణుండై నిఖిలదోషముల నిరసించియంతరాత్మయై యుండి సమస్తమును నియమించువాఁడై సంసారమునకు శత్రునైనవఁటలు పరమాత్మ నుపాసింపవలయుననియుపదేశింపని నీచ కర్మములవలన నేమిపురుషార్థము పొందనగు? పాతాళలోకమును బొంది మిక్కిలి భోగాసక్తుఁడై మదాంధుఁడై స్వస్వరూపమును మఱచి యచ్చోటినుండి నిర్గమింపఁజాలనివానివలె జీవుఁడు హృదయబిలమును బ్రవేశించి విషయసుఖాభిలాషతో వర్తించుచుఁ, బ్రకృతివివిక్తమగుస్వస్వరూపము నెఱుంగక యాట నుండి నివర్తింపఁడు. హృదయబిలమున నుండి, స్వప్రకాశమై యున్న జీవాత్మస్వరూపమును నెఱుంగనివానికి దేవమనుష్యాదుల హృదయబిలస్వరూపమును దెలుపు నీచకార్యములచే నెట్టి పురుషార్థము సాధింపనగును? బుద్ధి పలువిధము లగువృత్తులు గలదై చపలయైనజారిణివలె రాగాదిగుణములుగలదై వర్తించు

చుండును. జీవుఁడా బుద్ధి కవసానము నెఱుంగఁ జాలకున్నాఁడు. అట్టిజీవునకు బుద్ధివివేకమును గల్గింపఁజాలని తుచ్ఛకర్మములచే నేమిపురుషార్థము సంప్రాప్తమగును? మీఁదుమిక్కిలి సంసార రూప మగునవర్థమే సంభవించు. లోకంబున నరుఁడు తన భార్య విలాసములకుఁ జిక్కి యదికోరినవస్త్రాభరణాదులను సంపాదింపఁ బాటుపడి పలుదుఃఖంబు లనుభవించుచు సంసారబంధము నొందుచుండును. అట్లే జీవుఁడు చపల యగుబుద్ధికిఁ బరవశుండై కర్మబద్ధుండై జన్మజరామరణరూప సంసారము నొందును. జీవుఁడు స్వస్వరూపమును, బుద్ధి కధీనములగు స్వర్గనరకవృత్తు లను దెలిసికొనఁజాలడు. అట్టి జీవునకు స్వర్గ నరకాదిగతులను దెలుపు నీచకర్మములవలన నేమిశ్రేయస్సు లభించును? మఱియు మాయ మహాప్రవాహమువంటిది. ఇహలోక పరలోకములు తీరములవంటివి. ప్రవాహము, స్వగత మగువస్తువును వేగవశమున నొకపరి యొకతీరమునకును వేఱొకపరి వేఱొకతీరమునకుఁ జేర్చుచుండును. అట్లే మాయయుఁ దనకధీనులగువారికి జనన మరణములను గల్గించుచు నొక్కతఱి నీలోకమును మఱియొక పరిఁ బరలోకమును జేర్చుచుండును. తాదృశమాయకుఁ బర వశుం డయి యుంటచే మత్తుఁడయి "మాయ యిహలోక పర లోకములఁ బొందించుచున్న"దని యెఱుంగక వర్తించును. అట్టి వాని కిహపరలోకప్రాప్తికి హేతువు లగుకర్మములచే నెట్టి పురుషార్థము చేకూరును? మఱియుఁ బంచవింశతి తత్త్వము లును బరమపురుషుని కద్భుత మగు శరీరమగుచున్నవి. అది పరమాత్మకు ధార్యమై యున్నదని యెఱుంగనివానికి దేహాత్మ భ్రమాదులు గల్గించుకర్మములవలన నేమిలాభము కలుగును?

ఈశ్వరుఁడు సమస్తదోషములను నిరసించువాఁడు. అతఁడు శాస్త్రముచేతనే ముఖ్యముగాఁ దెలియఁబడువాఁడు. అతఁడు ప్రవృత్తిధర్మము నాచరించుటచే బంధమును,నివృత్తిధర్మ మాచరించుటచే మోక్షమును గల్గించువాఁడు. అతఁడు సమస్తజీవుల హృదయకుహరమునందును వర్తించును. ఈశ్వరుఁ డట్టివాఁడని తెలియనివారి కీశ్వరగుణములఁ బ్రతిపాదింపని కర్మములతో నేమిప్రయోజనము? మఱియుఁ గాలచక్రము బ్రహ్మమొదలు స్తంబపర్యంతముగల సమస్తమును నశింపఁజేయును. అది గర్భజన్మ జరామరణాదులను గల్గించునదగుటచే దుస్సహమైనది.అది యొకరికి వశముగాక వర్తించుచుండును. అట్టి కాలచక్రము నెఱుంగనివారికిఁ గాలవశ్యత్వమును దెలుపు కర్మములవలన నేమి లాభమున్నది? ఇంతియకాక శాస్త్రము హితముపపాదించుచున్నదికాని సర్వమునకును దండ్రివంటిది.అది ప్రవృత్తిధర్మముల మఱపించును. అట్టిశాస్త్రము నెఱుంగక శబ్దాదివిషయములందు విశ్వాసముగలవాఁడు శాస్త్రానుశాసనమున కాను కూల్యము నిమిత్తము సృష్ట్యాదులం దెట్టుగాఁ బ్రవర్తించును? నివృత్తిధర్మబోధకశాస్త్రము ననుసరించువాఁడు సృష్టికై ప్రయత్నింపనే ప్రయత్నింపఁడు.' అని యిట్లు హర్యశ్వు లందఱు నేకచిత్తులై నారదునివచనంబులు విమర్శించుకొని నారదునిఁ బరిక్రమించి యరిగి బ్రహ్మోపాసనముచే ముక్తినిఁబొందిరి. ఆ నారదుఁడును బ్రహ్మసాన్నిధ్యమునుగల్గించువీణాస్వరమందును, బ్రసన్నుఁడయిన హరిపాదపద్మములందును, దనచిత్తము నవిచ్ఛిన్నభక్తితోఁ బ్రవేశింపఁజేసి యెప్పటివలె లోకములందుఁ బరిభ్రమింప నారంభించెను. అనంతరము దక్షుఁడు సుశీలురయిన

దనపుత్త్రులు నారదోపదేశమునఁ దానాజ్ఞాపించిన సృష్ట్యుద్యోగ మును మాని మా_క్తిమార్గమునవలంబించినట్లు విని శోకించుచుఁ 'బుత్త్రులుగలవారు శోకములకుఁ దావయి యుందు'రన్న లోకో_క్తిని స్మరించుకొని దుఃఖింప నారంభించెను. అట్లు దుఃఖించుచు దక్షుండును బ్రహ్మవచనములవలన శాంతించి పాంచజనియందు మఁగుడ శబళాశ్వ లనునామములుగలవేవురుపుత్త్రులను బుట్టించెను. ఆశబళాశ్వులును "ప్రజాసృష్టిచేయుఁ"డని తండ్రిచే నాజ్ఞాపితులై నియమపరులయి, తమపూర్వు లగుహర్యశ్వులు సిద్ధిఁబొందిన నారాయణసరమున కేగిరి. వా రక్కేగి యాతీర్థోదక స్పర్శమువలననే సమ_స్తపాపములనునశింపఁజేసికొనినిర్మలచిత్తులై యుత్కృష్ట మగుప్రణవమును జపించుచు,నచ్చట నత్యుగ్ర మగుతపం బాచరింప మొదలిడిరి. వారు కొన్నిమాసములు జలమునుమాత్రమే త్రావుచు, మఱి కొన్నిమాసములు వాయువునుమాత్రమే భక్షించుచు,నీమంత్రము నుచ్చరించుచు మంత్రాధిదేవత యగుభగవంతు నారాధించిరి. ఆమంత్రము"ఓంనమో నారాయణాయ" అనునది. దానిని జపించుచు "ఓపరమేశ్వరా! జీవసమూహమునకుఁ బ్రాప్యుఁడవును, బ్రాపకుఁడవును, నాధారుఁడవును. సమ_స్తజీవుల హృదయకమలములందుఁ బ్రవేశించి నియమించుచు,రజ_స్తమంబులచే నుపహతముకాని స్థానముగల్గి కల్యాణగుణాత్మకుఁడవయిసమ_స్తదోషములనిరసించుచు వర్తించు నీకు నమస్కారము. అట్టి నిన్ను ధ్యానముచేయుదుము" అని యిట్లు నారాయణమంత్రమును జపించుచుఁ బ్రజాసృష్టినొనర్పఁ దత్పరులయి యున్నచో నాశబళాశ్వులదరికి నారదముని మగుడ వచ్చి పూర్వమువలె వారికిఁగూడ నివృత్తిమార్గము నుపదే

దీర్పనివారికి ముక్తియే లేదు. ఓరీపాపీ! నారదా! విషయభోగాదులందు విరక్తిపుట్టించినవాఁడవగుటచే నాపుత్త్రుల కిహలోక శ్రేయస్సు చెఱిచితివి. విషయపూర్వక మగుభోగము లేనివారు మోక్షమం దధికారులు కారు. కావున వారికిఁ బరలోక శ్రేయస్సును జెఱిచితివి. ఓదుష్టా! ఇట్లు బాలకులబుద్ధిని జలింపఁజేసిన వాఁడవయి కృపారహితుఁడవై హరియశమును నశింపఁజేసి వర్తించునీవు సిగ్గుమాలి హరిభక్తులలో నెట్లు సంచరించుచున్నావు? ఓనారదా! భగవద్భక్తులందఱును భూతానుగ్రహము గలిగి వర్తించుచుండ నీవు భూతవిప్రియకారివై యున్నావు. నీకు సిగ్గులేదా ? మఱియు వైరము లేనివారికి వైరము గల్పించి స్నేహములను దొలఁగించు దురాత్ముండవు నీవుదక్క వేఱొక్కరుండు లేఁడు. విషయాసక్తిరూపమగు స్నేహపాశమును ఛేదించుటయే వైరాగ్య మని తలంచుచున్నావు. అది జ్ఞానమువలన సంభవించునుగాని నీవంటియసాధువుల దురుపదేశముచే మతి చలించినంతమాత్రమున వైరాగ్యము గలుగ నేరదుసుమా? విషయసుఖము లనుభవించి తదీయ దుఃఖమ్ములను దెలిసికొని స్వయముగా విరక్తిచెందువానివలెఁ బరోపదేశమునఁ జంచలబుద్ధిగలవాఁడు విరక్తినొందనేరఁడు. కావున నీవు కర్మాసక్తచిత్తులమయి యొరులకు విప్రియము చేయఁదలంపక యున్న గృహస్థుల మగుమాకు దుస్సహ మగు నపకార మొనర్చితివి. దానిని మేము సహింపఁజాలము. ఓసంతానవిచ్ఛేదకా! ఏ హేతువువలన నీవు నాపుత్త్ర నాశనము గావించి వర్తించితివో యదికారణమున, ఓమూఢా! సర్వలోకములందును నెల్లప్పుడును భ్రమించుచునే యుండువుగాక. నీవొకస్థలముననైనను జిరకాలము

నివసింపక వర్తింతువుగాక" యని నారదునకు శాపమొసంగెను. అంత సాధుసమ్మతుఁడయిన నారదుఁ డాశాపమును స్వీకరించెనే కాని ప్రతిశాపమునొసంగ సమర్థుఁడయినను మాఱాడక సహించెను. ప్రతిశాపము నీయకుండుటచేత నే నారదుని సాధుత్వము తెలియవచ్చుచున్నది. ఇది యైదవయధ్యాయము.

---

శుకుఁడు దక్షసంతతిని కశ్యపసంతతిని దెలుపుట.

ఓరాజేంద్రా! పుత్త్రనాశమువలన విమనస్కుఁడయియున్న దక్షునొద్దకుఁ జతుర్ముఖుం డరుదెంచి యతనిదుఃఖము నుపశమింపఁజేసి ప్రజాసర్గోపాయమును జెప్పెను. అంత దక్షుఁడు విచారము విడిచి సృష్టికున్ముఖుఁడయి యసిక్ని యనుభార్యయందుఁ బితృవత్సలలయిన యఱువదిమందికుమారికలఁ బడసెను. ఆయఱువదిమందిలోను బదుగురుకన్యలను ధర్మునకొసంగెను. పదుమూఁగురు తనయలను గశ్యపునకిచ్చెను. ఇరువదియేడుగురఁ జంద్రున కొసంగెను. రుద్రునకును, నంగిరసునకును, గృశాశ్వునకును, నిద్దఱేసి కన్యకల నిచ్చెను. మిగిలినవల్వురను, దార్క్ష్యుఁడను దేవున కొసంగెను. ఓరాజా! ఎవరి సంతానములచే ముల్లోకములును నిండినవో యా దక్షకన్యకలయు వారి సంతానములయు నామధేయములను వినుము. ధర్ముఁడు దక్షుఁ డొసంగిన భానువు, లంబయు, కకుప్పును, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు వసువును, ముహూర్తయు, సంకల్పయు, నాఁబడు పదువురను బరిణయమయి యందు భానువువలన వేదుండును, ఋషభుండునునను నిద్దఱుపుత్త్రులఁ గాంచెను. అందు ఋషభునివలన నింద్రసేనుం

డుదయింబండె. రాజా! లంబవలన విద్యోతుండనువానిని బడ సెను.ఆవిద్యోతునకు స్తనయిత్నువు లనుకొందఱుసుతులుగలిగిరి. ధర్మునకుఁ గకుప్పనెడి భార్యయందుఁ గీకటుఁడు గలిగె. వానికి సంకటుఁ డుదయించె. ధర్మునకు జామియందు దుర్గాభిమాని దేవతలు గొందఱుదయించిరి. వారికి స్వర్గుండును,నందియునుద్భ వించిరి. ధర్మునకు విశ్వయనుభార్యయందు విశ్వేదేవు లనువారు పుట్టిరి. ఆవిశ్వేదేవతలకు సంతానములేదని చెప్పుదురు. సాధ్య యను కళత్రమునకు సాధ్యగణముదయించెను. వానికర్థసిద్ధుండు జన్మించె. ధర్మునకు మరుత్వతియందు మరుత్వంతుఁడును జయం తుఁడును గల్గిరి. అందు జయంతుఁడు వాసుదేవాంశమువలన జన్మించిన యుపేంద్రుఁడనియే చెప్పుదురు. ముహూర్తవలన నతఁడు ముహూర్తాభిమాను లగుదేవగణములను బడసెను. వారు తమతమ ముహూర్తకాలములందుఁ గల్గెడు సుఖదుఃఖ రూప ఫలమును సమస్తభూతములకు నొసంగు మౌహూర్తికు లనఁబడిరి. ధర్మునకు సంకల్ప యనుభార్యయందు సంకల్పుఁడను వాఁడుదయించె. ఆసంకల్పునకుఁ గాముఁడుదయించె. ధర్మునకు వసువునం దష్టవసువులు జన్మించిరి. వారు క్రమముగా, ద్రోణుఁ డనియుఁ,బ్రాణుఁడనియు, ధ్రువుఁడనియు, నర్కుఁడనియు,నగ్ని యనియు, దోషుఁ డనియు, వసువనియు, విభావసువనియు నా మంబులు వహించిరి. అందుద్రోణునకభిమతియనుభార్యయందు హర్షుఁడు, శోకుఁడు, భయుఁడు, మొదలగువా రుదయించిరి. ప్రా ణునకు కూర్జస్వతి యనుకళత్రమున సహుండును, నాయువును, బురోజవుఁడును సంభవించిరి. ధ్రువునకు ధరణి యనుభార్య గలదు. ఆమె కతనివలనఁ బురాభిమాని దేవతలు పెక్కు రుద

యించిరి. అర్కునకశనయను భార్యయందుఁ దర్షాదు లనఁబడు పుత్త్రులుదయించిరి.అగ్నికి వసోర్ధారయనుకళత్రమువలనద్రవిణ కుఁడు మొదలగు కుమారులును గల్గిరి. ఆయగ్నికే కృత్తిక లందు స్కందుఁడుద్భవించె.కావున నతనికి షాణ్మాతురుఁడనియుఁ గార్తికేయుఁడనియు, నగ్నిభువనియు నామములుగలిగె.ఆస్కం దునకు విశాఖాదు లుదయించిరి. దోషుఁ డనువసువునకు శర్వరి యను భార్యయందు నారాయణాంశమువలన శింశుమారుఁడుద యించె. వసువున కాంగీరసి యనుభార్యయందు విశ్వకర్ముఁడను పుత్త్రుండు గలిగె. వాఁడు శిల్పాచార్యుం డని ప్రసిద్ధిగాంచె. ఆ విశ్వకర్మునికిఁ జాక్షుషుఁడను మనువుదయించె. అతనికి విశ్వులు సాధ్యులునవెడికుమారులు పెక్కురుగల్గిరి.విభావసుఁ డుషయను భార్యయందు వ్యుష్టుని,రోచిస్సును,నాతపునిఁ గనియె.అం దాత పునకుఁ బంచయామఁడను దినాభిమానిదేవత యుదయించె.ఆ పంచయామునందే సమస్తభూతములును దమతమవ్యాపారము లందు జాగ కులయి వర్తించుచున్నారు. ఓరాజా! ధర్మున కొసంగిన పదువురుదక్షుపుత్త్రికలవలన నుదయించినసంతానము లివి. కశ్యపచంద్రుల కొసంగిన దక్షకన్యల సంతానవృద్ధి పిమ్మటఁ జెప్పెదను. శంభునిభార్య యగు సరూప కోట్లసంఖ్యగల రుద్ర గణములను గనెను. ఆరుద్రగణములకుఁ బదునొకండ్రు నాయకు లయిరి. వారినే యేకాదశరుద్రు లందురు. వారు క్రమముగా, రైవతుండును, నజుండును, భవుండును, భీముండును, వాముం డును,నుగ్రుండును,వృషాకపియు నజైకపాత్తును,నహిర్బుధ్న్యుం డును, బహురూపుఁడును, మహాంతుఁడును నను నామంబులతో విలసిల్లిరి.వీరుగాక రుద్రపారిషదగణములు భయంకరరూపులయి

ప్రేతులు వినాయకులు నాఁబడునవి గొన్నిగలవు. ఈపార్షదగణములు రుద్రున కన్య యను భార్యయందుఁ బుట్టె. అంగిరసుఁడు దక్షుఁడొసంగిన యిరువురుకన్యలను జేపట్టి యందు స్వధయను దానియందు, బితృగణంబులునుసతియనుదానియందు నధర్వాంగిరసుఁడనెడి వేదాభిమాని యగుపురుషునిఁ గనెను. కృశాశ్వుఁడర్చిస్సను భార్యయందు ధూమ్రకేశుని, భీషణ యనుభార్యయందు వేదశిరుండు, దేవలుండు, వయునుండు, మనువు నాఁబడు పుత్త్రులను బుట్టించెను. తార్క్ష్యునకు దక్షుండిచ్చిన నల్వురు పుత్త్రికలలోను బతంగి యనుభార్యయందుఁ బతగు లుద్భవించిరి. యామినియందు శలభులుగలిగిరి. సుపర్ణ యను నామాంతరముగల వినతయందునారాయణునకువాహనమయిన గరుత్మంతుఁడు, సూర్యసారథి యైనయనూరుఁడును, గల్గిరి. కద్రువ పలువిధము లగునాగులనుగనియె. ఓరాజేంద్రా! చంద్రుఁడు కృత్తికాదులగు నిరువదియేడ్వురను జేపట్టెను. కాని యతఁడఁదులో రోహిణినిమాత్రమే యెక్కుడుగాఁ బ్రేమించి తక్కినవారి నుపేక్షించె. దక్షుం డదియెఱిఁగి క్షయరోగపీడితుఁడ వగుదువుగాక యని శపించె. అందువలనఁ జంద్రుఁడు తద్రోగపీడితుఁడై, కృత్తికాదులందు సంతానము వడయలేకపోయె. పిమ్మట నతఁడు దక్షునిఁ బ్రసన్నునిఁగాఁ జేసికొని కృష్ణపక్షమందు క్షయమునొందుచున్న కళలనుమాత్రము పొందఁగలిగెను. ఓనరపాలా! కశ్యపభార్యల సంతానములవలననే యీజగమంతయుఁబూరితమయ్యె. వారినామములను వర్ణించెద వినుము. కశ్యపుఁడట్లదితిని, దితిని, దనువును, గాష్ఠను, నరిష్టను, సురసను, నిళను, మునిని, గ్రోధవశను, దామ్రను, సురభిని, సరమను, దిమిని బరిగ్రహించె

నని చెప్పితిఁగదా ! అందుఁ దిమివలన యాదోగణములు సంభ
వించె. సరమవలన శునకములును వ్యాఘ్రములును, మార్జా
లములు మొదలగునవియు నుద్భవించెను.సురభివలన మహిషము
లును, గోవులును, మఱియుఁ దక్కిన చీల్పఁబడిన డెక్కలుగల
వియు జన్మించె.తామ్రవలన శ్యేనము, గృధ్రము మొదలగునవి
జనించె. మునివలన నచ్చరల సమూహములు ప్రభవించె. ఓ
రాజా ! క్రోధవశవలన దంశనస్వభావము గల సర్పాదులు
పుట్టెడమె.ఇలవలన సమస్తమగువృక్షములును సంభవించె. సురస
వలన యాతుధాను లుదయించిరి. అరిష్టవలన గంధర్వులు సం
భవించిరి. కాష్ఠవలన నశ్వ గర్దభాదులు ప్రభవించెను. దనువు
వలన నఱువదియొక్కరు పుత్త్రులు గల్గిరి. వారిలోఁ బ్రధానులు
పదునెనమండ్రు గలరు. వారు క్రమముగా, ద్విమూర్ధుఁడును,
శంబరుండును, వరిష్ఠుండును, హయగ్రీవుండును, విభావసుం
డును, నయోముఖుండును, శంకుశిరుండును, స్వర్భానువును,
గపిలుండును, నరుణుండును, పులోముండును, వృషపర్వుఁడును,
నేకచక్రుఁడును,సుతాపనుఁడును, ధూమ్రకేశుఁడును, విరూపా
క్షుఁడును, విప్రచిత్తియు, దుర్జయుండును, నను నామములచే
నొప్పువారు.వీరిలో స్వర్భానువుకుమారియగుసు ప్రభను నముచి
వివాహమాడెను. బలవంతుఁడును, నహుషకుమారుండును నగు
యయాతి వృషపర్వునికూఁతునుశర్మిష్ఠను బెండ్లియాడెను. వసు
కుమారుఁడయినవైశ్వానరునికిసౌందర్యవతులగునల్వురుకుమారి
కలుగలరు.వారిలోనుపదానవిని హిరణ్యాక్షుండును,క్రతువు హ
యశిరసను, బ్రహ్మచోదితుఁ డయినకశ్యపుఁడు పులోమా కాలక ల
ను, గ్రమముగా నుద్వాహమైరి. అందుఁ బులోమా కాలకలకు

పౌలోమకాలకేయులను నఱువదివేవురు దానవు లుదయించిరి. వారు సమరవిక్రములయినిరంకుశులై యాగంబులఁ జెఱుచుచు వర్తింపఁ గార్యవశమున స్వర్గలోకమున కేఁగి నీ తాత యగు నర్జునుండు దేవేంద్రుని యనుమతిఁ జొప్పున వారి నందఱను సంహరించెను. విప్రచిత్తి సింహికను బరిణయమయి నూఱువురు రాక్షసులను గాంచెను. ఆ నూర్వురలోను రాహువనువాఁడు జ్యేష్ఠుఁడు. వాఁడు దానవుఁడయినను భగవదనుగ్రహమువలన గ్రహాత్వమును బొందెను. ఓరాజేంద్రా ! ఏవంశమందు నారాయణుండు స్వాంశముచే నవతరించెనో, యాయదితివంశమును వర్ణించెద. సావకాశుఁడవయి వినుము. అదితికి వివస్వంతుండును, నర్యముఁడును, బూషుండుఁ, ద్వష్టయు, సవితయు, భగుండును, ధాతయు విధాతయు, వరుణుండును, మిత్రుండును, శక్రుండును, నురుక్రముండును ననెడి పన్నిద్దఱు పుత్త్రులుగల్గిరి. వివస్వంతుఁడు సంజ్ఞయను భార్యయందు శ్రాద్ధదేవుని, యమయములనెడి యొక మిథునమును గనియెను. ఆసంజ్ఞయే బడబారూపము నొంది వర్తించుచు నశ్విదేవతలను గనియె. ఛాయ యనుభార్యయందు శనైశ్చరుండును, సావర్ణిమనువును, ధపతి యనుకన్యకయుఁ గల్గిరి. ఆతపతి సంవరణునిఁ బతిగా వరించె. అర్యమునకు మాతృక యనుభార్యగలదు. వారిరువురకును గర్షణీలు రయినజనులు గల్గిరి. వారిమూలముననే మానుషజాతి భూమిపై స్థిరంబుగా బ్రహ్మచేఁ గల్పితంబయ్యె. పూషుండు పూర్వము దక్షునితోఁగలహించిన శంకరునింజూచి దంతములు వెలువడునట్లు నవ్వెను. పిమ్మట యాగధ్వంసకాలమున రుద్రపార్షదులు వానిదంతంబుఁ లూడ్చిరి. అందువలనవాఁడుబోసినోటివాఁడయి పిష్టమునుదినుచు

నపత్యరహితుఁ డయియుండె. త్వష్టకు దానవులకు సోదరియగు రచన యనుభార్య గలదు. వారిరువురకును వీర్యవంతుఁడయిన విశ్వరూపుండు సంభవించె. బృహస్పతి యవమానితుఁడై తొలఁగిపోయినప్పుడు సురగణంబులు తమ శత్రువులగు దానవులకు భాగినేయుఁడయినను నా విశ్వరూపునిఁ బురోహితునిఁగాఁ జేసికొనిరి. ఇది యాఱవయధ్యాయము.



ఇంద్రుండు బృహస్పతిని దిరస్కరించుట; ఇంద్రుఁడు తానొనర్చిన బృహస్పతి తిరస్కారమునకు వగచుట; సురలు విశ్వరూపు నాచార్యుని గావరించుట; విశ్వరూపుఁడు సురల కాచార్యుండగుట.

అనిన విని రాజు యోగీంద్రునింజూచి "ఓమునీంద్రా! సురాచార్యుఁడయిన బృహస్పతి తన శిష్యులగు సురలను విడిచి చనుటకుఁగత మేమి? శిష్యులు గురువున కేదియో యప్రియముచేసియుండవలయును. లేనిచోనతఁడు వారిని విడిచిపెట్టఁడు. కావునశిష్యులు చేసినయక్రమమునువర్ణించిచెప్పు"మనియడుగ శుకుండిట్లనియె. 'ఓరాజేంద్రా!ఇంద్రుఁడు ముజ్జగంబుల కధిపతి కావునఁ దదైశ్వర్యమదముచే సన్మార్గమును విడిచి మరుద్గణములచేతను, నేకాదశరుద్రులచేతను నష్టవసువులచేతను నాదిత్యులచేతను, మునులచేతను బరివృతుఁడై విశ్వేదేవులును, సాధ్యులును నశ్వినీకుమారులును, బలసి కొలుచుచుండ, సిద్ధులును, జారణులును, గంధర్వులును, బ్రహ్మవాదు లగుమునులును, విద్యాధరులును, నచ్చరలును, గిన్నరులును, బతగులును, నాగులును నుతించుచు సేవించుచునుండ, నందఱును మనోహరముగా గాన మొనర్చుచుం

డఁగా సింహాసనాసీనుండై చంద్రమండలమువలె సుందర మగు శ్వేతాతపత్రములును, మనోహరము లగుచామరములును మహా రాజచిహ్నముల సూచింప, నర్ధాసనమందు శచీదేవి విరాజిలు చుండఁ బేరోలగం బున్నసమయంబున దేవతలకును దనకును గురువై, పరమపూజ్యుఁడయి సురాసుర నమస్కృతుఁడైన బృహస్పతి సభలోనికి విచ్చేసెను. ఇంద్రుఁ డతనిఁజూచియు నాసన మునుండి లేవలేదు; ఆదరముతో నమస్కారాదియుక్త కర్మ ములాచరింపలేదు. అంత విద్వాంసుఁడును, సమర్థుఁడును నగుబృహ స్పతి యింద్రుని మదాంధత్వమును గనుఁగొని మాటాడక తన గృహంబున కరిగెను. ఇంద్రుఁడు తదుత్తర క్షణమందే తా నొనర్చిన గురుహేళనమును నెఱింగి విచారించుచు నాసభ యందే తన్నిట్లు నిందించుకొనెను. "అకటా! మహాకష్టము సం ప్రాప్తమైనది! అయ్యో! నేను మిక్కిలి యసాధుకర్మ మాచరించి తిని. ఐశ్వర్యమత్తుండనై నేను గురుతిరస్కారము గావించితిని. నాకంటె నల్పబుద్ధి లోకంబునఁ గలఁడా? సాత్త్విక స్వభావు లయిన దేవతలకు నే నీశ్వరుఁడనయ్యు రాక్షసస్వభావముగలవాఁ డనైతి. నన్నింతకుఁ దెచ్చినదీ యైశ్వర్యమే కదా? నిత్యానిత్యవివేక సంపన్నుఁడయినవాఁ డెవ్వఁడు సత్యలోకాధిపతి లక్ష్మినైన నపే క్షించును? సింహాసనస్థుఁడయిన మహారాజు ప్రత్యుత్థానాదిక మును జేయ నవసరము లేదని వృద్ధులు పలుకుదురు. కాని యట్లు చెప్పెడివారు ధర్మజ్ఞులుకారని నామతము. ఒకవేళ నట్టి కుమార్గో పదేశము చేయువారి వచనంబుల నెవ్వఁ డాదరించునో వాఁడు శిలానావ నధిరూఢుం డయినవాఁ డడుగంటు మునిఁగినట్లు నరకం బుల మునుంగును. కావున నేనుబోయి శాఠ్యమును విడిచి నాశిర

స్పతని పాదములు సోఁకునట్లు మ్రొక్కి మాయాచార్యుఁడగు బృహస్పతినిఁ బ్రసన్నునిఁగాఁ జేసికొందును" అని యిట్లు దేవేంద్రుఁడు చింతించుచుండ బృహస్పతి యోగప్రభావముచే గృహమందుఁ దిరోహితుండయ్యె. పిమ్మట నిం ద్రుండు గురుసందర్శనోపాయ మాలోచించియును బడయనేరక బుద్ధిచే దానినే చింతించుచు శోకయుక్తుఁడయి సుఖమును జెందలేక పోయెను. గురువును గానక చింతించుచున్న యింద్రునింగాంచి యదియే తగిన యుద్ధసమయమని యెంచి శుక్రుండు ప్రోత్సాహింప రాక్షసులందఱును దుర్మదులై క్రూరకర్మపరులై దేవతలతో సమరమొనర్పసమకట్టిరి. ఆయుద్ధమున దానవులు ప్రయోగించిన తీవ్రములయిన శరపరంపరలచే ఖండితావయవులై దేవత లింద్రునిఁ బురస్కరించుకొని యవనతవదనములతోఁ బోయి బ్రహ్మను శరణుఁజొచ్చిరి. అంతఁ గమలాసనుండు శత్రుపీడితు లయిన దేవతలను జూచి మిక్కిలి జాలిపడి వారి నిట్లూరడించెను. "ఓసురశ్రేష్ఠులారా! అక్కటా! మీరు గొప్పయపరాధము చేసితిరి. కావుననే మీ కింతటి గొప్ప కష్టము సంప్రాప్తమైనది. ఆలోచింప బ్రహ్మజ్ఞానసంపన్నుఁడును జితేంద్రియుండునునగు బృహస్పతి నవమానించుట మహాపరాధముగదా? మీరొనర్చిన గురుతిరస్కార రూప మగుమహాపరాధమునకే శత్రుపరాభవము ఫలమని తలపోయుఁడు. కానిచో నైశ్వర్యరహితు లయిన మీశత్రువు లైశ్వర్య సంపన్ను లయిన మిమ్ము జయించుట యెట్లు పొసఁగును! ఓయింద్రా! మీశత్రువులును మొదట గురుతిరస్కారము వలననే క్షీణబలు లయిరి. కాని యిప్పుడు భక్తితో శుక్రునారాధించి బలసమృద్ధులయిరని యెఱుంగుము.

మఱియు శుక్రుని దేవతగా భావించు చున్నయాదైత్యులు బల శాలులయి గర్వితులై నేఁడో, ఱేపో, యెల్లుండియో నానిలయ మును గూడ నాక్రమింపక మానరు. భార్గవశిష్యు లయినవారు గూఢాలోచన పరులై యాత్రివిష్టపమును లెక్కింపరు. మఱియు వారు విప్రులను, గోవిందుని, గోవులను దిరస్కరింపక మానరు. అప్పుడు వారిని దప్పక దుఃఖంబులు చుట్టు ముట్టును. కావున నింక మీరు త్వష్టకుమారుండును, జితేంద్రియుఁడును దపస్వియు నగువిశ్వరూపునిఁ బురోహితునిఁగా వరింపుఁడు. ప్రాజ్ఞుఁ డయిన యావిశ్వరూపుఁడు మీయభిలషితములను నెఱవేర్పఁ గలఁడు. ఒకప్పుడు విశ్వరూపుఁడు దానవపక్షపాతము నుజూపినను మీరు సహింపుడు" అని బ్రహ్మ పలికిన వచనంబులచే బాధా రహితులయి సంతుష్టులై దేవతలు విశ్వరూపుని సమీపించి యాలింగనము చేసికొని యిట్లనిరి. 'ఓమునివర్యా! మేము నీకతిథులుగా వచ్చితిమి. మాకాతిథ్య మిచ్చుటచే నీయాశ్రమము శుభప్రదమగుఁగాక. ఇందువలన నీపితృదేవతల మగుమాకు సమయోచిత మగుసర్థము సమకూడుఁగాక. పుత్రవంతులైన వారికిఁ గూడఁ బితృశుశ్రూషణముకంటె నుత్కృష్టధర్మము వేఱొకటి లేదని చెప్పనొప్పునప్పుడు బ్రహ్మచారులకది పరమ ధర్మమని వేఱ చెప్పవలయునా? ఆచార్యుఁడు భగవద్దృష్టిచే నారాధింపఁ దగిన వాఁడు. తండ్రి విధాతవలె నారాధనీయుఁడు. సోదరుఁడు దేవేంద్రునిగతిఁ బూజనీయుఁడు. తల్లి భూదేవివలెఁ బూజనీయురాలు. సోదరి దయాస్వరూపురాలు. తాను ధర్మము రెండవరూపము. అతిథి తనరూపమేకాని వేఱుకాదు. అభ్యాగతుఁడు వహ్నిస్వరూపుఁడు. సమస్తభూతములును దనతో సమానములుగాఁ

జూడవలయును. కావున నీపితృదేవతల మగు మేము శత్రుపీడితు లమయి నీకతిథులమై వచ్చితిమి. అందువలన నీకు మే మత్యాదర ణీయులము. నీ తపఃప్రభావముచే శత్రుతిరస్కారరూప మగు మాదుఃఖమును దొలంగించి మాసందేశమును జేయనర్హుండవు. ఓమునితిలకా ! బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడవును బ్రాహ్మణుఁడవును సమస్తవర్ణములకు గురువవును నగునిన్ను నుపాధ్యాయునిఁగా వరించితిమేని మేము తప్పక సులభముగా శత్రువులను జయింపఁ గలుగుదుము. నీవట్లుండుట కనుగ్రహింపుము. ఇదిగో నీకు నమ స్కరించుచున్నవారము. స్వప్రయోజనమును నెఱవేర్చుకొనఁ దమకంటెఁ గనిష్ఠుఁ డగువాని పాదములకు మ్రొక్కినను నిందా ర్హులుగారు. మఱియు వేదాధ్యయనసంపన్నులు చిన్నవా రయి నను జ్యేష్ఠులు; కాని యేండ్లుమీఱినవారు జ్యేష్ఠులుగారు. నీవు చిన్నవాఁడవయినను వేదజ్ఞుఁడవగుటవలన మాకుఁ దప్పక వంద నీయుఁడవే" అని యిట్లు దేవగణములు దమకుఁ బురోహితుఁడ వయి యుండవలయునని కోరఁగా మహాతపశ్శాలి యగువిశ్వ రూపుఁడు నవ్వుచు మృదువచనములతో వారికిట్లనియె! 'ఓవిబు ధులారా ! పౌరోహిత్యమును ధర్మశీలురు నిందించుచుందురు. అది బ్రహ్మవర్చసమును నశింపఁ జేయుచుండును. అది యట్టిదయి నను లోకాధిపతులగు మీరు ప్రార్థించుచుండఁ బితృసేవాపరా యణుఁ డయిననావంటివాఁడు నిరసింపఁగలఁడా ! మఱియు లో కాధిపతు లగుమీరు శిష్యనిరతుకునిఁగా నియోగించుటయేపర మార్థముగదా ! ఆలోచింపఁ బౌరోహిత్య మవలంబించుటవలన ధనము, దానివలన ధర్మమును సిద్ధించుచున్నవి. కానినిష్కాముల కాధనముతో నవసరములేదు. వారికి శిలవృత్తిచే సంపాదించిన

ధనమే ధర్మాదులు నిర్వర్తింపఁజాలును.పౌరోహిత్యము దుర్మతులకు సంతోష హేతు వగును గాని మావంటివారికిఁ గాదు. "ఓవిబుధులారా! అట్టి గర్హితకర్మము నేనెట్లు చేయుదును? అయినను బితృదేవతలును బూజ్యులునగు మీప్రార్థనమును నేను నిరసింపఁజాలను. నేను ధర్మములచేతను, బ్రాణములచేతను మీయభిలషితమును సాధించెదను" అనిపలికి మహాతపస్వియైనవిశ్వరూపుఁడు సావధాన చిత్తముతోఁ బౌరోహిత్యము నంగీకరించి శుక్రుని నీతిచాతుర్యముచే సురక్షిత మగుచున్నను దైత్యుల సంపదను నారాయణకవచరూపక మగుమంత్రబలముచే నాకర్షించి యింద్రున కొసంగెను. అనంతరము నిరుపమబుద్ధిశాలియైనవిశ్వరూపుఁడు నారాయణకవచ మంత్రమును నింద్రునకుపదేశింప నతఁడు దానివలన సురక్షితుఁడై సమర్థుఁడై రాక్షససైన్యములఁ దునుమాడెను " అని చెప్పెను. ఇది యేడవయధ్యాయము,

---

నారాయణకవచ ప్రారంభము.

అదివిని రాజేంద్రుండు యోగీంద్రుంజూచి "ఓయోగీశ్వరా! ఇంద్రుఁడు విష్ణువిద్యచే సంరక్షితుఁడై వాహనసహితు లగుశత్రువులను లీలగాజయించి త్రైలోక్యలక్ష్మిననుభవించె నని చెప్పితివి. అందుల కా నారాయణకవచప్రభావమే ముఖ్యముగదా! ఆతతాయు లగుశత్రువుల నవలీల యుద్ధమున జయింపఁజాలు సామర్థ్య మొసంగిన యానారాయణకవచమును నాకుపదేశింపుము" అని యడిగిన రాజునకతం డిట్లనియె. 'ఓరాజా! దేవతలకుఁబురోహితుఁ డయినవిశ్వరూపుఁడు తన్నడుగుచున్న మహేంద్రునకు

నారాయణకవచము నుపదేశించెను. దాని నీకుఁ జెప్పెద సావధానచిత్తుండవయి యాలింపుము. విశ్వరూపుఁడింద్రునకిట్లు చెప్పె. 'ఓమహేంద్రా! స్నానాదుల నాచరించి కాలుసేతులను గడిగికొని పురుషుఁడు దర్భపవిత్రము నుంచుకొని యుదఙ్ముఖుఁడై యుపవేశించి యాచమనంబుగావించి వాక్కును బంధించి నారాయణాష్టాక్షర మంత్రముచేతను,వాసుదేవ ద్వాదశాక్షరమంత్రముచేతను,నంగన్యాస కరన్యాసముల నొనర్చి యాధ్యాత్మికాది తాపత్రయమువలన నేదేని భయము సంప్రాప్తమైనచో స్వయముగా నారాయణ ప్రతిపాదనముచేఁ బ్రచురమై కవచమువలె సంరక్షకమయియున్న మంత్రమును జపింపవలయును.అంగన్యాస కరన్యాసములొనర్చుట యెట్లనఁగాఁబురుషుఁ"డోన్నమోనారాయణాయ"యనెడి యెనిమిది యక్షరములనుబ్రణవసంపుటితములనుగాఁ జేసి క్రమముగా శిరమునందును,ముఖమందును,వక్షస్థలమందును, నుదరమందును, దొడలయందును, జానువులందును, పాదములందును, నంగన్యాసము చేయవలయును. అట్లె "ఓన్నమో భగవతే వాసుదేవాయ" యను ద్వాదశాక్షరవిద్యగలయక్షరములను బ్రణవసంపుటితముగాఁజేసి క్రమముగా రెండేసి యంగుష్ఠపర్వములందును,దర్జన్యాదులగు నాలుగేసి వ్రేళ్లయందునుఁ గరన్యాసము చేయవలయును. మఱియు విష్ణుషడక్షరీమంత్రమునం గలయక్షరములను బ్రణవయుక్తములుగాఁ జేసి హృదయమం దోంకారమును, వికారమును మూర్ధమందును, షకారమును భ్రూమధ్యమందును,ణకారమును శిఖయందును, వేకారమును నేత్రములందును, నకారమును సమస్తసంధులయందును, విన్యసించి మిగిలినమకారవిసర్గమును షడంతముగాఁజేసి.

దిగ్బంధనము చేయవలయు. ఇట్లుచేసినచో జప్త చెప్పఁబడినషడ క్షరియు, నష్టాక్షరియు, ద్వాదశాక్షరియు ననెడిమంత్రత్రయము ను నావృత్తిచేయ యోగ్యుండగును. పిమ్మట నతఁడు ధ్యానయో గ్యుఁడును, జ్ఞానాది షడ్గుణములతోను, నపృథక్సిద్ధంబు లగుశక్తు లతోను గూడిన పరమాత్మను ధ్యానముచేసి జ్ఞానమునకును, ప్రభావమునకును, సత్కర్మములకును, నాధారమయిననారాయణ వర్మమంత్రమును జపించుచు, "నేతన్మంత్ర ప్రతిపాద్యుఁడై, నాశ్రితులకష్టములను హరించుచు, గరుత్మంతునిమూఁపుపై పాద పద్మములనుంచి, శంఖచక్రములను, డాలును, ఖడ్గమును, గదను, ధనుర్బాణములను, పాశమును ధరించి యెనిమిది బాహువులతో నొప్పుచు, నిత్యావిర్భూతములును నిరుపాధికములు నగునపహత పాప్మత్వాదు లగుగుణములుగలపరమేశ్వరుఁ డన్నింటినుండియు నన్ను రక్షించుఁగాక. యాదోగణములకు, వరుణపాశమునకుఁ బ్రతిభటుఁడయి జలములవర్తించు మత్స్యమూర్తి జలమందు నన్నురక్షించుఁగాక. స్వసంకల్పము చేత నే మాయావటురూపము దాల్చినవామనమూర్తిస్థలమందునన్నురక్షించుగాక. పాదత్రయ ముచేతనులోకత్రయమునువశముగావించుకొన్నత్రివిక్రముండు నాకాకసమున రక్షకుండగుఁగాక. రాక్షససేనలకును, దదధిపతు లకును శత్రువయి సమర్థుఁడయి దిశలు ప్రతిధ్వనించు నట్లును భయాతిశయమున గర్భపాతములు గలుగునట్లు నట్టహాసము గావించెడునారసింహుఁడుదుర్గమములగునరణ్యసీమలయందును సంగరంబులందును రక్షించుఁగాక. యజ్ఞస్వరూపుఁడును దంష్ట్రా గ్రముచే భూమినుద్ధరించినవాఁడునునగువరాహమూర్తి మార్గ మున నన్నుఁ గాపాడుగాక. పరశురాముఁడు పర్వతకూటములం

దున్న దుష్టులఁజంపి రక్షించుఁగాక. ప్రవాసమందు దశరథ కుమారుఁడగు రాముం డోముఁగాక. అభిచారాదు లగుసమస్త క్రూరధర్మములనుండియుమూర్తిపుత్త్రుఁడయిననారాయణుండు గాచుఁగాక. యోగవిరోధుల నిరసింప సమర్థుఁ డయినదత్తాత్రేయుఁడు యోగవిరోధులనుండి ప్రోచుఁగాక. జ్ఞానప్రదానముచేఁ గర్మబంధమును నిరసింపఁజాలినవాఁడును సిద్ధగణముల కధిపతియు నగుకపిలుండు కర్మబంధనమునుండి కాపాడుఁగాక. కామ నిగ్రహుం డయినసనత్కుమారుఁడు మదనునివలన రక్షించుఁగాక. చతుర్ముఖాది దేవతలను బరిహాసము చేసి వేదములహరించిన మధుకైటభాదుల సంహరించిన హయగ్రీవుఁడు నన్నుఁ గాపాడుఁగాక. అవిచ్ఛిన్నమగుభగవదారాధనము గలనారదుండు భగవదుపాసన కంతరాయము కలుగకుండఁ జూచుఁగాక. ఆశ్రితార్తిహరుఁ డయినకూర్మమూర్తి సమస్తనరకములనుండియు రక్షించుఁగాక. వైద్యశ్రేష్ఠుఁ డయినధన్వంతరి శీతోష్ణాదులగు ద్వంద్వంబులనుండికాచుఁగాక. విజితేంద్రియుఁడయినఋషభుఁడు భయములనుండి కాపాడుఁగాక. సర్వాంతరాత్మ యగువిష్ణువు లోకాపవాదమునుండి నన్నుఁ గాచుఁగాక. దుర్జను లొనరించు నుపద్రవముల నడఁగించు బలభద్రస్వామిమృత్యువునుండిరక్షించుఁగాక. సర్పరా జయిన శేషుఁడు సర్పములనుండి సంరక్షించుఁగాక. జ్ఞానప్రదుఁ డయిన వ్యాసుఁ డజ్ఞానమునుండి కాచుఁగాక. జగన్మోహకములయిన పాషండధర్మములనుండి బుద్ధుం డుద్ధరించుఁగాక. ధర్మసంరక్షణార్థ మవతరించెడి కల్కిమూర్తి కాలమల మగుకలిదోషమునుండి రక్షించుఁగాక. గదాపాణి యై ప్రాతఃకాలమందును, గోవిందుండును, వేణుధరుఁ డై

సంగవకాలమందు గోవిందుఁడు నన్ను రక్షించుగాక. శక్తిపాణియైన నారాయణుండు పూర్వాహ్ణమునఁగాచుఁగాక. చక్రధరుఁడయిన విష్ణువు మధ్యాహ్నకాలమునఁ బోషించుఁగాక. మధుసూదనుఁడు స్వతేజంబున దీప్తుండయి భయంకర మగుచాపమునుదాల్చి యపరాహ్ణంబునఁ గాచుఁగాక. మఱియుసాయంకాలమునమాధవుండును బ్రదోషమునహృషీకేశుండును, నర్ధరాత్రంబునఁబద్మనాభుండును నపరరాత్రంబునశ్రీవత్సాంకితుండగు శ్రీధరుండును బ్రత్యూషకాలమున ఖడ్గపాణియగు జనార్దనుండును,బ్రతిసంధ్యయందును దామోదరుండును, బ్రభాతమునఁగాలశరీరకుండును, విశ్వనియంతయు నగుభగవంతుండునురక్షించుఁగాక. ప్రళయకాలనిర్ఘాతమువలెఁ దీవ్రమయిన యంచులుగలిగి భగవత్ప్రయుక్తమై సర్వస్థలములందును భ్రమించుచు వాయుప్రేరితమగు నగ్ని శుష్కతరువులనుంబోలె శత్రుసైన్యములను దహించెడి చక్రము నన్ను రక్షించుఁగాక. అశనివలెనగ్నికణములను జల్లెడి యోగదాయుధమా! నీవు పరమపురుషునికిఁ బ్రియమయినదానవు. నేను నతనికి దాసుండను. కావున నీవు కూశ్మాండులను, వైనాయకులను, యక్షులను, రక్షస్సులను, భూతములను, బిశాచములను నుగ్గునూచముగాఁ జేయుమా! శత్రువులనుబూర్తిగా సంహరింపుమా! ఓశంఖరాజమా! నీవువిష్ణువుచేఁబూరింపఁబడిభయంకరముగా ధ్వనిచేయుచు, శత్రువుల హృదయములను జలింపఁజేయుచు, యాతుధానులు, ప్రమథులు, మాతలు, ప్రేతలు, పిశాచములు,విప్రులు మొదలగు గ్రహవిశేషములను భయంకరాకారు లగుసితరరాక్షసులను బలాయితులనుగాఁ జేయుమా! తీవ్రధారగల యోఖడ్గమా! నీవు భగవంతునిచేఁ బ్రయుక్తమ

వై నాశత్రుసైన్యములను ఖండ ఖండములుగాఁ దునుమాడు మా! నీవు సూర్యచంద్రులవంటి కాంతిగలదానవు. నీవు పాపాత్ములచూపులను నాచ్ఛాదించి వారినేత్రముల హరింపుమా! గ్రహములవలననుదోకచుక్కలవలననుజోరాదులైననరులవలనను, దంశనస్వభావముగల సర్పాదులవలనను, బాపస్వభావముగల భూతములవలనను, మాకు సంభవించెడి భయములన్నియు భగవంతుని నామములను రూపమును, నాయుధములను స్మరించుటవలనఁ దత్కాలమందే నాశనమొందుఁగాక. మఱియు మా శ్రేయస్సును బ్రతిబంధించెడు నవన్నియును నశించుఁగాక. బృహద్రథంతరము మొదలయినసామవాక్కులచే నుతింపఁబడువాఁడై ఛందోమయుఁడై సమర్థుఁడై, యున్న గరుత్మంతుఁడు సమస్తాపదలనుండియు రక్షించుగాక. విష్వక్సేనుఁడు తన నామములచే రక్షించుఁగాక. శ్రీహరినామములును, రూపమును, వాహనమును, చక్రాదులగు నాయుధములును, విష్వక్సేనాదులగు పారిషదజనంబులును, గౌస్తుభాదులగునలంకారములును, మాబుద్ధిని, నింద్రియములను, మనస్సును, బ్రాణములనుసంరక్షించుఁగాక చిదచిదాత్మక మగునీజగత్తువాస్తవముగా భగవదాత్మకమే. ఈ జగం బట్టిదేయని దృఢముగానమ్మిప్రార్థించుటచే సమస్తమగునాపదలును నాశము చెందుఁగాక. మఱియుఁ దానొక్కఁడే చిదచిదాత్మకమగుజగంబునం దంతరాత్మగానుండఁదగిన ప్రభావముగలవాఁడగుటచే భగవంతుఁడు, దేవమనుష్యాదు లగునామరూపములవలనఁ గిల్గు భేదములేనివాఁడై జీవునివలెఁ గర్మాధీనతచేఁగాక స్వసంకల్పరూపజ్ఞానముచేతనే భూషణములను నాయుధములనెల్లు ధరించుచున్నాఁడో యట్లె దివ్యమంగళవిగ్రహము

లను; రామకృష్ణాది నామములను, ధరించుచున్నాఁడని ప్రార్థించుచున్న మాప్రార్థనను సత్యమగుదానిగాఁజేసి యస్త్రపార్షదాది పములను దాల్చి సర్వకాలములందును, సర్వప్రదేశములందును, సర్వావస్థలయందును,రక్షించుఁగాక. ఆగ్నేయాది విదిక్కులందును, దిక్కులందును, నూర్ధ్వభాగమందును,నధోభాగమందును,శరీరాంతర్భాగ మందును, బహిర్భాగమందును, గానవచ్చుచున్న నరసింహమూర్తి స్వతేజముచే సూర్యాది తేజస్సుల నాచ్ఛాదించుచు,తనయట్టహాసధ్వనిచేతఁ దనభక్తుల భయమును దొలంగించుఁగాక,"యని యీచెప్పఁబడినదినారాయణకవచ మనెడిమహామంత్రము. ఓయింద్రా! ఈమంత్రరాజమును నీకుపదేశించితిని.ఈనారాయణకవచము నీశరీరమునకుఁ గవచమగును.నీ వీ సాయమున సులభముగా రాక్షసవీరులను జయింపఁగలవు. ఈ నారాయణకవచము ననుసంధానముచేసికొనెడి పురుషుఁ డేయే భయంకరవస్తువును నేత్రముచేఁ జూచుచున్నాఁడో, కాలితోఁదాఁకుచున్నాఁడో, యాయాపదార్థములన్నియు భయమును బొంది స్వయముగానే పలాయితములగును. ఈకవచమును దాల్చినవానికి రాజులవలనఁగాని,చోరులవలనఁగాని, గ్రహాదులవలనఁగాని, యాధివ్యాధులవలనఁగాని భయ మెంతమాత్రమును సంభవింపనేరదు. ఓయింద్రా! ఈ విద్యాప్రభావమును దెలుపు నొక యితిహాసమును జెప్పెదను. వినుము. పూర్వకాలమునఁ గౌశికగోత్రజుఁడగు నొక విప్రుఁడీవిద్యను ధరించి యోగధారణము నవలంబించి నిర్జలప్రదేశమందు దేహమును విసర్జించెను. ఆదేహమునకుపరిభాగమునందొకానొకప్పుడుచిత్రరథుఁ డనెడిగంధర్వపతి స్త్రీపరివృతుఁడై

విమానముతో సంచరించుచుండెను. వాఁడట్లు బ్రాహ్మణుని దేహ మున్నస్థలమునకు వచ్చినతోడనే వాని విమాన మాకసమునుండి తలక్రిందుగా నేలకుఁ బడియెను. అనంతర మతఁడు విచారించు చుండఁగా వాలఖిల్యమహర్షి వచ్చి యాకౌశికుని ప్రభావమును నతఁ డవలంబించిన మంత్రప్రభావమును జెప్పి "నీ వాతనియస్థు లను గొనిపోయి నదిలోవేసిననీకు శ్రేయంబు గల్గు"నని చెప్పెను. అంతనతఁడు తత్ప్రభావమును విని మిక్కిలి యాశ్చర్యము చెంది యాయస్థులను బోఁవుచేసి సరస్వతీనది కేఁగి వాని నందువైచి స్నానముగావించి తొంటిప్రభావమును బొంది, విమానారూ ఢుండయి తనస్థానమున కేఁగెను. ఈవర్మప్రభావ మెట్టిదియో దీని వలనఁ దెలియఁబడినదికదా! భయాగమనకాలమున నీ నారా యణవర్మము నెవఁడు వినునో, యెవఁ డాదరించునో, యెవఁ డవ లంబించునో, వాని నెట్టిభయంబులును స్పృశింపనేరవు. సమస్త భయములును దప్పకనశించును." అని విశ్వరూపుండు చెప్పె నని చెప్పి, ఓనరేంద్రా! దేవేంద్రుఁడు విశ్వరూపునివలన నీవర్మ మును బొంది యుద్ధమున సమస్తరాక్షసులను జయించి త్రై లోక్యలక్ష్మిని బొందెను. ఇది యెనిమిదవయధ్యాయము.

---

ఇంద్రుఁడు విశ్వరూపుని శిరంబుల ఖండించుట.
త్వష్టవృత్రాసురునిఁ బుట్టించుట. వృత్రాసురపీడి
తులగు సురలు విష్ణుని నుతించుట.

ఓరాజేంద్రా! దేవతలకుఁ బురోహితుఁ డయినవిశ్వరూపు నికి సోమపీథమనియు, సురాపీథమనియు నన్నాద మనియు మూఁడు శిరస్సులు గలవని వేదములవలన వినుచున్నాము. ఆ

విశ్వరూపుఁడు సవినయుఁడై యాగమునందుఁ బితృసంబంధులగు దేవతల నుచ్చైస్స్వనముతోఁ బిల్చి భాగములఁ బ్రత్యక్షము గా నర్పించుచు మాతృప్రయుక్త మగుస్నేహమును బురస్కరించుకొని తద్వంశజాతు లగురాక్షసులకుఁగూడఁ బరోక్షముగా యాగభాగముల నర్పించెను. అప్పు డింద్రుఁడు దేవవంచనాత్మక మగు కపటకర్మమును దెలిసికొని భయసంచలితహృదయుఁడయి కోపమున నావిశ్వరూపుని శిరంబుల ఖండించెను. ఖండితము లగు నతని శిరంబులలో సోమపీథమనునది కపింజలపక్షిరూపము నొందెను. సురాపీథ మనుశిరంబు కలవింకపక్షియయ్యె. అన్నాదమనెడి శిరంబు తిత్తిరిపక్షియయ్యె. ఇంద్రుఁ డాబ్రహ్మహత్యను నిరసింపఁ దగినంతసామర్థ్యము గలవాఁడయ్యుఁ నట్లుచేయక బద్ధాంజలియై యాపాపమును స్వీకరించెను. ఇట్లు బ్రహ్మహత్యాపీడితుఁడగు నింద్రునిఁజూచిభూతములు "ఓబ్రహ్మహంతా!" యని సంబోధింప నారంభించెను. ఒక సంవత్సరపర్యంత మట్లు పిలువఁబడి యింద్రుఁడు తాను శుద్ధుఁడై భూతాక్రోశమును దప్పించుకొనవలెనని యెంచి యాబ్రహ్మహత్యను నాల్గువిధములగాఁ గావించి భూమియందును,జలములందును,వృక్షములందును, స్త్రీలయందును జేర్చెను. భూమి బ్రహ్మహత్యలో నాలవపాలు గ్రహించినందుల కొకవరమిమ్మని యింద్రునియాచించెను. ఇంద్రుఁడు దాని యభిప్రాయం బెఱింగి " నీయందు గోతులుండెనేని శీఘ్రకాలములోనే పూర్తిచెందుఁగాక" యని వరమొసంగ భూమి సంతోషపూర్వకముగా నారెండింటిని స్వీకరించెను. ఆదోషమే భూమియం దిప్పటికిని జవుడుగాఁ గానవచ్చుచుండును. అట్లే యింద్రుఁడు పాపభాగము నొందుచున్న వృక్షములకు "ఛేదింపఁ

బడిన ప్రదేశములు మగుడఁ జిగుర్చుగాక" యని వరమొసం గెను, అంత వృక్షము లారెండింటిని వహించెను. వానియందుఁ బ్రహ్మహత్యజిగటపదార్థముగాఁగానవచ్చుచుండును.అనంతరము స్త్రీలకు బ్రహ్మహత్యాభాగమును "మీరు మాటిమాటికి భోగ యోగ్యలై యుందురుగాక" యనువరంబును నొసంగెను. వారా వరమును బాపమును గ్రహించిరి. వారియందాపాపము ప్రతి మాసమందును రజోరూపంబునఁ గానవచ్చును. పిమ్మట నుదక ములకుఁ బాపభాగముతో "మీకు ద్రవాధిక్య ముండుఁగాక" యనివరంబునొసంగనవి సంతోష పూర్వకముగా స్వీకరించెను. వానియం దాయింద్రుని పాపము బుద్బుదములుగాను నురుపుగా ను గానవచ్చును. త్వష్ట తనకుఁబుత్త్రశోకము గల్పించిన యింద్రు నిఁ గోపించుచు, నింద్రునకు శత్త్రు వగువాఁడు వర్ధిల్లి యతని సంహరింపవలయు నని తలంచి హోమమును గావించెను. ఆ హోమానంతరమందుఁ బ్రళయకాలమం దుద్భవించిన యముని చందంబున దక్షిణాగ్నియందు ఘోరదర్శనుఁ డగునొకరక్క -సుండు సంభవించె. ఆరాక్షసుఁడు ప్రతిదినంబు నిషుప్రమాణ మన్నివైపులను వర్ధిల్లుచు నగ్నిదగ్ధమగుపర్వతంబు చందంబునఁ బొడసూపుచు, సంధ్యాకాల మేఘములవంటి దేహకాంతితో నొప్పుచు, సంతప్తము లగురాగితీఁగలవంటి శ్మశ్రువుగలవాఁడ యి, మాధ్యందిన మార్తాండునివలె నుగ్రములగు లోచనం బుల భీకరుఁడయి, తనచేతనున్న త్రిశూలమునకు భూమ్యాకాశ ములకు నడుమనున్న పదార్థములఁ గ్రుచ్చి నృత్యము చేయుచు, మేఘమువలె గంభీరముగా నార్చుచుఁ, బాద విక్షేపములచే భూతలమును జలింపఁ జేయుచుఁ, గొండగుహవలె గంభీరము

గాఁ గానవచ్చు వక్త్రబిలముచే నాకాశమును మ్రింగుచున్నట్లు కనఁబడుచు, నాలుకచే నక్షత్రములనాకి రుచిచూచుచు,భయంకర మగుదంష్ట్రలుగలిగి భువనత్రయమును గ్రసింపఁదగినంత విపులమయిన నోటిని మాటిమాటికిఁ దెఱచుచు, వర్తింపఁ జొచ్చె. వానిఁజూచి సర్వలోకములవారును, దశదిక్కులవారును మిక్కిలి భయముచెంది ప్రాణరక్షణార్థము పర్వెత్తిరి. ఓ రాజేంద్రా ! మూర్తీభవించిన త్వష్టృప్రజాపతి తపంబువలెనున్న యారక్కసునిచే ముల్లోకములును వృతములయినవి కాన వానికి వృత్రుండను నామముకలిగె. వాఁడు లోకపాలురకు విరోధి యగుటవలన ధర్మవిరోధియై లోకదుస్సహుఁడయి వర్తించుచుండెను. వానిఁ జూచి దేవతాశ్రేష్ఠులందఱును సైన్యసమేతులై వచ్చి తమతమయాయుధముల నొక్కమాఱు ప్రయోగించిరి; కాని యావృత్రుఁడు వాని నన్నింటి నొక్కపరి మ్రింగివైచెను. దేవత లదిచూచి తమ తేజస్సంతయు వ్యర్థమయినందులకు మిగుల వగచుచు, వృత్రుని సామర్థ్యమున కచ్చెరువొందుచు జీవశరీరకుఁడును,జగత్కారణభూతుండును నగు పరమాత్మను స్థిరచిత్తములతో నిట్లునుతించిరి. 'ఓపరమపురుషా!వాయువు, వహ్నియును, నుదకములును, భూమియును, లోకత్రయాంతర్గతు లగుబ్రహ్మాదులును, మేమును, నీకు భయపడుచు, నీశాసనరూప మగునారాధనము సల్పుచుంటిమి. సుప్రసిద్ధుఁడయిన యంతకుండు సైతము నీవలన భయపడును. ఇట్లు సమస్తలోకవాసులవలనను బూజలుగొనుచున్న నీకన్న మాకు రక్షకు లెవ్వరుగలరు? ఓదేవా ! నీవు స్వాభావికమహిమ గలవాఁడవగుటచే విస్మయరహితుండవయి,సమస్తకామములచేఁ బరిపూర్ణుఁడవై,

స్వానుభవానందముచే రాగాదిశూన్యుఁడవై, యూర్మిషట్క-
రహితుఁడవై వర్తించుచున్నాఁడవు. ఇట్లన్నివిధంబులచేతను శ్రే
ష్ఠుండగు నీవుండ నిన్నువిడిచి యెట్టిబుద్ధిహీనుఁడైనను సముద్ర
మును దాఁటఁ గుక్కతోఁక నూఁతగాఁ గొన్నట్లు క్షుద్రదైవము
ల ననుసరింతురా? ఓమహనీయా! పూర్వము ప్రళయకాలపయో
నిధియందుమునుఁగుచున్న భూమియ నెడినావను మత్స్యమూర్తి
వయిన నీశృంగంబున బంధించి సత్యవ్రతాదు లనుదుర్గమ మగు
నాపదలనుండి తరింపఁజేసిన నీవిప్పుడు శరణాగతుల మగుమమ్ము
ను, దురంతమగు వృత్రభయమునుండి తప్పక రక్షింపఁగలుగు
దువు. కావుననే నిన్ను శరణుసొచ్చితిమి. ఇంతియకాక జగదాది
యందు బ్రహ్మయు నీ నాభికమలమున నుదయించి ప్రచండ
వాయువుచేఁ దరంగితమయి భయంకరముగా ధ్వనిచేయుచున్న
ప్రళయకాలపయోనిధింజూచి మిక్కిలి భీతుఁడయి నీసాయము
వలననే తద్భయంబును నిస్తరించె. అప్పుడు బ్రహ్మను భయాతీ
తునిఁగాఁజేసిన నీవే మాకిప్పుడు పాలకుఁడవగుదువుగాక. ఓపర
మాత్మా! నీవు నిస్సముండవై నిరధికుండవయి యొప్పుచున్నావు.
నీవు నీసంకల్పరూపజ్ఞానములచే మమ్మును సృజించితివి. భగ
వంతుఁడవగునీయనుగ్రహంబును బొందియే వ్యష్టివర్గమును సృ
జించుచున్నాము. మాకట్టిశక్తియొసంగినది నీయనుగ్రహమే కాని
వేఱుగాదు సుమీ? అట్లయ్యు మే మీశ్వరత్వాభిమానము గల
వార మగుటచే మాహృదయకుహరములం దంతరాత్మరూపుఁడ
వయి నియమించుచున్న నీదివ్యవిగ్రహమును జూడఁజాలకున్నా
రము. ఓదేవదేవా! నీ వెప్పుడును మాసంరక్షణమునే కోరుచుఁ
బ్రతియుగమందునుసంకల్పరూపజ్ఞానముచే రామకృష్ణాద్యవతా

రంబులఁ దాల్చుచుంటివి. అట్టి నీవు మిక్కిలి శత్రుపీడితుల మగు మమ్ము నీపట్టునఁ జేపట్టి రక్షింపుమా? ఓయీశ్వరా! నీవు భక్తవత్సలుండవు. మాకు దైవమవు. నీవు కార్యకారణావస్థల లోనుండు చిదచిత్తులు శరీరముగాఁగలవాఁడవయ్యు నాచిదచిత్తులకు విలక్షణుండవయి యుందువు. నీ వందఱికంటె నుత్కృష్టుండవు. అందువలన నీవే మాకు శరణ్యుండవని నమ్మియున్నారము. నిన్నే శరణుచొచ్చితిమి. నీవార మగుమమ్ముఁ జేరదీసి శత్రునిరాసమును గావించి సుఖింపఁజేయుమా?" అనియిట్లు సురలు భక్తియుక్తులయి నుతించుచుండఁగా శంఖచక్రాదిసాధనంబులఁ దాల్చిన భగవంతుండు వారికిఁ బశ్చిమభాగంబున నావిర్భవించెను. అట్లు సాక్షాత్కరించినవాఁడును, శ్రీవత్సకౌస్తుభములుమాత్రముదక్కఁ దక్కినవానియన్నింటియందును దన్నుఁబోలుచున్న నందాదులచేఁ బరివేష్టితుండును, శరత్కాలపద్మములకైన వచ్చు కన్నుఁగవగలవాఁడును నగుపరమాత్మను జూచి యా సురలందఱును నీశ్వరసందర్శనజనిత మగునానందముచేఁ బరవశులై యతనికి దండప్రణామము లాచరించి మెల్లమెల్లన లేచి యిట్లు నుతింపఁదొడంగిరి. 'ఓదేవా! నీవు షాడ్గుణ్యసంపూర్ణుఁడవు. నీవు జీవసమూహమునకుఁ బ్రాప్యమవై ప్రాపకుఁడవై యాధారుఁడవై యున్నావు. జగముల కాధారభూతుండవు. జగములకుఁ గారణభూతుండవు, అచింత్య మగుప్రభావముగలవాఁడవు. పురుషోత్తముఁడవు, మంగళస్వరూపుఁడవు, ఒరులకు మంగళములఁ గూర్చువాఁడవు, స్వార్థమపేక్షింపకయె పరులదుఃఖములసహింపలేనివాఁడవు. అన్యాపేక్షలేకుండ జగముల కాధారుఁడ వగుచున్నావు. లోకైకనాథుఁడవు, పరమహంసుండవు, జ్ఞానకర్మ

యోగనిష్ఠులగు మునులకు సమాధియోగముచేఁ దెలియఁబడుచున్నావు. పరిస్ఫుటమయిన భక్తిరూపధర్మముచే నీసందర్శనమునకు విరోధి యగునజ్ఞానకవాటము నున్మూలించుకొని భగవద్దర్శనసాధన మగుచిత్తము గలయాత్మలోకమునకు సాక్షాత్కరించుచున్నాఁడవు. నీవు నిత్యమై నిరుపాధికమై,యపరిచ్ఛిన్నమైయున్న జ్ఞానానందముగలవాఁడవు. అయినప్పటికి జగద్వ్యాపారరూపమగు నీ లీలావిహారము లోకమందలి మృత్కులాలాదుల వ్యాపారమువంటిది కాకపోవుటచేఁ దెలియఁ దరముకానిది. కులాలాదులు ఘటాదులను సృజింప భూతలాదిరూప మగునాధారము నపేక్షించుచున్నారు. నీవు నీకంటె నితర మగునాధారము నపేక్షింపక యాధారభూత మగునీయందే సృజించుచున్నావు. మఱియు నీవు మావంటి సహాయసంపదను నపేక్షింపకయే సృజించుచున్నావు. కులాలుఁడు దండచక్రాదిసాధనములు లేకుండ ఘటముల నిర్మింపఁజాలఁడు. నీవు గుణత్రయరహితుఁడవు. కులాలాదులు సత్త్వాదిగుణములు గలవారు. సూక్ష్మ చిదచిద్రూపమగు నీశరీరమునే వికోచించిస్థూలావస్థను బొందించి విశ్వాకారముగాఁ బరిణమింపఁజేయుచున్నావు. కులాలాదులు తమకంటె భిన్న మగుమృత్పిండాదులచే ఘటాదులను నిర్మించుచున్నారు. *కావున నీవ్యాపారమునకును గులాలాదుల వ్యాపారమునకును

---

* 'ఓయీ ! విశ్వమునకుఁ గేవల మీశ్వరుఁడే కారణమా? లేక చిదచిత్తులతోఁగూడిన యీశ్వరుఁడు కారణమా? ఆలోచింప మీ మతమందుఁ జిదచిద్విశిష్టుఁడే కారణముకాని కేవల మీశ్వరుఁడు కాఁడు. అట్లయినచో లోకమునందలి ఘటమునకు మృత్తిక యుపాదానమును గులాలుఁడు నిమిత్తకారణమును నగుచున్నట్లు ప్రపంచమునకు బ్రకృతియుపాదానమగుచుండెను.

మిక్కిలి యంతరము గలదు. సంతతమును బరిణామశీలములగు చిదచిత్తుల సంబంధముగలవాఁడ వయినను దద్గతవికారములను బొందనివాఁడవు. నీవట్లు విశ్వమును సృజించి పెంచి సంకోచింపఁ జేయుచున్నావు. ఓదేవా! నీవు కర్మనిష్ఠుఁ డగు సంసారి చందంబున సత్త్వరజస్తమోగుణాత్మక మగు ప్రపంచమునఁ బడి స్వకృతము లగు కర్మఫలము లనుభవించుచుంటివో? లేక యంతరింద్రియ బహిరింద్రియ వ్యాపారముల మఱచిన

భగవంతుఁడు ప్రపంచమునకు నిమిత్తమగుచుండెను. ఇట్లుండ భగవత్కులాలాదుల వ్యాపారమున కేమి వ్యత్యాసముగలదు? అని శంకింప నవకాశములేదు. ప్రకృతిపురుషవిశిష్టుఁడే విశ్వమున కుపాదానము. అట్లయినను బ్రకృతిపురుషులకంటె నుత్కృష్టుఁడును, విశేష్యమును నగుపరబ్రహ్మము విశ్వమునకు నిమిత్తకారణ మగుచున్నాఁడు. ఈశ్వరుఁడు సత్త్వాదిగుణములు లేనివాఁడు. కులాలుఁ డట్లు కాక సత్త్వాదులు కలవాఁడు. అందుచే ఘటమునకుఁ గులాలుఁడువలె విశ్వమున కీశ్వరుఁడు నిమిత్తకారణమైనను మిక్కిలి వైలక్ష్యము చూడఁబడుచున్నది. మఱియు భగవంతుఁడు ప్రకృతిపురుషభూతమగు స్వశరీరమును విశ్వాకారముగాఁ బరిణమింపఁ జేయుచున్నాఁడు. కాన జగమునకు నిమిత్తకారణమయ్యు నుపాదానకారణమగుచున్నాఁడు. కులాలుఁడు స్వభిన్నమగుమృత్పిండముచే ఘటమును నిర్మించుటచే నుపాదానకారణము కాలేదు. దీనింబట్టి భగవత్కులాలాదుల వ్యాపారములకు వ్యత్యాసముగలదు. ఒక్కఁడు నిమిత్తోపాదానకారణములగుట యనుభవవిరుద్ధముగా నున్నదని శంకింపఁబనిలేదు. అట్లు చెప్పుటకు లోకదృష్టాంతమును వేదప్రమాణమును గలవు. సాలెపురుగు తనదేహమునుండియే పటాదులను నిర్మించుచున్నది. అట్లె భగవంతుఁడును దనశరీరమునే విశ్వముగా మార్పవచ్చును ఇందులకు 'యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ' ప్రమాణము. కావున పరమేశ్వరుఁడు నిమిత్తోపాదాన కారణములు గలవాఁడు కావచ్చుననుట నిర్వివాదాంశము.

వాఁడును, సమదర్శనుఁడును, నగు తత్త్వజ్ఞాననిష్ఠుని చందం బున నుదాసీనుఁడవయి వర్తించుచుంటివో, దెలియఁజాలకు న్నాము. ఆలోచింప నీవు కర్మనిష్ఠునివంటి వాఁడవునుగావు. జ్ఞాననిష్ఠునివంటి వాఁడవునుగావు. కర్మనిష్ఠునివలెఁగర్మఫలమను భవింపక, జగత్సృష్ట్యాదుల నొనరించుచున్నవాఁడ వగుటచే జ్ఞాననిష్ఠునివలె నుదాసీనుండవును గాక, వర్తించుచుండ నీవు వారి నెట్లు వ్రోలుదువు. నిశ్చయముగా నీవు కర్మఫలానుభవ మునం దుదాసీనుండవును,గర్తవును నగుచున్నావు.ఉదాసీనత్వ మును, గర్తృత్వమును బరస్పరము, విరుద్ధధర్మము లయినను నీయం దట్టివిరోధము లేకయే సంఘటించుచున్నది. నీవు కర్మ నిష్ఠులును జ్ఞాననిష్ఠులు నగుచేతనముల కంతరాత్మవయి యీ యిర్వురకంటె విలక్షణుండ వయి, వివిధశక్తి సముపేతుండ వయి యుండఁగా నీయం దవి యెట్లు విరుద్ధములగును? సంసారి ముక్తులకంటె నీవు కేవలము విలక్షణమయినవాఁడవు. నీవు జ్ఞానాదిషడ్గుణములచే సంపూర్ణుండవు. అమేయములగు ననంత కల్యాణగుణములు గలవాఁడవు. సంసారిముక్తు లట్టి వారు కారు. మఱియు నీవు కర్మజ్ఞాననిష్ఠు లగుచేతనముల కంతరా త్మవు.దురవగాహ మగు మాహాత్మ్యముగలవాఁడవు.మఱియు నర్వాచీనులసంశయమూలకమగు నూహామార్గములలో నొక దాని స్థాపింపఁ బ్రమాణాభాసములను దెలుపు తర్కశాస్త్రా భ్యాసముచేఁ గలుషితము లగునంతఃకరణములతో దురాగ్రహు లయినవాది ప్రతివాదులవాదములకువిషయీభూతుండవుకావు. సమస్తములగు ప్రాకృతదోషములను నిరసించినవాఁడవు. నీ వేక రూపుఁడవు. నీవు మాయనుగూర్చి తిరోధానము చెంది వర్తించు

చున్నాఁడవు. అట్టి నీయందుఁ గర్తృత్వము, కారయితృత్వము
ఉదాసితృత్వము మొదలగు ధర్మములలో నేవి నీయందు సంఘ
టింపవు? సమస్తము సంఘటించును.* కావునఁ గర్తృత్వోదాసీన

---

* ఈచెప్పుటవలనఁ దెలియఁదగినయంశ మేమనఁగా భగవంతుఁడు సృష్ట్యా
దివ్యాపారములు గలవాఁడయ్యు నావ్యాపారములం దతఁడు స్వతంత్రుఁడగు
కర్తయగుచున్నాఁడు. ప్రయోజ్యకర్త యగుజీవునికిఁ బ్రేరకుఁడగుటవలనఁ బ్ర
యోజకకర్తయు నగుచున్నాఁడు. కావున భగవంతునికిఁ గర్తృత్వము ప్రయో
జకకర్తృత్వము అనెడి ధర్మములుగలవని చెప్పవచ్చును. కర్తృత్వమున్నచోఁ
గర్మఫలానుభవము తప్పనా యని శంకింపరాదు. భగవంతుని కర్తృత్వము
కర్మాధీనముకాదు కావునను, నతనికిఁ గర్మఫలముఁ గుడిపెడిమఱియొక యీశ్వ
రుఁడు లేఁడు కావునను, నతనికిఁ గర్మఫలానుభవములేదు. సమస్తశాసకుఁడగు
భగవంతునికంటె వేఱొకఁడు లేనప్పుడు ఫలానుభవరూపమగునని ష్టము నతని
కెవఁడు చేయును. పోనిమ్ము. కర్మమే స్వయముగా ననిష్టమును గల్గించుననరాదా?
అందులకు వేఱొక యీశ్వరుఁడుండ నేల? యని ప్రశ్నింప వలనుపడదు. కర్మఫ
లములును భోక్తలు నున్నప్పటికిని వానికి సంధానము చేయువాఁడు వేఱొకఁ
డుండకతీఱదు. జీవులును దత్కృతకర్మములు నుండఁగా నీశ్వరుఁ డాయా
జీవుల కాయాకర్మఫలమును గూర్చుచున్నాఁడు. ఈశ్వరునకట్లు సమకూర్చు
వాఁడు మఱియొకఁడు లేనిచో నది సరిపడదు. జడమగు కర్మము దనంతటఁ
దానే ఫలమొసంగ శక్తిగలదిగాదు. జీవులు సుఖాపాదకము లగుకర్మఫలము
లనుభవింపఁ బ్రవృత్తులగుచున్నను ననిష్టాపాదకములగుకర్మఫలము లనుభవిం
పఁ బాలుపడరు. స్వీయానర్థమున కెవఁడయిన సమకట్టునా? కావున ధర్మఫల
లములకును దాని ననుభవించు జీవులకును సంధానము చేయువాఁడుండకతీఱదు.
లోకమున సమస్తవిధములగు మొలకలకును జలము సామాన్యకారణము. బీజము
విశేషకారణము. అయినను జలబీజములకు సంధానముచేయువాఁడు లేనిచో
నంకురములు వొడమవు. అట్లేకర్మఫలమునకును భోక్తకును సంధానము చేయువాఁ
డొకఁడుండవలయును. ఇట్లు భగవంతునియందుఁ గర్తృత్వమున్నను నుదాసీన

త్వములు పరమాత్మవగు నీస్వరూపమున విరోధింపవు. మఱియు లోకమున నొకఁడు ద్రాటినిఁజూచి సర్ప మనుభ్రాంతిని జెందుచున్నాఁడు. మఱియొకఁడు దాని రజ్జువునుగానే తెలిసికొనుచున్నాఁడు. దానిఁగూర్చి వారు సల్పెడి వాదములకు రజ్జువు హేతువయి యనుసరించుచున్నది. అట్లేనీవును నిన్నుఁగూర్చి వాదోపవాదములు సలుపు సమబుద్ధులకును, విషమబుద్ధులకును వారి వారి మతములకనుగుణముగానే వర్తించుచు నుదాసీనుఁడవయి యుందువు; కాని యసద్వాదములఁ బ్రతిషేధింపవు. కావున వారి వారి వాదములకు సమ విషమబుద్ధులే కారణములు; కాని నీవు కావు. ఓ దేవా! జగంబునకు నిమిత్తకారణమవును నుపాదాన కారణమవును నయియున్నను, నన్నివస్తువులందు నున్నవాఁడ

---

త్వముకూడఁ గలదు. భగవంతునియందుఁ గర్తృత్వమే యంగీకరింపఁబడినది; యుదాసీనత్వములేదే! ఉదాసీనత్వమేయున్న యెడల యద్విషయకమయినది కలదని యడిగెదేని చెప్పెదనిను. సుఖదుఃఖములకు సాధనములగు పుణ్యాపుణ్య కర్మములందు భగవంతునికిఁ గర్తృత్వములేదు. కాని తాదృశ కర్మఫలములనుభవింపఁ బ్రాచీనవాసనానుసారముగా జీవులకుఁ బ్రేరకుఁడుమాత్రమే యగుటచేఁ దద్విషయకమగు నుదాసీనత్వముండవచ్చును. కావున నీశ్వరుఁడుసమస్తము చూచుచున్నాఁడు గావున సాక్షియగుచున్నాఁడు. కర్మములందుఁ బ్రవృత్తులగు జీవులకుఁ బ్రవర్తకుఁడగుచున్నాఁడు కావున ననుమోదకుఁడగుచున్నాఁడు. అట్లెసమస్తమునకుఁ బ్రభువయి యాశ్రితరక్షకుఁడయి ఫలమొసఁగును గాన ఫలప్రదుఁడగుచున్నాఁడు. ఇట్లు సర్వశక్తిసమన్వితుండగు నీశ్వరుని యందు సమస్తము సంఘటించును. జీవుఁడు కర్మాధీనుఁడగుటవలనను, మాయామోహితుఁడగుటవలనను, నవిద్యచే నావృతమగు స్వభావము గలవాఁడగుటచే తను బుణ్యాపాపఫలముల ననుభవించుచున్నవాఁడగుటవలనను జీవునియం దిట్టి ధర్మము లుండ నేరవు.

వయినను, నిర్వికారుండవయి యొప్పుచున్నాఁడవు. కారణమేమన నచేతనవిశిష్టు లగుసమస్తజీవులును నీకు శరీరమగుచున్నవారు. కాన యచేతనసంపర్కజనితము లగువికారములు జీవులనేకాని నిన్నుఁ జెందనేరవు. మఱియుఁ జిదచిత్తులు కాలము మొదలగు విశేషణములచే నవభాసించుచున్న నీవొక్కఁడవే సమాధిక రహితుఁడవయి వర్తించుచున్నాఁడవు. ఓయీశ్వరా! నీవట్లసాధారణములుగలవాఁడవయి సర్వసముఁడవయి వర్తించుటంబట్టియే, పురుషార్థమును నిర్ణయింపఁగలవారయి నిన్నును బ్రియతమవస్తువునుగా నెంచుచుఁబరోపకారమందుసాధువులయి రాగాదిరహితులయి వర్తించు పరమభాగవతులందఱును, నీమహిమయనెడి యమృతసముద్రమందలి బిందువు నాస్వాదించి తమమనంబుల నిరతిశయసుఖ మనుభవించి దానివలన, దృష్టములును శ్రుతములును నగునైహికాముష్మిక సుఖలేశములను మఱచి తన్నుఁ గొల్చినవారి నెప్పటికిని సంసారమును బొందింపని నీదుచరణాంబుజసేవను జేయుచున్నారు. ఓదేవా! నీవు త్రిభువనమునందును బ్రవేశించి నియామకుఁడవయి యున్నాఁడవు. త్రివిక్రముఁడవగు నీకసాధ్యమగునది యొంతేనియు లేదు. సూర్యచంద్రాగ్నులు నీకు నేత్రములయి యొప్పుచున్నవారు. ముజ్జగంబులకును మనోహరమగు ననుభవముగలవాఁడవు. అట్టి నీకు నమస్కారంబులొనరించెదము. ఓ పరమపురుషా! దైత్యులును, దానవులును, మనుజులును నీవిభూతులేకదా! అట్టివారిని సంహరించుట యనుచితము. అయినను దైత్యాదుల కిది యభ్యుదయకాలము కాదని తలంచి వారిని జయింపఁదలంచితివేని పూర్వమున నీవు స్వీయమాయచేత వామనావతారమును రామకృష్ణాద్యవతారములును

వరాహాద్యవతారములును దాల్చి విరోధినిరసనము చేసినట్లుగా నిప్పు డీవృత్రాసురుని జయింపుము. ఓజగద్రక్షకా! దయారసముచే సానురాగములయి మందహాసముచే మనోహరములయి యున్న నీకడకంటిచూపులచేతను, సుధారసము నీసడింపంజాలిన నీ మధురవాక్యములచేతను సంతతమును నీ పాదపద్మధ్యానసక్తము లగుహృదయకమలములు గలవారమయి, నీకు సేవకులమయి నీకు శరీరభూతుల మగుటచే భవదధీనుల మయి వర్తించు మాదుఃఖంబులం దొలంగింప నర్హుండవు. ఓమహాత్మా! నీవు సకలజగంబుల సృష్టిస్థితి లయములకు నిమిత్తమగు నిత్యమాయచే వినోదించువాఁడవు. సమస్తజీవ సముదాయముల హృదయములందుఁ బ్రత్యక్శరీరుఁడ వయి బహిర్భాగములందుఁ బ్రకృతిశరీరకుఁడవయి, యీ దేశమున, నీకాలమున, నీదేహమున, నీసుఖదుఃఖాదుల ననుభవింపవలయుననెడి వ్యవస్థ కనుకూలముగా వ్యాపించుచు, సమస్తజీవుల చిత్తవృత్తికి సాక్షిభూతుండవయి, దహరాకాశమే శరీరముగాఁ గలవాఁడవైన పరమాత్మపరబ్రహ్మమయిననీకు మేము విజ్ఞాపించుకొనినకార్యము వహ్నికి విస్ఫులింగములవలనఁ గల్గిన ప్రకాశమువలె లెక్కింపఁ దగినంత గొప్పదికాదు. ఓపరమపురుషా! మేమీస్వల్పప్రయోజనమునపేక్షించి వివిధములగు పాపములవలనఁ గల్గిన సంసారపరిశ్రమముపశమింపఁ జేయుచున్న నీపాదపద్మముల నీడను జేరితిమి. కావున మాయీకార్యమును నిర్వహింపుము. ఓకృష్ణా! ఆవృత్రాసురుఁడు మా తేజంబులను మాయాయుధములను మ్రింగివైచెను. అంతియకాదు. ముల్లోకములనుగూడ మ్రింగుచున్నాఁడు. అట్టి భయంకరుఁ డగు నారక్కసునిఁ జక్కాడుము. నిఖిలదోషములను

నిరాకరించి యాశ్రితుల కష్టములం బోకార్చుచు, సమస్తజీవుల హృదయ పుండరీకమునవిలసిల్లుచుం, జిత్తవృత్తికిసాక్షిభూతుండ వయి, భారమును హరించి భూమికి సుఖముగల్గించుచుం బవిత్ర కీర్తినార్జించుచు నిజభక్తజనుల ననుగ్రహించుచు, సంసారతాప మున శ్రమచెందినవారికి శరణ్యుండవై యైహికాముష్మిక సుఖం బుల నీయఁగలిగి నిరతిశయపురుషార్థస్వరూపమవై యొప్పు నీకు నమస్కారము'' అని యిట్లు దేవతలు సాదరులయి నుతించిన తన స్తోత్రమును విని భగవంతుఁడు సంతసించి వారల కిట్లనియె. ''ఓ సురశ్రేష్ఠులారా ! మీరొనరించిన స్తోత్రమునకుఁ బ్రీతుండ నైతి. మీరొనరించిన స్తోత్రమువలనఁ బురుషులకు నాభక్తి యుదయించును. దానివలనఁ బరమాత్మస్వరూపమహిమ తెలియ నగుచున్నది. నాస్వరూప మహిమను నెఱింగినవారికి నేను బ్రసన్నుండ నగుదును. నన్నుఁ బ్రీతునిగాఁ జేసినవారికి లోకము లోఁ బొందఁ దరముకాని దేదికలదు ? సమస్త వాంఛితము లును వారికి సమకూడును. అయినను బ్రయోజనాపేక్ష విడిచి నాయందు భక్తిని జూపుచున్నవాఁడు నావలనఁ గొంచెమై నను బ్రతిఫలము నొంద నిష్టపడఁడు. మీరు నన్నును బ్రసన్ను నిఁగాఁ జేసికొనియు శత్రుజయరూప మగుకోరిక వాంఛించుట మిక్కిలి తెలివిమాలినపని. ఇంద్రియాధీనుఁ డగుజనుఁడు శబ్దాది విషయములందు దృష్టిగలవాఁడై తనకు నిరతిశయపురుషార్థ మేదియో తెలియఁజాలఁడు. నే నట్టివారికి నిరతిశయపురుషార్థము నీయసమర్థుండనయ్యు, వాఁడు కోరినదానినే యొసంగుచు వాని కనుకూలముగానే వర్తించుచుందును. నిరతిశయ పురుషార్థము ను, దత్సాధనములును దెలిసినవాఁడు తాదృశ పురుషార్థమును

సాధనములను నెఱుంగనివానికిఁ గర్మయోగమే యాచరింప వలయునని యుపదేశింపఁడు. రోగి తన శ్రేయస్సు నెఱుంగక యుపథ్యవస్తువులను గోరుచున్నను వానిహితమెఱింగిన వైద్యశ్రేష్ఠుఁ డందుల కంగీకరించి యొసంగునా? కావున మీకు నిరతిశయపురుషార్థమును గూర్చుట నాకు విధి. ఓయింద్రా! మీరందఱును దధీచిమహామునిని జేరుఁడు. అతనివలన మీ యభిలషితము నెఱవేఱును. విద్యావ్రత తపంబులసార మయినయమ్ముని గాత్రమును వేగముగా యాచింపుఁడు. అతనిశరీరము మిక్కిలి సారవంతమయినది. అతనిప్రభావమును వర్ణించెదను. వినుఁడు * దధీచియను మహాముని ప్రవర్గ్య మను ధర్మవిద్యయందును, బ్రహ్మవిద్యయందును నసమానుఁ డయియుండెను. అతఁ డట్టి

* ఇక్కడ భాగవతమునఁ గంఠోక్తిగాఁ జెప్పకపోయినను గొన్నిపదములచే సూచితమయ్యె. అది గ్రంథార్థమందున్నను నవసరమగుటచే నిందుఁ జేర్పవలసివచ్చె. ఆగ్రంథార్థమందలికథాంశ మేమనఁగా. "దధ్యఙ్ఙాథర్వణో వక్షః ప్రవర్గ్యబ్రహ్మవిద్యయోః। ఇతిజ్ఞాత్వాశ్వినౌదేవౌ గత్వాతమిదమూచతుః। బ్రహ్మవిద్యాంప్రవర్గ్యంచ వేదత్వం సాంప్రతంద్విజ! తదావాభ్యాంప్రవక్తవ్యమాగతౌత్వాంతదర్థినౌ। దధ్యఙ్ఙపితదాప్రాహ తత్పశ్చాత్ప్రదృష్టివీవ్యహం। కర్మణ్యవస్థితోద్యాహ మధునానతు సాంప్రతం। తచ్ఛ్రుత్వాతౌతథేత్యుక్త్వా జగ్మతుఃస్వాలయంకిల।ఏతస్మిన్నంతరేశక్రో విద్యాతిశయమాత్మనః। అసహంస్త్వరితోగత్వా దధ్యంచమిదమబ్రవీత్। ప్రవర్గ్యంబ్రహ్మవిద్యాంచకస్మైచిద్వక్తుమర్హసి। శిరశ్ఛింద్యాం యది బ్రూయా రాగలోభాదినా తవ। తథాబహుతిథేకాలే నాసత్యావుపజగ్మతుః। ఊచతుశ్చాప్యథర్వాణం బ్రూహిపూర్వోక్తమావయోః। ఇంద్రేణాహం నిషిద్ధోస్మీత్యాహతౌద్విజసత్తమః। యదివక్ష్యేశిరశ్ఛింద్యాదింద్రోమేనాత్రసంశయః। పూర్వమేవశిరశ్ఛిత్వా తరశ్వ్యశ్వ।శిరసంతథాసంధాస్యావస్త్వమధునాబ్రూహితేన

విద్యాశాలియని యెఱింగి యశ్వినీసుతు లతనివలన విద్య నభ్యసింపవలెనని తలంచివచ్చి "మాకు విద్య నుపదేశింపు" మని యడిగిరి. అది విని యమ్ముని "నే నిప్పుడు కర్మయోగాసక్తుఁడనై యున్నాను. వేఱొకప్పుడువచ్చినఁ దప్పక యుపదేశించెద" నన వారు వెడలిపోయిరి. అనంతర మింద్రుం డతనిపాలికి వచ్చి "నీవెవ్వరికిని విద్య నుపదేశింపవలదు. నీవట్లుచేసెద వేని నీశిరంబును ఖండించెద"నని చెప్పి పోయెను.అట్లుకొంతకాలము చన్నపిమ్మట నశ్విదేవతలువచ్చి "మాకు విద్య నుపదేశింపు" మనఁగా నతఁ డింద్రశాసనమును దెలిపెను. అది విని యశ్విదేవతలు "దేవేంద్రుఁడు నీశిరంబును ఛేదించినచో మాశిరంబును ఛేదించి నీకు సంధానముచేసి గురు ఋణమును దీర్చుకొందు"మని పలికిరి. అందులకు ధైర్యమొంది యమ్ముని తనకుఁ దెలిసినంతవఱకు బ్రహ్మవిద్యను వారలకుపదేశించి తద్విద్యాప్రభావముచే వారి నమరులఁగాఁ జేసెను. ఆమహాముని యట్టిప్రభావముగలవాఁడు. ఆదధీచి మదాత్మకమై యభేద్యమయిన నారాయణకవచమును ద్వష్టకొసంగె. అతఁడు తన కుమారుఁ డగువిశ్వరూపున కొసంగె. దానినే నీవు విశ్వరూపునివలనఁ బడసితివి. మఱియు నాదధీచి దేవతారక్షణరూపధర్మము నెఱింగినవాఁడు. కావున మీనిమిత్త మశ్విదేవతలు యాచించినచో నతఁడు తప్పక తనయంగముల నొసంగును. అతనియెముకలనుగొనిపోయి విశ్వకర్మ కొసంగుఁడు. అతఁడు వానితో శ్రేష్ఠ మగునాయుధ

---

ప్రవర్గ్యకం। తచ్ఛేదింద్రశ్ఛినత్త్యాశు స్వకీయం శిరసం తతః। సంధాయదక్షిణాంచైవ దాస్యావఇతిహోచతుః । ఏవముక్తోథదధ్యఙ్ఞు తయో స్తదుభయం జగౌ। ప్రవర్గ్యబ్రహ్మవిద్యాభ్యాంసతథావీర్యవాన్యతః । అని చెప్పఁబడియున్నది.

మును నిర్మించును. మదీయశక్తిసంయుతమయిన యాయాయుధము నింద్రుఁడు స్వీకరించి వృత్రాసురునిఁ దెగటార్చును. వాఁడు నశించినచో మీమీయాయుధంబులును, దేజంబులును, మీరు స్వీకరించి తొంటివలె వర్తింతురు. నాభక్తులను లోకమున నెవ్వరును బాధింపలేరు. కావున నాభక్తులగు మీకు బాధ కలుగక భద్రంబులు సంప్రాప్తమగుఁగాక' నిది తొమ్మిదవ యధ్యాయము.

---

దధీచి సురలయభిలషితంబుఁదీర్చుట; ఇంద్రుఁడు వృత్రాసురునిపయిఁ గవియుట.

అని యిట్లు దేవేంద్రుని నియమించి యాదేవతలు చూచుచుండఁగ నచ్చటనే యంతర్ధానమును చెందెను. ఓభారతా! అనంతరము దేవతలందఱు నమ్మునిపాలికరిగి యాచించిరి. అథర్వణపుత్త్రుఁడును, పరబ్రహ్మ మననశీలుఁడును, మృత్యువును బ్రియబంధువునుగాఁ జూచువాఁడు నగునాదధీచి దేవతలకోరిక విని సంతుష్టచిత్తుఁడై పరిహాసము చేయుచున్నట్లు లీవిధముగాఁ బలికెను. "ఓసురలారా! మీరు చావులేనివారు. కావున మరణకాలమందు శరీరుల కెంతదుస్సహ మగుక్లేశము సంభవించునో తెలిసికోలేరు. జీవింపఁ దలంపుగలవారికి జీవులకు దేహము ప్రియతమమై యిష్టమైయుండు. అట్టిదేహమును నారాయణుఁడువచ్చి యాచించినను నిచ్చుట కెవఁ డుత్సహించును?" అని పల్క విని దేవత లిట్లనిరి. "ఓమునీంద్రా! ఓపుణ్యకీర్తీ! నీచరిత్రము నుతింపఁదగి యున్నది. నీవు భూతదయగలిగి వర్తించుచున్నవాఁడవు. అట్టి మీవంటిమహాత్ములకు విడువఁదరముగాని వస్తువొకటియుం

డునా? మరణకాలమున దేహుల కధికశ్రమమగునని చెప్పితివి అది సత్యమే.లోకమున స్వప్రయోజనమునే ముఖ్యముగాఁ జూచుకొనెడివాఁడు పరుల బాధల నెఱుంగఁజాలఁడు. కావున వాఁడు యాచింపవచ్చును.ఆదాత యియ్యనని ప్రత్యాఖ్యానము చేసిన చో సతండా యాచకుని బాధల నెఱుంగనివాఁడే యగును. అట్లే మేము స్వార్థపరులము కాన నీకష్టములను బాటింపక యాచించితిమి. మా ప్రార్థనమును దిరస్కరించిన నీవును మా కష్టముల నెఱుంగనివాఁడవే" యని నుడువుచున్న సురలంగాంచి మునీంద్రుం డిట్లనియె, "ఓసురలారా! మీధర్మబుద్ధిని దెలియ నెంచి నే నట్లుపలికితిని, కాని వేఱుకాదు. నాప్రార్థనము క్షయమునుబొందినది. కాన నాదేహమును దప్పక విడువవలసినవాఁడనే. అట్లు పరిత్యజనీయమయిన నాశరీరమును మీకుఁ బ్రియమగునట్లుగా విడుచుట కభ్యంతరమేమున్నది? లోకమునఁబురుషుఁడెవఁడుభూతదయాసమన్వితుఁడై యస్థిరమగుశరీరముచేతస్థిరమగు ధర్మమునుగాని కీర్తినిగాని సాధింపఁడో, వాఁడు పరోపకార మొనరించుచున్న వృక్షాదిస్థావరములకంటెఁ దక్కువవాఁడని యెన్నఁదగును.ఎవఁడు భూతములు శోకము చెందిన శోకించి, సంతసించిన సంతసించునో,యట్టివాఁడు సంపాదింపఁదగిన. యక్షయధర్మ మిట్టివంటిదేకదా! అహహా! కుక్కలు మొదలగు జంతువులకు భక్షణీయములై తమజ్ఞాతులకు విగ్రహకారులై తమకుఁబనికిరాలినవై యున్న తమశరీరములను పరోపకారార్థముపయోగింపని మానవులజన్మము వ్యర్థమయినది.అంతకంటెఁ గష్టములేదు.దైన్యములేదు."అని యిట్లుపలికి నిశ్చితబుద్ధియగు దధీచి తనప్రత్యగాత్మను బరబ్రహ్మమునందు సమర్పించి యిం

ద్రియములజయించి, మనోబుద్ధులనుమరలించి, పుణ్యపాపకర్మములను నశింపఁజేసికొని, జీవశరీరకుఁ డగు పరమాత్మ యాథాత్మ్యమును జూచుచు, యోగము నాశ్రయించెను. అతఁడు తన దేహము నెఱుంగనె యెఱుంగఁడు. అనంతర మా యెమ్ములతోఁ జేసిన వజ్రాయుధమును గేలఁగీలించి దేవేంద్రుండు భగవత్తేజంబుతోఁ సంయుతుఁడై సమస్తదేవగణములును బరివేష్టించి సేవింప నైరావతారూఢుండై మునులచే నుతింపఁబడుచు ముల్లోకముల సంతసింపఁజేయుచున్న వానివలె సత్వరముగఁ గదలి ప్రళయకాలమునఁ నశింపఁజేయనెంచి ప్రపంచముపైఁగవిసినరుద్రునివలెఁ జూపట్టుచు రాక్షసానీకములమధ్యమున నున్న వృత్రాసురు నెదుర్కొనెను. ఓరాజా! అట్లుగూడిన సురాసుర సైన్యములకుఁ గృతత్రేతాయుగ సంధికాలమున నర్మదానదీతీరమున ఘోరసంగ్రామము ప్రవర్తిల్లెను. అప్పుడు వృత్రాదులగురక్కసులు రుద్రులచేతను, వసువులచేతను, నాదిత్యులచేతను, నశ్వినుతులచేతను, బితృదేవతలచేతను, నగ్నులచేతను, సురలచేతను, సాధ్యులచేతను, విశ్వేదేవులచేతను, పరివృతుఁడై స్వీయకాంతులచేఁ బ్రకాశించు నింద్రునిఁజూచి సహింపఁజాలక వృత్రపక్షముననున్న, నముచియు, శంబరుండు, ననర్వుండును, ద్విమూర్ధుండును, వృషభుండును, నంబరుండును, హయగ్రీవుండును, శంకుశిరుండును, విప్రచిత్తియు, నయోముఖుండును, బులోముండును, వృషపర్వుండును, బ్రహేతియు, హేతియు, నుత్కటుండును, ధూమ్రకేశుండును, విరూపాక్షుండును, గపిలుండును, విభావసుండును, నిల్వలుండును, వాతాపియుఁ బల్వలుండును, దందశూకుండును, వృషధ్వజుండును, గాలనాభుం

డును, మహానాభుండును, భూతసంతాపనుండును, వృకుండును, మాలియు, సుమాలియు, మొదలగువీరాగ్రేసరులును, వేలకొలందిసంఖ్యగలదైతేయులును,దానవులును,యక్షులును,రక్షస్సులును, గనకవికారము లగుపరికరములఁ ధరించి మృత్యువునకయిననుదుష్ప్రాపమగు నింద్రుని సేనాముఖమునునిరోధించిజాగరూకులయి గర్వాతిరేకంబునఁ బెనుబొబ్బలువెట్టుచు,గదలను, బరిఘలను, బాణంబులను, ప్రాసంబులను, ముద్గరములను, దోమరంబులను, శూలంబులను, బరశ్వథంబులను, ఖడ్గములను,శతఘ్నులను, మొదలగు నానావిధ శస్త్రాస్త్రములనుదాల్చి, సురవీరుల నెదుర్కొని పోరాడిసాగిరి. ఆసమయంబునఁ బుంఖానుపుంఖములుగాఁ బ్రయోగించిన రాక్షసుల శరజాలములచే సంఛన్నులయి మేఘావృతములగునక్షత్రములవలె సురలు గానరారైరి. అయినను రాక్షసప్రయుక్తము లగు నాయాయుధజాలములు హస్తలాఘవముగలసురసైనికులచేఖండింపఁబడి నడుమనే నశించెను; కాని వారిని జెందలేకపోయెను. తమయాయుధములు వ్యర్థములగుటకుఁ గోపించి రక్కసులు, గిరిశృంగములను,వృక్షములను,పాషాణములను జేకొని దేవసైన్యములపైఁ దొంటివలె వర్షించిరి,కాని యవియు నిష్ఫలంబులయ్యె. అప్పుడు రాక్షససైనికులు తమశస్త్రాస్త్రసమూహములును,దమవర్షించిన గిరిశృంగాదులును దేవతలకు హాని గల్గింపకపోవుట నెఱింగి మిక్కిలి భీతిల్లిరి. ఓరాజా! రాక్షసులు చేసిన యొకయపకారమును దేవతలను బొందలేకపోయెను. క్షుద్రులుపల్కిన నిందావాక్యములు మహాత్ములను క్షోభింపఁజేయలేనట్లు భగవదనుకూలు రయినదేవతలను నాదానవాదుల శస్త్రాదు లేమిచేయఁ

గలవు? అనంతరము విష్ణుభక్తివిముఖు లయినరాక్షసవీరులు హతబలులై, యుద్ధగర్వమును విడిచి తమప్రయత్నములు వ్యర్థ మగుటకు మిగులఁ జింతించి బలపరాక్రమాదులచే సుప్రసిద్ధు లయ్యును సంకోచింపక యుద్ధావనియందు వృత్రునివిడిచి పర్వె త్తుటకు నిశ్చయించిరి. ధీరాగ్రేసరుఁ డయినవృత్రుఁ డాసమా చారమెఱిఁగి తీవ్రమగుభయముచేఁ బలాయితు లగువారినినిలిపి నవ్వుచుఁ గాలోచితమును ధీరులకు మనోహరమునగు నీవచన మును బలికెను. 'ఓవిప్రచిత్తీ! ఓశంబరా! ఓపులోమా! ఓయనర్వుఁడా! ఓరాక్షసవీరులారా! నావచనము నాలింపుఁడు. పుట్టినవానికెల్లను మరణము తప్పదు. అది నిశ్చయము. ఆమృ త్యువునకుఁ బ్రతిక్రియ వేఱొకటి లోకమున లేదు. లోకమున రెండువిధములగు మరణములు యుక్తములని పెద్దలువచించి యున్నారు. ఆరెండును సామాన్యులకుఁ బొందఁ దరముకానివి. ఇంద్రియంబుల జయించి, బ్రహ్మవిషయక ధారణాయోగముచే శరీరము విడుచుటయొకటి. రెండవది యుద్ధమునకు విముఖుఁడు కాక దేహమును విడుచుట. కావున యుద్ధమరణము సామా న్యులకు లభ్యముకాదు. ధైర్యమునఁబోరుఁడు. మనము జయించి తిమేని సంతోషమే. లేనియెడ మనకుఁ గీర్తియు వీరస్వర్గంబును గలుగును. అట్టి యశోవీరస్వర్గంబులఁ గల్గించు మృత్యువునెవఁ డిష్టపడఁడు. కావున ధైర్యవంతులరయి నిలిచి యుద్ధమొనర్పుట యుక్తము'' ఇది పదియవయధ్యాయము.

—ఇంద్రవృత్రాసురుల యుద్ధము.—

అని యిట్లు తమయధిపతి యగువృత్రాసురుఁడు ధర్మవచన

ముల నుపన్యసించుచున్నను నతిభయము చెంది పలాయనపరు లయిన యారక్కసులు యుద్ధమునకు మొగియరైరి. అప్పుడు వృత్రుఁడు కాలానుకూల్యము గలసురలచే బాధితమై సేనానీవి రహితమైనట్లు పర్విడుచున్న తన సైన్యమును జూచి సహింపఁ జాలక కోపావిష్టుండయి, పలాయితు లగువారిని వెంబడించి పర్విడు దేవతలను స్వబలముచే నివారించి నిందాపూర్వకముగా నిట్లు పలికెను. 'ఓసురలారా! తల్లి విడిచిన పురీషమువలె దుర్బలులై పలాయితులగు రక్కసుల వెంబడించి కొట్టుటవలన మీకుఁగీర్తిసంభవింపనేరదు. భయపడినవారిని జంపుట శూరధర్మముకాదు. స్వర్గదాయకమునుగాదు. ఓ నీచులారా! సురలారా! మీకు విషయభోగేచ్ఛ లేనిచో, మీహృదయమున సమర మొనరింపఁదలంపున్నచో, నందులకుఁ దగిన బలమున్నచో, నా యెదుట క్షణమాత్రము నిలువుఁడు." అని యిట్లు పలుకుచుఁ మహాబలవంతుఁ డగువృత్రుండు లోకములు మూర్ఛిల్లునట్లు భయంకర మగుసింహనాదమొనర్చెను. ఆనాదమునువిని సమస్తదేవగణములును మూర్ఛిల్లి పిడుగడిచినవారివలె నేలఁబడెను. అంత వృత్రుఁడు రణమందు మదోన్మత్తుఁడై శూలమునుదాల్చి భూమిని జలింపఁజేయుచు మదపుటేనుఁగు వనంబునుంబోలె మూర్ఛిల్లిపడి నిమీలితనేత్రులయియున్న సురసైనికుల బలముచే తను పాదములచేతను మర్దింపనారంభించెను. అదిచూచి దేవేంద్రుఁడు సహింపఁజాలక తన శత్రువగు వృత్రునిపై భయంకర మగు నొకగదను బ్రయోగించెను. వాఁడా వచ్చుచున్న గద దుస్సహమైనదైనను నెడమచేతితో లీలగా నొడిసిపట్టె. కోపోద్దీప్తుఁడై భయంకరముగా సింహనాదము చేయుచుం బెద్దపెద్ద

యడుగులిడుచువచ్చి యాగదాదండముతో నైరావతము కుంభ స్థలమునుగొట్టెను. దానిఁజూచినవారందఱు నావృత్రునిపనిని మెచ్చుకొనిరి. అంత గదాతాడిత మగునైరావతము వజ్రభిన్న మగుపర్వతమువలె సుడివడుచుఁ బీడను సహింపఁజాలక రక్తమును గార్చుచు దేవేంద్రునేడువిండ్లదూరమునకుఁగొనిపోయెను. ఓనరేంద్రా! అట్లైరావతంబును, దేవేంద్రుండును దుఃఖిత చిత్తులై సమరభూమినుండి తొలంగుచుండఁగాఁ జూచి మహాత్ముఁ డయినవృత్రుండు దేవేంద్రునిఁ జంపఁదగినసమయ మలవశిననను నధర్మమని మగుడ గదనుబ్రయోగింప నిష్టపడలేదు. అనంతర మింద్రుం డమృతస్యందులగు తన హస్తములతో నైరావత ముశరీరముఁ దడవిదానిబాధ దొలంగించియుద్ధాభిముఖుఁడయ్యె. సమరాభిలాషతో వచ్చి వజ్రాయుధహస్తుఁడై యున్న దేవేంద్రునిఁజూచి వృత్రుండు తనసోదరుఁ డగువిశ్వరూపుని నిర్దయుఁడయి చంపిన యింద్రుని ఘోరకృత్యమును స్మరించుచు శోకసంతప్తుఁడై పిమ్మట మోహాక్రాంతుండై పెద్దపెట్టున నవ్వుచు నింద్రున కిట్లనియె. 'ఓరీయింద్రా! నీవు నాభ్రాతనుజంపి బ్రహ్మహత్యకును గురుహత్యకునునొడిగట్టిన పాపాత్ముండవు.అట్టి నీవు నేఁడు దైవవశమున నాయెదుటఁ బడితివి. పాషాణకఠోర మగు నీహృదయము నిప్పుడే యీ శూలమునభేదించి నిన్ను సంహరించి నా భ్రాతృ ఋణమును దీర్చుకొందును. అకటా! నాసోదరుండు బ్రాహ్మణుండు. వేదాధ్యయనసంపన్నుఁడు. మఱియు నీకు గురువు. అపరాధమేమియుఁ జేయనివాఁడు. యజ్ఞదీక్షవహించి వర్తించుచున్న యోగ్యుఁడు. అట్టి మహాత్ముని నీవు విశ్వసింపక కరుణారహితుండవై యాజ్ఞికుఁడు పశువు శిరంబులంబోలె నతనిశిరంబు

లఖండించితివి. నీవంటి పాపాత్ముఁడు వేఱొకండుకలఁడా? నీవుపుత్ర హీనుండవు.సంపద్విహీనుండవు. లోకాపవాదమునకు జంకనివాఁడవు.గురుహత్యారూపమగు నీవొనర్చిన క్రూరకృత్యము పిశాచములకును నిందనీయమైనది. అట్టిపాపాత్ముఁడవగుటచే మదీయశూలభిన్నుండవయిన నీశరీరము పవిత్రమగు నగ్ని దహింపఁజాలదు. కావున గృధ్రములు లెస్సగా భుజించును. మఱియుఁ గ్రూరుండవగు నిన్ననుసరించివచ్చిన మూఢు లయినదేవతలందఱును నస్త్రముల ధరించి నాపైఁ గవిసినచో నిశాతమగు నాత్రిశూలముచే వారి శిరంబులఁ జీల్చి భూతములకు బలిపెట్టెదను. ఓరీయింద్రా! వీరుఁడవయిన నీవు వజ్రాయుధంబున నాశిరంబును ద్రుంచితివేని, యప్పుడు నాదేహముచే భూతబలియొనర్చి కర్మబంధనమును విడిచి జ్ఞానవంతులు పోవుమార్గ మనుసరించెదను. ఓసురేశా! నీయెదుట నిలువఁబడి నీకు శత్రువనైయున్న నాపయి నప్రతిహత మగువజ్రాయుధము నేల ప్రయోగింపవు? నీగదవలెను, స్వల్పప్రయోజనమగు యాచనవలెను, వ్యర్థమగునేమోయని సందేహించుచున్నావా! నీవజ్రమట్లువ్యర్థముకాదు. కావున సందియము విడిచి ప్రయోగింపుము. ఇంతియకాక నీవజ్రము భగవంతుని తేజంబుచేతను, దధీచి తపంబుచేతను, మిక్కిలి తీవ్రమైయున్నది. కావున శ్రీహరిచే నాజ్ఞప్తుఁడవయిన నీవాయాయుధమున నన్నుఁ జంపుము. భగవదనుకూలపక్షము గలవారికి రాజ్యసంపదయును బ్రభుత్వాదిగుణంబులును గల్గునని చెప్పుదురు. విష్ణుపక్షాశ్రయుఁడవగు నీకట్టివి గలుగుటకు లోపములేదు.మఱియు నాగురువయిన నారాయణుండు "నాచరణారవిందములందు మనంబు నిలుపు" మని చెప్పె. నే నట్లు

నామనంబునుదచ్చరణారవిందముననిలిపి విషయాసక్తుండనుగాక నీవజ్రంబున భిన్నుండనై స్వర్గాదిలోకముల నపేక్షింపక మోక్షమును బొందెదనుగాని నరకమును బొందను. మాకుఁ బ్రభువగు సంకర్షణుండు ప్రయోజనాంతరము నపేక్షింపని తన భక్తులకు భూమియందును, స్వర్గమందును, పాతాళాదిలోకములందును, సంపదల నొసంగఁడు. అదియె మిక్కిలి సముచితమయినది. అట్టిసంపదలు వినాశసభయమును మనోవ్యథను, మదమును, గలహము, నభిమతము లగువస్తువులు కలుగమివలని దుఃఖమును, క్షుద్రసుఖాభిలాషమును గల్గింపకమానును. వానివలన మోక్షప్రాప్తి గలుగనేరదు. అందుచే, నో శక్రా! మాప్రభువగు సంకర్షణుండు తనభక్తునికిఁ ద్రివర్గరూపఫలమును గలిగింపక స్థిరఫలరూపమగుముక్తినిగల్గించును. తాదృశముక్తిని గల్గించు భగవత్ప్రసాదము నిష్కాములగు మావంటి భక్తులకే లభించును. మావంటివారికే భగవంతుఁడు ప్రసన్నుండగును. కాని విషయభోగపరాయణు లగుమీవంటివారికిఁ బ్రసన్నుండు కానేరఁడు. తాదృశభగవత్ప్రసాదము సంపాదింపలేని మీవంటివారికి స్థిరఫలముదక్క స్థిరఫలము లభించుటెట్లు?" అని యిట్లు పలికి భక్తివశమున భగవంతు నభిముఖునిఁగాఁ జేసికొని "ఓనారాయణా! నీపాదమూలము నాశ్రయించిన దాసులకుదాసుండనై వర్తించెద. నామనంబుప్రాణనాథుఁడవగు నీగుణంబుల స్మరించుఁగాక. నావాగింద్రియము నీగుణములనే నుతించుఁగాక. నాశరీరము, భవదారాధనతత్పర మగుఁగాక. ఓనారాయణా! సకలసౌభాగ్యనిధి వగునిన్ను విడిచి నేను వైకుంఠము నపేక్షింపను. చతుర్ముఖైశ్వర్యమును గోరను. సార్వభౌమత్వము నభిలషింపను.

పాతాళాది లోకాధిపత్య మంగీకరింపను. అణిమాది యోగసిద్ధులను వాంఛింపను. మోక్షము నిష్టపడను. ఓయరవిందాక్షా! ఱెక్కలు రానిపిల్లలు తల్లులనువలె, విరహదుఃఖిత యగుప్రియురాలు తన ప్రియునివలెను, నామనంబు నిన్నుఁ జూడఁ గాంక్షించుచున్నది. ఓవాసుదేవా! ఉత్తమశ్లోకు లయిననీభక్తులతో నాకు స్నేహము సంఘటిల్లుఁగాక. త్వన్మాయామోహితుండ నై విషయాసక్తుండనయి పలువిధము లగుకర్మము లొనర్చుచు సంసారచక్రమునఁ బరిభ్రమించు నాకిఁక మీఁద విషయాసక్తిగలుగకుండునట్లు లనుగ్రహింపుము". ఇది పదునొకండవ యధ్యాయము.

అని యిట్లు వృత్రుండు పలువిధములఁ దలపోసి, స్వశరీరమును విడువనెంచి, యుద్ధమందలిజయముకంటె మరణమే శ్రేష్ఠమైనదని తలంచుచు భయంకర మగుశూలమును గ్రహించి ప్రళయకాలోదకమందుఁ గైటభాసురుఁడు నారాయణునిఁబోలె, నింద్రు నెదుర్కొనెను. అనంతరము వృత్రాసురుండు సరసంబుగాఁ బ్రళయకాలాగ్నివలె దుస్సహమగుశిఖ గలయాశూలమును గిరగిరఁ ద్రిప్పి పెద్దపెట్టున సింహనాదంబుచేసి "ఓపాపీ! యింద్రా! దీనిచేఁ జచ్చితి" వని పలికి రెట్టించిన కట్టలుకతో నిందునిపైఁ బ్రయోగించె. అట్లు ప్రయుక్తమై, భ్రమించుచు నుల్కవలె దుర్నిరీక్ష్యమై, యాకసమునుండి వచ్చుచున్న యాశూలమును సురపతి గనుఁగొని, దానికిఁ జంచలింపక, నూఱుధారలు గలవజ్రమును గేలసంధించి యాయాయుధమును, సర్పరాజువలెఁ బొల్చు నావృత్రుని బాహుదండమును జూప ఱచ్చెరువడ ఖండించెను. తన బాహువు దెగినందులకు వృత్రుండు మిగులఁగ్రుద్ధుండై భయంకర మగుపరిఘమును జేపట్టి వజ్రహస్తుఁ

డయియున్న యింద్రునిసమీపించి యింద్రునిఁగొట్టె. అట్టె యై రావతమును మర్దించెను. ఆదెబ్బచే నింద్రాయుధముచేతనుండి పడెను. అంత వృత్రుని యద్భుతకార్యమును జూచి యచ్చటి సుర లును, జారణులును, సిద్ధసంఘములును, నాదనుజాధిపతిని నుతిం చి, యింద్రునిదురవస్థకు మిగుల వగవసాగిరి. ఇంద్రుండు తనచేతి యాయుధము శత్రుసన్నిధియందు నేలఁబడినందులకుమిక్కిలిసిగ్గు పడి మగుడ దాని గ్రహింప నదిచూచి వృత్రుండతని కిట్లనియె. ఓయింద్రా! ఏలవిచారించెదవు? మగుడనాయుధమునుస్వీకరించి తివి కాన నీశత్రువ నగునన్నుఁ జంపుము. ఇది విషాదమునకుఁ గాలము కాదు. ఈస్వల్పపరాజయమునకు దుఃఖింపకుము. జిఘాం సులును, యుద్ధేచ్ఛగలవారు నగుపురుషుల కెల్లప్పుడును జయమే సంభవింపదు. ఒకదేశంబున నొకకాలంబునఁ బరాజయము గూడసంభవించు. పురుషులుకర్మవశ్యులగుటవలనను, బరమపురు షునికి నియామ్యులగుటవలనను, నాయా దేశములకును, దనకర్మ మునకును ననురూపము లగుసుఖదుఃఖాదుల ననుభవింప నీశ్వ రుండు జయాపజయాదుల నిచ్చుచుండు. ఈశ్వరదత్తములగు వానికై లజ్జాశోకములఁ జెందరాదు. సృష్టిస్థితిలయములను గావిం చువాఁడును సర్వజ్ఞుండును, జగత్కారణుండును, సనాతనుఁడును నగుపరమపురుషునకుమాత్రమే సర్వస్థలంబులందును జయము గల్గుచుండును. కాని మనవంటిసామాన్యుల కన్నిస్థలములందును జయముగల్గునని చెప్పఁజాలము. మఱియుఁ బరమపురుషునికి బ్రహ్మాదిలోకపాలురతోఁగూడినలోకములన్నియుఁ బాశబద్ధము లగుపక్షులు తదధిపతులకువలె వశములయి వర్తించు. అట్లుండ నీశ్వరున కోరులవలనఁ బరాజయ మెట్లు సంభవించును? ఇంతియ

కాక కాలరూపుఁడగు భగవంతుఁడే జయాపజయంబులకుఁ గారణమగుచుండును. ఒక్క జయాపజయముల కేయన నేల? ప్రవృత్తిసామర్థ్యంబు, వేగము, బలము, ప్రాణము, మోక్షము, సంసారము మొదలగు నన్నింటి కీశ్వరుండే కారణుండు. అట్లుండఁ దత్త్వము గ్రహింపనేరక యవివేకి జయాదులకుఁ దానే కారణుండని తలంచుచుండు. అట్లు తలఁచుట మిక్కిలి తెలివిమాలినపని. భగవంతుం డొక్కఁడే స్వతంత్రుఁడు. దారువికారమగు బొమ్మలును, యంత్రగృహీతములగు మృగములును బురుషునకు స్వాధీనములయినట్లు సమస్తభూతములు నీశ్వరున కధీనము లయియుండును. కావున మనమెంతమాత్రమును స్వతంత్రులము కామని తలంపుము. మఱియుఁ బ్రకృతిపురుషులును, మహదహంకారములును, భూతములును, నింద్రియంబులును, నంతఃకరణంబును మొదలగునవన్నియుం గూడియు భగవదనుగ్రహము లేకుండ సృష్టిస్థితిలయంబుల నొనర్ప సమర్థములు కాకపోయెను. వెక్కల? అతని యనుగ్రహంబు లేకుండఁ జతుర్ముఖుండయినను సర్గమునందు సమర్థుండు కానేరఁడు. ఇట్లుండ నజ్ఞుండు కార్యములం దసమర్థుం డయినను దన్ను సమర్థునిఁగానే తలంచుచుండును. ఆపరమపురుషుఁడు స్వయముగా భగవదనుగ్రహమునకుఁ బాత్రములగు పృథివ్యాది భూతముల చేతనే భూతములఁ బుట్టించుచున్నాఁడు. చంపుచున్నాఁడు. ఆయువు. ప్రభుత్వము, తేజస్సు, మొదలగునవి యన్నియుఁ బరమపురుషున కధీనములయి యుండును. అట్టియాయురాదులన్నియు నుచితకాలములందు నిజకర్మములకు ఫలంబులయి సంప్రాప్తమగుచుండు. అందువలన మరణ దారిద్ర్యాదులువలె నాయురాదులును గోరకుండఁగనే వచ్చి జీవులనుబొందు

చుండును భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడవగు నీకు సమస్త సంపదలును గలుగక మానవు. వెఱవకుము. జయాపజయాదిక ము సర్వమును భగవదధీనములయి తదనుగ్రహమువలనను నిగ్రహమువలనను, గలుగుచుండుటచే నప్పటప్పట మనవంటివారికి సంభవించు కీర్తిదుష్కీర్తులందు, జయాపజయంబులందును, సుఖదుఃఖములందును జీవితమరణములందును, వికారము చెందరాదు. అట్టివాఁడే వివేకవంతుఁడనఁబడును. సత్త్వరజస్తమోగుణములు కేవలము ప్రకృతివేకాని జీవునివికావనియు, సత్త్వాది గుణపరిణామ మగు దేహమున నున్నయాత్మను సాక్షియనియుఁ దలంచినవాఁడెప్పుడును సంసారబద్ధుండు కానేరఁడు. ఓయింద్రా కావున వివేకవంతుఁడవయి పోరుము. నీవు సంగరమునందు నా యాయుధమును బాహువును నఱికి పరాభూతునిఁ గావించితివి. అయిన నేనంతతో నూరకుండక శక్తికొలందిని బ్రయత్నించుచు నీప్రాణము లపహరింప యుద్ధమొనర్చుచున్న నన్నుఁజూడుము. సంగరమును జూదముతోఁ బోల్పనచ్చును. ఇందు జీవములే పణముగా నుంపఁబడును. కరితురగాదులు ఫలకములుగా నుండును. బాణములు పాచికలుగా నుండును. ఇట్టి దానియందు వీనికి జయమనియు, వీనికిఁ బరాజయమనియు నెవఁడు నిశ్చయింపఁ గలఁడు. అయిన నీకు భగవత్సాహాయ్యము కలదు. కావున నీకే జయముగలుగునని నిశ్చయింపవచ్చు" అని యిట్లు పలికినవృత్రుని నిష్కపటవచనములు విని సంతసించి యతని మెచ్చుకొని వజ్రమునుదాల్చి యాశ్చర్యమును విడిచి పెద్దపెట్టున నవ్వుచు నింద్రుఁ డతనికిట్లనియె. 'ఓవృత్రాసురా! నుతింపఁదగిన యిట్టిబుద్ధి గలవాఁడగుటవలన నీవు తప్పక కృతకృత్యుఁడవయితివి. నీవన్ని

విధములచేతను నీకంతరాత్మయై నిరతిశయప్రియుఁడయియున్న భగవంతుని సేవించితివి. నీవు జనమోహినియగు విష్ణుమాయను ధరించితివి. కావున నీకుఁ దామసత్వమును విడిచి సాత్త్వికపురుషత్వమును బొందితివి. రాజసస్వభావము గలనీకు షాడ్గుణ్యపూర్ణుఁడయినవాసుదేవునియందు నిశ్చలబుద్ధిగలుగుట కచ్చెరువు పడను చున్నయది. మోక్షాధిపతియును, నాశ్రితబంధహారియు నగు నీశ్వరునియందు భక్తిగల పురుషుఁడు బ్రహ్మానందసముద్రమున విహరించుచు, స్వల్పములై గుంటనీటికి సరివచ్చు కైవల్యాది సుఖముల కింతయేని సరకుగొనఁడు" అని యిట్లన్యోన్యమును భగవద్ధర్మ విచారమును సలుపుచు వీరశ్రేష్ఠు లగునింద్రవృత్రాసురులు తనతన యపారవీర్యంబును జూపుచు సంగరంబొనరించిరి. ఓరాజా! అప్పుడు వృత్రుఁడు భయంకరమైన లోహమయపరిఘమును వామహస్తంబునఁ దాల్చి యిందునిపై విసరెను. ఇంద్రుండా వచ్చుచున్న పరిఘమును దిగ్గజశుండాదండమువంటి యతని వామహస్తమును, దన వజ్రమునఁనొక్కట ఖండించెను. ఇట్లు ఖండితము లయిన బాహుమూలముల నుండి స్రవించు నెత్తుటి వఱదలచేఁ దడిసిన వృత్రుఁడు, వజ్రాయుధమున ఱెక్కలు దెగ నాకసమునుండి జాఱిపడిన పర్వతమువలె నొప్పెను. అనంతరము దనుజపతి మృత్యుతుల్యము లగుదంష్ట్రలచే జగత్త్రయమును గ్రసించుచున్నట్లు కానవచ్చుచు మిక్కిలి దీర్ఘకాయుఁడై బలముచేఁ బర్వతముల నిట్టట్టు చలింపఁజేయుచు, నడగొండవలెఁ జూపట్టుచుఁ బాదములచే భూమిని జూర్ణముగా నొనర్చుచు, భూమ్యంతరిక్షములకుఁ దాఁకునట్లు నోరు దెఱచి యాకసమువలెఁ



1157. ఇంద్రుఁడు వృత్రాసురుని వధించుట.

గంభీరమగు వక్త్రబిలమున సర్పరాజువలెఁ గాననచ్చు భయంకరమగు నాలుకచే మహాబలముగల సర్పము గజము నట్టులైరావతసహితుఁ డగునింద్రుని గ్రసించెను. ఇట్లు వృత్రగ్రస్తుఁడగు తమప్రభువును గాంచి సురలును, బ్రజాపతులును, మహర్షులును "అక్కటా! గొప్పకష్టము సంభవించె" నని చింతాక్రాంతులయి హాహాకారంబులు చేసిరి. ఓరాజా! ఇంద్రుఁడు పరమపురుషునిచే సంరక్షితుఁడగుటచేతను, భగవంతుని యోగమాయాబలముచే వర్ధితుఁడగుటచేతను, వృత్రుని గర్భగోళమునుజొచ్చినను మృతినొందలేదు. అనంతరము బలాసురునిఁ జంపిన యింద్రుఁడు తనవజ్రముచే వానికుక్షిని జీల్చి వెలికివచ్చి పర్వతశృంగమువలెనున్న వానిశిరంబు బలాత్కారమున ఖండించెను. ఓరాజేంద్రా! నిశాతధారలు గలవజ్రము వృత్రుని కంఠముచుట్టును బరిభ్రమించుచు, నొక సంవత్సరకాల మతిక్రమించునప్పటికి ఛేదింపఁ గలిగెను. వృత్రునిశిరంబు ఖండితమయిన పిమ్మట గంధర్వులును సిద్ధులును మిక్కిలి సంతసించి గగనమున దుందుభులు మ్రోయించిరి. మహర్షులు వృత్రునిఁ జంపఁ దగు వీర్యమును బ్రకటించెడి మంత్రములచేత నింద్రుని నుతించిరి. సురలు పుష్పవర్షములు గురియించిరి. స్వప్రకాశరూప మగు నాత్మ వృత్రశరీరమునుండి నిర్గమించి లోకులందఱుఁ జూచుచుండఁగనే వైకుంఠమును బొందెను. ఇది పండ్రెండవయధ్యాయము.

---

—ఇంద్రుండు బ్రహ్మహత్యకు జంకి మానససరస్సున దాఁగుట.—

ఓనరనాథా! వృత్రుండు చచ్చుటవలన మూఁడులోకములును లోకపాలురును, మనోవ్యథలను విడిచి సంతసించి నిగతి

శయు సుఖంబును గాంచిరి. కాని యింద్రుఁడుమాత్రము సుఖ మందలేకపోయెను. అనంతరము దేవతలును, ఋషులును, పితృ దేవతలును భూతములును, దైత్యులును, దేవానుచరులును, బ్రహ్మయు, రుద్రుండును, సురేంద్రుండును తక్కినవారును దమతమ నిలయంబుల కరిగిరి'' అని నుడువుచున్న మునింగాంచి రాజిట్లనియె. ఓమునీంద్రా! వృత్రవధానంతరమం దింద్రుండు దక్కందక్కినవారందఱును సుఖంబుగాంచిరని చెప్పితివి. ఇంద్రు నకు సుఖం బలవడకపోవుటకుఁ గారణంబేమి? దేవతల కందఱకు సుఖముగల్గ నింద్రునకుఁగూడ సుఖము గల్గి తీఱవలయును. అట్లుండ సురలకు సుఖమును సురేంద్రునకు దుఃఖమును గలు గుటకుఁ గారణంబును వివరించి చెప్పుము. వినఁ గుతూహల మగుచున్నది' యని వచింప మునీంద్రుం డతనికిట్లనియె.'ఓమా నవేంద్రా! మొదట సురలును, మునులును మొదలగువారు వృత్రుని పరాక్రమమునకు భీతులయి యింద్రుని సమీపించి వృత్రునిఁ జంపి తమ భయమును దొలఁగింపవలయునని ప్రార్థిం చిరి. కాని యింద్రుండు బ్రహ్మహత్యకు భయపడి యప్పని కిష్ట పడక "ఓసురలారా ! మునులారా ! పూర్వము విశ్వరూపునిఁ జంపుటవలన బ్రహ్మహత్యనన్నుఁ జుట్టుముట్టి బాధింపఁగా దానిని స్త్రీలును, భూమియును, జలములును, వృక్షములును; బంచి స్వీ కరించినవి. ఇప్పుడు వృత్రునిఁ జంపుటవలన జనితంబగు పాపము నెందుంచి పవిత్రుండనగుదును'' నని సవిచారముగాఁ బల్కఁ గా. మునీశ్వరులు విని యింద్రుంజూచి "ఓయీ! నీవు బ్రహ్మ హత్యకై వగవకుము. భగవత్ప్రీతిగా నీచే నశ్వమేధమును జేయించెదము. దానివలన నీకు మంగళములు లభింపకమానవు.

నీవు భయపడ నవసరము లేదు. అశ్వమేధమువలన బ్రహ్మహత్య నివర్తించునా? యని సంశయింపఁ బనిలేదు. లోకత్రయమునకు నంతరాత్మయై సమస్తమునకును నియామకుఁడై స్వయంప్రకాశుఁడై యున్న నారాయణుని హయమేధముచే నారాధించితివేని త్రిభువనమును సంహరించుటవలనం గల్గిన పాతకము సైతము తొలఁగిపోవునని చెప్పఁ దగియుండ వృత్రవధ జనితపాపము తొలఁగి పోవునని వేఱ చెప్పవలయునా? మఱియు బ్రాహ్మణునిఁ జంపినవాఁడైనను, దండ్రిని ఖండించినవాఁడైనను, గోవును సంహరించినవాఁడైనను, దల్లిని సమయించిన వాఁడైనను, గురువును దోరించినవాఁడైనను, శ్వపచుఁడైనను, బుల్కసు లను పాపజాతివారైనను భగవంతుని సభక్తికముగాఁ గీర్తించి నంతమాత్రమున సంశుద్ధులగుదురు. అట్లుండ నీవు శ్రద్ధాసమన్వితుఁడవై భగవంతునుద్దేశించి యశ్వమేధమువంటి మహాక్రతువు నొనర్చుచుండఁగా, మేము చేయించుచుండఁగా, దానివలన బాపములు తొలఁగిపోవుట కబ్బురమేమున్నది? పరబ్రహ్మమునకు శరీరభూతమగు సచరాచరంబగు జగంబును సంహరించినను నశ్వమేధమొనరించిన నీకుఁ బాతకముండదని చెప్ప నొప్పునప్పుడు ఖలుఁడగు వృత్రాసురువధవలని పాతక మీ మహాయాగముచే దొలంగుట వింతయా? అనియిట్లు బ్రాహ్మణులు పలుమాఱు పలువిధములఁ దన్నుఁ బ్రోత్సాహింపఁగా విని యింద్రుండు నిర్భీతుండయి వృత్రునిఁ దెగటార్చెను. వృత్రుఁడు ఖండితుఁడయిన తోడనే బ్రహ్మహత్యాపాతక మనివార్యమై యింద్రుని జుట్టుముట్టెను. ఓరాజా! ఆబ్రహ్మహత్యాసంగతివలన నింద్రునకు దుఃఖమేకాని సుఖము కలుగలేదు. ధైర్యాది గుణముల

వలన నది సమకూరరాదాయని యడుగ నవకాశము లేదు. లజ్జావంతుండును, నిర్దయత్వ మందినవాఁడు నగువానిని ధైర్యాది గుణము లెన్నియున్నను సుఖింపఁజేయ లేవు. కావున నింద్రుఁడు ధైర్యాది గుణవంతుఁడయినను సుఖమందలేకపోయెను. పిమ్మట బ్రహ్మహత్య చండాలస్త్రీవలెఁ గానవచ్చుచు మూర్తిమతియై ముదుసలితనముచేఁబాదాద్యవయవములు కంపించుచుండ, క్షయరోగముచే వ్యాప్తరాలయి యెఱ్ఱనిజటలు దాల్చి, నెఱసిన మోటువెంద్రుకలు మొగముపై వ్యాపింపఁగా మాటిమాటికిని "నిలునిలువు" మని పల్కుచుఁ జేఁపలవంటి దుర్వాసనగల ప్రాణవాయువులచే, మార్గమును దోషయుక్తముగాఁ జేయుచుఁ, దన్ను సమీపింప నింద్రుండు దానింజూచి భీతుండయి దాని దప్పించుకొన దశదిక్కులకును నేఁగెను. కాని యెచ్చటను విశ్రాంతిస్థానము లభింపలేదు. ఓరాజా! అనంతర మింద్రుఁడీశానదిక్కున కేఁగి మానససరోవరమును బ్రవేశించి సూక్ష్మరూపమున నందున్నపద్మనాళము నాశ్రయించి తనదూతయగు నగ్నికిఁ బ్రవేశింపరాని జలము లందుండుటచే యజ్ఞాదిభాగ వర్జితుఁడై బ్రహ్మహత్యకుఁ గానరానివాఁడై తన్నివృత్తికుపాయమాలోచించుచు, వేయువత్సరంబులకాలంబు గడపెను. ఆసమయమందే విద్యాతపోయోగాదులచే సమర్థుం డయిననహుషుం డింద్రాధిపత్యంబు వహించి భోగ్యవస్తువులును భోగకరణములును సమృద్ధిగ సంప్రాప్తించుటవలన మదాంధుం డయి వివేకశూన్యుండై యింద్రపత్ని యగుశచీదేవినిగోరి యందువలన నా సంపదలనువదలి సర్పమై పుడమిని జన్మించె. అనంతర మింద్రుం డచ్చటనేయుండి విప్రవాక్యముల స్మరించుకొని చిరకాలము

భగవద్ధ్యానాసక్తుండయ్యె. మానస సరోవర పద్మములందు విహరించు లక్ష్మీదేవి, విష్ణుభక్తిచే నొప్పు నింద్రుని కాపాతకము లేకుండ రక్షింప సురక్షితుఁడయి కొంతకాలమునకు స్వర్గమున కరుదెంచెను. అంత బ్రహ్మర్షులందఱును దేవేంద్రుని సమీపించి సంతసముతో భగవదారాధనరూపమగు నశ్వమేధయాగమున కతని దీక్షితునిఁగాఁ జేసిరి. బ్రహ్మవాదు లగుమునులు ఋత్విక్కులై యాగకృత్యంబులు నెఱవేర్చుచుండ నింద్రుండు శ్రద్ధాసమన్వితుండయి సర్వనియామకుఁడయిన పరమపురుషు నారాధింప నందువలనవృత్రవధజనిత మగుపాపము గొప్పదయినను, సూర్యునివలన మంచువలెఁ బూర్తిగా నశించెను. ఓరాజేంద్రా! మరీచి మొదలగు మహామునులు చేయించిన యశ్వమేధము వలన నింద్రుఁడు బ్రహ్మహత్యారహితుండై స్వర్గరాజ్యమును బొంది సుఖంబులనుభవించెను. సమస్తపాపములను దొలంగించునదై భగవంతుని సంకీర్తనముకలదై భగవద్భక్తినభివర్ధించునదై భక్తజనుల వర్ణనమున నొప్పుచు, నింద్రుని జయమును, బ్రహ్మహత్యావిముక్తియుఁ గల్గిన యీమహాఖ్యానమును నిరుపమానమగు ప్రభావముగలది. దీనిని ప్రతిపర్వమునందును బఠించిన పండితులు ధనమును, యశంబును, రిపుజయమును, నాయువును, సమస్తమంగళములను, బొంది నిఖిలపాపవిముక్తులగుదురు. ఇది పదుమూఁడవ యధ్యాయము.

---

## చిత్రకేతూపాఖ్యానము.

అని చెప్పుచున్న శుకుంగాంచి రాజిట్లనియె. 'ఓమునీంద్రా! రజస్తమోగుణస్వభావుఁడయి, పాపకారియైన వృత్రాసురునకు

భగవంతుఁడగు నారాయణునియందు నిశ్చలమగుభక్తి యెట్లు కలిగినది? కేవలము సత్త్వప్రధానులగు దేవతలకైనను నిర్మల చిత్తులగు ఋషులకైనను, ముకుందునియందుఁదఱుచుగా భక్తి సంఘటిల్లుట దుర్లభము. అట్లుండ నీవృత్రాసురున కట్టిభక్తి యుదయించుట యచ్చెరువు కలిగించుచున్నది. పృథివీసంబంధు లగు రేణువులవలె లెక్కింపఁదరముకాని శరీరు లిందుఁ గలరు. కాని వారిలోఁగొందఱుమాత్రమే మానవత్వముకలవారు. ఆ మానవులలోఁ బెక్కండ్రు త్రివర్గరూపమగు శ్రేయస్సునే కోరు చుందురుకాని నిరతిశయసుఖదాయకమగు ముక్తినపేక్షింపరు. దైవవశమువలనఁ గొందఱు ముముక్షువులున్నను, వేయింటి కొక్కఁడుమాత్రమే రాగాది విముక్తుఁడగును. అట్లు ముక్తులగు వారిలోఁ గోటి కొకఁడుమాత్రమే రాగాదిరహితమగు చిత్తముగలిగిన నారాయణభక్తుఁడు సంభవించు చుండును. అట్లుండఁగా రజస్తమోభిహతుఁడై సర్వలోకములకును సంతాపము గల్గించువృత్రుున కట్లు దుర్లభమయినను, దృఢబుద్ధి భగవంతునియం దుదయించెనుగాని శబ్దాదివిషయములం దుద యింపలేదు. ఓమునీంద్రా! ఈవిషయమై నామనంబు మిక్కిలి సందేహించుచున్నది. కావున నతనిచరితమును సంపూర్ణముగా వినిపింపుము. విన మనంబు కుతూహలపడుచున్నది. ఆ వృత్రుఁడు విష్ణుభక్తియందేకాక పరాక్రమమందుఁగూడ గొప్పవాఁడు. లేనిచో నింద్రునంతటివానికిఁ బౌరుషముచే సంతసము గల్గింపఁగలఁడా! కావున నోమునివర్యా! భగవద్భక్తి చేతను, బౌరుషముచేతను నుదారుఁడగు వృత్రునిచరిత్రము విని పింపుమా. వినెదము'' అని కుతూహలముతో నడుగుచున్న రాజు

నకు మునిపుంగవుం డిట్లనియె. ఓనరేంద్రా! నీప్రశ్నము మిక్కిలి యుచితమయినది.నీ వెక్కుడగు శ్రద్ధతో వినుచు నిట్లు ప్రశ్నించి నందులకు నుతింపనచ్చును. నీవడిగినదాని కొకయితిహాసము కలదు. ఆ యితిహాసమును నేను మాతండ్రియగు వ్యాసునివలనను, నారదునివలనను, దేవమునివలనను వినియుంటిని. నే నెట్లుగావింటినో యట్లె చెప్పెద. సావకాశచిత్తుండవయి వినుము. ఇంద్రునిచేఁ జచ్చినవృత్రుండు పూర్వజన్మమున శూరసేన దేశములందుఁ జిత్రకేతుఁడను సార్వభౌముండై యుండెడివాఁడు.వాఁడు మిక్కిలి ప్రఖ్యాతికెక్కినవాఁడు. వాని పరిపాలితకాలంబున భూమి సమస్తకామములను బూరించుచుండె. వానికిఁ గోటిమంది భార్యలుగలరు. అయిన నతని కొకభార్యయందయినను సంతానము గలుగలేదు. అతఁడు లావణ్యమును, నౌదార్యమును, యౌవనమును నుత్తమకులప్రసూతత్వమును శాస్త్రజ్ఞానమును సార్వభౌమత్వమును, సమస్తసంపదలను బొందినవాఁడయినను, మఱియుఁ బలువిధములగు సద్గుణములు గలవాఁడయినను, సంతానములేదనెడి విచారము దుర్నివారమయి బాధింపఁజొచ్చెను. అందువలన సార్వభౌముఁడయిన యాచిత్రకేతువునకు, సమస్తసంపదలుగాని సౌందర్యవతులగు భార్యలుగాని సస్యసంపదలతోఁ బొల్చెడిభూమిగాని సంతసము గొలుపలేక పోయినవి.ఇట్లు సంతతంబును సంతానముగూర్చి చింతించుచున్న యాభూకాంతుని మందిరమునకు భగవంతుఁడును,జ్ఞానసిద్ధుండును యథేష్టముగా లోకములఁ దిరుగువాఁడును నగు నంగిరసుండను మునిపుంగవుం డొకనాఁడు వచ్చెను. చిత్రకేతుఁ డతని కెదురేగికొనివచ్చి యాసనమిచ్చి పూజించి యతిథిసత్కా-

రములను జేసి సుఖోపవిష్టుఁడగు నమ్మునిచెంతను సమాహిత చిత్తుండయి యుపవేశించెను. అంత నమ్మహర్షి వినయావనతుఁడయి భూమిపైఁగూర్చుండిన చిత్రకేతుని సముచితముగా గౌరవించి కొంతవఱకే సంభాషించి యిట్లుపలికెను. 'ఓసార్వభౌమా! నీవారోగ్యవంతుఁడవయి యున్నావా? నీ బంధువులకందఱకుం గుశలమా? రాజ్యాంగములన్నియు సురక్షితములయి కుశలముతో వర్తించుచున్నవియా? జీవుఁడు మహదహంకారాదులచే రక్షితుఁడయి తదాయత్తమగు సుఖముఁ జెందుచున్నవిధమున రాజుగూడ రాజ్యాంగములందుఁ బ్రజాభారమునుంచి నిర్భరసుఖముల నందవచ్చును. రాజునకు మిక్కిలి సుఖాపాదకములు రాజ్యాంగములే. కావున నీరాజ్యాంగములకుఁ గుశలముకలదుగదా? రాజ్యాంగములవలన రాజు సుఖమనుభవించునట్లు రాజువలన రాజ్యాంగములుగూడ మనోదుఃఖరహితములై హితముఁజెందును. ఒక్క-రాజ్యాంగములే యననేల? స్నేహితులు, బంధువులును, దేవతలునుగూడ సుఖంబులఁజెందుదురు. ఇంతియకాక యెవ్వనికి భార్యలును, ప్రజలును, గార్యసహాయులగు నమాత్యులును, మిత్రులును, బరిజనులును, మంత్రులును, బురజనులును, దేశవాసులును, నితర భూపాలకులును, బుత్త్రులును, నధీనులయి యుందురో, యారాజునకు మిక్కిలి శ్రేయస్సుగల్గును. కాని భార్యాప్రభృతులందఱును సామాన్యముగాఁ బ్రతిరాజునకును నధీనులయియుండుట దుర్లభము. వారినందఱ నధీనులనుగాఁ జేసికొనవలెనన్న రాజు విషయాసక్తుండుకాక జితేంద్రియుఁడయి వర్తింపవలయును. ఆరాజట్లువర్తించి వారినందఱను స్వాధీనులఁగాఁ జేసికొన్నచో వానికిలోక

పాలురతోఁగూడిన సమస్తలోకములును జాగరూకతతోఁబూజలను బన్నులను గొనివచ్చి యిచ్చి వశ్యులగుచుందురు. అట్టిరాజు నిత్య సంతుష్టుఁడయియుండును. నీ కీసర్వమును సంఘటించియుండును. కాన నీవును సర్వదా సంతుష్టుఁడవయి యుండవలసినది. కాని నీయాత్మ ప్రీతిని జెందుచున్నట్లు కానరాదు. ఆయసంతుష్టికిఁ గారణము నీవా ? పరులా? నీముఖము కాంతిపూరితమై యుండక వెలవెలపోవుచున్నది. ఆలోచింప నీకభిలషితవస్తువేద్దియో లభింపకపోవుటచే నిట్లు విచారపరీతుఁడవయి యున్నట్లుతోఁచెడిని. ఆకారణమును దెలియఁజెప్పు" మని యంగిరసుండు చిత్రకేతుని విచారకారణమెఱిఁగియున్నను బలువిధములుగ వికల్పించి యడుగుచున్నతనికి సంతాన మభిలషించుచున్నచిత్రకేతువువినయావనతుఁడయి యిట్లుపలికెను. "ఓమునీంద్రా! కర్మయోగముచేతను, జ్ఞానయోగముచేతను, భక్తియోగముచేతను సమస్తపాపములఁ దొలంగించుకొని నిర్మలచిత్తులగు తమవంటి యోగులకు దేహుల యంతర్భాగ బహిర్భాగములందుండునదియేది తెలియఁబడదు? సమస్తము తెలిసియుండును. అయినను నాచిత్తమునందున్న యర్థమును దెలియఁగోరియడిగితివి కాననా యభిప్రాయమెఱిఁగిన నీయాజ్ఞనుబడసి చెప్పెదను. ఓ మహామునీ ! లోకపాలుర కపేక్షణీయములగు సమస్తసంపదలును నాకున్నను, నవి సంతానములేక కుందుచున్న నన్నును నాఁకటిచేతను దగచేతను బీడితులయి యన్నపానములను గోరువారిని జందనవనితాదు లట్లు సంతసింపఁజేయఁజాలకున్నవి. కావున నో మహాభాగా! నేను నాపూర్వులతోఁగూడదుస్తరమగునరకమును దరించుటకును ముఖ్యసాధనమగుపుత్త్రుఁడు నాకులభించునట్లును

గ్రహింపుము" అని యిట్లు చిత్రకేతుండు యాచింపఁగా బ్రహ్మకుమారుండును గృపాలుండును నగు నంగిరసుఁడు స్వయముగా ఋత్విజుఁడై త్వష్టదేవతాకమగు చరువును బచింపఁజేసి త్వష్టను బూజించి యాగశేషమును జిత్రకేతుభార్యలలో జ్యేష్ఠురాలును శ్రేష్ఠురాలును, నగు కృతద్యుతియనుదాని కొసంగి చిత్రకేతు నుద్దేశించి "ఓరాజా! నీకుఁ దప్పక పుత్త్రుఁడు జనించును. నీకు వాఁడు హర్షమును శోకమునుగూడఁ గల్గించు"నని చెప్పి యతని వీడ్కొనిపోయెను. అనంతరము కృతద్యుతి యా యజ్ఞావశేషమును భక్షించి యగ్నివలన గృత్తికవిధంబునఁ జిత్రకేతునివలన బుత్త్రరూపమగు గర్భముధరించెను. ఓనరేంద్రా! శూరసేన దేశాధిపతి వీర్యముచే నామెగర్భము శుక్లపక్షచంద్రుని చందంబునఁ గ్రమముగా వర్ధిల్లెను. పిమ్మటఁ గొంతకాలమునకు శూరసేన దేశప్రజలకధికానందము కలుగునట్లొకపుత్త్రుఁడు పుట్టెను. పుత్త్రజననవార్త విని చిత్రకేతుండు పరమానందము పొంది తత్కాలనుందే స్నానము చేసిశుద్ధుండై యలంకృతుండై కుమారునికివిప్రులచే నాశీర్వాదముల నిప్పించి జాతకర్మమొనరించెను. ఆసమయమున నారాజుహిరణ్యమును; వెండిని, వస్త్రములను, నలంకారములను, గ్రామములను, గజములను, హయములను, నాఱర్బుదముల లెక్కగలవాని విప్రులకుఁ బంచి యిచ్చెను. ఇంతియకాక యమ్మహీపతి కుమారున కాయువుగలుగునట్లు గాను, ధనకరముగాను, కీర్తికరముగాను, సమస్తదేహులకును, గోరినకోర్కులను మేఘునివలె వర్షించి సంతృప్తిఁగల్గించెను. అతికష్టమువలనఁ బొందఁబడిన కుమారునియందా చిత్రకేతునకు బహుప్రయాసమువలన సంపాదితమగు ధనమందు నిఱుపేదకుఁ

బలెఁ బ్రేమమధికముగా వర్ధిల్లఁజొచ్చెను. కృతద్యుతికిఁగూడఁ గుమారునియందు నిరతిశయమగు ప్రేమము వర్ధిల్లుచుండె. అట్లుండ నదిచూచి తక్కిన రాజపత్నులుగూడఁ బుత్రాభిలాష పీడితలు కాఁజొచ్చిరి. ఇంతియకాక ప్రతిదినంబును బాలకుని లాలించుచున్న చిత్రకేతునకు సంతానవంతురాలగు కృతద్యుతియందున్నంత ప్రేమము తక్కినకాంతలందు లేకపోయెను. అంత నా రాజభార్యలు భర్త తమ్ముఁ దిరస్కరించుచుండుటచేతను సంతానము లేకపోవుటచేతను, మిక్కిలి దుఃఖితలై తమ సవతియగు కృతద్యుతియందసూయచూపుచు నొక్కొక్కమాఱు తమ్మునిందించుకొనుచు సంతతము నిట్లు పరితపించుకొనుచుండిరి. అకటా! సంతానములేని మావంటి పాపాత్మురాండ్ర జన్మమేల? కాల్పనా? సంతానములేని స్త్రీ భర్తచేఁ దిరస్కృతురా లగును. సంతానవంతురాండ్రగు సవతు లాగొడ్డురాలిని దాసిని జూచినట్లు చూతురు. ఆలోచింప వంధ్యదాసికంటెను నీచురాలు. దాసస్త్రీలు ప్రభువును బచరించి యతనివలనఁ దమకు వలయుపదార్థములను బడసి సుఖముగ వర్తింతురు. వారలకు సంతాపమే యుండదు. గొడ్డురాండ్రగుమావంటిరాజపత్నులకు సంతాపము దక్క సుఖమేమి కలదు. కావున మేము దాసీజనముకంటెను దురదృష్టవంతురాండ్రము' అని యిట్లు రాజపత్నులు తమసవతిపుత్త్రునిఁ జూచి దందహ్యమానము లగుచిత్తములు కలవారై కావుననే రాజున కసమ్మతురాండ్రయి యుండుటచే ద్వేషబుద్ధి వర్ధిల్లఁజొచ్చెను. అట్టివిద్వేషముచే వివేకము నశింపఁ గఠినచిత్తలయినస్త్రీలు చిత్రకేతువును సహింపలేక యాబాలకునకు విషము పెట్టిరి. అదితిని యాబాలుఁడు నిశ్చేష్టితుఁడై యుండెను. తల్లి

యగు కృతద్యుతి తన సవతులు చేసిన దుష్టకృత్యము నెఱుంగక జాలక పిల్లవాఁడు నిద్రించుచున్నాఁడనియే భావించుకొని గృహమందుఁ గార్యాంతరాసక్తురాలయ్యె. అనంతరము కొంతసేపటికి కాకాంత దన దాదిని జూచి 'బాలుఁడు చిరకాలము నిద్రించుట యచ్చెరువుగానున్నది. కావున మేల్కొలిపి బాలునిఁ గొనిర'మ్మని యాజ్ఞాపించెను. ఆదాది పిల్లనియొద్ద కేగి పై కుబికిన నల్లగ్రుడ్లు గలవాఁడై ప్రాణేంద్రియ జీవములచే సంత్యక్తుఁ డయినట్లు గానవచ్చు వానింజూచి 'హా! చచ్చితిని. హా చచ్చితిని' అని యాక్రోశించుచుఁ బుడమిపైఁ బడెను. దాని యాక్రందనమును విని తల్లితొట్రుపడుచుఁ జేతులచే గుండెలు బాదుకొనుచు, నెలుఁగెత్తి యుచ్చైస్స్వరంబున నేడ్చుచుఁ ద్వరగానచ్చటికివచ్చిచచ్చి పడియున్న బాలకునిఁజూచి మోహాతిశయముచేతను, దుఃఖాతిరేకముచేతను భ్రాంతురాలయి కట్టుపుట్టము వీడ్వడుచుండఁగాఁ గేశపాశమువిరియుచుండ మిక్కిలిగా నేడ్చుచు భూమిపైఁబడెను. అంత నంతఃపురమందున్న పురుషులును స్త్రీలును వారి రోదనము విని సత్వరముగా వచ్చి రాజపత్నితో సమానముగా నేడ్వఁ జొచ్చిరి. పిమ్మటఁ గృతద్యుతి సవతులు కృతాపరాధలయ్యును నేమియు నెఱుంగనివారివలె వచ్చి యచ్చెరువడి లేని దుఃఖమును దెచ్చుకొని విలపింపఁజొచ్చిరి. అప్పుడు చిత్రకేతుఁడు మరణకారణము లేకుండఁ జచ్చిన కుమారుని విని పుత్త్రప్రేమముచే వర్ధిల్లిన దుఃఖాతిశయముచేఁ బీడితుఁ డయి యొకచోఁ గ్రిందఁ బడుచు, నొకచోఁ దూలిపోవుచు, నొకచో మూర్ఛిల్లుచు, వివేకహీనుఁడయి యనుసరించి వచ్చుచున్న యమాత్యాదులతోను విప్రులతోనుగూడి యాస్థలముచేరి కేశపాశమును,నంబరమును

జాఱుచుండఁగా నిట్టూర్పు పుచ్చుచు బాష్పబిందువులు కంఠమును నిరోధించుటం జేసి మాటాడలేక యాబాలుని పాదమూలము చెంతఁబడి విలపింప నారంభించె. ఇట్లు మహాశోక పరీతుఁడయినభర్తనుజూచి సమీపించి చచ్చినకుమారునిఁగూర్చి బహుప్రకారముల విలపించుచుఁ జూచుచున్న జనులను,మంత్రులను భర్తను, దక్కఁగలవారిని మఱింత దుఃఖింపఁజేసె. మఱియు నా రాజపత్ని రక్తచందనపుఁబూఁతలు గల స్తనములను గన్నీటిధారలచేఁ దడుపుచు ధరించినపుష్పమాలికాదులు రాలిపడఁ బుత్త్రుంగూర్చి యెలుఁగెత్తి కురరినలె నిట్లు విలపింపఁజొచ్చెను. 'హాదైవమా! నీకు సుంతేనియుఁ గరుణలేదు; హా! ఏమనుదాన, నీవు వివేకహీనుఁడవు. కానిచోఁ బిత్రాదిమూలకమునఁ బుత్త్రాదులను సృజించిన నీవు ముందు పిత్రాదులకు మరణము గల్గించుటకు బదులుగాఁ జిన్నవారగు పుత్త్రాదులకేల మరణము కల్గింతువు? ముందుదయించిన జనకాదులు జీవించియుండఁ దరువాతఁ బుట్టిన పుత్త్రాదులు మృతిచెందుట యింతేని యుక్తముగాలేదు. మఱియు నిట్లు మరణము కల్గించుట నీసృష్టికి మిక్కిలి విపరీతముగా నున్నది. ఆలోచింప నీవు సర్వోత్కృష్టుండవుకదా! నీకాపాటి తెలియవలదా? ఈ ప్రకృతిమండలమున సమస్తదేహులకును నుత్పత్తిక్రమము ననుసరించియే మరణక్రమము లేనిచో స్వకీయమగుపుణ్యాపాకర్మముల ననుసరించియే యుత్పత్తిమరణము లెల్లనుం బ్రవర్తిల్లుగాక. అందు నీవుచేసెడి దేమున్నది? "నేనుజేసెడి దిఁకేమి, కర్మానుసారముగా ఫలమును బొందించువాఁడ" నని యందువేని నిజసృష్టి వర్ధిల్లుటకై కల్పించిన పుత్త్రాదిరూపమగు స్నేహపాశమును స్వయముగానే

ఛేదించుచుంటివి. కావున నదియు యుక్తముకాదు' అని యిట్లు కొంతసేపు దైవమును నిందించి కుమారుం గూర్చి 'ఓకుమారా! దిక్కులేని నన్నీ దుఃఖసాగరంబునఁ ద్రోచి యెడుగంట ముంచుట నీకింతేనియు యుక్తముకాదు. నీ నిమిత్తము కడు విలపించుచున్న నీజనకునిఁ జూడవేమి? సంతతిలేక పోవుటవలనఁ గల్గినదుఃఖము నొకవేళ సహించిన సహింపవచ్చు. కాని పుత్త్రశోకమును సహించుట దుర్భరము. ఇట్లు దుఃఖతప్తులగుమమ్ముఁ జూడుము. చూడనిచో మమ్మునుగూడ యమాంతికమునకుఁ గొనిపొమ్ము.ఓకుమారా! నీతోడిబాలకులు నిన్నుఁ జూడవచ్చిరి. త్వరగా లెమ్ము లెమ్ము. నీమిత్త్రులు నిన్నాటలకుఁ బిల్చుచున్నారు. త్వరగాఁబోవేమి?ఓముద్దులపట్టి! చిరకాలము నిద్రించితివి. ఆఁకలి గొనియున్నవాఁడవు కాఁబోలును. వేగముగా లేచి పాలు త్రావుము. మాదుఃఖమును దొలంగింపుము. ఓపుత్త్రా! దృష్టిదోషము దగులునేమోయని, యుత్పలములవంటి నేత్త్రములుగల నీసుందరముఖారవిందమును గన్నులారఁగాంచి యెఱుంగను. నిర్భాగ్యురాలనగు నే నిప్పుడు చూచుచున్నాను. అవ్యక్తమధురము లగు నీవచనంబులు వినరావేమి? అకటా! దయారహితుఁడగు దైవమునిన్నుఁ బరలోకమునకుఁగొనిపోయెనా యేమి?'' అని యిట్లురోదనముచేయుభార్యంజూచి చిత్రకేతుండును మిక్కిలి యెలుఁగెత్తి విలపింపఁ జొచ్చెను. వారిరువురట్లు విలపింపఁగాఁజూచి యనుచరు లందఱును విలపించుచుఁ జిత్రప్రతిమలవడువున నుండిరి.ఆచిత్రకేతుఁ డిట్లు వివేకహీనుఁడై దారుణదుఃఖమనుభవించుచుండఁగాఁ దెలిసికొని యంగిరసుండు నారదునితోఁగూడ నచ్చటికి వచ్చెను.ఇది పదునాల్గవయధ్యాయము.

నారదాంగిరసులు చిత్రకేతునకు హితముబోధించుట.

అనంతరము నారదాంగిరసులు చచ్చినకుమారుని చెంతనుండి చచ్చినవానివలె, గానవచ్చుచు, దుఃఖసంతప్తుండై యున్న చిత్రకేతునిఁజూచి వేదాంతవచనములచే నతని బోధింపనెంచి యిట్లు నుడివిరి. ఓరాజేంద్రా! యెవనిఁగూర్చి నీవువిలపించుచున్నావో వానికిని నీకును గల సంబంధమేమి? నీవెవండవు? వాఁడెవఁడు? సృష్టి ప్రవాహరూపముగ వర్తిల్లుచున్నది.అది పూర్వమందుండెను. ఇప్పుడున్నది. మీఁదను గూడ నుండఁగలదు. ఈమూఁడు కాలములందుఁగూడ నీకును నతనికి నుంతేనియు సంబంధము లేదు. ఇట్లుండ నీవేల విలపింతువు? నాకడుపునఁ బుట్టినవాఁడు. నాకును వీనికిఁ బితృపుత్త్ర సంబంధమున్నది? కాన దుఃఖించుచున్నానని యందువేని చెప్పెద విను. కాలము మహాప్రవాహమువంటిది. ప్రవాహవశమున నందున్న యిసుము రేణువులొక్కచో నొకప్పుడు కూడికొనియుండును. వేఱొకప్పుడు విడిపోయి నానాముఖములఁ జెదరిపోవును. అట్లె దేహులుకాలప్రవాహమునకు స్వాధీనులయి దానంబడి కొట్టుకొనిపోవుచు నొకచోఁ గలిసికొందురు. వేఱొకచో వియోగమును బొందుదురు. అట్లు కలిసికొన్నప్పుడు వారికిఁ గలసంబంధము పరస్పర కాల కర్మాధీనము లగుదేహములవలనఁ గల్గునదికాని వేఱుకాదు. ఆ సంబంధము సోపాధికమగుటం జేసి యుపాధినశించినప్పు డదికూడ నశించును. మీ పితృపుత్త్రసంబంధము దేహద్వారక మగుటంజేసి సోపాధికముకాన యుపాధి యగుదేహము నశించినచో సంబంధమును నశించును. తాదృశ సంబంధమునుగుఱించి విలపించుట తెలివిమాలినపని.ఓయీ! పితృ పుత్త్రత్వాది సంబంధము కేవల

మాత్రగతంబును గాదు. కేవలము దేహగతంబును గాదు. అది దేహాత్మ సముదాయమందున్నది. తాదృశ సముదాయ మిప్పు ట్టున లేదు. దానికై శోకించుచుంటినని యందువేని యెవ్విధమున నైనను విలపింపఁ దగదు. జాతిగుణాదివిశేషములతో సంయుత మగు బీజములు నానావిధములుగలవు. ఈశ్వర సంకల్పమువలనే నాబీజములనుండి బీజాంతరములుపుట్టుచున్నవి. నశించుచున్నవి. అట్లె యీశ్వరసంకల్పమున భూతములనుండి భూతములు పుట్టు చున్నవి. నశించుచున్నవి. ప్రాణములేని బీజము లీశ్వర సంకల్ప మున నెట్లుపుట్టి నశించుచున్నవో యట్లే ప్రాణులును నీశ్వర సంకల్పముననే పుట్టి నశించుచున్నారు. కావున నీ యుత్పత్తి వినాశము లీశ్వర సంకల్పాధీనము లనియెంచి విశేష్యాంశమగు జీవునికి దేహసంబంధము గలుగుటకే యుత్పత్తియనియు నది పోవుటకే మరణమనియు ననుచున్నారు. కాన వేఱొక యు పాయము లేదని భావించి దుఃఖము విడిచిపెట్టవలయును. మఱి యు జీవునకిట్టి దేహసంబంధము కలుగుటకును గలుగకపోవుట కును దైవసంకల్పము కారణము. అది లేనిచో జీవుఁడు దేహసం బంధమువిడుచును. జీవుఁడు, దేహము విడిచిపోయినందులకు దుఃఖించిన నేమి ప్రయోజనము? నేనుజీవునకై దుఃఖింప లేదు. సాక్షాత్సంబంధము గల దేహమునకై విలపించుచున్నా నని యందువేని యదియును సముచితముకాదు. దేహ మెప్పుడును శాశ్వతముకాదు. నీదేహమును నాదేహమును, గానవచ్చుచున్న చరాచరాదుల దేహమును, ప్రస్తుతకాలమునఁ గానవచ్చుచు న్నను నివి జన్మమునకుఁ బూర్వమందు లేవు. మరణమునకుఁ బరమందును లేవు వర్తమానమందుఁ గానవచ్చుచున్నను వీనిని

లేనట్టుగానే యెంచుకొనవలయును. కావునన శాశ్వత మగు దేహమునుగూర్చి విలపింపనేల? మఱియు సమస్తభూతములకు నంతరాత్మయై వర్తించుచు, నాయాజీవుల కర్మానుసారముగా శాసించుచు నున్న యీశ్వరుఁడు తనచే సృజింపఁబడి, కావుననే స్వతంత్రములుకాని భూతములచేతఁ దాదృశభూతములను బుట్టించుచు, పెంచుచు, సంహరించుచు నున్నాఁడు. ఓరాజేంద్రా ! యీశ్వరుఁ డట్లు సృష్ట్యాదు లొనరించుచున్నను, దత్ప్రయుక్తములగు దోషములనుగాని సుఖములనుగాని పొందఁడు. అట్లయిన "నీశ్వరుఁ డేప్రయోజనమునుగోరి సృష్ట్యాదు లొనరించుచున్నాఁడు?*నిష్ప్రయోజనునకుఁ బ్రవృత్తిసంభవింపదే? యని యడుగవచ్చును. కాని అవాప్తసకలకాముఁడయిన యీశ్వరుఁ

* ఓయీ! లోకములోఁ బ్రయోజన మపేక్షింపకుండ జనులు కార్యములందుఁ బ్రవర్తించుట చూడలేదు. కావున జగత్సృష్ట్యాదు లొనరించు భగవంతునకుఁగూడ నేదయిన ప్రయోజనముండక తీఱదు. ఆప్రయోజనము స్వార్థము కావచ్చును. పెఱవారికొఱకును గావచ్చును? అని ప్రశ్నింప నవకాశము లేదు. భగవంతుఁడు స్వాభావికముగా నవాప్తసకలకాముడు. కావున స్వార్థప్రయోజనము లేదు. పరార్థముగూడ నతఁడు సృష్ట్యాదు లొనరింపవలసిన యవసరంబులేదు. అవాప్త సకలకాముఁడగు నతని యనుగ్రహమే పరులకుఁ బ్రయోజనముల సమకూర్చుచుండ సృష్ట్యాదులేల? కావున నతఁడు, బాలుఁడు కందుకక్రీడాదులందును, బొమ్మరిండ్లు మొదలగు కార్యములందును బ్రయోజన మపేక్షింపకయే ప్రవర్తించునట్లు భగవంతుండును సృష్ట్యాదులందుఁ బ్రయోజన మపేక్షింపకయే ప్రవర్తించుచున్నాఁడు. ఓయీ! భగవంతుఁడు తనసంకల్పముచేతనే జీవులకుఁ బ్రయోజనముల గూర్చునని చెప్పితివి. అట్లయినచో నతఁ డందఱు జీవులకును నొకవిధమున సుఖముకల్గింపక కొందఱకు దుఃఖము గల్గించి కృపారహితుఁడనిపించుకొనుచున్నాఁడు? ఈశ్వరున

నకుఁ బ్రయోజన మేమియుండును? బాలకులిసుకతో బొమ్మరిండ్లను నిర్మించి కొంతసేపాడుకొని పిమ్మట వానిఁ బాడుచేసి పోవుచుందురుకదా? వారే ప్రయోజన ముద్దేశించి యట్లు చేయుచున్నారు? కేవలము లీలనిమిత్తమే వారట్లు చేయుచున్నారు. అట్లే భగవంతుఁడు సృష్ట్యాదులను లీలకై చేయుచున్నాఁడని యెఱుంగునది. మఱియు భూమియందుఁ బడిన బీజమువలన బీజాంతరములు పుట్టుచున్నట్లు దేహి దేహము పిత్రాది దేహమువలనఁ బుట్టుచున్నది. వహ్నికి వేఁడిమి స్వభావ సిద్ధమైనట్లు దేహమున కట్లు పుట్టుట నైజము. అగ్నిహోత్రుని యుష్ణత్వముగూర్చి చింతించుట యెట్టిదియో దేహవినాశమునుగూర్చి విచారించుటయు నట్టిదియే. కావున దేహముఁగూర్చి శోకింపకుము. ఇఁక జీవునిగూర్చి శోకింతుమందువేని నిత్యుఁడును, వికారాదులు లేనివాఁడును నానందస్వరూపుఁడును నగు జీవునిఁగూర్చి విచారించుటయు ననుచితము. ఇంతియకాక రజతమం దున్న గుణాదులులేని ముత్తెపు చిప్పయందుఁ దద్గుణములున్నవని భ్రాంతిచెందుచున్నట్లు దేహమం దాత్మగుణము లున్నవనియు, దేహమే యాత్మయనియు గొందఱు దలంచుచున్నారు. అది యనాది సిద్ధమగు దేహాత్మభ్రమవలనఁ గల్గినది కాని వేఱుకాదు" అని యిట్లు

---

కట్టి వైషమ్యముండవచ్చునా? అనియడిగినఁ జెప్పెదనువిను. భగవంతుఁడు సకలజీవులకు నంతరాత్మయై వారివారి కర్మానుసారముగా ఫలములనుసమకూర్చుచుండును. వారివారి పుణ్యపాపకర్మములే యందులకుఁ గారణముకాని వేఱుకాదు. ఈయర్థమునే "సాధుకారీ సాధుర్భవతి, పాపకారీ పాపోభవతి, పుణ్యః పుణ్యేనకర్మణా। పాపః పాపేన కర్మణా" అని శ్రుతి చెప్పుచున్నది. కావున సృష్ట్యాదులవలన నీశ్వరుఁడు నిర్దయుఁడు కాఁడు.

నారదాంగిరసులు బోధింపఁగా వారి వచనములవలనఁ గొంచె ముజ్ఞానము వహించి చిత్రకేతువు తనచేతులచే దుఃఖాతిశయమున వాఁడినవదనమును దుడిచికొని యిట్లుపలికెను. ఓమహాత్ములారా! జ్ఞానసంపన్నులయిన మీరెవ్వరు? మీరు పూజ్యులలోఁ బూజ్యతములు. మీరీ క్షుద్రవేషముచే గూఢులయి యిచ్చటికి వచ్చినవారలు. మీ రెవ్వరో యెఱుంగఁజాలకున్నాను. లోకమున భగవద్భక్తులయిన బ్రాహ్మణులు యథేష్టముగా సంచరించుచు, వెఱ్ఱివారినలెఁ గానవచ్చుచు. విషయాసక్తులమయిన మావంటివారికి జ్ఞానోపదేశము చేయుచుందురు. అజ్ఞుఁడనై దుఃఖించుచున్ననాకు హితోపదేశము చేయవచ్చిన మీ రెవ్వరో తెలియఁజేయుఁడీ? మఱియు భగవత్ప్రియులై యున్మత్తవేషంబున సంచరించు మహానుభావులు పెక్కురుగలరు. వారెవరందురేని, సనత్కుమారుండును, నారదుండును, ఋభువును, నంగిరసుండును, దేవలుండును, నసితుండును, వ్యాసుండును, మార్కండేయుండును, గౌతముండును, వసిష్ఠుండును, భగవంతుఁడగుపరశురాముండును, కపిలుండును, శుకుండును, దూర్వాసుండును, యాజ్ఞవల్క్యుండును, జాతుకర్ణియు, నరుణియు, రోమశుండును, చ్యవనుండును, దత్తాత్రేయుండును, నాసురియుఁ, బతంజలియుఁ, బరాశరుండును, మైత్రేయుండును, భరద్వాజుండును, వారుణియు, నుచథ్యుండును, వేదశిరుండును, బౌధ్యుండును, బంచశిఖుండును, హిరణ్యనాభుండును, కౌసల్యుండును, శ్రుతదేవుండును. ఋతధ్వజుఁడును మొదలగువారలు. వీరలేకాదు. జ్ఞానసంపన్నులయిన మహాత్ములు పెక్కురు సంచరించుచున్నారు. నాచెప్పినవారిలో మీరెవ్వరై యుందురు?

ఓ సుప్రభావులారా! నేను మూఢుఁడను, నరపశువను, మూర్ఖబుద్ధి గలవాఁడను, అజ్ఞానమనెడి చీకటిలో మునిఁగినవాఁడను. ఇట్టినాకు మీరు జ్ఞానదీపము నొసంగఁదగిన చాతుర్యము కలవారు.'' అని నుడువుచున్న రాజుంజూచి యంగిరసుం డిట్లనియె. ఓరాజా! నేను బుత్త్రునిఁగోరుకొన్న నీకుఁ బుత్త్రు నొసంగిన వాఁడును, అంగిరసుండను. ఈతఁడు భగవంతుఁడును బ్రహ్మకుమారుండును నగు నారదుఁడే. పుత్త్రశోకముచే నీ విట్లు దుస్తరమగు నజ్ఞానమందు మునింగినవాఁడవు. నీవిట్టి దుఃఖమునకుఁ దగవు. నీవు మహాపురుషులచే ననుగ్రహింపఁ దగినవాఁడవు. బ్రాహ్మణ భక్తియుతుండవును, భగవద్భక్తుండవును నగు నీవు దుఃఖింపఁదగదు. కావున నీయీదుఃఖమును దొలఁగించి నిన్నను గ్రహింప నిచ్చటికి వచ్చినవారము. నేను వెనుకనే నీకుఁ బరమ జ్ఞాన ముపదేశించుటకై నీయింటికి వచ్చితిని, కాని నీవప్పుడు పుత్త్రాభిలాష గలవాఁడవయి యున్నవాఁడవని తెలిసికొని పుత్త్రు నొసంగితిని. పుత్త్రుఁడు నీకు దుఃఖము గల్గించువాఁడని తెలిసియు నతనినే యొసంగితిని. నేనట్లుచేయక నీకు జ్ఞానముపదేశించినను బుత్త్రాభిలాషివై యున్న నీకది పట్టుపడదు. ఇప్పుడు పుత్త్రశోకముచే వైరాగ్యము నొందియున్నవాఁడవు కావున నాయుపదేశించెడి జ్ఞానము నీయందు నెలకొనఁగలదు. పుత్త్రుఁడు మొదట నీకు సంతసము కల్గించినను నిప్పుడు దుఃఖకారణుఁడయి విడిచిపోయె. అట్లే భార్యలును, గృహములును, ధనములును, సమస్త సమృద్ధులును, శబ్దాదివిషయములును, జంచలములగు రాజ్యసంపదలును, సార్వభౌమత్వమును, జతురంగసైన్యములును, ధనాగారములును, భృత్యులును, నమాత్యులును,

మిత్రులును, వీరందఱును మొదట సంతసము గల్గించువారయి నను నవసానమున దుఃఖంబునే కల్గించువారని నమ్ముము. ఓనరేంద్రా! ఈ నీ సమస్తసంపదలును, స్వప్నపదార్థముల వంటివి. స్వప్నమం దొకప్పుడు తాను రాజ్యాభిషిక్తుం డయినట్లును, నొకప్పుడు పరదేశమున కరిగినట్లును దోఁచుచుండును.అవి యాకాలమందు మాత్రమే కానవచ్చుచుఁ దదుత్తరక్షణమందే నశించును. స్వప్నదృష్టమగు పదార్థములవలె నీసంపదలును శాశ్వతములుకావు. స్వప్నపదార్థములకంటె నివి మఱికొంతకాలము న్నను నాలోచింప వినశ్వరములనియే నమ్ముము. అనాదులగు కర్మవాసనలచే వాసితమగుమనస్సుతోఁ గూడినయింద్రియములువిషయములను ధ్యానించుచుండుటవలన స్వప్నమం దట్టిపనులు తెలియవచ్చుచుఁ దదుత్తరక్షణమందే యీసంపదలును వినశ్వరములగును. పరమపురుషార్థము తప్ప నిలలో శాశ్వతమగున దేదియును లేదు. కావునఁ బంచభూతములతోను, జ్ఞానేంద్రియములతోను,కర్మేంద్రియములతోను గూడిన యీ దేహమనిత్యమనియుఁ, గర్మఫలానుభవము నిమిత్త మిది దేహికిఁ గల్గుచున్నదనియు,దేహి కిది పలువిధము లగు సంతాపములను విషయసుఖములను సమకూర్చుచుండుననియుఁ దెలిసికొని దారపుత్రాదులందున్న ప్రేమానుబంధ మెడలించి స్వస్థచిత్తుండ వయి జీవాత్మను బుద్ధీంద్రియాదులకంటె విలక్షణ మగువానిగాను, బరమాత్మకు శరీరభూతునిగాను నిశ్చయించి శరీరాదులు నిత్యములు కావని విశ్వసించి యాత్మాభిమానమును విడువుము. వైరాగ్యము నందుము'' అని యంగిరసుం డుపదేశించుచుండ నారదుం డారాజుఁజూచి యిట్లనియె. ఓరాజా! నీకు మంత్రరూప

మగు నుపనిషత్తు నుపదేశించెదను. సావధానుండవయి స్వీకరింపుము. నీవు భక్తియుక్తుండవయి దానిని ధారణచేసితివేని నేడురాత్రులు కడచునప్పటికి నారాయణునిఁ బ్రత్యక్షముగాఁ జూడఁగలవు. ఇంతియకాక శర్వాదిదేవతలందఱు నేమహాత్ముని పాదమూలము లాశ్రయించి యబ్రహ్మాత్మకత్వభ్రాంతిని, నాత్మస్వాతంత్రమనెడి భ్రాంతిని విడిచి నిస్సమమై నిరధికమై, యున్నయతని మాహాత్మ్యమును బొందిరో యాపరమేశ్వరుని మాహాత్మ్యమును నీవును నచిరకాలములోనే పొందఁగలవు'' అని పలికెను. ఇది పదునేనవ యధ్యాయము.

---

{ నారదుఁడు చిత్రకేతునకు మంత్రము నుపదేశించుట; చిత్రకేతువు సంకర్షణుని సన్నుతించుట. }

ఓరాజా! అనంతర మానారదాంగిరసులు చచ్చిన నృపకుమారుని యోగప్రభావముచేఁ జిత్రకేతువు మొదలగు జ్ఞాతులకుఁ జూపించి యాశ్చర్య మగ్నులంగావించి యాజీవాత్మ నుద్దేశించి మొదట నారదుం డిట్లుచెప్పెను. ఓజీవాత్మా! నీవు ప్రవేశించిన శరీరమునకు దల్లిదండ్రులగు నీరాజదంపతులును, వారి మిత్రులును, జుట్టములును, నిన్నుంగూర్చి మిక్కిలి శోకించుచున్నారు. కావున వారినందఱను వేర్వేఱఁజూడుము. నీవు బలాత్కార మరణమువలన నీశరీరము విడిచితివి కాని యాయువు చెల్లి కాదు. ఇంకను నీకాయుర్దాయశేష మున్నది. కావున నీవు మిగిలిన యాయువుతో మగుడ నీశరీరమును బ్రవేశించి మిత్రపరివృతుండవై సింహాసనము నధిష్ఠించి భూమండలము నేలుచు

నీతండ్రియొసంగెడి భోగ్యవస్తువుల ననుభవింపుము." అని నారదుండు పలుక విని జీవుండు జిత్రకేతుప్రముఖులు విన నిట్లనియె. ఓమునీంద్రా! నేను బుణ్యాపాపకర్మముల విశేషములవలన దేవ తిర్యగాది యోనులందుఁ బుట్టుచున్నవాఁడను. ఆయాజన్మములందలి నాతలిదండ్రులను బురస్కరించుకొని బాంధవులు పెక్కురున్నారు. అనేకజన్మములం దనేకులతో బాంధవ్యముగల నాకీ చిత్రకేతుకృతద్యుతులే జన్మంబునఁ దల్లిదండ్రులయిరి? వీరందఱు నే జన్మమందలి చుట్టములు? మఱియు సమస్తజీవులును పెక్కుజన్మంబుల నెత్తినవారగుటంజేసి యేదో యొక్కొక్క జన్మమందుఁ బరస్పరమును, బాంధవులైకాని, సపిండులయికాని, మధ్యస్థులైకాని, మిత్రులైకాని, యుదాసీనులయికాని, ద్రవ్యాదులఁ బురస్కరించుకొని విద్వేషము వహించినవారైకాని యుండకతీఱదు. అంగడియందుంచిన సువర్ణవికారములగు కడియములు కుండలములు మొదలగువస్తువులు బేహారముచేయు మనుష్యులం దొకనియొద్దనుండి మఱియొక్కనియొద్దకుఁబోవుచు వచ్చుచున్నట్లు జీవులును దేవమనుష్యాదియోనులం దెల్లప్పుడును వర్తించుచుందురు. ఆలోచింప మనుజులందు నిత్యుఁడగు జీవునకును, దత్సంపాదితములయిన పశ్వాదులకును సంబంధ మనిత్యమై చూపట్టుచున్నది. అయిన నాజీవునకుఁ బశ్వాదుల క్రయవిక్రయాది సంబంధ మున్నంతకాలమును "నాది" యనుబుద్ధి గలుగుచున్నది. క్రయాదిసంబంధము తొలంగినతోడనే మమత్వముగూడ నశించుచున్నది. ప్రసిద్ధుఁడయిన జీవుఁడు వాస్తవముగా దేహాత్మాభిమానము లేనివాఁడయినను గర్మవశమున దేవాదిశరీరములందుఁ బ్రవేశించినవాఁడై యా

దేహమును విడువనంతకాలమును బిత్రాదిబాంధవులను దన వారని భావించుచున్నాఁడు. కాని యాశరీరమును బరిత్యజించిన వెంటనే దానికి సంబంధించిన పిత్రాదులు తనవారని భావిం పఁడు. ఈజీవుఁడు మొదలును దుదయులేనివాఁడు. నిరతిశయ సూక్ష్ముఁడగుటవలన విషజలశస్త్రాదులవలన నాశము చెందఁడు. జ్ఞానాకారమున నొక్కఁడయి యుండువాఁడు. వాఁడు బుద్ధికిని, నింద్రియములకును, మనంబునకును, బ్రాణములకును, నాధా రుఁడయి యుండు స్వయంప్రకాశుఁడు. ఇట్టి జీవాత్మను బరమ పురుషుఁడు తన మాయాగుణములగు సత్త్వాదిగుణములచే దేవమనుష్యాది రూపములతోఁ బొల్చు విశ్వమునుగా సృజించు చున్నాఁడు. ఆపరమపురుషునికి వీఁడు తనవాఁడనియు వీఁడుపరుఁ డనియు వీఁ డిష్టుఁ డనియు వీఁడు ద్వేషియనియు విషమబుద్ధి లేదు. అతఁడు సర్వసముఁడు. అతఁ డాయాజీవు లొనరించిన పుణ్యపాపకర్మములను విమర్శించి తత్తత్ఫలములను వారికి సమ కూర్చి తా నుదాసీనుఁడయి సాక్షియై యుండును. జీవులు తత్త త్పుణ్యపాప కర్మములు గలవారగుటంజేసి తమతమ కర్మముల ననుసరించియే దేవాదిరూపముల నొందుచున్నారు. కావున సృష్టి యందు వైషమ్యము కానవచ్చినను భగవంతుని సర్వసమత్వ మును జెఱుపదు. ఇదియుగాక పరమపురుషునికి గుణదోషము లుగాని సుఖదుఃఖాది ఫలము కాని చెందవు. అతఁడు కేవలము దాసీనుఁడయి యుండును. ఆలోచింప జీవుండును గర్మరహి తుండు కావున పుణ్యపాపములకు దేహమేకాని తాను గర్త కాఁడు. దేహేంద్రియాదులను నియమించుచున్నాఁడు. ఇట్లు జీవుఁడు పరమపురుషునితో సముఁడయినట్లు గానవచ్చుటచే

జీవుఁడు క్రియాఫల మనుభవించుననియుఁ, బరమపురుషుం డను భవింపఁడనియు విభాగ మెట్లని యడుగుట సముచితమేకాని, జీవ పరమపురుషుల కెక్కుడు తారతమ్యము కలదు. పరమాత్మ ప్రకృతిపురుషులకంటె విలక్షణమయిన స్వస్వరూపమును, జీవ స్వరూపమును, బ్రకృతిస్వరూపమును లెస్సగాఁ జూడ సమర్థుండు. జీవుఁడు కర్మతిరోహితమగు స్వభావము గలవాఁడై ప్రకృతినే తన్నుఁగాఁ దలంచుచు, నాప్రకృతియందున్న కర్తృత్వమును దనయందారోపించుకొనుచున్నాఁడు. కావుననే జీవుండు ఫలభోక్త యగుచున్నాఁడు. పరమపురుషుఁడు నిత్యాసంకుచితజ్ఞానము కలవాఁడగుటంజేసి దేహాత్మభ్రాంతి లేనివాఁడై కర్మఫలము నొందఁడు" అని జీవుఁ డాకళేబరమును జొచ్చి పలికి నిర్గమించెను. అప్పుడు చిత్రకేతుఁడును దక్కిన జ్ఞాతులును మిక్కిలి యాశ్చర్యము నొంది పుత్త్రవిషయక మగు దేహానుబంధమును ఛేదించి దుఃఖమును విడిచిపుచ్చిరి. అనంతర మాజ్ఞాతులు తమకు దుఃఖమోహాదులను గల్గించునట్టి స్నేహమును విడిచి యాశవమును దహించి పారలౌకిక క్రియల నొనర్చిరి. విషమిచ్చి యాబాలకునిఁ జంపిన రాజపత్నులు జీవాంగీరసులు చెప్పిన వచనములు విని మిక్కిలి లజ్జించి బాల హత్యాపాపముచేఁ గాంతి దఱిగి తత్పాపము దొలంగించునుపాయమును బ్రాహ్మణులవలనఁ దెలిసికొని యమునానదిం జేరి ప్రాయశ్చిత్తము లొనరించుకొనిరి. చిత్రకేతుండును నంగిరసుని సద్వచనములను, నారదుని యుపదేశమును జీవుని భాషణములను, జక్కఁగవిమర్శించి వివేకవంతుఁడై బురదనుండి వెలువడిన గంధగజంబు చందంబున గృహమనెడి చీకటి నూతినుండి నిర్గ

ఖించెను. అనంతర మతఁడు యమునఁ దానములాడి పితృతర్ప ణాదుల నొనరించి, యింద్రియముల నియమించి మౌన మవలం బించి నారదుని సమీపించి దండప్రణామము లాచరించెను. భగవంతుఁడగు నారదుడు తనయందు గురుభక్తి నుంచి తన్ను సమీపించిన చిత్రకేతువునుగాంచి యతని శిష్యలక్షణముల కా నందించి మంత్రోపనిషద్విద్యను నీవిధముగా నుపదేశించెను. ఓపరమాత్మా! వాసుదేవ వ్యూహముచేతను, ప్రద్యుమ్నవ్యూహ ముచేతను, ననిరుద్ధవ్యూహము చేతను, సంకర్షణవ్యూహముచేతను వర్తించుచున్న నీకు నమస్కారము. నాలుగు వ్యూహములతోఁ బొల్చు నిన్ను ధ్యానింతుము. ఓదేవా! నీవు కేవలము విజ్ఞానస్వ రూపుఁడవయి నిరతిశయమగు నానందమే స్వరూపముగాఁ గల్గిసు ఖాంతరము నపేక్షింపక రాగద్వేషావిరహితుండవయి జాత్యాది కల్పనాశూన్యుండనయి యొప్పుచున్నవాఁడవు. నీవు స్వాత్మా నందము ననుభవించుచున్నవాఁడవగుటంజేసి యశనాదులగు షడూర్ములు లేనివాఁడవు. నీవింద్రియములకును, నింద్రియాధి ష్ఠాన దేవతలకును నియామకుఁడవు. స్వరూపముచేతను, గుణ ములచేతను, నధికుండవు. విచిత్రములగు ననంతశక్తులు గలవాఁ డవు. అట్టినీకు నమస్కారము. ఓమహాత్మా! వేదములును మనం బును నీస్వరూప మరయఁగోరి ప్రయత్నించియు సమర్థములుం గాక మరలివచ్చినవి. అట్టి స్వరూప మపరిచ్ఛిన్నమై యుండ నిఁక నెవ్వఁడు తెలియ సమర్థుండు? మఱియు నీవు జ్ఞానైకా కారుండవు. కావుననే నిస్సముఁడవై నిరధికుండవై వఱలు చున్నవాఁడవు. చేతనాచేతనములకు విలక్షణుండవు. అట్టి నీవు మమ్ముల సంతతమును రక్షింతువుగాక. స్థూలావస్థగల

చిదచిత్తులే రూపముగల యీ జగ్గమంతయు మృత్పిండా దులవలన ఘటాదులువలె, సూక్ష్మ చిదచిత్తులే శరీరముగాఁగల నీవలన నుదయించినది. ఉదయించిన విశ్వము నీస్వరూపమందే వర్తించుచున్నది. అచ్చటనే లీనమగుచున్నది. ఇట్లు జగము సృజింపఁ బెంప హరింప సమర్థమగు స్వరూపముగల నీకు నమస్కారము. ఇంతియకాక జగము నంతర్బహిర్భాగములం దంతటను వ్యాపించియున్నను నాకాశశరీరుఁడయి యొప్పుచున్న యెవనిని మనంబును, బుద్ధియు. నింద్రియములును నెఱుంగఁజాలవో యట్టి నీకు నమస్కారము. అగ్నిసంపర్కమువలన లోహాదులు దాహకశక్తి గలిగి సమస్తమును దహించుచున్నవి. తాదృశదాహకశక్తి లేనప్పుడు దహింపఁజాలకున్నవి. అట్లే దేహమును నింద్రియాదులును, ప్రాణంబును, మనస్సును, బుద్ధియు, నీయనుగ్రహమువలనఁ దమకు జ్ఞానక్రియాశక్తులు కలిగినప్పుడు కర్మములందుఁ బ్రవర్తించుచున్నవి. తాదృశశక్తులు తమకలవడనప్పుడు క్రియాకలాప మొనరింప సమర్థములు కాకున్నవి. మఱియు లోహము దాహకశక్తి గల్గియు నితరము నేదహించునుగాని యగ్నిని దహింపలేదు. అట్లే దేహేంద్రియాదులుగూడఁ బరమేశ్వరుఁడవగు నీవలన జ్ఞానక్రియాశక్తుల నొందియు దక్కనవస్తుజాలమునువలె నిన్ను సాక్షాత్కారముగాఁ జేసికొనఁజాలవు. కాని జీవుండు మాత్రము స్వతస్సిద్ధమగు జ్ఞానశక్తి కలవాఁడు కావున భవ దనుగ్రహమువలన జ్ఞానవికాసమును బొందినిన్ను సాక్షాత్కరించుకొనఁగలఁడు. మఱియు నీవు జ్ఞానాదిషడ్గుణములచే నిండినవాఁడవు, మహాపురుషుండవు, మహానుభావుండవు. సమస్తభక్తుల కరకమలములచే నుపలాలితములగు చరణకమ

లములు గలవాఁడవై నిస్సమాభ్యధికుండవై, పరమస్థానమందు న్ననీకు నమస్కారము గావించుచున్నాను'' అని యిట్లు నారదుండు నుతించిభక్తుండును, ప్రపన్నుండును నగు చిత్రకేతున కావిద్య నుపదేశించి యంగిరసునితోఁగూడి సత్యలోకమున కరిగెను. ఓ రాజా! అనంతరము చిత్రకేతువు సమాహితచిత్తుఁడై జలమును మాత్రము గ్రోలుచునారదుండుపదేశించినయామహావిద్య నేడు దినంబులు జపించెను. చిత్రకేతు వట్లుజపించి సప్తరాత్రంబులను గడచిన యనంతరమున నామంత్రప్రభావమువలన నప్రతిహతమగు విద్యాధరాధిపత్యము బడసెను. మఱికొన్ని దినములామంత్రమును జపించి తత్ప్రభావమునలనఁ గామగమనము గలవాఁడై మృణాళమువలెఁ దెల్లని దేహకాంతితోను, నీలాంబరముతోను, నలరారుచు, నాయా యంగంబులందుఁ గిరీటమును, బాహుపురులును, మొలత్రాడును, కడియములును ప్రకాశించుచుండఁ బ్రసన్నవదనుఁడై యరుణలోచనుఁడై సిద్ధేశ్వరులచే సేవ్యమానుండై పాతాళలోకమునకుఁ గ్రిందుగానున్న దేవదేవుఁడగు సంకర్షణుని సమీపించి చూచెను. ఓరాజా! ఆపరమేశ్వరుని సందర్శనమువలన నతనిపాపము లన్నియును నశించినవి. అతని యంతఃకరణము మిగుల నిర్మలమైనది. ఆసమయమునఁ బొడమిన భక్తివెంపుచే లోచనములనుండి యానందబాష్పములు స్రవించుచుండెను. శరీరమంతటను బులకాంకురంబు లంకురించెను. అనంతరమతని కభిముఖుండై చని నమస్కరించెను. పిమ్మటఁ జిత్రకేతువు సంకర్షణుని పాదపీఠము నానందబాష్పబిందువులచేఁ దడుపుచుఁ బ్రేమాతిశయంబుచే నెలుంగు రాల్పడ నొక్కయక్కరమేనియుఁ బలుక నశక్తుండై యుండె.

కాన యీయాదిపురుషుని నుతింపనేరక పోయెను. అనంతర మొక కొంతసేపటికి బుద్ధివిశేషముచే మనంబును వశము గావించుకొని, చిత్రకేతువు మాటలాడ శక్తిని సంపాదించి, బాహ్యేంద్రియవ్యాపారమును దొలఁగించి, పాంచరాత్ర తంత్రము నుపదేశించినవాఁడును నాతంత్రముచేతనే ప్రతిపాద్యుండును నగు సంకర్షణుని నిట్లుసన్నుతించెను. "ఓ దేవా! నీవు సామాన్యముగా వశముచేసికొన దుర్లభుండవు. అయిన జితేంద్రియులై సమస్తము బ్రహ్మాత్మకముగా ననుసంధానము చేయుసాధువులకు సులభుఁడవే. మఱియు నిష్కాములై నిన్ను భజించు నా సాధువులకు సమస్తము నొసంగుచుందువు. వారియం దధిక వాత్సల్యము కలవాఁడవై యుందువు. కావున వారలు నిన్ను భక్తిచే వశముగావించినట్లు నీవును వాత్సల్యగుణముచే వారలను, వశము గావించుకొనుచున్నావు. ఓపరమేశ్వరా! సృష్టియు, స్థితియు, లయంబును, మహానందస్వరూపమగు మోక్షంబును, నీ విభూతులే కాని వేఱయినవి కావు. బ్రహ్మరుద్రాదులు సృష్టిలయములనుగావించుచున్నను వారు నీదయవలననే ప్రవర్తింపఁ జేయుచున్నారు; కాని స్వాభావికమగు శక్తిచేఁగాదు. వారు నీయంశాంశములవలన నుదయించియగ్నికి మిడుఁగుఱులవలె నుండెదరుచున్నారు. నీయంశాంశములవలన జన్మించి నీ వియోగముచేతనే సృష్టిలయములను బ్రవర్తింపఁజేయు బ్రహ్మరుద్రులకవి విభూతులు కానేరవు. కావునఁ దాదృశవిభూతులచే నొప్పెడినీవే సర్వాధికుఁడవు. నీకంటె నధికులు లేరు. ఇట్లు వారు నీయంశములవలన నుదయించియుఁ దావన్మాత్రముచేత మేమును "నీశ్వరులమే"యని యభిమానముతోఁ బ్రవర్తిల్లుచు "మాయందున్న సామర్థ్యమంత

యుఁ బరమపురుషాధీనమైన'' దని తలంపక వ్యర్థముగా స్పర్థ వహించుచున్నారు. వారికి స్పర్థమాత్రమే మిగులుచున్నదికాని యైశ్వర్య మెంతమాత్రమును సిద్ధింపకున్నది. మఱియు బంగారము మొదటఁ గారణమయి, పిమ్మటఁ గటకకుండలాది రూపముగాఁ బరిణమించి, తుదకుఁ బంగారముగానే నిలుచును. అట్లే నీవు మొదటఁ గారణమైన నీరూపమును కార్యజాతముగాఁ బరిణమింపఁజేసి యంతమందు మగుడఁ గారణమై మిగులుచున్నావు. కారణపదార్థము నవశిష్టపదార్థము నీవే యగుటవలన సృష్ట్యాదులు నీవిభవములే. ఆద్యంతము లందున్న నీవిభవము మధ్యావస్థయందుఁగూడ నుండునని వేఱచెప్పవలయునా? కావునఁ గాలత్రయవర్తివగుటచే సృష్ట్యాదులునీవిభవములేయైనను గార్యావస్థయందు మాత్రమే కానవచ్చుబ్రహ్మరుద్రులకు విభూతులు కానేరవు. మఱియుఁ గాలత్రయమున నుండుటచే నీవు కాలపరిచ్ఛిన్నుండవు కావు. సర్వకాలములందును బ్రతివస్తువునందును నంతరాత్మవై వ్యాపించియుండుటచే వస్తుపరిచ్ఛిన్నుండవు కావు. మొదటిదానికంటెఁ బరిణామమందుఁ బదేసిరెట్లధికమగు, భూమిచేతను, జలముచేతను, వహ్నిచేతను, వాయువుచేతను, నాకసముచేతను, నహంకారముచేతను, మహత్తత్త్వముచేతను, నావృతమయిన యీయండకోశము కోటిసంఖ్యాకములయిన యిట్టియండములతోఁగూడ నీయందణుకల్పమై చూపట్టుచున్నది. కావునఁ జేతనాచేతనరూప మగు సమస్తాండములందును నీవు వ్యాపించియుండుటచే "ఈవస్తు విచ్చటలేదు" అనెడి దేశపరిచ్ఛేదము నీకు సంభవింపదు. ఇట్లు దేశకాలవస్తువులచేఁ బరిచ్ఛిన్నుండవు కాని నీవే యధికుండవు; కాని

తక్కినవారుకారు. ఇట్లు సర్వాధికుండవగు నీ వాశ్రయింపందగి యనంతఫలదాయివై యుండఁగా ఫలకాములయిన నరపశువులు శబ్దాదివిషయములం దపేక్షకలవారై నీ విభూతులగు నింద్రాదుల నుపాసించి నశ్వరములగు స్వర్గాదిఫలములను బొందుచున్నారు. కాని రాజకులము నశించినపిమ్మటఁ దదాశ్రితులగు సేవకులు నిరాధారులై నశించినట్లు లింద్రాదులు నశించినతరువాత వారును నిరాధారులై నశింతురు. కానస్వర్గాది సుఖములందలి కోర్కి సంసారబంధముఁ గలిగింపక మానదు. అది యెట్టిదైనను నెప్పుడును సంకోచమునుబొందని యపరిచ్ఛిన్నమగుజ్ఞానమే స్వరూపముగాఁగల నిన్నే మహాప్రయోజనముగా నెంచుకొని చేయుచున్న యుపాసనములు నిరతిశయమగు భవదనుభవానందమును సంపాదించునుగాని వేఁపఁబడిన బీజములంకురములకుంబోలె జననమరణాదిరూపమగు ననర్థమునకుఁ గారణములు గానేరవు. నీ యుపాసనలవలన నిష్టప్రాప్తియు ననిష్టపరిహారంబును గలుగును. కాని బ్రహ్మేంద్రాదుల యుపాసనవలన నట్లు కలుగనేరదు. ఆబ్రహ్మేంద్రాదులును సామాన్యోపాసకులవలెఁ గర్మవశ్యులై దేవతాంతరము నుపాసించుచు సుఖదుఃఖాదిద్వంద్వములను బొందుచుండఁగా వారిని సేవించుటవలన నవియెట్లు సంభవించును ? కావున జ్ఞానాది శక్తుల కాశ్రయుఁడవై యాశ్రితకార్యముల నొనర్ప సమర్థుఁడవయి యున్నవాఁడవు నీవేకాని మఱియొకఁడు లేఁడు. ఏది భవదారాధనరూపమయి,నిర్దుష్టమై నీచేఁజెప్పఁబడినదో,నిష్కాములును నాత్మారాములును నగుమునులు మోక్షమ పేక్షించి దేని నుపాసించుచున్నారో, యా భాగవత ధర్మముచే నీవు సమస్త

మును స్వవశము గావించుకొంటివి. నీ యారాధనరూపమగు ధర్మము సర్వోత్కృష్టమయినది. కావుననే యాధర్మము నాచరించువారు దేవతాంతరముల నారాధించువారికంటె నుత్కృష్టు లగుచున్నారు. ఓ పరమపురుషా ! అన్యారాధనధర్మములందువలె భవదారాధనధర్మమం దున్నమానవుల కహంకారమమకారరూప మగుబుద్ధి సంభవింపనేరదు. కావున భవదారాధనరూపధర్మము సర్వోత్కృష్టమై యనంతఫలము నొసంగును. దేవతాంతరారాధనరూపమగుధర్మమహంకారమమకారముల చేఁ బ్రవృత్తమయినది కాన విశుద్ధమైనది కాదు. రాగద్వేషాదియుతమగుటచే నధర్మప్రచురమైనది. శత్రుమరణాదులను గోరి యాచరించుటవలన నది నశ్వరమై యస్థిరమగు ఫలమును మాత్రమే యొసంగును. కావున దేవతాంతరారాధనము నీచమయినది. ఇంతియ కాక యా యారాధన మధికముగ శరీరాయాసాదులను గల్గించి తుదకు సంసారరూప మగునరకమును బొందించుటచే నాచరించువానికి ద్రోహకరమగుచున్నది. శత్రుహింసాదులను గోరి యాచరించుటవలనఁ బరులకుఁగూడ ద్రోహకరమగుచున్నది. ఇట్లు తనకును బరులకును ద్రోహము గల్గించు దేవతాంతరారాధనరూపధర్మముచేఁ దన కేమి క్షేమముగల్గును? పరులకు దుఃఖమేమి కల్గును? స్వద్రోహమువలన* నీకుఁ గోపము సంభవించుటయుఁ, బరద్రోహమువలన నధర్మ

* ఇందులకుఁ బ్రమాణము. శ్లో. ఆత్మసంభావితా స్స్తబ్ధా ధనమానమదాన్వితాః। యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకం। అహంకారం బలందర్పం కామంక్రోధంచ సంశ్రితాః। మమాత్మపరదేహేషు ప్రద్విష్యం తోఽభ్యసూయకాః। తానహంద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।

ముప్పతిలుటయుఁగాక వేఱుఫలము లేదు. "అనన్యఫలమగు భక్తియోగముచే నన్ను సేవించువారిని సంసారసాగరమునుండి యుద్ధరింతు" నని సంకల్పించుకొని భాగవత ధర్మములను పంచరాత్రమూలముగా నుపదేశించితివి. ఆభాగవతధర్మమాచరించువారి కిష్టప్రాప్తి గల్గించుటచేతను, ననిష్టపరిహారము చేయుటచేతను, నీ సంకల్పము యథార్థమైనది. కావుననే నీసంకల్పము నెఱిఁగినమహాత్ములు చరాచరాత్మకమగు భూతసమూహమంతయు నీశరీరమునుగా భావించి ముక్తినపేక్షించి నిన్నుపాసించుచున్నారు. ఓదేవా! నీ సందర్శనము సమస్తనరులపాపములను క్షయింపఁజేయును. దర్శనము పాపక్షయకరమగునాయని సంశయింప నవసరము లేదు. నీ పవిత్రనామము నొక్కమాఱు విన్నచో హీనజాతివాఁడైనను సంసారబంధమునలన †విముక్తుఁడగుచుండఁగా సాక్షాత్సందర్శనమునలనఁ బాపరహితుఁడై ముక్తిఁజెందునని వేఱచెప్పవలయునా? ఓపరమాత్మా! ప్రకృతమున నీసందర్శనమువలన నాచిత్తము నిర్మలమైనది. నేను కృతార్థుఁడనైతిని. నీకుఁబ్రియుండును, భక్తుండును నగునారదమునిమంత్రోపదేశమువలన నాకింత యభ్యుదయము లభించినది. అదిలేనిచో నాకు లభించుటెట్లు? మఱియు నీవనంత కల్యాణగుణముల కాకరుండవు. నీవు కాలాదిపరిచ్ఛేదరహితుఁడవయి యనంతుఁడవయి వఱలుచున్నావు. లోకములో జననమరణాదిభాక్కులమయి నీవలనజ్ఞానశక్తిని బొంది వర్తించుచుండిన మేమాచరించునది జగదంతరాత్మనగు నీకు విదితమేకదా? అస

† క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు'' ఈశ్లోకముచే భగవంతుఁడు స్వద్రోహ మొనరించువారి కనర్థము కలిగించును.

మర్థులమగు మావంటివారు గుణాకరుఁడవగు నీగుణములలోలేశ మునైనను దెలిసికోలేరనుట నీకుఁ దెల్లమె. నీవు జ్ఞానప్రదులయిన నారదాదులకుఁగూడ జ్ఞానప్రదాన మొనర్చుచున్నాఁడవు. అట్టి నీయెడ మాచేయువిజ్ఞాపనము, లోకత్రయమును ప్రకాశింపఁ జేయు సూర్యునకు మెఱుగుడుంబురువు లొనర్చిన ప్రకాశము వలె నత్యల్పమని వేఱె చెప్పవలయునా! "దేవా! నీవు షాడ్గుణ్యా పరిపూర్ణుఁడవు. సమస్తభువనముల సృష్టిస్థితిలయముల కధిపతివి. సామాన్యయోగులకుఁ దెలియఁబడని స్వరూపము గలవాఁడవు. అత్యంతము పరిశుద్ధుఁడవు. అట్టి నీకు నమస్కారము. ఎవని ననుసరించి బ్రహ్మాదులు జీవించుచున్నారో, సర్వమును జూచుచున్న యే మహాత్మునిఁగూర్చి చిత్తవృత్తు లన్నియుఁ బ్రసరించుచున్నవో, యెవనితలయందు భూమండలమంతయు నావగింజవలెఁ గానవచ్చుచున్నదో, సహస్రశిరస్కుఁడ వగునట్టి నీకు నమస్కారంబులు." అని యిట్లు నుతింపఁబడి భగవంతుడు మిక్కిలి ప్రీతిఁజెంది విద్యాధరులకుఁ బ్రభువగు చిత్రకేతున కిట్లనియె. "ఓరాజా! నీకు నారదుండును నంగిరసుండును బ్రకృతిపురుషేశ్వర విభాగమును జక్కఁగ నిరూపించి చెప్పిరి. వారు చెప్పినది నావచనమేకాని వేఱుకాదు. మత్సంకల్పానుసరణముగా నేవారు నీకుపదేశించిరి. నాయనుగ్రహము లేకుండ నీకట్టియాచార్యులు లభింపరు. వారుపదేశించిన మంత్రవిద్యచేతను, నాసందర్శనముచేతను, సంసిద్ధుండవైతివి. వారియుపదేశము మత్సంకల్పానుసారికాదేమోయని సంశయింప నక్కఱలేదు. సమస్తభూతములకును తచ్ఛరీరుండ నగునాకును భేదములేదు. ఇట్లుండ జ్ఞానవంతులై నన్నుఁ జక్కఁగాఁ దెలిసికోఁజాలిన నారదాంగిరసులకును నాకును

భేదము లేదని వేఱె చెప్పవలయునా! *శరీరశరీరిభావముం బొందిన మాకు భేదమెట్లు కలుగును? నేను సర్వభూతములకు నంతరాత్మనై యొప్పుచుందును. చిదచిదాత్మకములగు భూతములనన్నింటిని నేనే పుట్టించుచు వానికిం గారణమగుచున్నాను, †కావున భూతములకును నాకును శరీరశరీరిభావమువలననే కాక కార్యకారణభావమువలనం గూడ నభేదము స్పష్టమగుచున్నది. నారదాంగిరసులు పల్కిన వచములు నావచనములే కాని వేఱుకావంటివి. అదెట్లు సరిపడు నని సందేహింపకుము. శబ్దాత్మకమగు బ్రహ్మమును, శబ్దమునకు వాచ్యమయిన యర్థాత్మక మగుబ్రహ్మమును, నీరెండును నాకు శరీర మగుచున్నవి. అర్థాత్మకమగు బ్ర

* ఈభాగమున "అభేద" మనుపదమునకు "ఈఘటము మృదాత్మకము" అనుస్థలమందు స్వీకరించిన యభేదమును స్వీకరింపరాదు. అట్లంగీకరించినచో మట్టియందున్న సర్వవికారములును ఘటమందుం బొడసూపుచున్నట్లు జీవప్రకృతులందున్న సమస్తవికారములును బరమాత్మయం దుండవలసివచ్చును. కావుననే యిట్టిచోట్ల విశిష్టాద్వైతులు శరీరశరీరిభావప్రయుక్తమైన యభేదమునే యంగీకరించిరి. వాస్తవముగా దేహాత్మలకు భేదమున్నప్పటికి శరీరశరీరిభావముచే నభేదమని వ్యవహరించుకొనుచున్నట్లు శరీరభూతమగుజీవప్రకృతులకును, శరీరియయిన పరమాత్మకును నభేదమును వ్యవహరించుకొనిరి. కావుననే బాల్యయౌవనాదులచే సంభవించెడి శరీరవికారములు జీవునికిం బొందనట్లు జీవప్రకృతులందున్నవికారములు పరమాత్మను బొందవని చెప్పుటకు వలనుపడుచున్నది. శరీరశరీరిభావముచే సమస్తభూతములతోను బరమాత్మక భేదమంగీకరింపవచ్చునని విశిష్టాద్వైతుల సిద్ధాంతము.

† శరీరశరీరులకును గార్యకారణములకు నెట్టి యభేద మంగీకరింపంబడినదో యట్టియభేదమే యంగీకరింపవలయు నని తాత్పర్యము.

హ్మమునకంతర్భూతు లయిననారదాంగిరసులు నాకుశరీరమయిన ప్పుడు శబ్దబ్రహ్మమున కంతర్భూతములగు వారి వచనంబులు నాకు శరీరభూతమగునని వేఱ చెప్పవలయునా? మఱియుఁబరిదృశ్యమానమగు దేవాదిశరీరములలోపలను బ్రవేశించి ధారకుఁడై వ్యాపించియున్న జీవాత్మయందును నాజీవాత్మకు ధార్యమైయున్న దేవాదిశరీరజాతమందును,బరమాత్మనగు నేనుబ్రవేశించియా రెండింటికిని ధారకుఁడనై యుందును. ఆ రెండును నన్నాధారముగాఁ జేసికొని వఱలుచున్నవి. ఓయీ! అచేతనమగు శరీరజాతమునకంతయు జీవాత్మ ధారకుఁడై యుండెనని చెప్పితివిగదా? ఆయుభయమునకును నీవుధారకుఁడవగు టెట్లు? అని యడిగెదేని చెప్పెదను వినుము. నిద్రించినవాఁడు స్వప్నావస్థయందొక్క యాత్మకు గజారోహణము, దేశాంతరగమనము, రాజ్యాభిషేకము, శిరశ్ఛేదము మొదలగు కార్యముల కనురూప మగుశరీరజాతము కలదని చూచుచున్నాఁడు. వాఁడు జాగ్రదవస్థనుబొంది యాత్మ యొక్క శరీరమందు మాత్రమే యున్నట్లు కనుఁగొనుచున్నాఁడు. దీనింబట్టి యోజింప స్వప్నావస్థయందుఁ గానవచ్చు నానాశరీరజాతము మాయామాత్రయై కల్పితమైనదే కాని స్వరూపప్రయుక్తమైనది కాదు. జీవుని స్వప్నావస్థ ప్రకృత్యుపాధికమైనట్లే జాగరాద్యవస్థలును బ్రకృత్యుపాధికము లేకాని స్వరూపప్రయుక్తములు గావు. ఇట్లుజీవుని స్వప్నాద్యవస్థలు పరమాత్మసంబంధినియగు ప్రకృతికధీనము లగుటచే నవియన్నియుఁ బరమాత్మనగు నాకధీనములయి యున్నట్లు స్పష్టమగుచున్నది. ఇదిచక్కఁగఁ దెలిసికొని,పూర్వ మనుభవించిన యవస్థలను స్మరించుకొనుచు నొకశరీరమునమాత్రమే వ్యాపించి యహంప్రత్యయను

నకు గోచరుఁ డయియున్న జీవాత్మను నాయాయవస్థలకు సాక్షిని గాను, ప్రకృతికంటె వేఱయినవానిఁగాను దెలిసికొనవలయును. ఓయీ! ఇప్పుడు ప్రకృతివివిక్తమగు జీవాత్మస్వరూపమును జెప్పితిని. ఇఁకఁ బ్రకృతిపురుషులకంటె వేఱయిన నా స్వరూపమును జెప్పెదను నాలింపుము నాస్వరూపము సుషుప్తియందుఁ దెలియఁబడుచున్నది. జీవుఁడు సుషుప్తి ననుభవించుచున్నాఁడు. అప్పుడు వానికి మానసిక వ్యాపారముగాని, తక్కిన యింద్రియముల వ్యాపారముగాని, తాను శరీరమున కధిష్ఠాతయై యున్నట్టుగాని, బ్రాహ్మణత్వాదిధర్మములతోఁ గూడియున్నట్టుగాని తెలియరాదు. కేవలము పరబ్రహ్మమునుగూడి సుఖించుచుండును. జీవుని కాయవస్థ గల్గించువాఁడను నేనే. జీవుఁడు నావలన నాయవస్థనుబొంది యెట్టిసుఖము ననుభవించుచున్నాఁడో దానికిఁ గారణమనై హేయగుణరహితుఁడనై బ్రహ్మశబ్దమున కర్థమనై యున్న నన్నుఁ బరమాత్మనుగాఁ దెలిసికొనుమది. ఓచిత్రకేతూ! సుషుప్తికి నాధారమగుటచేతను, దానికిఁ గారణమగుటచేతను, సుషుప్తియందు గల్గు సుఖమునకు హేతువగుటచేతను, నాస్వరూప మనుభవవిదులకుఁ దెలియనగుచున్నది. శరీరజాతమునకు ధారకుఁడయిన జీవునకుఁగూడ నంతరాత్మరూపుఁడనై నేను ధారకుఁడ నగుటచే నుభయమును నాకు ధార్యమైయుండుట స్పష్టమగుచున్నది. మఱియుఁ బ్రస్వాపమును, జాగరణమును ననుభవించుపురుషునకుఁ గలజ్ఞానము వానిరెండింటి సంబంధముగల్గియు వానికివ్యతిరిక్తమగుచున్నది. అది జీవస్వరూపము. ఆ జీవస్వరూపమునకు విలక్షణమైనది బ్రహ్మస్వరూపము. జాగరాదిసర్వావస్థలయందు ననుసరించుట, నాయవస్థలకు ద్రష్టయగుట, నహంప్రత్యయమునకు

గోచరుఁడగుట. జ్ఞానానందాది స్వరూపుఁడగుట. మొదలగుధర్మ ములచే జీవస్వరూపమును బరిశోధించి యది బ్రహ్మమునకు శరీర భూతమగుననియు, సర్వావస్థల ననుసరించు జీవునకు నియంతయై ద్రష్టయై, జీవుఁడనుభవించుచున్న సుఖాదులననుభవింపనివాఁడై యుండుటచేఁ బరబ్రహ్మము జీవునకు వ్యతిరిక్తుఁడనియు ననుసంధానము చేయవలెను. జీవుఁ డట్లు చేయక నాకుశరీరభూతుఁడయి యుండుటనుమఱచి తన్ను నాకంటెవేఱగువానిగాఁ నెప్పుడుచూచునో యప్పుడే వానికి జననమరణాదిరూప మగుసంసారము సంభవించుచున్నది. ఈ యనర్థము శాస్త్రజన్యజ్ఞానమును, నుపాసనాత్మక మగువిజ్ఞానమునుసంపాదింపఁగలమానవజన్మముచేతనే పరిహరింపవలెను గాని పశుపక్ష్యాదిజన్మములచేఁగాదు. మానవ జన్మమును బొందియు నీయర్థమును నివర్తించుకొనని పురుషున కెప్పుడును క్షేమము కలుగదు. వాఁడుసర్వదాసంసారకూపమున వర్తింపఁదగినవాఁడె. కావున మానవజన్మమందే జీవుఁడు ప్రయత్నించి తాను బరమపురుషునికి శరీరమైయున్నట్టు తెలిసికోవలెను. విషయసుఖములనిచ్చు ప్రవృత్తిధర్మము ననుసరించినచో శరీరాయాసము, ఫలవిపర్యయము, దుఃఖప్రాప్తియుఁ దప్పక కలుగుననియు, నివృత్తిధర్మాచరణ మొనర్చినచో దుఃఖాదిరహితమును, స్థిరంబునునగు మోక్ష సుఖ మలవడుననియుఁ దెలిసికొని, పురుషుఁడు ప్రవృత్తిధర్మములనుండి మఱలవలయును. మఱియు నరులు తమకు సుఖము గల్గవలెననియు, దుఃఖము నివర్తింపవలెననియుఁగోరి యందులకుఁదగినవ్యాపారములను జేయుచున్నారు. కాని యా వ్యాపారములవలన దుఃఖము నివర్తించుటయు సుఖము ప్రాప్తించుటయు లేకపోవుటయే కాక మీఁదుమిక్కిలి

సుఖమలవడక దుఃఖమే కలుగుచున్నది. కావునఁ గామనయందు బరిక్లేశమే కాక ఫలవ్యత్యాసముగూడఁ గలుగుచున్నది. సకాములిట్టి ఫలవిపర్యయము గల్గుచున్నదని తెలిసికొని, జాగరణము, స్వప్నము, సుషుప్తి యనుమూఁడవస్థల నతిక్రమించి విషయాసక్తులకుఁ గానరాని యాత్మస్వరూపము నెఱింగినపురుషుఁడు, కనఁబడునవియు, వినఁబడునవియు నగు విషయసుఖములందుఁ దన వివేకబలముచే విరక్తి నవలంబించి శాస్త్రజన్య జ్ఞానముచేతను నుపాసనాత్మకజ్ఞానముచేతను, సంతుష్టుండై నాయందు భక్తిగలిగి వర్తింపవలెను. పరమాత్మ నగు నాకును దనకును నవినాభావసంబంధముగలదని దర్శింపఁగల్గుట యేదికలదో యదియె యోగనిపుణులగు మనుజులచే సర్వప్రకారములచేతను బ్రార్థనీయమైయున్నది. ఓచిత్రకేతూ! నీవప్రమత్తుండవై శ్రద్ధతో జ్ఞానవిజ్ఞానసంపాదకమగు నావాక్యమును విని యాత్మానుసంధానమును జేయుము. దానివలన నీవుతప్పక సిద్ధుఁడవు గాఁగలవు.'' అని యిట్లు చిత్రకేతు నాశ్వాసించి జగద్గురువును సంకర్షణుండును నగుపరమేశ్వరుఁ డతఁడు చూచుచుండఁగనే యచ్చటనే యంతర్ధానము చెందెను. ఇది పదియేడవ యధ్యాయము.



— { చిత్రకేతుఁ డీశ్వర ధిక్కారమువలన శాపమునొందుట. శివుఁడు విష్ణుభక్తుల ప్రభావమును జెప్పుట. } —

ఓనరేంద్రా! అనంతరము విద్యాధరపతియగు చిత్రకేతువు హరి యంతర్ధానము చెందిన దిక్కునకు నమస్కరించి యాకాశగమనమున నచ్చటచ్చట సంచరించుచుండెను. మహాయోగియగు చిత్రకేతు వప్రతిహత మగునింద్రియపాటవము గలవాఁ

డయి, తన సంకల్పమునకుఁ దగిన నానావిధములగు భోగ్యవస్తు వుల ననుభవించుచు, మునులును, సిద్ధులును, చారణులును, దన్నుఁ బరివేష్టించి నుతించుచుండ మేరుకందరములందు విహరించుచు, విద్యాధరస్త్రీలచే హరినిగూర్చి మృదుమధుర గానముఁ జేయించుచు,నిట్లు చిరకాలము సుఖముగాఁ గడపెను. వాఁడొకనాఁడు విష్ణువు తన కొసంగినవిమానము నెక్కి దాని కాంతులు నలుగడలం గిడలుకొన నందందు సంచరించుచు,సిద్ధచారణాదులచేఁ బరివేష్టితుఁడైన శంకరునిఁ బొడఁగాంచెను. అప్పుడు శంకరుఁడు పార్వతి నాలింగనముచేసికొని తొడపైఁ గూర్చుండబెట్టుకొని మునిసభామధ్యమం దాసీనుఁడయి యుండెను. చిత్రకేతుఁ డట్లుచూచి పార్వతి వినునట్లుగాఁబెద్దపెట్టున నవ్వియిట్లు పలికెను. “ఆహా! ఈరుద్రుఁడు లోకమునకు గురువు. ఎల్లశరీరులకును ధర్మముపదేశించువాఁడు. దేవతలలో ముఖ్యుఁడు, ఇట్టివాఁడయ్యు నితఁడు భార్యను దొడపయి నిడుకొని సభామధ్యమందుఁ గూర్చుండెను. ఎంత వింతగానున్నది! పోనిండు. ఇతఁడు కేవలము కామాసక్తుఁడేమోయని యనుకొనుటకు వీలులేదు. ఈతఁడు జటాధారియై యుగ్రతప మాచరించినవాఁడు. బ్రహ్మజ్ఞాన ముపదేశింప నర్హుఁడు. సభాధిపతి. ఇట్టివాఁడు మూఢునివలె స్త్రీని దొడపైనుంచుకొని సభాసీనుండై యుండుటకు సిగ్గేల జనింపలేదో తెలియకున్నది. మూఢజనులుగూడఁ దఱుచుగా రహస్యమునందే స్త్రీల నంకమం దుంచుకొందురు. ఇతఁడు మహానియమవంతుఁడయ్యు సభయందే భార్య నూరువందుంచుకొని కౌఁగిలించుకొనుచున్నాఁడు. ఆలోచింప నీతఁడు ప్రాకృతజనులకంటెను దక్కువవానివలెఁదోఁచుచున్నాడు.’అని

యిట్లు నిరంకుశముగాఁ బలుకుచున్న చిత్రకేతు వాక్యములను వినియు శంకరుండు గంభీరహృదయుఁడు కావున మందహాసము చేయుచు నూరకుండెను. ఆశంకరున కనుచరులగు సభ్యులును నేమియుఁ బలుకక యూరకుండిరి. కాని యీశ్వరప్రభావము నెఱుంగక పలికిన చిత్రకేతు వచనంబులకుఁ బార్వతి మిగులఁ గోపించి యింద్రియముల జయింపలేకపోయినను జయించితిననెడి యభిమానముగల చిత్రకేతువును ద్దేశించియిట్లుపలికెను. 'అవురా వీఁడు లోకమున లజ్జారహితులగు మావంటి దుష్టులకు హితాహితములను బోధింపఁజాలినవాఁడు. తాను బోధించినదానివినక యతిక్రమించినచో శాసింప సమర్థుండు. వీఁడిక్కడి కేలవచ్చెను. మమ్మును దండించుటకే వచ్చెనా యేమి? మర్యాద నతిక్రమించియున్న శంకరునిఁజూచియు నీసభవారు నిషేధింప కూరకున్నారు. ఇందు చతుర్ముఖుండున్నవాఁడు. పాపము! ఆతనికయినను నీధర్మము తెలిసినదికాదే! అతని కుమారులగు భృగువునారదుఁడు మొదలగువారున్నారు. వారికయినను వీనికున్నపాటి తెలివిలేక పోయెనే? ఇందు సనత్కుమారుఁడు, కపిలమహాముని మొదలగు మహాత్ములున్నవారు. వారికయిన నీధర్మము తెలియఁబడలేదే! ఈశంకరుఁడు, జగంబులకు గురువు. బ్రహ్మాదులకుఁ బూజింపఁదగిన పాదపద్మములు గలవాఁడు. సమస్తమంగళములకును నిధానము. ఇట్టి మహాత్ముఁడగు నీశ్వరుని, మహామహులగు మునులను క్షత్రియాధముఁడొక్కఁడధిక్కరించుట మిగుల శోచనీయము. కావున నీదురాత్ముఁడు నిక్కముగా దండనీయుఁడు. విష్ణుభక్తుఁడగుటచే దండనార్హుఁడు కాఁడేమోయని సందేహింపనవసరము లేదు. ఈక్షత్రియాధముఁ డహంకారము

గలవాఁడు; స్తబ్ధుఁడు. ఇట్టివాఁడు సజ్జనులచే సేవింపఁబడుచున్న నారాయణుని పాదమూలమును సమీపించుటకుఁ దగఁడు. కావున నిఁక వీఁడు పాపాత్ముఁడగు రాక్షసుఁడై జన్మించుఁగాక. అట్లు జన్మించినను మహాత్ములకుఁ బెద్దయపకారము చేయక వర్తించుఁగాత" మని పార్వతి శపింపఁగా విని చిత్రకేతుండు విమానము నుండిదిగి యామెపాదములకుఁ దనశిరస్సు తాఁకునట్లు మ్రొక్కి ప్రసన్నురాలినిగాఁ జేసికొనుట కిట్లుపలికెను. ఓతల్లీ! నీవుకోపించినను నేనుగోపింపను. నీవొసంగిన శాపమును దోసిటితోఁ బ్రతిగ్రహించుచున్నాను. మనుజులకు దైవముచూపిన నిగ్రహము గాని యనుగ్రహముగాని వారి పూర్వకర్మమువలన సంభవించుచున్నది. విష్ణుభక్తుఁడనగు నేను మోక్షమును బొందకుండఁ బ్రాచీనకర్మము ప్రతిబంధించుచుండెను. ఆప్రాచీనకర్మ మిప్పుడు నీవొసంగిన శాపమువలన నిశ్శేషముగా నశించును. దానివలన నేనిఁక మోక్షమున కేఁగుదును. కాన నీవొసంగిన శాపము నాకు మిక్కిలి యనుకూలించెనని సంతసించుచున్నాను. శరీరులు చక్రమువలెఁ జుట్టివచ్చుచున్న జన్మజరామరణాది రూపమగు సంసారమునఁ దిరుగుచు ననాదియగు పుణ్యపాప రూపకర్మముచే స్వస్వరూపజ్ఞానమును విడిచి ప్రాచీనకర్మముల కనుగుణమగు సుఖదుఃఖఫలము ననుభవించుచుందురు. అట్లనుభవించుచు నుత్తరోత్తరమున సుఖదుఃఖములకు హేతుభూతములగు కర్మములఁ జేయుచుందురు. దేహాభిమానులై యిట్లు వర్తించుట నీకును, నాకును, దక్కినవారికిని సమానమయినది. నాచేసిన హేళనము నకు నీకుదయించిన కోపము ప్రాచీనకర్మసంబంధియే కాని వేఱు కాదు. కావున నస్మదాదులవలె నీవుఁ బ్రాచీనకర్మవాసన

లచేఁ గల్గిన దేహాత్మాభిమానము గలదానవే యనుట స్పష్ట మగుచున్నది. దేహి తనంతంటఁ దానుసుఖదుఃఖములఁగల్గించు కోలేఁడు. ఇతరుల వలనను బొందఁడు. వానికి సుఖదుఃఖములు కర్మమువలననే సంభవించుచున్నవి. క్షణికమును జడమును నైన కర్మము కాలాంతరమునందు సుఖదుఃఖముల నెట్లు గల్గించునని యందువేని వినుము. పుణ్యమనఁగా భగవంతునియనుగ్రహ రూపమైనది. పాపమన నతని నిగ్రహరూపమైనది. పాపపుణ్య కర్మములను బురస్కరించుకొని భగవంతుని నిగ్రహానుగ్రహ ములు దుఃఖమును సుఖమును గల్గించుచుండును. కావునఁ బ్రాజ్ఞుండు సుఖదుఃఖములకుఁ గర్మమును బరమాత్మనుం గార ణముగా నెన్నుచుండును. సత్త్వాదిగుణముల ప్రవాహరూప మయిన ప్రకృతిమండలమందు శాపమన నేమి? అనుగ్రహమన నేమి? స్వర్గమన నేమి? నరకమన నేమి ? సుఖమన నేమి? దుఃఖ మన నేమి? వీనికిఁ గల తారతమ్యము నేర్పఱిచి చెప్పుట దుర్ల భము. ఏమందువేని స్వర్గము కేవలము సుఖజనకమే కాక యం తమున దుఃఖజనకముగూడ నగుచున్నది. నరకము కేవలమును దుఃఖజనకమే కాక యంతమునఁ గొంత సుఖజనకముగూడ నగుచున్నది. అట్లె శాపానుగ్రహంబులును నియమిత ఫలముల నీయఁజాలవు. దీనింబట్టి యోజింప శాపాదులువలె ననుగ్రహా దులును బురుషార్థము నీయఁజాలకుండును. ఇట్లుండ వాని భేద మెట్లు నిశ్చయింపఁ గలుగుదుము? నిరస్తనిఖిలదోషుండును, షాడ్గుణ్యపూర్ణుండును నగు పరమపురుషుఁడు నిస్సముఁడై నిరధి కుఁడై తనమాయచేతనే సమస్తభూతములను సృజించు చున్నాఁడు. అట్లు సృజించుచుండియుఁ గర్మాధీనమగు దేహము

లేనివాఁడయి భూతముల కర్మముల కనుగుణమగు సంసారమును మోక్షమునుగూడ సృజించుచున్నాఁడు. కావున జీవులకుఁ గర్మానుసారముగా బంధమోక్షములట్లు దేవాది శరీరములుగూడ సంభవించుచుండును. జీవుఁడు జ్ఞానైకాకారుఁడగుటచేతను జ్ఞానానందరూపుఁడగుటచేతను నాదేవాదిశరీరముల సముఁడయి వర్తించును. కావున నతనికి "వీఁడు ప్రియుఁడనియు, వీఁడు శత్రువనియు; వీఁడు జ్ఞాతియనియు, వీఁడు బంధువనియు, నిది పెఱవానిదనియు, నిది తనదనియు, భేదములేదు. ఇట్లంతటను నిరంజనుఁడయివర్తించునతనికొక్కెడననురాగమును, నొకచోట ద్వేషమును గలుగునా? కలుగనేరదు. జీవు లిట్టివారయినను, ననాదియగు కర్మవాసనారూపశక్తి వారిని సంబంధించియుండును. ఆశక్తివలన నుద్భవించు నుత్తరోత్తరకర్మములే జీవులకు సుఖదుఃఖములను, నాసుఖదుఃఖములకు హేతువులగు ధర్మాధర్మములను, సంసారమును, మోక్షమును, జన్మమును, మరణమును, గల్గింప సమర్థమగుచున్నవి. కావున మోక్షముగూడఁ బరమేశ్వరుని దయను సంపాదింపఁజాలినపుణ్యకర్మవిశేషము వలనేకల్గుచున్నదని స్పష్టమగుచున్నది. ఓదేవీ! జన్మాదులన్నియుఁ గర్మములవలననె సంభవించుటచే "రాక్షసుఁడవై పుట్టు" మను నీవిచ్చెడి శాపము నుపసంహరింపుమని నిన్నుఁ బ్రార్థింపను. కాని నే మొదట మిమ్మునుగూర్చి పలికిన నిందావాక్యములను క్షమింపఁ బ్రార్థింతును." అని యిట్లుపలికి చిత్రకేతుండు పార్వతీపరమేశ్వరులను బ్రసన్నులనుగాఁ జేసి వారచ్చెరుపడిచూచుచుండఁగాఁ దన విమానమెక్కి పోయెను. అనంతరము భగవంతుఁడగు రుద్రుఁడు సురమునులును, దైత్యులును, సిద్ధులును, ప్రమ

థగణంబులును వినుచుండఁగా బార్వతిని గూర్చి యిట్లనియె. "ఓపార్వతీ! వివిధములును, విచిత్రములును, స్వాభావికములు నగు కృత్యములు గల నారాయణునిభక్తులు విషయసుఖములం దిచ్ఛలేనివారు; మహామహిమ గలవారు; అపకారికిఁగూడ నుప కారముచేయు స్వభావము గలవారు. అందులకీ చిత్రకేతువే దృష్టాంతము. ఆహా! వారి మహిమ యెట్టిదో చూచితివా! నారాయణునాశ్రయించినవా రెప్పుడును సామాన్యుల యాగ్ర హమునకు భయమందరు. వారు స్వర్గమందును, మోక్షమం దును, నరకమందు సమదృష్టి గలవారు. వారు భగవద్దాస్య మును దక్కఁ దక్కినదాని వేఱొకదాని నొల్లరు. ఈశ్వరునకు లీలాభూతమగు జగత్సృష్టిచే జీవులకు దేహసంబంధము గలుగు చున్నది. ఆదేహమును బురస్కరించుకొనియే సుఖదుఃఖము లును, జననమరణములు, శాపానుగ్రహములు మొదలగు ద్వం ద్వములు సంభవించుచుండునుగాని స్వరూపప్రయుక్తములై కాదు. జ్ఞానముచే నేకాకారుఁడయిన జీవునియందు దేవత్వము మనుష్యత్వము మొదలగు భేదమువలెనే స్వప్నద్రష్టకుఁ బొడ చూపుచున్న భేదమువలెనే సుఖము, జన్మము, అనుగ్రహము, మొదలయినవియు, దుఃఖము మరణము శాపము మొదలయిన వియు ననాదియగు కర్మమువలనఁ గల్గుచున్న దేహాత్మభ్రాంతిచే సంభవించుచున్నవియే కాని వేఱుకాదు. శాస్త్రజన్యజ్ఞానము, వైరాగ్యమును, ముఖ్యముగానవలంబించి నిరతిశయానందరూ పుఁ డగుభగవంతునియందు భక్తి చూపుచున్న మనుజులకు విషమదర్శన మెప్పుడును సంభవింపదు సుమీ! ఓమనోవల్లభా! నారాయణుని యంశాంశమువలన నుదయించి, "మేమును

నీశ్వరులమే" యను నభిమానమును వహించియున్న, నేనును, బ్రహ్మయును, సనత్కుమారుండును, నారదుండును, బ్రహ్మపుత్రులగు తక్కిన మునులును, దేవేంద్రాదులును నా శ్రీహరి చేష్టితమును గాని, స్వరూపమునుగాని తెలియఁజాలము. ఆవాసుదేవునకుఁ బ్రేమాస్పదుఁ డగువాఁడును లేఁడు. ప్రియుండును లేఁడు. తనవాఁడనియుఁ బరుఁడనియు నన్న భేదము లేదు. అతఁడు సమస్త భూతములకును నంతరాత్మయై వర్తించుటచే నతనికవియున్నియుఁ బ్రియములే. వివేకవంతుఁడును, నంతటను సమదృష్టి గలవాఁడును, శాంతుండును నగు నీచిత్రకేతువు వాసుదేవుని భక్తుఁడు. అతనివలె నేనును నచ్యుతునకుఁ బ్రియుండను. కావునఁ బరమపురుషునకు భక్తులును, శాంతులును, సమదర్శులును, నగుమహాత్ముల విషయమై యెంతమాత్రము నాశ్చర్యమొంద నవసరములేదు." అని యిట్లు భగవంతుఁడగు శంకరుండు పలికిన పలుకులు విని పార్వతి యాశ్చర్యమును గోపమును విడిచి సంతుష్టురాలయ్యెను. ఓరాజేంద్రా! భగవద్భక్తుఁడగు చిత్రకేతువు గారి యిచ్చినశాపమునకుఁ బ్రతిశాప మీయ సమర్థుఁడయిన నట్లుచేయక దాని శిరసావహించెను. అపకారికిఁగూడ నుపకార మొనర్చుట సజ్జనలక్షణము గదా! ఓనరపాలా! ఆ చిత్రకేతువే త్వష్టసంకల్పముచే దక్షిణాగ్నియందు వృత్రాసురుఁడయి యుద్భవించెను. వాఁడు పూర్వజన్మమున విష్ణుభక్త శ్రేష్ఠుఁడగుటవలన నీజన్మమున నిట్టిజ్ఞానము గలవాఁడయ్యె. రాక్షసుఁడగు వృత్రునకు విష్ణుభక్తి యెట్లుగల్గెనని యడిగితివి. దానికి సప్రపంచముగా సమాధాన మొసంగితిని. మహాత్ముఁడయిన చిత్రకేతువు పుణ్యచరిత్రమును, విష్ణుభక్తుల మహిమను విన్న

వాఁడు సంసార బంధమునుండి విముక్తుఁడగును. ప్రాతఃకాలమున నియమవంతుఁడయి శ్రద్ధతో హరిస్మరణపూర్వకముగా నీచరిత్రమును బఠించినవాఁడు సర్వోత్కృష్టమగు విష్ణుసాయుజ్యమును బొందును. ఇది పదునేడవ యధ్యాయము.

---

**శుకుఁడు సవిత్రాదుల వంశమును దెలుపుట; శుకుఁడు దితివంశమును దెలుపుట; ఇంద్రుఁడు దితి గర్భజంతువును ఖండించుట.**

ఓ రాజా! సవితకుఁ బృశ్నియను భార్యగలదు. అతని కామెయందు సావిత్రి మొదలగు నభిమాన దేవతలును, సోముండును, నగ్నియుఁ, బశుయాగాభిమాని దేవతయు, పంచమహాయజ్ఞాభిమాని దేవతలును గల్గిరి. భగునకు సిద్ధియను భార్యగలదు. ఆమెయతనివలన నంగుఁడు, మహిముఁడు, విభువు, ప్రభువు, నను నల్వురుపుత్త్రులను, సుస్వభావముచేతను, సౌందర్యముచేతను నధికురాలయిన యాశీస్సను పుత్త్రికను బడసెను. ధాతయనువానికిఁ గుహువనియు, సినీవాలియనియు, రాకయనియు, ననుమతియనియు నలువురు భార్యలుగలరు. అతనికి వారిలోఁ గుహూదేవియందు సాయమనువాఁడును, సినీవాలియందు దర్శుఁడనువాఁడును, రాకయందుఁ బ్రాతరాహ్వయుఁడును, ననుమతియందుఁ బూర్ణమాసుఁడును సంభవించిరి. విధాతయనువానికిఁ గ్రియయను భార్యయందు నగ్నిపురీష్యాదు లుద్భవించిరి. వరుణునకుఁ జర్షణియను భార్యగలదు. అతని కామెయందుఁ బూర్వము బ్రహ్మపుత్త్రుఁడగు భృగువును, వల్మీకమున నుదయించిన మహాయోగియగు వాల్మీకియుఁ, బుత్త్రులయి మగుడ జన్మించిరి. మిత్త్రునకు

రేవతియను భార్యయందు, ఉత్సర్గుఁడు, అరిష్టుఁడు, పిప్పలుఁడు ననుతనయులు ప్రభవించిరి. ఆ మిత్రావరుణులు పూర్వమొకప్పుఁ డూర్వశిని జూచి మోహించి కామాతిశయమువలనఁ గలిగిన రేతస్సును కుండయం దుంచిరి. దానివలన నగస్త్యుండును వసిష్ఠుండును నుదయించిరి. వీరు మిత్రావరుణులకు సాధారణపుత్రులు. మఱియు నింద్రుఁడు శచీదేవియందు, జయంతుఁడు ఋషభుఁడు, మీఢుషుఁడు నా ముగ్గురఁ బుత్రులంగాంచెను. త్రివిక్రమ రూపము వహించిన వామనునకుఁ గీర్తియను భార్యయందు బృహచ్ఛ్లోకుఁ డనువాఁ డుద్భవించె. ఆ బృహచ్ఛ్లోకునకు సౌభగాదులుదయించిరి. విష్ణు వదితియందు వామనరూపమున నవతరించి చేసిన మహాకార్యములనుగూర్చియుఁ జూపిన మహాశక్తులను గూర్చియు, ముందు సవిస్తరముగాఁ జెప్పెదను. ఓ నరేంద్రా! సాకల్యముగా నదితివంశమును వర్ణించితిని. దేనియందుఁ బరమభాగవతోత్తముఁ డయినప్రహ్లాదుండును బలిచక్రవర్తియు నుదయించిరో, యాదితివంశమును గూర్చియు, దాననుదయించి సురేంద్రాదులకు శత్రువులయిన దైతేయులనుగూర్చియు నీకిప్పుడు చెప్పెదను. దితికి మహాబలులును దైత్యదానవులకుఁ బూజనీయులునగు నిరువురు పుత్త్రులుగలరు. వారునామములచే హిరణ్యాక్షహిరణ్యకశిపులని ప్రసిద్ధికెక్కిరి. అందుహిరణ్యకశిపుఁడు జంభాసురుని కుమారిక యగుకయాధువును వరించి దానియందుఁ బ్రహ్లాదుని, ననుహ్లాదుని, సంహ్లాదుని, హ్లాదునిఁ బడసెను. ప్రహ్లాదాదులకు సింహికయను తోఁబుట్టువు కలదు. సింహిక విప్రచిత్తిని బెండ్లాడి రాహువను బుత్త్రుంగాంచెను. దేవతలతోఁ గలసి యమృతముఁ ద్రావుచుండఁగా హరి, యారాహువుశిరమునే

చక్రముచే ఖండించెను. సంహ్లాదునకు మతియను భార్యయందుఁ బంచజనుండు పుట్టె. హ్లాదునకు దమనియను కళత్రమం దిల్వ లుండు వాతాపి యనునిర్వురు తనయులు గల్గిరి. ఆయిర్వురలో నిల్వలుఁడు మాయావియై యగస్త్యున కాతిథ్యమొసంగనెంచి తమ్ముఁడగు వాతాపిని మేషమునుగాఁ జేయఁగా నారాక్షసకృత్యము నెఱింగి యమ్ముని వానిభక్షించి జీర్ణింపఁజేసెను. అనుహ్లాదుఁ డనువానికి సూర్మ్య యనుభార్యయందు బాష్కలుఁడు మహిషుఁడు నానిర్వురుసుతు లుదయించిరి. ప్రహ్లాదునకు దితి యను భార్యయందు విరోచనుఁ డుద్భవించె. వానికి బలిచక్రవర్తి సంభూతుఁ డయ్యె. బలి శమనయను భార్యవలన నూర్వురు తనయులం గాంచెను. ఆబలిప్రభావము వర్ణనీయమైనది. దానిం దరువాత వివరించెను. బలితనయులలో బాణాసురుఁడు పెద్దవాఁడు. వాఁడే శంకరు నారాధించి శివభక్తులలోఁ బ్రథముఁ డయ్యె. కావుననే యిప్పటికిని శివుఁడు బాణునికిఁ బురపాలకుఁడయి వర్తించుచున్నాఁడు, ఓరాజా! దితికి మరుత్తులను నలువదితొ"మ్మండ్రు పుత్త్రులు గలరు. వారికి సంతతిలేదు. ఆ మరుత్తుల కింద్రుఁడు దేవత్వమొసంగుటచే వారు సురలకు దాయాదులు కాలేదు". అనిన విని రా జిట్లనియె. "ఓ గురువర్యా! జన్మసిద్ధమైన రాక్షసత్వమును బాపి మరుత్తుల కిందు్రండు దేవత్వ మెందులకుఁ గల్పించె? ఇందు్రనకు వా రేమి యుపకారం బొనర్చిరి? ఆవృత్తాంతమును ముందుగాఁ దెలుపుము. ఇది వినుటకు నాకేకాక యీమునులకుఁగూడఁ గుతూహల ముదయించుచున్నది. కావునఁ దప్పక వివరించి సంతసింపఁజేయు" మనశుకుండు స్వల్పాక్షరములు గల్గి, యర్థగంభీరమై, యున్న రాజువచనము

లకుఁ గరమ్ము సంతసించి యాదరముతో నతని ప్రశ్నముల కిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "ఓమహీపాలా! విష్ణు వింద్రునిపక్ష మవలంబించి దితిపుత్రులను హిరణ్యాక్షహిరణ్యకశిపులను సంహరించెను. దితి పుత్రశోకముచే నుద్దీపితమగు కోపంబున మండిపడి యిట్లు చింతించె. "అక్కటా! ఈయింద్రుఁడు కేవలము విషయసుఖముల కాసించి విష్ణుసాయమును బడసి నాపుత్త్రుల ప్రాణములఁ గొన్న దురాత్ముఁడు, క్రూరుఁడు, కఠినహృదయుఁడు. ఇట్టిపాపాత్ము నెట్లుగాఁ జంపి సుఖముగా నిద్రపోదును? ఇంద్రుఁడు లోకహితముకొఱ కట్లు చేసి యుండ నాక్రోశింపనేల? యనుట యసందర్భము. తానే యీశ్వరుం డనెడియభిమానము గల్గినట్టి పురుషుని దేహము మరణానంతరము భస్మమగుచున్నది. లేనిచోఁ గ్రిమికీటకాదుల పాలగుచున్నది. అట్టి పాడుశరీరమునకు సుఖము లభించుటకై భూతద్రోహ మొనర్చుచున్న యీయింద్రుఁడు పురుషార్థ మెఱుంగఁడు. ఎఱిఁగినచోఁ దనకు నరకము కల్గించునట్టి భూతద్రోహమేల చేయును? తన నీచశరీరమునే యాత్మగాఁ దలఁచుకొనుచు, నిరంకుశ మగువృత్తి గలిగిన దేవేంద్రుని మద మడంపఁజాలిన పుత్త్రుండు నిశ్చయముగా నాకెట్లు లుద్భవించును?" అని యిట్లు భావించి తన మనోవల్లభుఁడగు కశ్యపుని సమీపించి పరిచర్య చేతను, స్నేహము చేతను, వినయము చేతను, నింద్రియ నిగ్రహము చేతను, నుత్కృష్టమగు భక్తిచేతను, మనోహరములగు మృదు భాషణములచేతను, మందహాసముచేతను, గడకంటి చూపుల చేతను, భావజ్ఞురాలయినదితిమనోహరుని మనస్సును హరించెను. జితేంద్రియు నెట్లు వశంవదునిగాఁ జేసికొనఁగల్గెనని సంశయింపఁ

బని లేదు. స్త్రీలకుఁ బురుషులను వంచింపఁజాలిన బుద్ధిచాతుర్యముకలదు. అది యెట్టివానినైన మోహింపఁజేసి పరవశునిఁగా నొనర్చి సంభోగార్థమంగీకరించునట్లుచేయఁగలదు. ఆకశ్యపుఁడు ముందుగా స్త్రీపుంసరూపము లగుభూతములను బరస్పరమొక్క శరీరమువలె మిళితములగుచున్నవని యాలోచించి తన దేహమున నర్ధభాగ మామెకొసంగి సంభోగరతుఁ డాయెను. అయారే! స్త్రీలు పురుషులమతుల నవలీల వశముగావించుకొందురుగదా? భగవంతుఁ డగుకశ్యపుఁడు దానితో సంభోగించి మిక్కిలి ప్రీతుఁడయి రతిచాతుర్యము నధికముగానుతించి నవ్వుచు దితి కిట్లనియె. 'ఓసుందరీ! నేమిఁగుల సంతసించితి. కావలసిన వరమడుగుము. తప్పక యిచ్చెదను. భర్త సంతుష్టుండై యనుకూలుఁడయి యుండ స్త్రీకిలోకమునఁగాని పరలోకమునఁగాని దుర్లభమగు వస్తువుండునా! స్త్రీకి భర్తయే పరదైవమని చెప్పుచున్నారు. పరదైవమయిన భర్తకు సంతసము గల్గుచుండ సర్వకామితములును నెఱవేఱుటకు సందియ మేమున్నది? పరదైవతము విష్ణువుకాన భర్తయెట్లగునని యందువేని చెప్పెదను వినుము. ఎవఁడు సర్వభూతముల మనంబులకు సాక్షిభూతుఁడై సర్వమున కంతరాత్మయై వఱలునో యాభగవంతుఁడు నామములచేతను, రూపములచేతను, విభిన్నములైన యింద్రాది దేవతారూపము లగుశరీరములచేతఁ బూజింపఁబడుచున్నాఁడు. సాధనములగునగ్న్యాదిశరీరములచేతఁ దదంతరాత్మయగుపరమపురుషుఁ డెట్లు సేవింపఁబడుచున్నాఁడో యట్లె స్త్రీలచేతఁ బతిశరీరుఁడైన యతఁడు పూజింపఁబడుచున్నాఁడు. నన్నునీవు సేవించి సంతసింపఁజేయుటవలన నేనే శరీరముగాఁగల వాసుదేవుఁడు

సంతసించును. వాసుదేవునిఁ బ్రసన్నునిఁగా జేసికొన్నవారికి సమస్తము సులభమగును. కావున నోయింతీ! శ్రేయస్కాముఁరాండ్రును బతివ్రతలునునగు స్త్రీలు నిశ్చలభక్తితో నీశ్వర స్వరూపుఁడగు భర్త నారాధింప వలయును. ఓ శుభురాలా! అనన్య ప్రయోజనమగు నిట్టిభక్తిచే నర్చితుఁడయిన నేను నీ-కెట్టి దుర్లభమగువరము సంపాదింపవలయునో చెప్పుము.'' అని యిట్లుపల్కినవల్లభునిఁగాంచి దితి యిట్లనియె. ''ఓనాథా! నీవచనములకు మిక్కిలి సంతసించితిని. నాకుఁ గల్గిన సుతుల నింద్రాదులు చంపించినవై చిరి. పుత్రశోకాగ్నిచేఁ బీడితురాలనై యున్నాను. నాపరిచర్యకు నీవు సంతసించితివేని దేవేంద్రునిఁ జంపఁజాలిన కుమారుని దయచేయుము. ఇదియే నాకోరిక'' యని పలికిన సతిపలుకులువిని విమనస్కుడయి యిట్లుపరితపించె. ''అయ్యయ్యో! ఎంతగొప్పయనర్థమిప్పుడుతటస్థించినది! ఇంద్రియముల కధీనుఁడనయి స్త్రీరూపయగు భగన్మాయచే వశీకృతుఁడనై దీనుఁడనై గొప్పయధర్మమాచరించితిని.ఆయధర్మము వలననే తప్పక నరకకూపమునందుఁ బడుట నిశ్చయము. ''అకటా! ఎంతపని! ఎంతపని! ఈదితి యెట్లుగా వంచించినది. ఆలోచింపదితి నవలసినపనిలేదు. స్త్రీస్వభావము ననువర్తించుచున్న యీయువతియందు దోషము సుంతేనియులేదు. ఇంద్రియాధీనుఁడనై స్వార్థమును మఱచిన నాజన్మమేల? కాల్పనా? అకటా! స్త్రీలముఖము శరత్కాలచంద్రునివలె మనోహరమై యుండును.వాక్కు లతిమధురములై హృదయంగమము లయి యుండును. మనస్సు కత్తివాదరవలెఁ గడు తీవ్రమై యుండును. ఇట్టి స్త్రీల చేష్టితము నెవఁ డెఱుంగఁజాలును? కేవలమును

స్వార్థము నపేక్షించుచున్న స్త్రీ లెవ్వరిని నిండు మనంబుతోఁ బ్రేమింపరుగదా! ఇంతియగాక తనయభిలషితమును దీర్చుకొనుటకు భర్తనైనను, గుమారునైనను, సోదరునినైనను నిరాఘాటముగాఁ జంపివైతురుగదా! ప్రతిజ్ఞారూపమగు నావచనమెంతమాత్రమును వ్యర్థముకాఁగూడదు. ఇంద్రుఁడును వధార్హుఁడుకాఁడు. ఎట్టికార్యమును బొసఁగింపఁజేయుదు? ఏవిధంబున నీసంకటమును దరించువాఁడ. ఆలోచింప దీనిఁ దరించుటకొక్కయుపాయమున్నది" అని భగవంతుఁడయిన కశ్యపుఁడు మనంబున నాలోచించుకొని కోపావిష్టుండయి తన్ను నిందించుకొనుచు నిట్లుపలికెను. "ఓసుందరీ! నీవు కోరినప్రకార మింద్రుని జంపఁజాలిన పుత్త్రుఁడు నీకుఁ దప్పక కలుగు. నేనొక వ్రతమును జెప్పెదను. దానిని నీవొకసంవత్సర మాచరింతువేని నీకోర్కి సిద్ధించును. లేనిచో నీకుఁబుట్టిన పుత్త్రుఁడు దేవతలకు హితుఁడగును" అనినవిని దితి "ప్రాణేశ్వరా! ఆవ్రతమును నేఁదప్పకాచరింతును. నాచేయవలసిన కార్యము లేవో యుపదేశింపుము. కాని వ్రతభంగకరములగు కార్యములను మాత్రముపదేశింపవలదని యాచించుచున్నాను" నావుడుఁ గశ్యపుఁ డామెతో నిట్లనియె. 'ఓప్రియురాలా! భూతములను హింసింపరాదు. ఎంతటికష్టము గల్గినను శాప మీఁదగదు. అసత్య మాడఁగూడదు. గోళ్లనుగాని,రోమములనుగాని త్రుంపరాదు. అమంగళములగు నెముకలు మొదలగువానిఁ దాకఁగూడదు. నీటిలోనికి దిగి తానమాడరాదు. ఎవనినైనను గోపింపరాదు. దుర్జనులతో భాషింపఁదగదు. మలినవస్త్రములను దాల్పరాదు. పూర్వము విడిచిన పుష్పమాలికను మగుడధరింపరాదు.ఉచ్ఛిష్టమైనను గాలికి నివే

దితమైనను, జీమలు మొదలగువానిచే దూషితమైనను, శూద్రాదులచే నానీతమయినను, రజస్వలచే దుష్టమైనను, నన్నమును దినరాదు. దోసిటితో జలము ద్రావఁ దగదు. ఉచ్ఛిష్టమైనచో జలము స్పృశింపకుండనుండక, సాయం ప్రాతస్సంధ్యాకాలములందు ముక్తకేశవుగాక యలంకారహీనవై యుండక, మితభాషిణివై దిగంబరవై చరింపక, కాళ్లుకడిగికోకుండ, సమాహితచిత్తవుగాకుండ శయనింపకుము. తడిగల్గినపాదములతోఁ గాని, యుత్తరముగాఁదల నిడికొనిగాని పశ్చిమశిరస్సుగాఁగాని, యన్యులతో నగ్నవైగాని శయనింపరాదు. మఱియు సంధ్యాసమయలందునిద్రింపమేలుగాదు. ఇంతియకాక, శుభ్రవస్త్రమునుదాల్చి సదాశుచివై, పసపు, హరిచందనము, మొదలగు మంగళపదార్థములను వహించి, ప్రాతఃకాలభోజనమునకుఁ బూర్వముగోవులను విప్రులను, లక్ష్మీనారాయణులను బూజింపవలెను. పుత్త్రవతులును సువాసినులునునగుస్త్రీలను మంచిగంధముచేతను, బూలదండలచేతను, నుపాయనములచేతను, నలంకారములచేతను, బూజింపవలయును. అట్లే తన భర్తనుగూడ నర్చించి హృదయమునఁ జేర్చి ధ్యానింపవలెను. ఈయంగములతోఁగూడిన యీపుంసవనము వ్రతము నొకవత్సరమునునిరంతరాయముగా నెఱవేర్తువేని యింద్రసంహారియగు కుమారుండు నీకుఁదప్పక జనించును" అనిన కశ్యపుని వచనంబులకు సంతసించి దితి యావ్రతమునాచరింప నంగీకరించి దృఢమనస్కురాలయి పెనిమిటివలన గర్భమునుదాల్చి వ్రతమును లెస్సగా నాచరించుచుండెను. అనంతరమింద్రుఁడు తన పినతల్లియభిప్రాయము నెఱింగి కశ్యపునాశ్రమమందుండి వ్రతముసల్పుచున్న నామెను సేవింపనారంభించెను.

ఆ యింద్రుఁడు నిత్యమును వనమునకేఁగి పువ్వులను, బండ్లను, దుంపలను, సమిధలను, దర్భలను, బత్రములను, జిగుళ్లను, దూర్వాంకూరములను, మృత్తికను, జలమును, నాయాకాలములందుఁ దెచ్చియిచ్చుచు వేఁటకాఁడు మృగములను జంప వేచియున్నట్లు దితివ్రతమునకు భంగము గల్గింపఁ దలంపుగల్గి కుటిలచిత్తుఁడై యచ్చటనే చరించుచుండెను. ఇంద్రుఁడట్లెంత వేచియుండినను వ్రతభంగమును గావింపఁ దగిన యుపాయము వడయఁజాలక "నాకెట్లుశుభముగల్గు" నని దీర్ఘవిచారమున వర్తింపఁజొచ్చెను. ఇట్లుండ నొకనాఁడు దితి వ్రతమువలన మిగులఁ గృశించినదగుటచే జలము దెచ్చికొని పాదప్రక్షాళన మొనర్ప శక్తిలేనిదై యశుచియై దైవమువలనమోహితురాలయి సాయంసమయమున నిద్రించెను. సర్వదా వేచియున్న యింద్రుఁడు తనకుఁదగిన యవకాశ మలవడినదని సంతసించి నిద్రచే మైమఱచియున్న దితి యుదరమును యోగసామర్థ్యమువలనఁ బ్రవేశించి బంగారువలె మెఱయుచున్న గర్భమును వజ్రాయుధంబున నేఁడువిధములుగా ఖండించెను. అప్పుడా ఖండము లేడ్చుచుండ విని యింద్రుండు రోదనము వలదనిచెప్పి యొక్కొక్కఖండమును మగుడ నేడేసిఖండములుగా ఛేదించెను. "మారోదీః" అని ఖండించుటవలన వారు మరుత్తులను సార్థకనామము నొందిరి. ఓ రాజా! అట్లు ఛేదింపఁబడిన యాభాగములు ప్రత్యేకముగాఁ బాణిపాదాద్యవయవములు గలవారయి దోసిలివట్టి యింద్రుంజూచి "ఓ దేవేంద్రా! మేము మరుత్తులను పేరు గలవారము. నీకు భ్రాతలము. అట్టి మమ్మునేల సంహరించెదవు" అని ప్రార్థింపఁగా నింద్రుండు కరుణించి "ఓమరుత్తు

లారా! మీ రెంతమాత్రమును భయపడకుఁడు. నాకు మీరు భ్రాతలరు. మీరు మరుద్గణము లను పేరితో నాకుఁ బార్షదుల రయి భక్తితోఁ గొల్చుచుండు''డని చెప్పియొప్పించెను. ఓరాజా నశ్వత్థామ యస్త్రముచే దగ్ధుఁడవగుచున్న నిన్నుం బోలె శ్రీహరి యపారకరుణచే రక్షించుచుండుటంబట్టి వజ్రముచే ఛేదింపఁ బడియు దితిగర్భస్థుడగు శిశువు మరణము నొందలేదు. ఓరాజా! పరమపురుషు నొక్కమాఱారాధించినను మనుజుఁడు తన్మహిమచేహరితో సమానరూపమునొందును. ఇట్లుండఁ బెద్దకాలము హరిని సేవించుచో హరిసమానరూపత్వము నొందుననుటకు సందియముండునా? ప్రస్తుతమునదితికొంచెము తక్కువగానొక సంవత్సరము దేవేంద్రునిఁగూడి చరించుచున్న పరమేశ్వరు నారాధించెను. కాన దయాళుండగునతఁడు సురేంద్రుండు ఖండించినయా ముక్కలను జీవింపఁజేసెననుట యొకవింత కాదు. ఆ నలువదితొమ్మండ్రును మరుత్తులను పేరఁబరఁగుచుఁ, దల్లిదోషమునలన రాక్షసత్వమునువిడిచి దేవతలై యజ్ఞభాగమున కర్హులయిరి. అనంతరము దితి నిద్రనుండిలేచి యగ్నివలెఁ బ్రకాశించుచున్న కుమారులంజూచి సమీపముననున్న యింద్రునింజూచి సుస్వభావురాలుగానసంతసమునొందియిట్లనియె. 'కుమారా! మహేంద్రా! ఆదితేయులగు మీకు భయంకరుఁడగు నొకకొమరునిఁ గోరి దుష్కరమగు నీపుంసవనమనెడి వ్రత మాచరించుచుంటిని. నేనొక్కరినే కోరికొనియుండఁగా నలువదితొమ్మండ్రెట్లుగా నుదయించిరి? నీకుఁ దెలిసినచో సత్యముఁ జెప్పుము. అసత్యమాడఁగూడదు''అనియడిగిన దితింగాంచి యింద్రుం డిట్లనియె. ఓతల్లీ! నీయభిప్రాయము నెఱిఁగియే నీసమీపమునకువచ్చి పరి

చర్యఁ జేయుచు సమయమునకు వేచియుంటిని. ఇంతదాఁక నాకు సమయము లభింపలేదు కాని యిప్పు డలవడినందున సంతసించి లోనికిఁ బ్రవేశించి నీగర్భమును ఖండించితిని. విషయసంబంధి యగు పురుషార్థమునందుమాత్రమే బుద్ధిగల యధర్మపరుఁడనగు నేనిట్లు సప్తఖండములుగా ఖండింపఁగా నవి యేడ్వురు కుమారులయినవి. నే నందుల కాశ్చర్యపడి యొక్కొకకుమారుని మరల నేడుఖండములు గావింపఁగా నలువదితొమ్మండ్రయిరి. ఇట్లు ఖండింపఁబడియు సజీవులయియుండిరి. ఓతల్లీ! అప్పుడు వీరిని జూచి నీవు పరమపురుషుని భక్తితో నారాధించినందుల కిదియూకస్మికమగు ఫలముగ దాయని భావించితిని. తల్లీ! వీర లిట్లు జీవించుట నీవొనర్చిన విష్ణుపూజవలననే చుమా? ఎవరు నిష్కాములయి భగవంతు నారాధించుచు, మోక్షమునుగూడ నపేక్షింపరో, వారు తమతమపురుషార్థములను సాధింప నిపుణులని చెప్పఁబడిరి. నిష్కాములయి భగవంతు నారాధించుటయే యుత్తమము కాని సకాములై కొల్చుట తగదు. నిరతిశయ పురుషార్థమగు దన్నుఁగూడ నొసంగు పరమపురుషు నారాధించి పండితుఁడయినవాఁడెవఁడయిన నరకమందుఁగూడ లభ్యములగు శబ్దాదివిషయానుభవము కావలయు నని కోరుకొనునా? సకామవై నీవారాధించు పరమపురుషారాధనము పరిపూర్ణము కాకపోయినను ఫలయుక్తమైనదికాని విపరీతముగా జరిగినది. సకామముగా నాచరించుటవలన నిట్లు సంభవిల్లె. ఓపూజ్యురాలా! నేను మూర్ఖుండనై నీగర్భమును ఛేదించి దుష్కర్మ మాచరించితిని. దైవవశమువలన నీగర్భము ఖండితమైనను మగుడ నుజ్జీవితమైనది. కావున నాచేసిన యపరాధమును మన్నింపుము.'' అని

నిష్కపటముగాఁబలికిన యింద్రుని వాక్యములు విని దితి శాంత చిత్తయయి యూరకుండె. అనంతర మింద్రుండు దితికి నమస్కరించి మరుత్తులతోఁగూడ స్వర్గపురంబున కరిగెను. ఓరాజా! నన్ను నీవడిగిన మరుత్తులజన్మమును బూర్తిగాఁ జెప్పితిని. ఇంక నీకేమి చెప్పవలయునని ముని యడిగిన సంతసించి రాజిట్లనియె. ఇది పదునెనిమిదవ యధ్యాయము.

---

## శుకుఁడు పుంసవన విధానమును జెప్పుట:

"ఓమహాత్మా! దితి యొకవత్సరము పుంసవన మాచరించినదని చెప్పితివి. అట్టి మహావ్రతమువలనఁ బరమపురుషుండు తప్పక ప్రసన్నుఁడగునని యు వచించితివి. దాని విధానమును సప్రపంచముగా వినఁగోరుచున్నాను." నావుఁడు శుకుం డిట్లనియె. "ఓ రాజా! సర్వపురుషార్థములను సాధింపఁజాలిన యీ పుంసవన వ్రతమును మార్గశీర్ష మాసమున శుక్లపక్షమున నొకానొక శుభతిథియందు భర్తయనుమతిని బడసి స్త్రీలు ప్రారంభింపవలయును. మొట్టమొదట మరుత్తులజన్మప్రకారమును విని బ్రాహ్మణుల యాజ్ఞనొంది దంతధావనముఁ గావించి స్నానము చేసి తెల్లని నూతన వస్త్రములను దాల్చి ప్రాతఃకాలభోజనమునకుఁ బూర్వము లక్ష్మీనారాయణుల నావాహించి పూజింపవలెను. అప్పుడు భగవంతునుద్దేశించి "ఓపరమేశ్వరా! నీవు సమస్తములగు మహావిభూతులకును నధిపతివి. నీవు సంకల్పమాత్రము చేతనే సమస్తకార్యసిద్ధులను నెఱవేర్పఁగలవు. నీ వవాప్తకాముఁడవు. నీకితరులు చేయవలసిన దేదియును లేదు. కావుననే

నీకితరుల యపేక్ష లేదు. అట్టి నీకు నమస్కారము. మహైశ్వర్యము బరులఁ దిరస్కరింపఁజాలిన సామర్థ్యము, లోకోత్తరమైన ప్రభావము, బలము మొదలగు సమస్తగుణముల చేతను బ్రకాశించుచున్నవాఁడవు. కావున నీవే ప్రభువవు. నీకంటె వేఱొకఁడు లేఁడు. అట్టి నీకు నమస్కారము. ఓవిష్ణుపత్నీ! ఓలక్ష్మీ! నీవాశ్చర్యశక్తులతోఁ గూడినదానవు. మహాపురుషలక్షణముతో వెలయుచున్నావు. సర్వసంపదలకు నాధారమవు. ఎల్లలోకములకును జననివి. అట్టి నీకు వందనములు." "ఓమహాపురుషా! ఓ మహానుభావా! ఓలక్ష్మీప్రియా! నీ కివే నమస్కృతులు. పార్షదగణములతోఁ గూడిన నీ కర్ఘ్యపాద్యాదికమును సమర్పించెద"ననెడి పూజామంత్రము నుచ్చరించుచుఁ బ్రతిదినమును, నారాయణుని కావాహనము, నాసనము, నర్ఘ్యమును, బాద్యమును, నాచమనీయమును, స్నానమును, వస్త్రములను, యజ్ఞోపవీతములను, భూషణములను, మంచిగంధమును, బుష్పములను, ధూపమును దీపమును నుపహారము మొదలగు నుపచారములతో సావకాశచిత్తయై పూజింపవలయును. అనతంరము హవిస్సును సిద్ధముఁ జేసి భగవంతు నుద్దేశించి పండ్రెండుపర్యాయము లగ్నిలో హోమము చేయవలెను. అట్లు హోమ మొనర్చునప్పుడు "ఓన్నమోభగవతే, మహాపురుషాయస్వాహా"యని త్యాగమంత్రము నుచ్చరింపవలెను. సర్వసంపదలను గోరినవారు వరదులును సమస్తాభిలషితముల నొసంగసమర్థులునునగు లక్ష్మీనారాయణుల భక్తితో నీవిధమున ననుదినంబును బూజింపవలెను. అనంతరము సమాహితచిత్తయై దండప్రణామ మాచరించి భక్తివినయములచే నమ్రవదనయై వెనుకఁ జెప్పినమంత్రమును బది

పర్యాయములు జపించి పిమ్మట నిట్లు నుతింపవలెను. "ఓలక్ష్మీ! ఓ. నారాయణా! మీరిరువురును విశ్వమునకుఁ బ్రభువులరు. మీరే జగంబునకు ముఖ్యకారణమై యున్నారు. ఓదేవా! ఈలక్ష్మియే ప్రకృతిగదా! ఈప్రకృతియే కారణావస్థయందు నిరతిశయ సూక్ష్మమై, తెలియఁ దరముకాని స్వరూపముగలదై యాశ్చర్య స్వరూపిణియై నీకుఁ గార్యములం దుపయుక్తయై భక్తులు కాని వారికి దురతిక్రమమై వఱలుచున్నది. పురుషోత్తమా! నీవట్టి ప్రకృతి కధీశ్వరుఁడవు. నీవుసర్వయజ్ఞస్వరూపుఁడవు. ఈలక్ష్మియిష్టి స్వరూపిణి. ఈలక్ష్మియాగక్రియ, నీవు యాగఫలమనుభవించు వాఁడవు. లక్ష్మిసర్వవస్తువులందునుండు గుణవ్యక్తినీవాగుణముల వ్యక్తీకరించువాఁడవు. ఈదేవిభుక్తి. నీవు ఫలభోక్తవు. నీవు సమస్తజీవులును శరీరముగాఁగలవాఁడవు, ఈదేవి సర్వేంద్రియములకాధారమైనది. ఈలక్ష్మినామరూపములు. నామరూపములను నిర్వహించువాఁడవు నీవు. కావున మీరిరువురును ముల్లోకములవారికిని వరము లొసంగువారలు. సర్వములోను నుత్కృష్టులు. ఓపవిత్రకీర్తీ! నిన్నడిగిన నాప్రార్థనలు సత్యములగుఁగాక." అనియిట్లు లక్ష్మితోఁగూడ వరదుఁడగు నారాయణుని నుతించి మిగిలినపూజాద్రవ్యముల నక్కడనుండి తొలంగించి భగవంతునికాచమనము సమర్పించి మగుడ వెనుకటి ప్రకారమున స్తోత్రముచేసి భక్తిచే వినమ్రమగు చిత్తముతో యాగావశేషము నాఘ్రాణించి వెండియు విష్ణునిఁ బూజింప వలయును. మఱియుఁ బరమభక్తియుక్తురాలై తన భర్త నీశ్వరునిఁగా భావించి యతనికిఁ బ్రియములగు నాయావస్తువుల నర్పించి సంతసింపఁ జేయవలెను. పతియుఁ దనభార్యచేయు

నుపచారములకు సంతసించి యామెనెక్కుడుగాఁ బ్రేమించుచు, నామె యొనరించు చిన్నకార్యములును, ఘనకార్యములును, జక్కఁగ నెఱవేర్చుచుండవలెను. ఇట్లు దంపతు లనుకూలురయి వర్తింతురేని వారిలో నొకరొనర్చినపని యిరువురకు ఫలమొసంగుచుండును. పత్నియిట్లు కొంతకాల మాచరించి తరువాత నొనర్పనశక్తురాలయినచో భర్తయాకార్యభారమును వహించి సమాప్తి నొందింపవలయును. కాని దాని మధ్యకాలమున నసమాప్తిగా వదలిపెట్టరాదు. మఱియుఁ బ్రతిదినమును బ్రాహ్మణులకును, బుత్త్రవతులగు ముత్తైదువలకును, బుష్పమాలలను, మంచిగంధమును, గానుకలను, నలంకారములను సమర్పించి సంతసించునట్లు నియమముతోఁ బూజింపవలెను. అనంతరము స్వహృదయమునందే భగవంతు నుద్వాసనము చెప్పి యతనియెదుట నివేదితమయిన హవిస్సును, సకలవాంఛల నెఱవేఱుకొఱకుఁ దినవలయును. ఈచెప్పినవిధానముచే నొకసంవత్సరమును గడపి కార్తికమాసమున నంతిమదినమం దుద్యాపనము చేయవలయును. మఱునాఁడుదయమున లేచి స్నానముగావించి తొంటియట్లు పరమేశ్వరునిఁ బూజించి నేతితోఁ గూడినపాయసమును సిద్ధముచేసి యామె భర్తచేఁ బండ్రెండుపర్యాయములుహోమముచేయింపవలయును అనంతరము పండ్రెండుగురు బ్రాహ్మణులను బిలిచి పరమాత్మస్వరూపులనిభావించుచు యోగ్యములగు నాహారాదులచేఁ దృప్తినొందింపవలయును. పిమ్మట నావిప్రులకు బెల్లముతోను దిలలతోను లాజలతోను నుదకముతోను నించిన పాత్రములసర్పించి వారికి నమస్కరించివారిచ్చుదీవనల స్వీకరించి వారియనుమతి వడసి యాచార్యుని ముందుగాఁ జేసి

కొని బంధువులతోఁగూడి తాను భుజింపవలెను. మంచి సంతానమును సౌందర్యమును గలుగఁజేయు చరుశేషమును దనపత్ని కర్పింపవలెను. పరమాత్మసంబంధియగు నీవ్రతమును యథావిధిగాఁ బురుషుఁ డొనరించెనేని యభీప్సితార్థమును బొందును. స్త్రీ యీవ్రతమును సల్పినచో నామెకు సౌభాగ్యము, సంపదలు, పుత్త్రులు, దీర్ఘజీవియగు భర్తయు, కీర్తియు, గృహము, మొదలగు నిష్ట వస్తువులు కల్గును. వివాహముకాని యువతి దీని నాచరించినచో సమస్తలక్షణములుగల భర్త లభించు. అపుత్త్రవతు లాచరించినచో, దీర్ఘజీవులగు పుత్త్రులుగల్గుదురు. సౌభాగ్యహీనురాలు దీని నొనర్చినచో సౌభాగ్యము గల్గును. విరూపయగు స్త్రీ యీవ్రతమొనర్చినచో శ్రేష్ఠమగు రూపమొందును. రోగపీడిత దీనిఁ జేసినచో రోగవిముక్తయగును. ఇంద్రియబలము లేనివారు దీనినొనర్చినచోఁ బటుతరమగు నింద్రియబలము నొందుదురు. అభ్యుదయకరములగు కార్యములందెవ్వరైన దీనిఁ బఠించినచోఁ బితృదేవతలకును దేవతలకును మిక్కిలి తృప్తిగలుగును. అట్లు తృప్తి చెందిన పితరులును దేవతలును బఠించినవానికి సమస్తవాంఛితములను నొసంగుదురు. హోమావసానమున శ్రీహరియు నగ్నియుఁగూడఁ బ్రసన్నులయి యడిగినవరముల నిత్తురు "ఓరాజా! మరుత్తుల జన్మములు దితియొనర్చిన పుంసవనవ్రతవిధానమును, ఫలమును వివరించి చెప్పితిని." అనినఁ బరీక్షిన్నృపాలుఁడు విని సంతసించి యిట్లనియె. ఇది పందొమ్మిదవయధ్యాయము.

ఇది శ్రీమత్కేతవరపు వేంకటశాస్త్రి ప్రణీతంబయిన యాంధ్ర వచన భాగవతంబున నాఱవస్కంధము సమాప్తము.

శ్రీకృష్ణార్పణ మస్తు.



శుభమస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్ర భాగవతము.

## సప్తమస్కంధము.



### సనకాదులు జయవిజయులకు శాప మిచ్చుట.

ఓశుకయోగీంద్రా! నీవు వక్కాణించిన చరిత్రములవలన మిగుల సంతసించితిని; కాని నన్నొకసందేహము బాధించుచున్నది. దానిఁదొలఁగించిసంతుష్టునిఁగాఁ జేయుము. భగవంతునికిజ్ఞానాది మహాగుణములు దప్ప రాగము ద్వేషము మొదలగు దుర్గుణములు లేవుగదా! కోరఁదగినవస్తువు లేకపోవుటచే నతఁడవాప్తసమస్తకాముఁడనియు, రాగద్వేషాదులు లేనివాఁడౌటచేనందఱి నొక్కవిధముగానే చూచువాఁడనియుఁ బెద్దలు చెప్పుదురు. అది సత్యమైనచో రాక్షసులకేమి దేవతలకేమి తక్కిన సమస్తభూతములకేమి హితుఁడయి వర్తింప వలయునుగదా! ఇట్లుండ భగవంతుఁడు రాగద్వేషాది దుర్గుణములుగల యధమునివలెఁగొందఱితో స్నేహమును, గొందఱితో ద్వేషమును వహించి తన విషమబుద్ధిఁ జూపనేల? దేవతలవలె దైత్యులును బరమేశ్వరునికి శరీరభూతులేకదా! తన శరీరములోఁ గొంతభాగమునకు హితమొనర్చుటయుఁ, గొంతభాగమునకహితమొనర్చుటయుఁ దగునా? ఇది తగదని యెట్టివానికయినఁ దోఁచకమా

నదు. అదియోజింపక శ్రీహరి యింద్రుని ప్రయోజనము నెఱవేర్చ దైత్యుల నెందులకు సంహరించెను? నిరతిశయానంద స్వరూపుఁడు కాన యాతని కింద్రాదులు సాధింపవలసిన పని యేదియు లేదే? అట్లయినప్పు డింద్రునకు సాయముచేయ నేల? రాగద్వేషాదిశూన్యుఁ డయినవానికి రాక్షసులందు ద్వేష మెట్లుగలిగె'' నని యిట్లు నారాయణుని గుణములనుగూర్చి గొప్ప సంశయము పొడముచున్నది. దానినివర్తింప నీవే తగినవాఁడవు''అని రాజడిగిన విని శుకుం డతని కిట్లనియె. ''ఓమహారాజా! హరిచరిత మతని మహిమను బ్రకటించును. భక్తిని వర్ధింపఁజేయును. అది యూహకు లొంగునదికాదు. అట్టి హరిచరిత్రమును జెప్పుమని యడిగినప్రశ్నము మిక్కిలి యుక్తముగా నున్నది. పరమపుణ్యమగు నాహరిచరితము నారదాదిమహర్షులచే సంతతమును గానము జేయఁబడుచుండును. మఱియు హరిగుణములనుగూర్చి నీకుఁగల్గిన సందేహమును హరిగుణములను వివరించి తొలఁగించుటయే యుచితము. కాన మాజనకుఁడగువ్యాసమహామునికి నమస్కరించిహరికథను జెప్పెదను. సావధానుఁడవయి వినుము. ఓరాజేంద్రా! ఈశ్వరునికి రాగద్వేషాది గుణములుగాని కర్మాధీనము లగుజన్మాదులు గాని లేవు. అతఁడు ప్రత్యక్ష ప్రమాణాదులకు గోచరుఁడు కాఁడు. అతఁడు చిదచిదాత్మకమగు ప్రకృతిపురుషులకంటె వేఱయినవాఁడు. అయినప్పటికి నతఁడు తనకంశభూతమై సత్త్వాదిగుణ విశిష్టమయిన ప్రకృతి నవలంబించి యొకప్పుడు బాధ్యులును, వేఱొకప్పుడు బాధకులు నగుదేవాసురుల కంతరాత్మయై వర్తిల్లుచున్నాఁడు. కావున శరీరభూతులగు దేవాసురులఁ బురస్కరించుకొని బాధ్యబాధకభావము గలుగుచున్నది. అంతియకాని యది

ప్రకృతికంటెను పురుషునికంటెను విలక్షణమైన పరమాత్మను బొందునదికాదు. సత్వము, రజము,తమము నాఁబడు గుణములు ప్రకృతివేకాని యాత్మవికావు. ఆగుణముల కుత్పత్తి వినాశము లొక్కపరి సంభవింపక పర్యాయమునఁ గలుగుచుండును.మఱియు దేవతలు సత్వగుణప్రధానులనియు, రాక్షసులు రజోగుణ ప్రధానులనియు, యక్షాదులు తమోగుణప్రధానులనియు నెఱుంగుదువుగదా ! కర్మాయత్తమగు సత్వగుణ ముద్రేకించిన ప్పుడు జయకాలము దేవతలను మహర్షులను బొందును.అప్పుడు వారినెదిరించినవారికిఁ బరాజయమేకాని జయము సంభవింపదు. రజస్తమోగుణంబు లతిశయించి సత్వగుణము తిరస్కృతమైనం తకాల మెవ్వరికిని జయము గల్గదు. సర్వకాలములందు రజస్తమోగుణము లతిశయించియుండుటచేతనే రాక్షసయక్షాదులకు జయము సంభవింపనేరదు. ఒకవేళ రాక్షసయక్షాదులం దుండుసత్వగుణమే వారి పూర్వకర్మవిశేషముచే నుద్రేకించి రజస్తమంబుల నడపఁగల్గినచో వారి కప్పుడు తప్పక జయము సిద్ధించును. సత్వగుణముయొక్క యుపచయాపచయములేజయ పరాజయములకుఁ గారణమగుచున్నవి. ఆసత్వమునకు వృద్ధియు క్షయమును వారివారిపూర్వకర్మవిశేషముచేతనే సంభవించును గాని వేఱుకాదు. దేవతలు సత్వప్రధానులగుటచే వారికిఁదఱుచుగా సత్వమే యతిశయించుఁగాన జయమె సంభవించుచుండును. రాక్షసాదులు రజస్తమోగుణ ప్రచురులగుటచే నెప్పుడో కాని సత్వముద్రేకింపదుకాన తఱుచుగా నపజయమే సంభవించును. తమతమ పూర్వకర్మవిశేషములచే సత్వోద్రేకము జయకారణ మనియు, సత్వనాశనము పరాజయకారణ మనియుస్పష్టమయిన

దికదా! కావున సర్వాంతరాత్మయగు పరమేశ్వరుఁడు దేవతలకు జయ మొసంగలేదనియు రాక్షసులకుఁ బరాజయ మొసంగ లేదనియు వారి జయాపజయములకు వారివారి కర్మవిశేషము వలనఁ బ్రచురమయిన సత్త్వమే కారణమనియుఁ దెలిసికొనుము. జయాపజయములకు హేతువులయిన సత్త్వగుణరిపు హానివృద్ధులు వారివారి కర్మముల కధీనములగుటవలన నీశ్వరునకు వైషమ్యములేదు. అతఁడు వారివారి కర్మముల కనురూపముగాఁ బ్రవర్తించును. అంతమాత్రమున నజ్ఞులు భగవంతుఁడే యిట్లు విషమముగాఁ బ్రవర్తించుచున్నాఁడని భ్రాంతిచెందుచున్నారు. దీనివలన నీసందేహముతొలఁగవచ్చును. భగవంతుఁడు దేవాసురాదులందుఁ బ్రవిష్టుఁడయియున్నట్లు తెలిసికొనుట యెట్టులందువేని చెప్పెదను వినుము. అగ్నిహోత్రాదులు కాష్ఠాదులను బ్రవేశించి తత్తద్గతములగు దోషములను బొందక ప్రకాశించుచున్నట్లు పరమేశ్వరుఁడు దేహేంద్రియాది రూపమయిన సంఘాతమును బ్రవేశించి తద్గతములగు దోషములఁబొరయక వేఱయి ప్రవర్తించుచున్నాఁడు. కాని యట్లుండుట సామాన్యులు తెలిసికోలేరు. అది కేవల తత్త్వత్రయము నెఱింగి వివేకపూర్వకముగా భగవద్భక్తియోగమునభ్యసించిన పండితులకుమాత్రమేబహుజన్మములలోఁ దెలియును. పరమపురుషుఁడెప్పుడుతన సంకల్పజ్ఞానముచే జీవులకు శరీరముల సృజింపఁదలంచునో, యప్పుడు రజోగుణమును నియోగించును. ఎప్పు డట్లు సృజింపఁబడిన దేహములందు గ్రీడింపఁ దలఁపు గలవాఁడగునో, యప్పుడు సత్త్వమును నియమించును. ఎప్పుడీశ్వరుఁడు వాని నుపసంహరించి శయనింప నిష్టపడునో, యప్పుడు తమోగుణమును నాజ్ఞాపించును. ఓనరేం

ద్రా! ఇంతియకాక పరమాత్మ తనకు శరీరభూతమగు కాలమును సృజించి ప్రకృతిపురుషరూపమయిన సమష్టిసృష్టివలన వ్యష్టిసృష్టిని జేయుచున్నాఁడు. ఈశ్వరుఁడు తన కధీనమగు కాలమును వారివారి కర్మానుగుణముగ సత్వము నభివర్ధించుటకుఁగాని నశింపఁజేయుటకుఁగాని ప్రేరణ నేయుచుండును. కర్మానుగుణ్యమువలన నీశ్వరునిచేఁ గాలము ప్రేరితమయి సత్వగుణము నభివర్ధించిసురలకు జయముగల్గించుచుండును. విపులమూర్తియగుపరమేశ్వరుఁడిట్లు సురల కనుకూలుఁడగు రజస్తమః ప్రచురు లయినరాక్షసాదులను నశింపఁజేయుచుండును. ఇందువిషయమై యొకయితిహాసముగలదు. పూర్వము ధర్మరాజు రాజసూయము చేయుచున్నప్పుడు మహాప్రీతితో నారదుండు దానిం జెప్పె. అది నీకుఁ దెలిపెదనువినుము. పూర్వముధర్మరాజు రాజసూయమనుయాగము నొనరించి భీష్మాదుల యనుమతి వడసి కృష్ణునిసభాపతింగా నెంచి పూజించుచుండఁగా శిశుపాలుండు లేచి క్రుద్ధుఁడయియతని నిందింపఁదొడఁగె. అప్పుడు కృష్ణుఁడు చక్రముచేత నతని తల ఖండింపఁగా నాశిశుపాలునినుండి తేజమొక్కటి నిర్గమించివచ్చి కృష్ణునిలోఁ గలిసె. ధర్మరాజది చూచి మిక్కిలి యాశ్చర్యము నొంది యాసభయందున్న నారదమహామునిం జూచి మునులందఱును వినుచుండఁగా నిట్లనియె. "ఓమునీంద్రా! ప్రకృతి పురుషవిలక్షణుఁడగుశ్రీకృష్ణునియందు శత్రువయిన శిశుపాలుఁడు తేజోరూపమునఁ బ్రవేశించుట మిక్కిలి యద్భుతము. వహ్వారే! శిశుపాలుని భాగ్యము వర్ణనీయముగదా! అట్లు కృష్ణునియందు సాయుజ్యము నొందుట యన్యఫల మపేక్షింపక కేవలము భగవంతునిభజించు భక్తులకైననుదుర్లభముగదా!పూర్వముపృథు

రాజు తండ్రియగు వేనుఁడు భగవంతుని నిందించుటచే ద్విజులు కోపించినరకకూపమునఁ బడునట్లు చేసిరి. వానివలెనేయీశిశుపాలుఁడు మాటలాడనేర్చినప్పటినుండి యిప్పటివఱకునుకృష్ణునితో ద్వేషమువహించి యుండెడివాఁడు. వీని సోదరుఁ డగుదంతవక్త్రుఁడుకూడ నట్లే ద్వేషించుచుండువాఁడు. వీరిరువురును దుర్మతులై పాపకార్యములకు వెనుదీయరు. పరమాత్మయును, నిర్వికారుఁడును నగుశ్రీకృష్ణుని సంతతమును నిందించుచున్న యీశిశుపాల దంతవక్త్రుల నాలుక కుష్ఠాదిరోగపీడితమై పడిపోలేదు. మరణానంతరము వారు నరకమునైనను జెందలేదు. కేవలము భగవంతునే చెందిరి. ఇట్లు సమస్తజనులునుజూచి యచ్చెరువంద నీయిరువురును మోక్షప్రాప్తిసాధనములనేమియుఁ జేకొనకయె దుర్బోధమగు తేజంబున వెలుఁగొందుచునున్నకృష్ణునియం దనాయాసముగానే లయము నెట్లుచెందఁ గలిగిరి? అను సందియముచేనా డెందము వాయువుచే దీపశిఖవలె మిక్కిలి చలించుచున్నది. ఇది మహాద్భుతమయినది. దీనికిఁ గారణమునువేగముగా వక్కాణింపుము." అనిపలికిన ధర్మరాజు వచనంబులు విని నారదభగవానుఁడు సంతసించి సభాసదులందఱును వినుచుండ నతని ప్రశ్నమునకు సమాధానమగు నట్లొకకథ నీవిధమునఁ జెప్పెను. 'ఓరాజా! నిందావాక్యములును, స్తోత్రములును, చందనలేపాదులును, స్నానాదులును, నీశరీరమునకు మాత్రమేకాని యాత్మకు లేవు. దేహాత్మాభిమానముచే వానిని జీవుఁడు తనయం దారోపించుకొనుచున్నాఁడు. అది తెలియఁజాలక సంసారవర్తులగు భూతములు దేహాత్మాభిమానము గలవయి "నేనే నుతింపఁబడితిని. నేనే శ్లాఘింపఁబడితిని. నేనే దండింపఁబడితిని" అని శరీరము

నకు సంభవించునిందాదులనాత్మయందారోపించుకొని పరులకు హింస నొనర్పఁ జూచుచుండును. కాని పరులకుఁ దా మొనర్చు హింస నిందాదులువలె శరీరగతమే కాని యాత్మగతముకాదని యెఱుఁగవు. మఱియు దేహగతములగు దండనాదులవలెఁబ్రాణులవధగూడ దేహాత్మాభిమానముచే నాత్మయందారోపితము అగుచున్నది. అట్టి భ్రాంతిని బుట్టించు దేహాత్మాభిమానము సంసారులకేకాని సర్వేశ్వరునకు లేదు. అనాదులగు కర్మములవలన సంభవించు నభిమానము కర్మరహితుఁడయి సమస్తదోషములను నిరసించుకొని వర్తించు పరమేశ్వరునకు సంభవించుటెట్లు ? అభిమానము లేనప్పుడు తజ్జన్యములగు హింసాదు లెట్లు సంభవించును ? ఓయీ ! శిశుపాలుఁడు కృష్ణు నిందించుటయు నతఁ డతని సంహరించుటయును మనము ప్రత్యక్షముగాఁ జూచితిమే! ఇట్లుండఁ గృష్ణునకు దేహాత్మాభిమానము లేదనియు హింసింపలేదనియుఁ జెప్పిన నెట్లు విశ్వసింపఁదగు? నని యందువేని చెప్పెదవిను. కృష్ణుఁడు దేహాత్మాభిమానము లేనివాఁడయినను నిందించువాఁడు దండనార్హుఁడని లోకుల కుపదేశించుకొఱకును, శిశుపాలునకు రాక్షసత్వమును దొలఁగించి నిరతిశయపురుషార్థమగు తనరూపమందుఁ జేర్చుకొఱకును,నట్లొనరించెను గాని యభిమానముచేఁ గాదు. సంసారులకుంబోలె నతనికి స్తుతినిందాదులు లేవు. కనుకనే తన్నునిందించిన శిశుపాలునకు ముక్తి నొసంగెను. "ఓయీ! ఈచెప్పుట వలన భగవంతుఁడునిరభిమానుఁడుకాన నతనినిందించినను బాపములేదని తోఁచుచున్నది.అభిమానశూన్యులను నిందించుటయే మహాపాతకమని చెప్పుటకు వలనుపడదు. అదియెసత్యమైన నిర

భిమానుఁడగు కృష్ణుని నిందించిన శిశుపాలునకుఁ బాపమునకు మాఱుగా భగవత్సాయుజ్యము గలుగనేల? కావున భగవంతుని నిందించినవారికి శిశుపాలునకుంబోలె మోక్షము గల్గును గాని నుతించినవారి కేమియులేదని తెల్లమగుచున్నది. దీని నంగీకరించినచో సమస్తశాస్త్రములతోను విరోధప్రసంగమువచ్చుచున్నదని'' శంకింపఁ బనిలేదు. భగవంతుని నిందించినంతమాత్రమున ముక్తిగలుగదు. ఎవఁడువిచ్ఛిన్నమగు వైరముచేతఁగాని భక్తిచేతఁగాని, చిన్నప్పటినుండియువర్ధిల్లిన స్నేహముచేతఁగాని, భయముచేతఁగాని, కామముచేతఁగాని తనమనస్సును గేవలము హరియందు లగ్నము గావించి భగవంతునికంటె నన్యమగువస్తువులేదని తలంచునో యట్టివానికి ముక్తిగలుగును. కావునఁ జిన్నతనమునుండి యిప్పటివఱకు నవిచ్ఛిన్నమగు శత్రుత్వమువహించి భగవంతునియందు మనమును లగింపఁజేసిన శిశుపాలునకు ముక్తిగలుగుట కబ్బురమేమున్నది? ఇట్లు తన్మయత్వము నొందినపుఁడే వైరము ముక్తిగల్గించును గాని భగవంతుని దూషించినంతమాత్రమునఁ గలుగనేరదు. భక్తిగాని వైరముగాని యవిచ్ఛిన్నమై యొప్పినప్పుడు ముక్తిగలుగును. ముక్తి కివిరెండును మార్గములే కాని వైరముచేఁ దన్మయత్వ మందఁగలిగినట్లు భక్తియోగమున నొందఁజాలమని నానిశ్చయము. ఇంతియకాక భయముచేఁ దన్మయత్వ మొందునట్లుగూడ భక్తిచేఁ గాదని చెప్పవచ్చును. చూడుము. తుమ్మెద కీటకమును దెచ్చి నిరోధించి ఝుంకారధ్వని చేయుచు సరభసముగదానిచుట్టును భ్రమించుచుండును. అప్పు డాపురుగు భయముచేతను వైరానుబంధముచేతను సంతతమును దానినే స్మరించి తన్మయత్వమును జెంది తత్స

మానరూపమును జెందుచున్నది. అట్లె షాడ్గుణ్యపూర్ణుఁడును స్వసంకల్పముచేత స్వీకృతమగు మనుజశరీరము గలవాఁడును నగు కృష్ణునితో వైరమూని శిశుపాలదంతవక్త్రులు సంతతమును దదీయ ధ్యానముచేఁ దన్మయత్వమునొంది ప్రతిబంధకకర్మముల నశింపఁ జేసికొని తత్స్వరూపమును బొందిరి. ఓరాజా! భక్తిచేతను బోలెకామముచేఁగాని, వైరముచేఁగాని, భయముచేఁగాని, స్నేహముచేఁగాని, మనస్సును బరమాత్మయందు దావేశింపఁ జేసినచో నాసంతతధ్యానముచేఁ గామాదులగు పాపములను దొలఁగించుకొని పరమపద మందవచ్చును. ఇట్లు పరమపదవిని గాంచినవా రెందరో కలరు. కామమువలన గోపికాస్త్రీలును, భయమువలనఁ గంసుండును, ద్వేషమువలన శిశుపాలుఁడు మొదలగు నృపులును, జుట్టఱికమువలన యాదవులును, స్నేహమువలన మీరును, భక్తిచేత మేమును, భగవంతుఁడగుకృష్ణునియందు మనంబును నిలుకడగా నిల్పి విముక్తుల మయితిమి. *ఓధర్మరాజా! భగ

* ఇట భక్తియోగమువలెనే భయకామాదులుగూడ ముక్తిదాయకములగునని చెప్పఁబడియె. ఇంతియకాక భక్తికంటెఁ గామభయాదులే శీఘ్రముగా ముక్తిదాయకములని స్థాపితమయ్యె. అయినను భక్తియోగమందున్నయొక విశేషము సంరంభభయాదులందులేదు. భక్తియోగము ప్రస్తుతజన్మమున నారబ్ధమయి కారణాంతరమున విచ్ఛిన్నమయినప్పటికిని, నదియుత్తరోత్తరజన్మములందుఁ గ్రమక్రమముగా వర్ధిల్లి భావనాప్రకర్షను లభింపఁజేసి తుదకు ముక్తి గల్గించును. కానివ్యర్థముకాదు. ఈయర్థమునే కృష్ణభగవానుఁడు "పార్థనైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే" అని ప్రారంభించి "తత్రతంబుద్ధిసంయోగంలభతే పౌర్వదైహికం, యతతేచ తతో భూయ స్సంసిద్ధౌకురునందన, పూర్వాభ్యాసేనతేనైవ హ్రియతేహ్యవశోపిసః" అనుగ్రంథముచే నర్జునున కుపదేశించె. కావున భక్తియోగము కాలాంతరములందు ఫలసాధనమగును. కాని

వంతునితో ద్వేషము వహించినను వేనునకు శిశుపాలాదులకుం బోలె ముక్తిగలుగక పోవుటకు హేతు వేమోయని నీవు సందేహమంద నవసరము లేదు. వెనుకఁ జెప్పిన కామాదు లయిదింటిలో నొకదానిచేతనైనను మనమును భగవంతునియందు నిశ్చయముగా నుంపఁగల్గినచోఁ దుదకా కామాదిసాధనములను విడిచి ముక్తి చెందుదురు. వేనుఁ డిట్లయిదింటిలో నొకదానిచేతనయినను మనమును బరమేశ్వరునియందుఁ జేర్పలేక సంతతమును నిందింపఁ దొడఁగెను. అందువలన వానికి ముక్తి లేకపోవుటయే కాక, నరకముగూడ సంభవించినది. ఓధర్మరాజా! నీపినతల్లి కుమారులగు శిశుపాలదంతవక్త్రులు ముక్తిం జెందుట కీవైరానుబంధమే కారణముకాక, మఱియొకటిగూడ నున్నది. వీ రిరువురును బూర్వము విష్ణువు ద్వారపాలకులు. వారు విప్రశాపము వలన స్థానభ్రష్టులయి యిట్లు పుట్టిరి. వీరికిఁ బూర్వమం దధికమగు భగవదానుకూల్యమున్నది. కావున శాపాంతమందు భావ

విచ్ఛిన్నమైనంతమాత్రమున వ్యర్థముకాదు. భయకామాదు లేజన్మమున నారంభింపఁబడునో దానియందే యవి భావనాప్రకర్షము కలుగునంతకు నతిశయిల్లి ముక్తిగల్గింపవలెను. అట్లు కాక మధ్యకాలమున విచ్ఛిన్నమైనచో నవిస్వరూపనాశన మొందునే కాని యుత్తరజన్మముల వర్ధిల్లి ముక్తిగల్గింప నేరవు. ఇంతియ కాక విచ్ఛిన్నము లగు వైరాదులు నరకమునుగూడఁ గల్గించును. వైరాదులా జన్మమందే భావనాప్రకర్షపర్యంతమును వర్ధిల్లినచో ముక్తిగల్గించును. లేనిచో నరకమునఁ ద్రోయును. వేనువైరము భావనాప్రకర్షమును గల్గింపలేనిదగుట చేతనే ముక్తిగల్గింపకపోవుటయే కాక నరకమునఁగూల్చెను. శిశుపాలాదుల వైరము ప్రబలియాజన్మమందే భావనాప్రకర్షమును గల్గింపఁజాలిన దగుటచే ముక్తిసంభవించినది. ఈవిశేషముభక్తియోగమందుండుటచేతనే యిదినిరపాయమయిన మార్గమని తలంచి పెక్కండ్రు దీనినే యవలంబించుచుందురు.



1229. సనకసనందనాదులు జయవిజయులకు శాపమిచ్చుట.

నా ప్రకర్షసిద్ధిచే ముక్తి నొందిరి.'' అనినవిని యుధిష్ఠిరుండు నారదున కిట్లనియె. "ఓమునీంద్రా! నీచెప్పిన యర్థము మిక్కిలి యసంగతముగా నున్నది. సామాన్యముగా ముక్తులకే పునర్జన్మము లేదని వేదములు చెప్పుచున్నవి. ఇట్లుండ నిత్యసిద్ధులయి భగవంతుని పార్శ్వమునవర్తించువారలకుఁ బునర్జన్మము గల్గుట మిక్కిలి చిత్రముగా నున్నది. ఆశాపమెట్టిది? ఎవ్వరట్టిశాపమునొసంగిరి? ఎట్లాలోచించినను, గర్మాధీనమగు ప్రాకృతదేహేంద్రియాదులు లేక నిత్యసిద్ధులై వైకుంఠనగరమున వర్తించువారికిఁ బ్రాకృతదేహముతోను, దద్దేహానుగతములగు రాగద్వేషాదులతోను సంబంధము గలుగుట మిక్కిలియసంగతముగాఁదోఁచుచున్నది. ఆచరిత్రము నాకు వినిపింపవే''యని ప్రార్థించినవిని నారదుం డిట్లనియె. "పూర్వమొకప్పుడు బ్రహ్మనందనులగు సనకసనందనాదులు భువనత్రయమందును సంచరించుచు విష్ణువునుజూచుతలంపుతో వైకుంఠమున కేఁగిరి. రుద్రాదులకుఁ గూడఁబూర్వులయిన యాసనకాదు లయిదేండ్ల బాలకులవలెఁ గానవచ్చుచు దిగంబరులై పురద్వారమును బ్రవేశించుచుండఁగా నచ్చటనున్న జయవిజయులు వారిని బాలకులఁగా నెంచి లోపలి కరుగకుండ నివారించిరి. అంత వారు మిక్కిలి కోపించి "ఓరీ! మీరు రజస్తమోగుణములచే వఱలుచున్నారు. రజస్తమోగుణరహితుఁడగు నారాయణుని పాదమూలమున వసించుటకు మీరుతగరు. కావున నిటనుండి వేగముగాఁ బోయి రాగద్వేషాది ప్రచురులయిన రాక్షసులై జన్మింపు''డని శపించిరి. అనంతర మా ద్వారపాలకులు హరి పాదములపైఁబడి ప్రార్థింపఁగాఁ గరుణించి యమ్మునీంద్రులు "మూఁడు జన్మములచే మగుడ వైకుంఠప్రాప్తి

గల్గు''నని శాపమోక్ష మనుగ్రహించిరి. ఆ జయవిజయులు ముందుగా దితిగర్భమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులయిజన్మించి సకలదైత్యదానవులచేతను నుతిఁగాంచిరి. అందుఁ బెద్దవాఁడగు హిరణ్యకశిపువు నరసింహరూపుఁ డగునారాయణునిచేఁ జచ్చె. చిన్నవాఁ డగుహిరణ్యాక్షుఁడు, భూమి నుద్ధరించుటకు వరాహరూపముఁదాల్చినహరిచే మృతినొందెను. ఓయుధిష్ఠిరా! ఆహిరణ్యకశిపువు విష్ణుభక్తుఁడయిన కుమారునిఁ బ్రహ్లాదునిఁ జంపుటకనేకవిధములగు యాతనలను గల్పించె. ఇట్లు సర్వప్రయత్నంబులు చేసియుఁ గుమారునిఁ జంపలేక పోయెను. ఆప్రహ్లాదుఁడు సుఖదుఃఖములను సమముగా భావించుచు, సర్వభూతములనుదన్ను నేకవిధముగాఁ జూచుచునశనాయాసాదులులేక, విష్ణుతేజంబుచే వ్యాప్తుఁడై యొప్పుచుండఁగా నారక్కసుండు వాని నెట్లుసంహరింపఁగలఁడు.? అనంతరము వారిరువురును రెండవజన్మమున విశ్రవసునకుఁ గేకసియందు రావణకుంభకర్ణులయి యుదయించి సర్వలోకములను బాధింపఁ దొడఁగిరి. అప్పుడు హరి వారికిశాపవిముక్తిగల్గింప రాఘవుఁడయి పుట్టి సమయించెను. ఓరాజేంద్రా! నీ వా రామచరిత్రమును మార్కండేయమహామునివలన వింటివి. వారే యిప్పుడు నీ పినతల్లి కుమారులగు శిశుపాలదంతవక్త్రులయి జన్మించి కృష్ణుని చక్రమున హతులయి శాపవిముక్తినిగాంచిరి. వారిట్లు సంతతమునుహరితో వైర మవలంబించి తదీయధ్యానముచేవిష్ణుసాధర్మ్యమునుబొంది హరిపార్షదు లయిరి.'' అని చెప్పినవిని ధర్మజుండు మిక్కిలి సంతసించి నారదున కిట్లనె. ''ఓ మునీంద్రా! తనకుఁ బ్రేమాస్పదుఁడయి సద్గుణములకాశ్రయుఁడై యున్న ప్రహ్లాదునియందు హిరణ్యకశిపునకు ద్వేష

బుద్ధి యేలకలిగె. ఆప్రహ్లాదుఁ డేవిధముగా హరిభక్తి నిశ్చలుఁడయ్యె. ఆచరిత్రమును నాకు వినిపింపు"మని యడుగ నారదుం డిట్లనియె. ఇది ప్రథమాధ్యాయము.

---

{ హిరణ్యకశిపుఁడు తమ్ముని చావుకై విలపించి రాక్షసులయెదుటఁ బ్రతిజ్ఞ జేయుట. }

ఓరాజేంద్రా! తనసోదరుఁ డగుహిరణ్యాక్షుండువరాహరూపియగుహరిచే హతుఁడగుటవిని హిరణ్యకశిపువు మొదట మిక్కిలి దుఃఖమునుగాంచి పిమ్మట నుగ్రక్రోధమును వహించి పెదవి గొఱుకుచుఁ, గినుకచేఁ బ్రజ్వలించుచున్న నేత్రములతో నాకాశమును జూచి ధూమమయముగా నొనర్పఁ జొచ్చెను. మఱియు నతఁడు భయంకరమగు కోఱపండ్లు గలవాఁడగుటచేతను, నుగ్రము లగుచూపులు గలవాఁ డగుటచేతను, బొమముడిగలవాఁడగుటచేతను, చూచువారికి భయము గొల్పుచు శూలమును ధరించి సభయందున్నదానవులతో నిట్లనియె. ఓదానవులారా! ఓదైత్యులారా! ఓత్రిమూర్ధా! ఓరీ త్ర్యక్షా! ఓరీశంబరా! ఓరీ శతబాహూ! ఓయీహయగ్రీవా! ఓయీనముచీ! ఓపాకాసురా ఓయిల్వలా! ఓవిప్రచిత్తీ! ఓపులోమా! ఓశకునాదులారా! మీరందఱును ముందుగా నావచనము విని శీఘ్రముగా దాని నాచరింతురుగాక. దేవాసురులకు సముఁడయినను నారాయణుండు స్వల్పబలులయిన దేవతల పక్షము వహించి వారికోర్కె నెఱవేర్చుటకై మీకు స్నేహితుండగునాముద్దుతమ్ముని నిష్కారణుఁడయిసంహరించె. సూర్యునికింబోలెఁ దేజోమయమయినశరీరము గలవాఁడయ్యును, మాయావరాహరూపముఁ దాల్చినవాఁ

డగుటచే దేవతాస్వభావమును విడిచి కేవలము పశుస్వభావము గలవాఁడయి బాలునివలెఁజంచలచిత్తుఁడయివర్తించుచున్నహరి కంఠనాళము నీశూలముచేఖండించి యారక్తముచే రక్తప్రియుఁడయిన నాతమ్మునికిఁ దర్పణంబులొనర్చి దుఃఖరహితుఁడ నయ్యెదను. మనకువిరోధియు దేవతల కాధారుండునునగు విష్ణువుచచ్చినచో నాతఁడే జీవనముగాఁగల సురలు నిర్మూలమగు చెట్టుకొమ్మలవలెఁ దమంత తామేయెండి నశింతురు. కావున దివిజులఁ జంపుటకై మనముప్రయత్నింప నవసరములేదు. నేనునాకార్యమును నిర్వహించునంతలో మీరు బ్రాహ్మణులచేతను క్షత్రియులచేతను నిండియున్న భూమండలమున కరిగి తపస్వులను యాగకర్తలను స్వాధ్యాయపరులను, వ్రతనిష్ఠులను, దానశౌండులను వెదకి వెదకి సంహరింపుఁడు. ఓయీ! సురలునుహరియును మన కపరాధము చేసియుండఁగా వారిని జంపుటకు మాఱుగా నిరపరాధులగు ద్విజులను జంపనేల? యని శంకింపకుఁడు. ద్విజు లొనర్చుస్మార్త క్రియలును, యాగాదులును విష్ణువునకు శరీరభూతము లగుచున్నవి. దేవతలను, పితృదేవతలను, ఋషులను, నుద్దేశించి మనుజు లొనర్చుధర్మముల నతఁ డాశ్రయించియుండును. కావున ద్విజులను, వా రొనర్చుచున్న యాగాది ధర్మములను నశింపఁజేసినచోఁ దాదృశధర్మరూప మగుశరీరము లేకపోవుటచే విష్ణువు నశించును. ఆధర్మము నశించినతోడనే యాగాదినిష్ఠ మగు హవిర్భాగాదిరూప మయినభోజనము లేక పస్తుపడి దేవతలందఱును నిర్జీవులయ్యెదరు. అందువలన మీరందఱును గలిసి యెచ్చట బ్రాహ్మణులును, గోవులును, వేదాధ్యయనాదులును వర్ణాశ్రమములకు విహితములగు కృత్యములును బ్రవర్తిల్లునో,

యా దేశములకుఁబోయి పూర్ణముగా దహించి ధ్వంసము గావిం పుఁడు" అని శాసించుభర్తృశాసనమును శిరసావహించి యుద్ధ ప్రియులగుదైత్యులును, దానవులును, బ్రజలతో భయంకరము గాఁబోరిరి. అందుఁ గొందఱు బురములను, గ్రామములను, గోష్ఠ ములను, బొలములను, నుద్యానవనములను, ఋష్యాశ్రమము లను, రత్ననిలయములను, కృషీవలనివాసములను, ఖర్వటము లను, గొల్లపల్లెలను, రాజధానులను దహింపఁ దొడంగిరి. కొం దఱు పాఱలు గునపములు మొదలగు ఖననసాధనములు దాల్చి సేతువులను, బ్రాకారములను, గోపురములను ద్రవ్విపాఱవైచిరి. కొందఱు గొడ్డండ్రను స్వీకరించి ఫలవంతము లగు చూతాది వృక్షములను ఛేదించిరి. మఱికొందఱు గృహంబుల దహించిరి. వేఱొకకొందఱు కొఱకచ్చులచే జనులనుగాల్చిచంపిరి.ఇట్లురక్క సులు లోకమును ధ్వంసముచేయుటచే దేవతలందఱును భయపడి స్వర్గమును విడిచి యదృశ్యమానులయి భూమియందుఁ జరింప సాగిరి. అట హిరణ్యకశిపుఁడుమిక్కిలిదుఃఖితుఁడయి చచ్చినసోద రునకుఁ బ్రేతకార్యములు నిర్వర్తించి దేశకాలముల నెఱిఁగిన వాఁడు కావున శకుని, శంబరుఁడు, ధార్ష్టి, భూతసంతాపనుఁడు, వృకుఁడు, కాలనాభుఁడు, మహానాభుఁడు, హరిశ్మశ్రువు, మదో త్కచుఁడు, నాఁబడు తమ్ముని కుమారులను, వారలతల్లియగురు షద్భానువును, దనతల్లియగు దితిని,మధుర వచనములచే దుఃఖ విముక్తులఁ గావించి యిట్లనియె."ఓతల్లీ! ఓమఱఁదలా! ఓపుత్త్రు లారా! వీరుఁ డయినహిరణ్యాక్షునిఁ గూర్చి మీరు సుంతేనియు దుఃఖింపరాదు. శత్రువులతోఁ బోరిచచ్చుటకంటె శూరులకుఁ బ్రియతమ మయినది యుండదు. నాతమ్ముని కట్టిప్రియము

లభించినందులకు సంతసింపఁ దగియుండగా విచారింపనేల ? ఇంతియ కాక సంసారమొక చలిపందిరివంటిది. నానాదేశస్థులగు పాంథులు జలపానేచ్ఛచే నందుఁగూడికొని క్రియానంతరమందే విడివడి నానామార్గములఁ జెదరిపోవుదురు. అట్లె భూతములును దమతమ కర్మముల ననుసరించి ప్రవృత్తుఁడయినయీశ్వరునిచే సంయోజితములునువియోజితములును నగుచుండును. కావునఁ గర్మానుబంధమున నొక్కచోఁ గూడి కర్మావసానమునఁ జెదరిపోవుచుండును. దేహము నశ్వరము. ఆత్మ నిత్యుఁడు. అతఁడు తనకర్మమున కనుగుణమయిన శరీరాదులను బొంది కర్మాంతమున విడుచుచుండును. అట్లయినప్పు డాత్మయె నశించినదని భ్రమఁజెంది శోకించుచుందురు. కాని యాత్మ కెన్నఁడును నాశనాదులులేవు.అతని స్వరూపము ప్రకృతికి దూరమయినది.అతనికి దేహేంద్రియాదుల యాథార్థ్యము చక్కఁగఁ దెలియు.అతఁడు ప్రకృతికంటెఁ బరుఁడయిధర్మభూతజ్ఞానముచే సర్వవ్యాపియై యుండును. అయినప్పటికిని జీవుఁడు స్వకీయమగుపుణ్యపాపకర్ములను బురస్కరించుకొని సత్త్వాదిగుణములను వికృతినొందించుచుఁదనకర్మఫలానుభవమునిమిత్తము లింగశరీరమునుదాల్చుచున్నాఁడు."నేను దేవుఁడను," "నేనుమనుష్యుఁడను"ననుప్రతీతినిబట్టి దేహమే యాత్మయని తెలియవచ్చుచున్నది.కాని యది భ్రాంతికాని వేఱుకాదు. చూడుము. జలము చలించినప్పుడు దానఁ బ్రతిబింబించిన వృక్షాదులు చలించుచున్నట్లె కానవచ్చును.ఆలోచింప నుపాధియగుజలమునుబట్టి వృక్షాదులకుఁ జాంచల్యమున్నట్లు భ్రమకలుగుచున్నదికాని వేఱుగాదు. కంటియందున్నదోషముచే భూమి దిరుగుచున్నట్టు భ్రమకలుగుచున్నది.

కాని వాస్తవముగా భూమికట్టి భ్రమణము లేదు. అట్లైనసత్త్వాది గుణపరిణామము లగు దేహేంద్రియాదులతోఁ గూడి మనస్సు సంచరించుచుండఁగా జీవుఁడుస్వయముగా దేహాదులకంటెభిన్నుఁడయినను "నేనే దేవుఁడను" "నేనే మనుష్యుఁడ" నని దేహమునే తన్నుఁగాఁ దలంచుచు దేహాదిలింగములు లేనివాఁడయినను నవి కలవని నమ్మచుండుట భ్రాంతిమూలకమే కానివేఱు కాదు. వాస్తవముగా శరీరాదులకంటె భిన్నమయిన యాత్మను శరీరాదులఁగాఁదలంచుట యాత్మవ్యత్యాసమెకాని వేఱుకాదు. ఆయాత్మవ్యత్యాసమే సంసారము. అదియె ప్రియాప్రియవస్తువులతో సంయోగవియోగములను గల్గించి సుఖదుఃఖజనక మగుచున్నది. పుట్టువు, చావు, పలువిధములగుశోకములు, అవివేకము విషయానుధ్యానము, మిత్రాదులుబోధించినను వివేకమనుసంధానముచేసికోలేకపోవుట, మొదలగునవియన్నియుఁ గర్మమువలనఁ గల్గిన సంసారమే. యమునకును బ్రేతబంధువులకును బ్రవర్తిల్లిన సంవాదరూపమగు నొక పురాతనేతిహాసము కలదు. దానినీవిషయమై యుదాహరించెదను. సావధానచిత్తములతో వినుఁడు. పూర్వ ముశీనరదేశములందుఁ బ్రఖ్యాతిగాంచిన సుయజ్ఞుఁడను నొకరాజు గలఁడు. అతఁడు యుద్ధమున శత్రువులచేఁ జంపఁబడఁగా నాతని జ్ఞాతు లాశవముచుట్టునుమూగిరి. శిథిలమయిన రత్నకవచముతోను, జాఱినయలంకారముతోను, శరవిచ్ఛిన్నమయిన వక్షముతోను, నెత్తుటఁబడిసిన దేహముతోను, వీడ్వడిన కేశములతోను, నిశ్చలములగు నేత్రములతోను, గ్రోధముచే దష్టమయిన యధరోష్ఠముతోను, ధూళిధూసరితమయిన ముఖపద్మముతోను, దెగినభుజముతోను, నాయుధముతోను

యుద్ధభూమియందుఁ బడియున్న భర్తను గాంచి యతనిభార్యలు మిక్కిలి దుఃఖించుచు "హానాథా ! చచ్చితి" మని పలుకుచుఁ, జేతులచే ఱొమ్ములు మోఁదుకొనుచు. భర్తపాదములసన్నిధినిబడి, యెలుఁగులెత్తి యేడ్చుచు, గుచకుంకుమమును దుడిచి పాఱుచున్నకన్నీటిచేఁ బతి పాదపంకజములను దడుపుచు, ముడిచిన కేశపాశములును, దాల్చినయలంకారములును జాఱుచుండఁగాఁ జూచువారికిఁగూడ దుఃఖముదయించునట్లుగా నిట్లు విలపింపసాగిరి. "హా ప్రాణేశ్వరా ! దయారహితుఁ డగుబ్రహ్మచే నిట్లు చంపఁబడితివా ? ఉశీనరదేశవాసులకెల్లను జీవనము నిచ్చుచు సంతసముగూర్చెడి నీవిప్పుడు దుఃఖమును గల్గించుట యుచితమా ? ఓ మహీపాలా ! మాకుఁ బ్రియతముఁడ వయి కృతజ్ఞుఁడ వయి యున్న నిన్ను విడిచి మేమెట్లుగా జీవింపఁగల్గుదుము? నీవెచ్చటికేఁగెదవో యచ్చటికే వచ్చి నీపాదసేవ నొనర్తుము. కావున మాకు సహగమనమొసంగుము." అని విలపించుచు నారాజపత్నులు భర్తృకళేబరమునకు దహనాదిసంస్కారము లొనర్ప నిష్టపడకుండిరి. అంత సూర్యుం డస్తమించెను. ప్రేతబంధువు లిట్లు చేయుచున్న రోదనధ్వనుల నాలకించి యముఁడు బాలకవేషమునుదాల్చి యచ్చటికివచ్చి వారల కిట్లనియె. "అయ్యారే! ఏమివింత! వయస్సున నాకంటెఁ బెద్దవారయి జననమరణాదిరూపమగు లోకపరిపాటినిఁ జూచియు, నీప్రేతబంధువులు మోహమును జెందుచున్నారు. భూమియందుఁబుట్టి భూమియందే లయమునుజెందుట మానవాదులకు స్వాభావిక ధర్మము. ఈ రండఱును నీమృతపురుషునివలె జన్మించి చచ్చుటకు సిద్ధులై యున్నట్లు తెలియఁజాలక వృథాదుఃఖముఁ జెందు

చున్నారు. మాతల్లిదండ్రులు నశించినప్పటికిని మే మింతేనియు దుఃఖమొందలేదు. భళిరే ! స్వల్పవయస్కులమైనను మేమే ధన్యులము. బాలకులమై యిందు సంచరించుచున్నను మేము వృకాదులచే భక్షింపఁబడలేదు. తల్లిగర్భమందున్నప్పు డెవఁడు రక్షించెనో యాభగవంతుఁడే జననానంతరమందును సర్వదా రక్షింపఁగలఁడు. ఇందులకై విచారింపనేల ? ఎవఁడు లీలకై సర్వప్రపంచమును సృజించుచున్నాఁడో, యెవఁడు క్షయాదివికారములు లేనివాఁడో, యెవఁడు తాసృజించిన జగంబులను రక్షించుచున్నాఁడో, యెవఁడు వాని నంతమున నశింపఁజేయుచున్నాఁడో, యాపరమేశ్వరుఁ డంతట నంతరాత్మరూపమున నిండియున్నాఁడు. అతని కీ చరాచరప్రపంచము క్రీడాసాధనము. నిగ్రహానుగ్రహసమర్థుఁ డయినయతఁ డీప్రపంచముతో నాడుకొనుచున్నప్పుడు భూతములకు సంయోగవియోగములు గల్గుచుండు. కావునఁ జచ్చినవారికివిలపింపరాదు.పుట్టినవారికిసంతసింపరాదు. మార్గమును దప్పి యరణ్యములఁ బట్టిపోయినను, దైవముచే రక్షింపఁబడినవాఁడు నిరపాయముగా నిలుసేరఁగల్గును. ఇంటియందున్నవాఁడయినను దైవరక్షితుఁడుకానిచోఁ దప్పక మృతి చెందును. కావున నీశ్వరానుగ్రహముగలవాఁ డీలోకమున దిక్కులేక యడవులలోఁ గ్రుమ్మరుచున్నను జీవింపఁగల్గు. అది లేనివాఁడు గృహములలో వందలకొలంది జనముచే రక్షితుఁడగుచున్నను జీవింపఁనేరఁడని తెలిసికొనుఁడు. దేవమనుష్యాదులందఱును నిజకర్మముల ననుసరించి పుట్టి కర్మఫల మున్నంతకాలమును వర్తించి, యది యవసానమందిన క్షణమందే గిట్టుదురు. ఆయాకర్మము లీశ్వరాయత్తములై యుండును. కాన యతఁడే

దేవాదులయుత్పత్తి వినాశముల నడుపుచున్నవాఁడు. అతఁడు సర్వశక్తుఁడు.జీవులకంతరాత్మయై దేవాదిశరీరములందు వర్తించుచున్నను నతనికి సంసారము లేదు. ఈశ్వరాధీనమయినదానిఁ గూర్చి విలపించి సంపాదించునదేమికలదు? కావున దుఃఖము విడువుఁడు. ఈ కనఁబడుచున్న రాజాదుల శరీరము జీవులకుఁ గర్మజనితమగు మోహమువలనఁగల్గుచున్నది. గృహము గృహస్థునికంటె భిన్నమయినట్లు జీవుఁడు శరీరముకంటె వేఱగుచున్నాఁడు. మంటిచేతనుగాష్ఠాదులచేతనునిర్మితమయినగృహము కాలవశమున నెట్లు నశించుచున్నదో, యట్లె పంచభూతముల భాగములచే నిర్మితమగు నీశరీరము కాలవశమున యౌవనాది దశలచే వికారములఁబొంది కర్మవినాశమయినతోడనే వినాశమునొందు. అగ్ని దారువులందుండియు దగ్ధములగు వికారములనుబొందక దానికి భిన్నమయి చూపట్టుచున్నది. వాయువు దేహమందు వర్తించుచున్నను నది దానికంటె వేఱగుచున్నది. ఆకాశమంతటను వ్యాపించియున్నను దత్తద్వస్తుగతములగు వికారములను బొందక వానికంటె భిన్నమగుచున్నది. అట్లే జీవుఁడు సత్త్వాదిగుణములచేఁ బరిణమితములగు దేహేంద్రియాదుల నాశ్రయించి యవిభాగముగా వర్తించుచున్నను, దేహాదిగతములగు జరామరణాదివికారముల నొందక వానికి భిన్నుఁడయి వఱలుచున్నాఁడు. ఓ యంగనలారా! మూఢబుద్ధులయిన మీరెవనికై విలపించుచున్నారో యాసుయజ్ఞుఁడిదిగో నిచ్చటనే యున్నాఁడు. విలపించెదరేల? "దీనికై మేము విలపింపలేదు. ఎవఁడు మావిలాపముల విని ప్రత్యుత్తరమిచ్చుటకు సమర్థుఁడో యట్టివానికై యిట్లు చింతించుచున్నా"మని యందురేని, వాఁ

డెప్పుడు సూక్ష్మదృష్టితోఁ జూచినను జూడఁబడఁడు. ఎప్పుడును మీకు గోచరము కానివాఁడు మీవిలాపముల విని ప్రత్యుత్తర మెట్లీయఁగలడు? "ఇందుండు ప్రాణముకయి విలపించుచున్నా" మని యందురేని, ప్రాణము ముఖ్యమైనదైనను వినునదియుఁ గాదు. ప్రత్యుత్తర మిచ్చునదియుగాదు. "మాకెప్పుడుగానరాక పోయిన నెవఁ డీశరీరమందుండి యిప్పుడు వెడలిపోయినాఁడో, వానిఁగూర్చి విలపించుచున్నా" మని యందురేని, వాఁడు దేహ ప్రాణాదులకు భిన్నుఁడయిన జీవాత్మయే కాని వేఱొకఁడు కాఁడు. అతఁడు శ్రవణాదులగు నింద్రియములతోఁ గూడికొనియుఁ బ్రకృతికంటెఁ బరుండై స్వకీయమగు జ్ఞానముచే నొప్పుచు, భూతములచేతను, నింద్రియములచేతను, మనస్సుచేతను, లక్ష్యమాణములయినయుత్తమనీచదేహములను గర్మానుగుణముగాఁ బొంది కర్మమువశించినతోడనే వానివిడిచి పోవుచుండును. జీవునకుఁ గర్మవశమున దేహముగైకొంటయు వీడుటయు నైజమయి యున్నది. వాఁడు తన స్వాభావికమగురీతిచే నీశరీరమునువిడిచిపోఁగా వగవ నేమి యవసరము? ఎంతకాలము శరీరమునకుఁ గారణ మయిన పుణ్యపాపరూపమగు కర్మముండునో, యంతకాలమును దేహాదులతోఁగూడి యాత్మ ప్రకృతిసంబంధరూపమగు సంసార మును బొందును, దానివలన దేహాత్మభ్రాంతియు నందువలనఁ గ్లేశములును సంభవించును. జీవునకీ రాజశరీరసంబంధముగల్గెను. దానంజేసి మీరు "మా కితఁడు పతి" "మే మితనికి భార్యల" మని దేహాత్మభ్రాంతియు, దానివలనఁ గ్లేశములును జెందుచున్నారు. దేహాత్మభ్రమ నివారించెనేని యేసంబంధమును గానరాదు. దేహసంబంధమునకుఁ గారణమయిన కర్మము నివర్తించి

నతోడనే జీవుఁడు దేహమునువిడుచుచుండు. ఇట్లీ దేహమునకును నాజీవునకును సంబంధమే లేకపోయియుండఁగా మీరు విలపించుట నిష్ఫలము.మఱియు సత్త్వాదిగుణపరిణామములగు దేహాదులును శబ్దాదివిషయములును తమ కుపభోగ్యములయి యున్నవనెడి యభిమానము కేవలము వ్యర్థమయినది. కలలోఁ గాంచిన పదార్థములు దత్కాలమందుమాత్రమే యుండి నశించునవి. స్వప్నదృష్టమగు నానాపదార్థములువలె నీదేహాదులునిత్యములయియుండఁగా వానియందట్టి యభిమానముంచుట యవివేకమును వెల్లడిచేయుచున్నది.ఓయంగనలారా! దేహాత్మల యాథాత్మ్య మెఱిఁగిన మహాత్ములు నిత్యమగు నాత్మనిమిత్తముగాని, యనిత్యమగు దేహాదినిమిత్తముగాని యెంతమాత్రమును దుఃఖింపరు. ఆదేహాత్మల కాయాగుణములు నైజము లగుటచే వానిని దప్పింప నెరికిని శక్యముగాదు. అగ్నికి నైజమయిన యుష్ణత్వమును దొలంగించి శైత్యము నెవ్వరయినను ఘటింపఁజాలుదురా? పండితులిందులకయి దుఃఖింపక సుఖింతురు. అజ్ఞులు సంయోగవియోగములవలన సుఖదుఃఖముల నొందుదురు. పూర్వ మొక వ్యాధుఁడొక మహారణ్యంబున నివసించుచుండె. వాఁడు పక్షులకు యమునివలె వఱలుచుండెను. వాఁడొక నాఁడు జాలమును విస్తరింపఁజేసి పక్షులు మోసపోవున ట్లనేకమాయోపాయములఁ బన్నియుండె. అంత సమీపమున వర్తించుచున్న యడవిపిచ్చుకజతలో నాఁడుపిట్ట లుబ్ధకునిచే వంచితయై వలలోఁ జిక్కికొనియె. అప్పు డాపదనుబొంది దీనమైయున్న తనభార్యను జూచి పురుషపక్షి స్నేహాతిశయమున మిక్కిలి పొక్కుచు దానిరక్షించుట కసమర్థమై దీనమై యారాటమునొందుచు సంతా

పమునొంది యిట్లు విలపింపఁజొచ్చెను. 'అయ్యో! దేవుఁడు దయలేనివాఁడు. కఠినహృదయుఁడు. కానిచోఁ గనికరింపఁదగిన నా భార్యను నిష్కారణముగా నాతో నెడఁబాపునా? దానితో నతనికి గల్గు ప్రయోజనమేమి? అక్కటా! దీనుఁడనగు నన్నుఁగూర్చి యెంతదుఃఖించుచున్నది. నావియోగము నెట్లు సహింపఁగలుగును. ఆదేవునికి నాయందు సుంతేనియు దయలేదాయెనే! నా శరీరముననర్ధభాగమగుభార్యను నిర్దయుఁడై కొనిపోయినవాఁడు నన్నేలగొనిపోరాదు?'' దైవమా! కృపణుఁడనై యతికష్టముగఁ బ్రాణములధరించుచు, భార్యాశూన్యుఁడనై వర్తించు నన్నుఁ గూడ నాభార్యతోఁ గొనిపోవుట యుచితముగదా! అక్కటా! ఱెక్కలురాకపోవుటచే నెగురఁజాలక గూటియందువర్తించుచున్న తల్లిచావుపిల్లల నెట్లు పోషింపఁగలుగుదును? అయ్యో! పాపము.దురదృష్టవంతము లగునాశాబకములు గూఁటిలోనుండితల్లి రాకకయి యింకను నెదురుచూచుచుండును గదా!ఆహా!వానిఁ జూచియెట్లు జీవింపఁగలుగుదు?''నని యిట్లు ప్రియావియోగము నొంది సిల్లలకై యేడ్చుచున్నయాపురుషపక్షినిఁ జూచి యావ్యాధుఁడు సమీపమందెయదృశ్యమానుఁడయియుండికాలప్రేరితుఁడయి యొక్క కోలచే నేలఁగూలనేసెను. ఓ యబలలారా! మీరును నాకుళింగపక్షివలె మీమృత్యువునెఱుంగక పతికై విలపించుచున్నారు.మీరిట్లువివేకంబున నూఱువత్సరంబులు శోకించినను భర్తనుబొందలేరు'' అనియిట్లు బాలకుఁడయిన యముఁడు చెప్పఁగావిని జ్ఞాతులందఱును మిక్కిలియచ్చెరువొంది దేహాదికమంతయు ననిత్యమని నిశ్చయించుకొనిరి. యముఁ డిట్లుపదేశించి యచ్చటనే యంతర్ధానముచెందెను. అనంతరమున సుయ

జ్ఞునికి యథావిధిగా నుత్తరక్రియల నొనర్చి శాంతినొందిరి. ఓతల్లీ! సంయోగవియోగములు దేహాత్మలకు నైజమైయున్నవి. కావున మీరు హిరణ్యాక్షునికై శోకింపకుఁడు. వీఁడునావాఁడనియు,వీఁడు వెఱవాఁడనియు ననెడిభేదములు గల్గించు నజ్ఞానమూలకమగు కర్మములేకుండ దేహులకు స్వపరభేదముగల్గనేరదు'' అని యిట్లు హిరణ్యకశిపు వుపదేశింప విని దితియుఁ గోడండ్రును మనుమలును, శోకమును క్షణకాలములోనే విడిచి ధైర్యమవలంబించి వర్తింపసాగిరి. ఇది రెండవ యధ్యాయము.

---

హిరణ్యకశిపుఁడు తపం బొనర్చుట. బ్రహ్మ హిరణ్యకశిపునకు సాక్షాత్కరించుట. హిరణ్యకశిపువు బ్రహ్మను నుతించుట.

అని చెప్పి నారదుండు వెండియు నిట్లనియె. "ఓధర్మరాజా! అనంతరము హిరణ్యకశిపుఁడు తనకుఁ బరాజయమును,జరామరణాదులును బ్రతిపక్షులు లేకుండునట్లుగా సాధనములచేఁ జేసికొని తానొక్కఁడే లోకములకు రాజయి యుండవలెనని నిశ్చయించుకొనెను. పిమ్మటఁ దన రాజ్యంబు మంత్రుల కప్పగించి మందరశిఖరమున కరిగి యూర్ధ్వబాహుఁడై, యాకసమున దృష్టినిలిపి బొట్టనవ్రేలిచేమాత్రము భూమిని స్పృశించుచు, భయంకరముగఁ దపం బాచరించె. అప్పు డతఁడు జటాకాంతులచేఁ బ్రళయకాలసూర్యునివలెఁ బ్రకాశింపఁదొడఁగె. వాఁడట్లు తపమాచరించుచుండఁదొల్లి రాక్షసులబాధలకుఁజిక్కి భూమిలో దాఁగి యున్న దేవతలు మగుడ స్వస్థానములఁ జెందిరి. అంతనా దైత్యుని మూర్ధమునుండి పొగగుంపులతోఁ దపోమయాగ్ని

వెలువడి యడ్డుగాను, మీఁదుగాను, క్రిందుగాను, వ్యాపించి సర్వలోకములను దహింప నారంభించె. నదులును, సముద్రములును క్షోభ చెందెను, పర్వతములతోఁగూడ భూమి గ్రక్కదలె. గ్రహములతోఁగూడ నక్షత్రములు రాలిపడఁ దొడంగె. పదిదిక్కులును బ్రజ్వలింపఁజొచ్చె. ఆ తపోగ్నిచే సంతప్తులై దేవతలు స్వర్గమును విడిచి బ్రహ్మలోకమునకరిగియతనిం గాంచి యిట్లు మొరలిడసాగిరి. 'ఓ దేవదేవా! ఓ లోకనాథా! ఓ కమలాసనా! హిరణ్యకశిపుఁ డొనరించుచున్న తపంబుచే స్వర్లోకము మిక్కిలి సంతాపమొందె. అందు నిలుచుటకు సమర్థులము గాకున్నారము. లోకముల క్షేమమును దలంతువేని నీకుఁ బూజలొనర్చుచున్న లోకములు నశింపక పూర్వమే యాతపోగ్నినుపశమింపఁ జేయుము. ఇతరులకెవ్వరికి నొనర్పనలవికాని తపంబు సేయుచున్న యాహిరణ్యకశిపుని సంకల్ప మేదియో సర్వజ్ఞుఁడవయిననీకుఁ దెలియకపోదు. అయినను మా విన్నప మాలింపుము. "బ్రహ్మ తపోనియమముచేతనే చరాచరాత్మక మగునీప్రపంచమును సృజించి యింద్రాదిపదవులకంటె నుత్కృష్టమగు సత్యలోకము నధిష్ఠించెను. నేనును గొప్పదగుతపంబాచరించి యాపదవిని సాధించెదను. స్వల్పకాలమగు పురుషాయువులో నట్టి పదవి సాధింపనగునా యని సంశయపడనవసరము లేదు. ఆత్మ నిత్యమైనది. కాలమును నిత్యమే. కావున నిట్లు తపస్సొనర్చి పెక్కుజన్మములలోనైనను దానిసాధించితీరెదను మఱియు నాతపోబలముచే జగంబునంతను దలక్రిందుగా నొనర్తును. దేవాసురాదులను విపరీతముగాఁ జేయుదును. కల్పాంతమున నశించునట్టి వైకుంఠము మొదలగువానితో నాకుఁ బ్రయోజనమేమి? సాధించిన

సత్యలోకమునే సాధింపవలె" నని యాదైత్యుఁడు మనంబున సంకల్పించికొని యిట్లు ఘోరతప మాచరించుచున్నట్లు విను చున్నాము. ఓ లోకనాయకా ! నీపదము నపహరింపఁదలంచి చేయుచున్న యతని కృత్యమునకుఁ బ్రతిక్రియను వెంటనే యొన ర్పుము. ఈనీసర్వోత్కృష్టస్థానము గోబ్రాహ్మణుల యభివృద్ధికిని క్షేమమునకును, బురుషార్థమునకును, నైశ్వర్యమునకును,విజయ మునకును గారణమగుచున్నది. అది పరులకుఁజిక్కినచో, లోక మున సర్వమును నశించును" అని యిట్లు దేవతలు విన్నపమొన రింపఁగా భగవంతుఁ డయినబ్రహ్మ, భృగువుదక్షుఁడు మొదలగు వారు సేవించుచు వెనువెంటవచ్చుచుండహిరణ్యకశిపునియాశ్రమ మునకరిగిచూచెను. కానియాదైత్యుఁడుచిరకాలమునుండి నిశ్చ లుఁడయి తపంబొనర్చుచుంటచేఁ జట్టునుబుట్టలును, గడ్డియును, వెదురుపొదలునుదట్టముగాఁబెరిగియతనినింగానరాకుండ జేసెను. అంత బ్రహ్మ యతికష్టమున నతని సమీపించి పిపీలికాదులు తన శరీరమందున్న మెదడును, జర్మమును, మాంసంబును,రక్తమును స్వేచ్ఛగా భక్షించుచున్నను, గొంచెమేని సంచలింపక తపంబా నరించి లోకములకు సంతాపము గల్గించుచు మేఘములచాటున నున్న సూర్యునిమాడ్కిఁ బ్రకాశించుచున్నయారాక్షసుఁగాంచి యాతని నియమమునకాశ్చర్యముచెందిమందహాసముచేయుచు నిట్లనియె. 'ఓకశ్యపపుత్త్రా! నీకుఁగుశలమగుఁగాక.నీవుతపస్సిద్ధుఁ డవయితివి. తపంబు చాలింపుము. లెమ్ము, లెమ్ము. వరములనీఁ జాలిన నేనరుదెంచి నీయెదుటనిల్చితిని. వలయువరంబువేడుము. ఒసంగెదను. పిపీలికాదులు నీదేహమును భక్షించుచున్నను, నీ ప్రాణము లస్థిగతములయియున్నను,సుంతేనియుఁ జలింపక తపం

బొనర్చుచుంటచే నీధైర్య మెల్లవారికిని మహాశ్చర్యమును గల్గించుచున్నది. పూర్వము పెక్కండ్రు తపమాచరించిరి. కానియెవ్వరును నిన్నుఁదపంబునఁ బోలలేరు. భృగువు మొదలగు మహామును లైన నీవలె దృఢమనస్కులై తపంబొనర్పలేరని చెప్పవలసియుండఁగా నిప్పటివారలు నీకు సములుకానేరరని వేఱ చెప్పవలయునా ? దేవమానముచే నూఱువత్సరంబులు జలమునైన ద్రావక ప్రాణంబులు నిలుపుకొన్న నీవుందక్క నెవ్వఁడు సమర్థుఁడు? ఓదితికుమారా ! యోగీశ్వరులకయినను దుష్కరమగు నీ యీవ్యవసాయముచేత నే జయింపఁబడి నీ కధీనుండనైతి. తపోనిష్ఠుండ వయియుండుటచే మఱింతజయింపఁ బడితిని. ఓరాక్షసేంద్రా ! నీవు గోరినవరంబులనెల్ల నిచ్చెదను. మర్త్యుఁడ వయిన నీ కమరోత్తముఁడనైన నాసందర్శనము లభించి విఫలము కారాదు.'' అని యిట్లు పలికి బ్రహ్మ దివ్యప్రభావము గల కమండలూదకముచేఁ గీటభక్షితమయిన యతనిశరీరమును దడిపెను. అంత నాదితికుమారుఁడు సమిధలనుండి యగ్నివలెఁ గీచకావృత మగుపుట్టనుండి వెలువడి యింద్రియబలముచేతను, దేహబలముచేతను, వెలయుచు, సమస్తావయములు గలవాఁడయి వజ్రకాయుఁ డయి యౌవనముచే నొప్పుచుఁ దప్తకాంచనమువంటికాంతి నల్గడలవ్యాపించుచుండ లేచి యాకసంబున హంసపై నధిష్ఠించియున్న బ్రహ్మనుజూచి దదీయ సందర్శనముచే నధికానందమునుజెందుచు సమీపించి దండప్రణామమాచరించెను. అనంతరము లేచి నమ్రతతో నిలువఁబడి ఱెప్పవాల్పకుండ బ్రహ్మను జూచుచు, హర్షాతిశయముచే బాష్పబిందువులు స్రవింప, దేహము పులకింప, గద్గదస్వరముతో నిట్లును

తించెను. * "ఓదేవా! దైనందిన ప్రళయమునఁ గాలమువలన సమస్తమును జీకటిచేఁ గప్పఁబడి యుండఁగా నెవఁడు స్వప్రకాశరూపుఁడయి తన కాంతిచే దాని మగుడఁ బ్రవేశింపఁ జేసెనో, యెవఁడు, సృష్టి, స్థితి, లయమునాఁబడు మూఁడు శక్తులతో నొప్పుచు నీజగమును, సృజించునో, రక్షించునో, సంహరించునో, యట్టి గుణత్రయరూపునకు, సర్వోత్కృష్టునకు, మహాత్మునకు, నీకు నమస్కారము లాచరించెద. ఓ కమలాసనా ! నీవు సమస్తకారణములకును గారణమవు. జ్ఞానముచేఁ దెలియఁబడువాఁడవు. నీవే ప్రాణములతోను నుభయేంద్రియములతోను, మనస్సుతోను,బుద్ధితోను, బృథివ్యాదిభూతములతోను, గూడికొని కార్యరూపము నొందుచున్నావు. నీవే యీచరాచరాత్మకమగు జగమున కంతరాత్మవై నియామకుఁడవగుచున్నావు. నీవే ముఖ్యప్రాణమును నిర్వహించుచున్నవాఁడవు. నీవే సమస్తప్రజలకును బతివి. నీవే చిత్తమునకును, బుద్ధికిని, మనస్సునకును, నింద్రియములకునుబతివయి నిర్వహించువాఁడవు. ఇంతియకాక నీవే మహాభూతములగు పృథివ్యాదులకును, శబ్దాదిగుణములను గ్రహించు నింద్రియములకును, నంతఃకరణమునకును నియంతవు. ఓదేవా! నీవు సమస్తమందు నంతరాత్మవైయుండి విస్తారమగు వేదత్రయముచేతను, జతు

* విష్ణువుసర్వోత్కృష్టుఁడయిసర్వకారణుఁడయియుండఁగా బ్రహ్మయే సర్వోత్కృష్టుఁడని వర్ణించుట యనుచితమే,అయిన హిరణ్యకశిపువు తామసబుద్ధి గలవాఁడగుటచేతను ; నట్టివారలకు సర్వము విపరీతముగాఁ దోఁచుచుండుటచేతను,వాఁడు బ్రహ్మనే సర్వకారణునిగాఁ భావించి నుతించుచుండెను కాని వాస్తవముగా బ్రహ్మ సర్వకారణుఁడుకాఁడని తెలియవలయును.

హోత్రాదులను పేరుగల మంత్రములచేతను, యజ్ఞాది కర్మములను బ్రవర్తింపఁ జేయుచున్నావు. నీవే యోగీశ్వరులందంతరాత్మవై యుండి యోగమును విస్తరింపఁజేయుచున్నావు. నీ వనాదిపురుషుఁడవు. నీవు దేశమువలనను గాలమువలనను బరిచ్ఛిన్నుండవు కావు. నీవు సర్వజ్ఞుఁడవు. అంతరాత్మవై వెలయుచున్నను,నిన్నెట్టిదోషములును స్పృశింపవు.నీవే కాలశరీరకుఁడవయి దానికి నియామకుఁడవయి నిమేషాదులగు కాలావయవములచే బ్రజల యాయువును దగ్గించుచున్నావు. నీవే పరమాత్మవు. నీ కెట్టివికారములును లేవు. నీవే నిరతిశయ మగుస్థానమున వర్తించుచున్నావు. నీకుఁగర్మాయత్తములగు జన్మాదులు లేవు? నీవే సమస్తజీవలోకమును బ్రదికించువాఁడవు. వేపలుకులేల, ఈ చరాచరప్రపంచమున నీకంటె నధికమగునదికాని, నీకు సమమగునదికాని వస్తువెద్దియును లేదు. అట్లె నీకంటె నన్యమగున దెద్దియును లేదు. వేదములును,నుపవేదములును,నగు సమస్త శబ్దజాలములును నీశరీరములేకాని వేఱయినవి కావు. హిరణ్మయాత్మకమగుబ్రహ్మాండమును గర్భముగాఁగలవాఁడవు. నీవు స్వరూపముచేతను గుణములచేతను గొప్పవాఁడవై ముజ్జగములకు వెలపటను వెలయుచున్నావు. ఓదేవదేవా! ఈకానవచ్చు చరాచరప్రపంచము నీ స్థూలశరీరమగుచున్నది. ఓవిశ్వకారణ! జీవులకు, నింద్రియాదులను, శబ్దాదివిషయములను సృజించి వారొనరించు వ్యాపారములను లీలారసముచేననుభవింప నీ కేది సాధనమగుచున్నదో, ఏది పరమేష్ఠిస్థానమున నుండునదో, యదియే నీసూక్ష్మరూపము. ఓయీశ్వరా! నీవు ప్రాకృతము లగునింద్రియములకుఁ దెలియఁబడకుండ సర్వాంతరాత్మవై

యొప్పుచున్నవాఁడవు. అనంతమై యింద్రియములకుఁ గానరానిదై యున్న యెవ్వనిరూప మఖిలమందును, నంతరాత్మయై వ్యాపించియున్నదో, యెవనికిఁ జేతనాచేతనములు శరీరమగుచున్నవియో, యాపరమేశ్వరుఁడవగు నీకు వందనములు'' అని నుతించి వెండియు నిట్లనియె. ''ఓవరదా! నీవు నాకభిమతంబులగు వరముల నీయఁదలంచితివేని, నీచే సృష్టములగు భూతములలోనేదియు నన్నుఁ జంపలేకుండుఁగాక. మఱియు గృహాదులలోపటను గాని, వెలపటనుగాని, బవటిపూఁటఁగాని, రాత్రియందుఁగాని, భూమినిగాని యాకసమునఁగాని చావులేకుండుగాక. నాకు నీచేతను, నాయుధములచేతను, నరులచేతను, మృగములచేతను, మృతిలేకుండుఁగాక. అంతియకాక, ప్రాణరహితము లగునవి కాని, ప్రాణసహితములగునవి కాని, సురలుగాని, యసురలుగాని, మహాసర్పములుగాని నన్నుఁ జంపలేకుందురుగాక. యుద్ధములందు నాకెదురులేకుండుగాక. సమస్తప్రాణులకు నేనధిపతినై యుండుగాక. నాకు దేవేంద్రాది లోకపాలురమహిమ లభించుఁగాక. తపముచేతను, యోగముచేతను, సాధ్యములయి యోగీశ్వరులకుఁ గల్గియుండు నణిమాదు లగునైశ్వర్యములు నాకు సంభవించుఁగాక. ఓదేవా! యీవరంబుల నాకొసంగుము.'' ఇది మూఁడవయధ్యాయము.

---

(ఇంద్రభవనవర్ణనము. సురలు హిరణ్యకశిపునకు భయపడి నారాయణుని మఱువు సొచ్చుట.)

అని హిరణ్యకశిపుఁడు ప్రార్థింపఁగా, నతనితపంబునకు మిక్కిలి సంతసించినకమలాసనుఁడు వెనుకముందు లాలోచింపక దుర్లభము లయినయావరంబుల నొసంగి యతనింజూచి, "ఓకుమారా! నావలన నీవు పొందినవరము లెట్టివారికయినను దుర్లభములు. అయిన నట్టి వరముల నీ కొసంగితిని" అని పలికి యతనివలనఁ బూజలుగొని, భృగువు దక్షుఁడు మొదలగువారు నుతించుచు వచ్చుచుండఁ దన భువనమున కేఁగెను. ఓ ధర్మరాజా! ఆదైత్యపతి యిట్లు బ్రహ్మవలన వరములంది బంగారమువలెఁ బ్రకాశించుదేహమున నొప్పుచు,హరి తనతమ్ముఁడగు హిరణ్యాక్షునిఁ జంపుట మనంబున స్మరించుచు సురపతులను, రాక్షసనాయకులను, మనుజేశ్వరులను, గంధర్వులను, విద్యాధరులను, నురగులను, సిద్ధులను, జారణులను, విద్యాధరులను, ఋషులను, బితృదేవతలను, మునులను, యక్షులను, రక్షస్సులను, బిశాచములను, బ్రేతములను,భూతపతులను,సర్వభూతములను, దిక్కులను, బెక్కేల? ముల్లోకములను జయించి తనవశము గావించుకొని తేజముతోఁగూడ లోకపాలుర స్థానముల హరించి, సకలసంపదలతోఁ బొదలునందనవనమున వెలుఁగొందు నమరావతిని జొచ్చి విశ్వకర్మచే నిర్మితమై ముల్లోకముల లక్ష్మికిని నిలయమై, సమస్తసంపదలచేతను బ్రకాశించు నింద్రభవనమున నివసించెను. ఆ భవనమునఁ జిత్రమయిన వితానములును, పద్మరాగరత్నములచే ఖచితము

లగు నాసనములును వెలయుచుండె. అందుఁ బవడములతోఁ సోపానము లమర్పఁబడియుండె. అచ్చటి ప్రదేశమంతయు మరకతరత్నములచేఁ గూర్పఁబడియుండె. దానికి స్ఫటికమయము లగు గోడలును, గరుడపచ్చలచేఁ జేయబడిన స్తంభములును గలవు. అందుఁ బాలనురువుతోఁ సమములగు శయ్యలును, ముత్యాలహారములును, బలువిధములగు నాస్తరణములును సర్వత్ర ప్రకాశించుచుండెను. దేవతాస్త్రీలందు నడయాడుచు ధ్వని చేయునూపురములచే నామందిరమును బ్రతిధ్వని నిచ్చునట్లుగాఁ జేయుచుండిరి. ఆమందిర స్తంభములు రత్నమయములై యద్దములను మించియుండుటచే నచ్చటిస్త్రీలు దమసుందర ముఖములను వానియందుఁజూచి తిలకాదులు దిద్దుకొనుచుండిరి. ఇట్టి మహేంద్రమందిరమును బ్రవేశించి మహాబలుఁడును, నిరర్గళమగు సంకల్పము గలవాఁడును, లోకములజయించినవాఁడును నగుహిరణ్యకశిపుఁడు రాజాధిరాజయి మిక్కిలిసంతాపము గల్గించు శాసనములచేఁ బరితప్తులైన దేవతలు తన్నుబరివేష్టించి కొల్చుచుండ నందుఁ గ్రీడింపఁ దొడంగెను. ఓ ధర్మరాజా! చెడువాసనగల మధువును దృప్తిదీఱఁగ్రోలి మత్తుండై యెఱ్ఱని తిరుగుడుగ్రుడ్లు గలవాఁడయి, తపోయోగమునకు, నింద్రియబలమునకు, దేహబలమునకు నిక్కయయిన యాదైత్యుఁడు త్రిలోకాధిపత్యము చేయుచుండ ముప్వేల్పులు దక్క దక్కిన లోకపాలురందఱును జేతులతోఁ బూజాద్రవ్యములు ధరించి యతని సేవింప నారంభించిరి. స్వీయ మగు తేజంబున నింద్రపదవి నధిష్ఠించి ప్రకాశించు చున్నయాదైత్యనాథుని సమీపించి విశ్వావసువు, తుంబురుఁడు, నేను, నావంటివారును,

గంధర్వులును, సిద్ధులును, ఋషులును, విద్యాధరులును, నచ్చరలును, మాటిమాటికి స్తోత్రముచేయఁ జొచ్చితిమి. ఆరక్కసుఁడే వర్ణాశ్రమధర్మాసక్తు లగుగృహస్థు లొనర్చు భూరిదక్షిణలుగలయాగములచే నారాధింపఁబడుచు, స్వీయబలముచే హవిర్భాగములను స్వీకరించుచుండె. వాఁడు లోకములఁ బాలించుసమయమున నేడు ద్వీపములతో నొప్పుభూమి దున్నకుండఁగనే ఫలించుచుండె. స్వర్గలోక మెల్లయభీష్టములను బూరించుచుండెను. అంతరిక్షాభిమాని దేవత వివిధములగు విచిత్రవస్తువులనిచ్చుచుండెను. లవణంబును, సురయు, జెఱకురసమును, నేయియు, పెరుఁగును, బాలును, శుద్ధజలమును, గలిగివర్తించు సముద్రములేడును, వాని భార్యలగునదులును, దరంగములచే రత్నసమూహములను దెచ్చి సమర్పించుచుండె. సకలపర్వతములును,సకలఋతువులం దుండుపుష్పములతోను, ఫలములతోను, నిండిన వృక్షపంక్తులను శిఖరంబులచే దాల్చి యతనికిఁ గ్రీడాస్థానములగుచుండె. ఇంద్రాదులు పాలించునప్పుడు చెట్లు వసంతాదికాలనియమముచేఁ బూచుచుఁ గాచుచు నుండెడివి కాని యితనిపరిపాలితకాలంబున నొక్కట సమస్తఋతుధర్మములతోను వఱలుచుండెను. ఆరాక్షసుఁడిట్లు సకల దిక్కులనుజయించి యేకాధిపతియై యభీష్టముగాఁ బ్రియములయినవిషయసుఖము లనుభవించుచున్నను, జితేంద్రియుఁడు కానికారణమునఁ దృప్తిచెందలేకపోయెను. మఱియు వాఁడైశ్వర్యమత్తుఁడయి గర్వాంధుడయి వైదికమార్గములఁ ద్రోసిపుచ్చుచుఁ బెక్కుసంవత్సరములకాలము గడపె. అంతనతనికి సనకాదు లిచ్చినశాపమున నంత్యకాలము సమీపించె. సమస్తప్రజలును లోకపాలురును, వాని చండ

శాసనమునకు మిక్కిలి భయము చెంది నిరాధారులయి విష్ణువును శరణు సొరఁ బోయిపోయి, యేదిక్కున నాశ్రితులబాధల నెడఁ బాపు పరమేశ్వరుఁ డుండునో, రాగాది రహితులై నిర్మలహృదయులైన సన్న్యాసు లేదిశనుబొంది మగుడజన్మమునకు రారో, యాదిక్కునకునమస్కరించి యింద్రియములజయించినవారయి, నిద్దుర విడిచి వాయువునుమాత్రమేయాహారముగా నుపయోగించుచు, నిర్మలులై నిశ్చలమనంబులతో హరినుద్దేశించి "ఓ దేవా నీవు జ్ఞానాదులగు షడ్గుణములచే వెలయువాఁడవు. సర్వమునకంతరాత్మవై యున్నవాఁడవు. మిక్కిలి దయగలవాఁడవు. అనుభవజ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడవు. ఆనందస్వరూపుఁడవు. ఆశ్రితులకభయమొసంగువాఁడవు. అట్టి నీకొఱకు నమస్కార" మని నుతించిరి. అంత సజ్జనుల కానందము గల్గించుచు, దిక్కులు ప్రతిధ్వనిచేయునట్లుగా మేఘగర్జనమువంటియశరీరవాణి యిట్లు వినవచ్చె. "ఓసురశ్రేష్ఠులారా! మీ రెంతమాత్రమును భయము చెందకుఁడు. మీకందఱకు మంగళమగుఁగాక. భూతములకెల్లనా సందర్శనము సకలశ్రేయస్సులను సమకూర్చును. రాక్షసాధముఁడయినహిరణ్యకశిపుఁ డొనర్చుచున్న దుష్టకార్యములన్నియు నాకుఁ దెలియవచ్చె. వానిని దప్పక వధింతును. స్వల్పకాలము నిరీక్షింపుఁడు. దేవతలందును, వేదములందును, గోవులందును, బ్రాహ్మణులందును,సజ్జనులందును, ధర్మమందును,నాయందును ద్వేషము వహించినదుష్టుఁడు శీఘ్రకాలములోనే నశించును. సర్వభూతములకును హితుఁడై రాగద్వేషాదులు లేక సర్వదా నన్నే స్మరించుచు, వర్తించుకుమారునకుఁ బ్రహ్లాదునకు వాఁడెప్పుడు ద్రోహము జేయునో, యప్పుడే నే వానిఖండింతును. వాని



1252. బ్రహ్మరుద్రేంద్రాదులు క్షీరాబ్ధికి వచ్చి శ్రీమహావిష్ణువును
స్తోత్రము చేయుట ; శ్రీమన్నారాయణుఁడు దేవతలకు
ప్రత్యక్షమై అభయ మిచ్చుట.

వరము లెట్లు రక్షించునో చూచెదనుగాక" అని యిట్లు వినరాగా, విని దివిజులందఱును, మిగుల నానందించి యతనికి నమస్కరించి భయరహితులై యింకఁ దప్పక రాక్షసుఁడు చచ్చెనని యే నిశ్చయించుకొని తమతమనివాసములకు మరలిరి. ఓధర్మరాజా! ఆహిరణ్యకశిపునకు గుణాదులచే నచ్చెరువు పుట్టించు నలువురు పుత్త్రులు గలరు. వారిలోఁ బ్రహ్లాదుండు గుణములచేతను, భగవద్భక్తిచేతను, శ్రేష్ఠుండని చెప్పవచ్చును. ఆప్రహ్లాదుఁడు బ్రాహ్మణకులము నాదరించువాఁడు. సుస్వభావముగలవాఁడు. కలయందయిన నసత్యమాడఁడు. ఇంద్రియముల జయించి సకలభూతములను దనతో సమముగాఁ జూచువాఁడు. అందఱకును మిత్త్రుఁడై వర్తించు పెద్దలకు దాసునివలె నమస్కరించు. తండ్రి తనయులందువలె దీనులయెడ వత్సలుఁడై యుండు. తనచెలికాండ్రను సోదరులని భావించు. గురువులను దైవమనితలంచు. విద్యయుధనము సౌందర్యము గొప్పవంశమందుఁబుట్టుటయు, మొదలగువానిచే నొప్పుచున్నను, గర్వమావంతయును లేక వర్తించు. దుఃఖహేతువులున్నను సుంతేనియు నతఁడుభయముచెందఁడు. వేదములు మిక్కిలి వర్ణించుచున్న స్వర్గాదిఫలము లనిత్యములని యెంచి వానియెడ నిస్పృహుఁడై యుండు. అతఁడుఁ శరీరము నింద్రియముల మనస్సును వశముగావించుకొని ప్రశాంతుఁడయియుండు. అతఁడు రాక్షసవంశమున జన్మించినను మాత్సర్యము మొదలగు నీచగుణములు లేనివాఁడు. ఓరాజేంద్రా! ఈశ్వరునియందున్న మహాగుణములవలె నాబాలునియందున్న యుత్కృష్టగుణము లిప్పటికిని బండితులచే నుతింపఁబడుచు విస్మృతములు గాలేదు. సభలయందు సజ్జనప్రశంస వచ్చెనేని శత్త్రువులయినను బ్రహ్లాదుని

దృష్టాంతముగాఁ దీసికొందురనఁ దక్కినవారట్లు చేయుదురని వేఱ చెప్పవలయునా? లెక్కలేని మహాగుణము లతనిమహిమను దెలుపుచుండును. విపులముగా నాతనిగుణముల వర్ణింప నాకల విగాదు. అతని మహిమము నిరుపమానమైనది. అతనికి నారాయణభక్తి యుత్పత్తిసిద్ధమై యొప్పుచుండెను. ఎల్లప్పుడును దన యుల్లమును భగవంతునందుఁ జేర్చియున్నవాఁడగుటచే జిన్నప్పటినుండియు నాటలాడి యెఱుంగఁడు. సంతతము వాసుదేవు నుతించుచు బాహ్యప్రపంచమును సరకుఁగొనఁడు. ఆసనమునఁ గూర్చున్నప్పుడును, తిరుగునపుడును, దినునపుడును, శయనించునపుడును, త్రావునపుడును, భాషించునపుడును, గోవిందచింత దక్క నన్యమేమియు నెఱుంగకుండెను. నారాయణ ధ్యానముచే క్షుభితమగు హృదయము గలవాఁడగుటచే నతఁడొకపరి రోదనము చేయును. మఱియొకమాఱు నవ్వును. వేఱొకసారి పెద్దయెలుంగుతో గానము చేయును. ఒకప్పుడు వేడుకతో ధ్వని చేయును. ఒకపర్యాయము లజ్జారహితుఁడయి నృత్యము సలుపును. ఒకమాటు విష్ణుభావనచే సర్వమును మఱచి తన్మయుఁడయి వర్తించును. ఒకపరి నిరంతరధ్యానముచే నతఁడు మిక్కిలిసుఖియై స్థిరమగు నానందమువలన జనించినబాష్పములు స్రవింప దేహమునఁ బులక లెగయ నూరక కూర్చుండు. మఱియు నతఁడు పరమేశ్వరుని పాదపద్మముల నిష్కామనతో సేవించుచుంటఁ జేసి, మాటిమాటికిని దనకధికసుఖము సమకూర్చుకొని విషయాభిలాషచే దీనమయిన మనస్సున కూఱటగలిగించె. ఓరాజా! ఇట్టి నిరుపమానమహిమచే నొప్పుచు,భగవద్భక్తులలో మొదటివాఁడై మహాత్ముఁడై యున్నతన కుమారుఁడయిన ప్రహ్లాదునికి హిరణ్య

కశిపుఁడు ద్రోహముచేయ సమకట్టె" అని నారదుండు చెప్పవిని ధర్మజుం డిట్లనియె. ఓమునీంద్రా! నిరపరాధుఁడయి, సాధువై కుమారుఁడై యున్న బాలునికిఁ దండ్రి ద్రోహముచేసె ననుట మిక్కిలి వింతగా నున్నది. అదియెట్లు ప్రవర్తిల్లెనో యావృత్తాంతమును సాంతముగాఁ దెలుపుము. ఇంతేకాక లోకమునఁ బుత్రప్రేమ గలజనకులు తమసుతులు తమకుఁ బ్రతికూలురయి వర్తించినచో మంచిమార్గమునఁ బ్రవేశింపఁ జేయ నిందావాక్యములు పలుకుదురు కాని శత్రువులవలె ద్రోహ మొనర్పరు. అట్లుండఁ దమ కనుకూలురయి సాధువులై తండ్రినే దైవముగా భావించి వర్తించువారికి ద్రోహ మొనర్పరని చెప్పవలయునా? ఓమునీశ్వరా! పుత్త్రునివిషయమయి హిరణ్యకశిపుఁడు చేసిన ద్రోహ మతని మరణమున కెట్లు కారణమయ్యెనో యని వినఁ గౌతూహలినై యున్నాను. తెలియఁజెప్పుము" అనిన విని నారదుం డిట్లనియె. ఇది నాల్గవయధ్యాయము.

---

గురువులు ప్రహ్లాదునిఁ దండ్రిపాలికిఁ గొనిపోవుట. హిరణ్యకశిపుఁడు గురుపుత్త్రులఁ గోపించుట.

ఓధర్మరాజా! శుక్రుఁడు రాక్షసుల పురోహితుఁడనుట సర్వవిదితమే కదా! అతనికి శండామర్కులను నిరువురు కుమారులు గలరు. వారు దైత్యరాజయిన హిరణ్యకశిపునొద్దనే యుండిరి. ఆదైత్యనాథుఁడు తనకుమారుఁ డగు ప్రహ్లాదుని నీతిశాస్త్రముఁ జదివింప వారియొద్దకుఁ బంపఁగా వారు సంతసించి యతనికిఁ దోడుగా మఱికొందఱ దైత్యబాలకులను సమకూర్చి చదివింపఁ

దొడంగిరి. ప్రహ్లాదుఁడు గురువులు చెప్పినదెల్ల వినుచుండెను; పఠించుచుండెను; కాని వారుచెప్పినదంతయు నయుక్తమని మనంబున భావింపకపోలేదు. వీఁడు తనవాఁడు. వీఁడు వెఱవాఁడు నను భేదబుద్ధి లేని ప్రహ్లాదునకుఁ దాదృశభేదముతోనొప్పు నీతిశాస్త్రము యుక్తముగాఁ దోఁచుటెట్లు? ఇట్లుండ నొకనాఁడు హిరణ్యకశిపుఁడు కుమారునిఁ బ్రహ్లాదునిఁ దొడపైనుంచుకొని "పుత్త్రా! గురువర్యులు చెప్పినదానిలో నీ కేది మంచిదని తోఁచుచున్నది? అని యడుగగా బాలుండు జనకుంజూచి "ఓయసురనాథా! దేహాత్మాభిమానముచేతను స్వాతంత్రాభిమానముచేతను, సర్వదా విషయసుఖములం దభిలాషము గలవా రయి భీతచిత్తులయి వర్తించు శరీరులకధఃపతనము గలించు నంధకూపమున కెనయైన యింటినివిడిచి యడవికిఁబోయి శ్రీహరి నాశ్రయించుట మిక్కిలి మంచిదని తలంచెదను" అని పలికెను. దైత్యేశ్వరుండు తనకు శత్రువగు విష్ణువున కుత్కర్షమును దెచ్చు కుమారుని వచనంబులు విని "బాలకుల బుద్ధులు పరులుపదేశించినమార్గము ననుసరించుట సహజముకదా? గురుగృహమునఁ బ్రచ్ఛన్నవేషు లయినివసించు బ్రాహ్మణు లెవ్వరో యితనికిట్టియుపదేశము చేసియుందురు. కావున నికమీఁద నట్టి యుపదేశము చేయకుండునట్లు చేయవలె" నని తలంచుకొని, తనలోఁ దానవ్వుకొనుచు నూరకుండెను. అనంతరము శండామర్కులు ప్రహ్లాదునిఁ దమగృహమునకుఁ గొనిపోయి యతనిఁ బొగడి మంచిమాటలచే సంతసింపఁజేయుచు నిట్లడిగిరి. "ఓ వత్సా! ప్రహ్లాదా! నీకు శుభ మగుఁగాక. నిన్నెప్పుడును గొట్టము. సత్యముచెప్పుము. అనృతము చెప్పకు. ఈబాలకుల నందఱను విడిచి నీకొక్కనికే

యిట్టి బుద్ధి చెప్పినవారెవరు? ఈబుద్ధివ్యత్యాసము విష్ణుభక్తుల వలనఁ గల్గింపఁబడినదా? లేక నీకు స్వయముగా లభ్యమైనదా? ఓకులదీపకా! ప్రహ్లాదా! వినవలెనని వేడుకపడు నీజనకుఁడు సంతసించునట్లు పలుకుము" అని యడుగ నాబాలుండు వారి కిట్లనియె. "గురువులారా! ఈబుద్ధివ్యత్యాసము పరులవలనఁగల్గినదా? లేక స్వయముగాఁ గల్గినదా? యని యడిగియున్నారు. వీఁడు పరుఁడు, వీఁడు నావాఁడు, వీఁడుమిత్రుఁడు, వీఁడుశత్రువు. వీడు బ్రాహ్మణుఁడు, వీఁడు దేవుఁడు, వీఁడు మనుష్యుఁడు నాఁబడు బుద్ధివ్యత్యాస మీశ్వరమాయచేఁ గల్పితమై మాయామోహితచిత్తు లగుమీకుఁ గానవచ్చుచున్నది కాని నాకెంతమాత్రము గానరాలేదు. ఎవఁడిట్టిమాయను స్వీకరించెనో యట్టిభగవంతునకు నమస్కారము.పురుషులుభగవంతు నెప్పుడాశ్రయింతురో, యప్పుడే యతఁడు వారలదేహాత్మాభిమానమును దొలంగించును. దానివలనఁ బరమాత్మకు శరీరభూతమగుటచే నంద ఱొక్కవిధమున నుండఁగా దేవమనుష్యాదిశరీరములను బురస్కరించుకొని వచ్చెడిస్వపరబుద్ధి నశించును. కానఁ దాను వేఱు వాఁ డనెడిబుద్ధి దేహాత్మభ్రమచేఁ గల్గుచున్నదనియు,నది భగవన్మాయచేఁగల్పితమగుచున్నదనియు, దానినివర్తింపఁ జేయువాఁడు పరమేశ్వరుఁడుదక్క వేఱొక్కఁడు లేఁడనియు నెఱుంగునది. ఏ పరమాత్మ సర్వసముఁడై యుండునో, యెవని స్వరూపమును వేదవాదులగు బ్రహ్మాదులు సైతమువిమర్శింపలేరో, యతఁడేనాకిట్టి బుద్ధివ్యత్యాసము గల్గించెను.ఇంతియకాక యినుమయస్కాంతమునొద్ద స్వయముగా నెట్లు భ్రమించుచున్నదో, యట్లె చక్రపాణిసన్నిధిని నాబుద్ధి యకారణముగానే తిరుగుచున్నది. కాన

భగవదనుగ్రహమువలననే నాకిట్టి బుద్ధి సంభవించెనుగానియొరులు నేర్పుటచే రాలేదని యెఱుంగుఁడు" అని గురువులకుఁ బ్రత్యుత్తరమిచ్చి మహామతియగుబాలుం డూరకుండె. అంత గురువులు వాని నుపాయాంతరములచే లోఁగొనుటకశక్తులై కోపంబున బాలుని నిందించుచు సమీపమున నున్న రాజభటునిఁ గాంచి "ఓరీ ! రాజసేవకా! వేగముగాఁ జబుకను దెమ్ము. మా కపకీర్తిని దెచ్చుచు దైత్యవంశమునకుముల్లువంటివాఁడగు నీదుష్టబుద్ధిని శిక్షించెదము. దీనికి దండోపాయమే తగినది. దైత్యులనెడి చందనవనమున వీఁడు ముండ్లచెట్టువలె నుద్భవించెను. దైతేయు లనెడి చందనవనమును ఖండింపఁ గొడ్డంటివంటివాఁడగు హరికి వీఁడు కామవలె సహకారి యగుచున్నాఁడు. తప్పక శిక్షించి వీనికిబుద్ధి మాన్పెదము" అని యిట్లు గురువులు పలువిధము లగునుపాయములచే వాని భయపెట్టి తమగృహమునకుఁ గొనిపోయి ధర్మార్థకామములను దెలుపు శాస్త్రములు జదివించి కొంతకాల మయినపిమ్మట, "బాలుఁడు సామాద్యుపాయము లందుఁ గోవిదుఁడయ్యె" నని నిశ్చయించి తల్లియొద్దకుఁ గొనిపోయి యలంకృతునిఁగాఁ జేసి, పితృసన్నిధానమునకుఁ దీసికొనిపోయిరి. అంత బ్రహ్లాదుఁడు తండ్రిపాదములకు బ్రమొక్కి నిలువఁబడ నసురనాయకుఁ డాశీర్వదించి సంతసంబునఁ బుత్త్రుం జేతులతో నెత్తి కౌఁగిలించుకొని మిక్కిలి సుఖము ననుభవించెను. ఓ ధర్మరాజా! అనంతర మాదైత్యుఁడు కుమారునిఁ దొడనిడుకొని మూర్ధ మాఘ్రాణించి యానందబాష్పములచేఁ దడుపుచు వికసితవదనుండై యిట్లు పలికెను. ఓయాయుష్మంతా! ప్రహ్లాదా! నీవింతకాలంబును గురువుల పజ్జనుండి యేమిచదివితివి? దాని

లో నీకు త్తమమని తోఁచినది లెస్సగా నాయెదుటఁ జదివి యానందింపఁజేయుము.'' అనఁగాఁ దండ్రిం జూచి ప్రహ్లాదుం డిట్లనియె. "ఓజనకా! హరికథలను వినుటయు, నతనినామ ముచ్చరించుటయు, నతనిస్మరించుటయు, నతని పాదముల సేవించుటయు, నతనిఁ బూజించుటయు, నతనికి నమస్కరించుటయు, నతనికిఁ బరిచర్య సేయుటయు, నతనితో మైత్రి నవలంబించుటయు, నతనికిఁ దన్నర్పించుటయు ననెడి తొమ్మిదివిధము లగుభక్తిని మహాత్ములు ప్రయోజన మపేక్షింపకయె విష్ణువునెడఁ జూపుచుందురు. అట్టి భక్తిని దెలుపుశాస్త్రములను జదువుకొనుట సర్వోత్తమమని తలంచెదను'' అని పల్కు కుమారుని వచనంబులు విని హిరణ్యకశిపుఁడు కోపమున మండిపడి యధరోష్ఠము చలించుచుండ గురుపుత్త్రులనుజూచి యిట్లుపలికెను. "ఓబ్రాహ్మణాధమా! నీవు నన్నుఁ దిరస్కరించి నాకుఁ బరమశత్రువయిన విష్ణుపక్షము నాశ్రయించిన దురాత్ముఁడవు. నాబాలునికి శత్రుపక్షచరిత్రము నా నేర్పితివి? ఇదియా నీవొనర్చినపని! లోకమునఁ గపటమైత్రి నవలంబించి యందులకుఁ దగినవేషమును ధరించి వర్తించు నీవంటి దురాత్ములు కలరుగదా! ప్రకృతకాలమున వారలద్రోహము గానరాకపోయినను నుచితకాలమునఁ బాపాత్ముల కుష్ఠాదిరోగరోగములవలెఁ బ్రకటము కాక మానదు'' అనిపల్కిన రాక్షసేంద్రునివచనంబులు విని గురుపుత్త్రుం డిట్లనియె. "ఓదేవేంద్రవైరీ! ఈవచనములు నేను నేర్పలేదు. పరులెవ్వరును నేర్పలేదు. నీ కుమారుఁడే యిట్లు పలుకుచున్నాఁడు. ఇతని కీబుద్ధి స్వాభావికమయినది. కావునఁ గోపము వదలుము. మమ్ము క్షమింపుము. దీనులమగు మమ్ముఁ గ్రోధించిన నేమి ప్రయోజన ముం

-డును?'' అని పల్కి-నవిని హిరణ్యకశిపుఁడు గురుసుతుల విడిచి కుమారునిదిక్కు మొగంబై "ఓరిబాలుఁడా! నీకీ పాడుబుద్ధి గురువులు నేర్పనిచో మఱితరులెవ్వరు నేర్పిరి?'' యని యడుగ బాలుం డిట్లనియె. "ఓ జనకా! గృహస్థాశ్రమమున నున్న వారికి భగవద్భక్తిరూపమగు బుద్ధి స్వయముగాఁ బుట్టదు. ఒరులు చెప్పినను సంభవింపదు. ఇంద్రియముల కధీనులయి తన్మూలమున నరకకూపమున కెనవచ్చుసంసారమున వర్తించుచుఁ, బూర్వదినమున ననుభవించినవస్తువులనే పరదినమునఁ గూడ ననుభవించుచుఁ గేవలము విషయసుఖములఁ గోరు మీవంటి గృహస్థుల కట్టిబుద్ధి మిక్కిలి దుర్లభమైనది. మఱియు నాగృహవ్రతులు శబ్దాదివిషయములను బురుషార్థములఁగాఁ దలంచుచు వానినే వెంబడించి గ్రుడ్డివారిననుసరించిపోయిన గ్రుడ్డివారు గోతియందుంబోలె సంసారమునఁబడి యీశ్వరుని వాక్తంత్రియనెడి త్రాటిచేఁ బద్ధులయి యుండుటంబట్టి, తమకుఁ బురుషార్థభూతుఁ డగు విష్ణువు నెఱుంగనే యెఱుంగరు. విషయాసక్తులబుద్ధి యనర్థముల నిరసించునిరతిశయమహిమచే వెలయు విష్ణుపాదముల దరిఁజేర లేదు. అట్లు తమబుద్ధిని జేర్చుకోవలెనన్నచో ముందుగా నితరప్రయోజన మపేక్షింపక సంతతమును హరిని సేవించుమహాత్ములపాదసేవను జేసి తీఱవలె'' ననిపల్కి-యూరకున్నబాలునిఁ గాంచి దైత్యనాయకుఁడు కోపాతిశయంబున వివేకము నశించుటచే వానినిఁ దొడనుండి క్రిందికిఁ ద్రోచి సహింపఁజాలక కనుఁగొనలు కెంపుగదుర భటులకిట్లనియె. "ఓ దైత్యులారా! ఈదురాత్ముని బాలుఁడనక యిటనుండి పైకిగెంటివేయుఁడు. వీఁడు వధ్యుఁడు. కాన వేగముగా వధింపుఁడు. ఈదు

1260,5




1261. హిరణ్యాకశిపుఁడు విష్ణునామోచ్చారణను చేసిన ప్రహ్లాదుని గోపించి తన సమక్షమునుండి తొలఁగించి చండామర్కు లను [illegible]

ష్ఠుఁడు తనవారగు బంధువులను, మిత్రులను విడిచి తనపినతం డ్రినిఁ జంపినవిష్ణువును దానిగతిఁ బూజించుచున్నాఁడు. ఆలోచింప నాసోదరునిఁ జంపినవాఁడు వీఁడేయని నిశ్చయింపవచ్చు. వీఁడు చంచలచిత్తుఁడు. ఐదేండ్ల ప్రాయమువాఁడై యుండియే విడువఁదరముకాని తల్లిదండ్రుల స్నేహమును విడిచిపుచ్చెను.ఇట్టి వాఁడు విష్ణువునకయిన ననుకూలుఁడయి యుండి మంచిసేయఁజాలఁడు. ఇట్టివాని ఖండించుటయే సముచితము. నాపుత్త్రుఁడని కనికరింపకుఁడు. శత్రుపక్షమువాఁ డయిన నౌషధము విధమున హితమొనర్పఁగల్గినచోఁ బుత్త్రుఁడనియె భావింతును.హితమొన ర్పఁ జాలనివాఁ డాత్మజుఁడైనను రోగమువలె విసర్జింపఁదగిన వాఁడె. ఇంతియకాదు.కరచరణాదులగు నవయవములలో నేదేని వ్రణాదిదూషితమైనప్పుడు దానిఁ దప్పక ఛేదించి తీఱవలె. అట్లు చేసినంగాని తక్కిన వానికి సుఖముండదు. కావునఁ బుత్రరూపమున నున్న యీశత్రువును దుష్టేంద్రియమునుంబోలె ఛేదించి మేమందఱమును సుఖింతుము. మీరిప్పుడే వీనిఁగొనిపోయి శూలములచేఁగాని, విషముచేఁగాని, మఱియేదేని యుపాయముచేఁగాని సంహరింపుఁడు.'' అని యిట్లాజ్ఞాపింప వాఁడియైనకోర పండ్లు గలవారును, భయంకరములగు వదనములు గలవారును నెఱ్ఱని శిరోరుహములు గలవారును,నగురక్కసులు పెక్కండ్రు శూలములఁ దాల్చి "పొడువు,పొడువు" అని పల్కుచుఁ గూర్చుండియున్న ప్రహ్లాదుని మర్మస్థానములను మిక్కిలి భేదించిరి. కాని చేతనాచేతనములకు సజాతీయుఁడగుటవలన నిట్టివాఁడని నిర్దేశింప వలనుపడనివాఁడును, సకలమునకంతరాత్మయైయున్న వాఁడును, జ్ఞానాదిపరిపూర్ణుఁడును నగు పరబ్రహ్మమందుఁ దన

మనస్సును నిశ్చలముగాఁ జేర్చినప్రహ్లాదునివిషయమై యారాక్షసకృత్యములు పాపాత్ముని సత్కార్యములవలె నిష్ఫలములయ్యె. ఇట్లు రక్కసుల శూలఘాతములు వ్యర్థమగుటం జూచి హిరణ్యకశిపుఁడు "అయ్యో! వీఁడు శూలఘాతములచేఁ జావలేదు. వీనికిఁ జావెట్లు సంభవించు"నని యోజించి బలాత్కరించి చంపవలెనని నిశ్చయించి బాలుని గజములచేఁ ద్రొక్కించెను. పాములచేఁ గఱపించెను. మారణహోమములు చేయించె. పిడుగులవాన గురియించె. అయినను బ్రహ్లాదుండు కసుగందలేదు. దైత్యనాయకుఁ డెట్లయినను వానిఁ జంపనెంచి పర్వతశిఖరముల కెక్కించి క్రిందికిఁ ద్రోయించెను. అతని నవరంధ్రముల మూయించి యుంచె. జలములలోఁ ద్రోయించెను. విషమిశ్రమైన భోజనము పెట్టించెను. మంచుపైఁ గూర్చుండఁ బెట్టెను. సుడిగాలులలోఁ బడవైచెను. అగ్నిహోత్రములో నిలువఁబెట్టించె. చిరకాలమాహారాదు లొసఁగకుండనుంచెను. ఇట్లెన్ని యోయుపాయములు పన్నినను బ్రహ్లాదుండు చావకుండుటఁ జూచి దైత్యనాథుఁడు దీర్ఘవిచారము నొంది "అక్కటా! ఈబాలు ననేకవిధముల నిందించితిని. వీనికి మరణోపాయములు పెక్కులు పన్నితిని. అభిచారహోమాదులను జేయించితిని; కాని వీఁడు తనమహిమచే నుంతేనియు హింసఁజెందక నిశ్చలుఁడయి యున్నాఁడు. నేనొనర్చిన మారణకృత్యములకుఁ జిక్కక వర్తించుచు, బాలుఁడయ్యు నిపుణబుద్ధిగలవాఁడయి నాచేసిన ద్రోహమును నుంతేనియుఁదలంపఁడు. పూర్వము శునశ్శేఫుఁడను బాలుఁడు హరిశ్చంద్రున కమ్ముఁబడి యూపబద్ధుఁడయ్యు వారి యపకారమును స్మరింపక విశ్వామిత్రుని సాయంబున బ్రదికియుండెనఁట! అట్లే వీఁడును బరులనేరినైననాశ్రయిం

చి యిట్లు జీవింపఁగలిగెఁ గాఁబోలు! వీని ప్రభావము దురూహ మైనది. వీనికెందును భయములేదు. వీనికిఁ జావులేదు. ఇట్టి వీనితో విరోధ మవలంబించుటవలన నాకు మరణము నిశ్చయముగా సంభవింపకమానదు. అని యిట్లు కుమారు నుద్దేశించి చింతించి వెలవెలబోవుచుఁ దలవాంచియున్న హిరణ్యకశిపుని గురుపుత్త్రు లగుశండామర్కులు నిర్జనప్రదేశమునకుఁ గొనిపోయి యిట్లనిరి. "ఓదైత్యనాయకా! నీవుముల్లోకంబులను జయించితివి. నీవు బొమముడివైచినఁ జాలు. లోకపాలురందఱును భయపడుదురు. ఇట్టినీకు విచారమునొందవలసర మేమి? చింతాకారణ మేమియుఁ గానరాదు. కుమారుని ప్రవర్తనముకై యిట్లు చింతించుచున్నానని యందువేని, యట్లు చేయుట యెప్పుడును దగదు. పిల్లలవర్తనమున నొకప్పుడు గుణములుండును. ఒకప్పుడు దోషములుండును. ఇంతమాత్రమున నీవంటివాఁడు చింతింపఁదగునా ? నీఁడు మిక్కిలి భీతుఁడయియున్నాఁడు. ఎక్కడకైనఁ బర్విడి పోవునేమో! అట్లు పోకుండ వీని వరుణపాశములచే బంధించి యుంపుఁడు. ఇంతలో మాజనకుండు శుక్రుండురాఁగలఁడు. అతనియొద్దఁ గొంతకాలముంచినవీనిబుద్ధి తప్పక చక్కనౌను. వృద్ధుల సేవవలనఁ బురుషులు తప్పకబుద్ధిమంతులగుదురు." అనివారు పల్కినిని రాక్షసపతి యంగీకరించి "అట్లయిన వీనికి రాజులకును గృహస్థులకును దగినధర్మములనుపదేశింపుఁడని నియమింప వారా ప్రహ్లాదునిఁగొనిపోయి వినయావనతుఁ డయినయతనికి,ధర్మార్థకామముల స్వరూపములను వాని సాధించుసాధనములను, మనస్సునకుఁబట్టునట్లుగా నుపదేశించిరి. కాని యా బాలుఁడు గురువులు తన కుపదేశించిన

త్రివర్గము రాగద్వేషాదుల కాటపట్టగుటవలన మంచిదికాదని తలంచెను. అంత నొకప్పు డాచార్యుఁడు గృహకృత్యములనెఱవేర్చికొనఁ గార్యాంతరాసక్తుఁడయి పోవుటంజూచి విద్వాంసుఁడయిన ప్రహ్లాదుఁడు తనసహాధ్యాయులమృదువచనములచేసంబోధించి కృపచే నవ్వుచున్నవాఁడుంబోలెఁ గానవచ్చుచు, విజ్ఞానమార్గ ముపదేశించెను. ఆబాలకు లతనియందలి గౌరవముచే నాటలాడుట మాని చిత్తములఁ జలింపనీక యతనియందే పొందించి యతని మోమునందే చూపుల నిలిపి రాగద్వేషాదులను విడిచి యతని చుట్టును గూర్చుండియుండఁ గృపతోఁ బరమభక్తుఁడయిన ప్రహ్లాదుం డిట్లనియె. ఇదియైదవయధ్యాయము.



### ప్రహ్లాదుఁడు బాలకులకు భగవద్ధర్మములుపదేశించుట.

ఓబాలకులారా ! ప్రాజ్ఞుఁడగు వాఁడీ మానవజన్మమందే చిన్నతనమునుండియు భగవంతునిఁ జేరుటకు సాధనములయిన ధర్మములనే యాచరింపవలయు. ఇంకొకజన్మమున నాచరింపవచ్చునని యుపేక్షింపరాదు. అప్పుడుమానవజన్మమెత్తుదుమో లేదో యెవఁడెఱుంగును? దుర్లభమైన మానవజన్మము లభించినప్పుడే పరమేశ్వరునిఁ గొల్చుట మంచిది. ముందుగావిషయసుఖముల ననుభవించి వార్ధకమున భగవదారాధన మొనర్పరాదా? యన వీలులేదు. అంతవఱకు బ్రదుకుదుమో లేదో నిశ్చయింపఁ జాలము. కావున నాలస్యముచేయక పరమపురుషార్థమునకు సాధనమయిన యీదేహముతోనే యీబాల్యమందే పరమపురుషునిఁ బూజింపవలెను. ఎవఁడు సర్వభూతములకు నంతరాత్మయైనియామకుఁడై నిరతిశయానందరూపుఁడై వర్తించుచుండునో,

యా పరమపురుషుని పాదపద్మముల యథార్థముగా సేవించుట మానవజన్మమున కవశ్యకార్యము గదా! ఓ దైత్యబాలకులారా! ఇంద్రియసుఖములు దేహసంబంధముచేతనే దేహికి లభ్యము లగుచున్నవి. కానఁ బశ్వాదిజన్మములందుఁగూడనవి లభ్యముకావచ్చును. ఆసుఖములకయి ప్రయత్నమక్కఱలేదు. దుఃఖములవలెనే విషయసుఖములుగూడ నప్రయత్నముగానే ప్రాచీనకర్మములవలన లభించుచుండఁ బ్రయత్నమేల? కావున విషయసుఖములకయి ప్రయాసపడుటవలన నాయుర్దాయము వ్యయమగుట తప్ప వేఱొక ప్రయోజనంబులేదు. ఒకవేళనట్లు ప్రయత్నమొనరించినను, పురుషుఁడు దుఃఖమిళితమై, సోపాధికమై యున్న సుఖమునే చెందఁగలఁడుగాని పరమేశ్వరునిపాదపద్మముల సేవించుపురుషునివలె దుఃఖములఁ దొలంగించుకొని నిరుపాధికమును నిరతిశయమును నిత్యమునునగు బ్రహ్మానందరూపసుఖము నొందలేఁడు. అందువలనఁ గుశలుఁ డయినపురుషుఁ డనర్థావహమగు సంసారము నాశ్రయించి, యెంతలోఁ బటుతరమయిన శరీరము విపన్నముకాదో, యంతలోనే శ్రేష్ఠమయిన క్షేమమునకయి ప్రయత్నింపవలయు. ఆలోచింప మానవున కాయుర్దాయము నూఱువత్సరంబులు మాత్రమే. ఇంద్రియముల వశముగావించుకొననివాఁడు వానిలో నేఁబదివత్సరములకాలము రాత్రులందు నిద్రించుచు వ్యర్థముగాఁ గడపును. బాల్యమున మూఢుఁడయియుండి పదివత్సరంబులు వ్యయముచేయును. పిమ్మటఁ బదివత్సరంబులు బాలక్రీడలతో వ్యర్థపుచ్చును. అంత్యకాలమున జరాపీడిత మగుదేహము గలవాఁడయి యసమర్థుఁడయి యుండి నిష్ప్రయోజనముగా నిరువదివత్సరంబులకాలమును బుచ్చును.

నూఱువత్సరములలో నిట్లు తొంబదివత్సరంబులు వ్యర్థము కాఁగా నికఁ బదిసంవత్సరములుమాత్రమే మిగిలినది. అప్పుడైన భగవంతు నారాధింపఁజాలక దుఃఖపూరితమైన కామముచేతను, బలీయమైన మోహముచేతను, క్రోధముచేతను, నాకర్షింపఁబడి గృహధర్మములం దాసక్తుండై మత్తుఁడై నిష్ఫలముగా వెళ్లించును. ఇంద్రియంబుల జయింపలేక గృహమందును దారపుత్త్రాదులందును బెద్ద యనురాగముంచి వర్తించినవా రెప్పుడు మహానర్థములఁ జెందుదురు. ఆయనురాగము విడువరాదా? యని యందువేని నింద్రియాధీనున కది యెప్పుడును పొసంగదు. గృహమందధికానురాగము గల్గి "యీగృహము నాది" యను నభిమానముతోఁ గూడి విప్పఁదరము కాని స్నేహపాశములచే బద్ధుండై యున్నతన్నును విముక్తునిఁగాఁ జేసికొన నెవఁడు పాటుపడును? లోకమున ధనము ప్రాణముకంటెను బ్రియతరమయినది. కావుననే తస్కరులును, యుద్ధభటులును, నావికులును మొదలగువారు ధనమునిమిత్తమై తమ ప్రాణముల గడ్డిపోఁచలవలెఁ బరిత్యజించుచున్నారు. ఇంద్రియాధీనుఁ డట్టిధనమందుఁ దనకుఁ గల్గు నభిలాషము నెట్లుగా విడువఁగల్గును? మఱియు భార్య దయాయుక్తురాలై రహస్యస్థలమునఁ గల్గించు సుఖము నెట్లు మఱవఁగల్గు? మనోహరములగు నామె వచనంబులం దెట్లు విరక్తుఁడగు? మిత్రసహవాసము నెట్లు త్యజింపఁగల్గు? తదీయ స్నేహపాశములచే బద్ధుఁడగువాని కది దుర్లభముగదా! బాలకులు వచ్చియురాని తియ్యనిపల్కులతో భాషించుచుండ మిక్కిలి యనురక్తినిజూపు మానవుఁడు వాని వినుటయం దెట్లు విరక్తుఁడగును? హృదయము నాక

క్షించు పుత్త్రులను, బుత్త్రికలను, దమ్ములను, సోదరీజనమును, దీనులయిన తలిదండ్రులను, పలువిధములగు భోగోపకరణములు గల యిండ్లను, గులక్రమమున వచ్చెడి వృత్తులను, బశువులను, భృత్యులను, సర్వదా స్మరించుకొనుచు, దురంతమగు మోహముగలవాఁడై కోశాత్మకమగు గృహమును నిర్మించుచు, నిర్గమనద్వారమును గూడ నుంపక,యందుండి నశించుపురువువలెఁ దన్నుఁబంధించునట్టి కర్మకలాప మాచరించుచున్న సుఖములందును, రసనాది సుఖములందునుఁ దృప్తిఁజెందక వానినే యధికముగాఁ దలంచుకొనును. అట్టివాని నెట్లు విరక్తితో విడువఁగలఁడు? ఇంతియకాక యట్టిపురుషుఁడు కుటుంబమును బోషింపఁ దనయాయువు నంతయు వృథ చేయుచుఁ దనకు మిక్కిలి హితమగు పురుషార్థము నెఱుంగఁజాలఁడు. తన కుటుంబమునం దధికానురాగము గలవాఁ డగుటచే సర్వకాలములందును, సర్వ ప్రదేశములందును దాపత్రయముచేఁ బీడితుఁ డగుచుండియు సంసారము హేయమను బుద్ధిని బూనఁడు. "పరధనమపహరించినచో నీలోకమున రాజదండనము గల్గు. పరమున యమదండనము సంభవించు"నని యెఱిఁగియు, మనుజుఁడు ధనమం దధికమగు నభినివేశముగలవాఁడై యింద్రియములకు లోనై కుటుంబము నిమిత్తము పరవిత్తమును దస్కరించు. ఓదనుజులారా! ఇట్లు సంసారదుఃఖముల నెఱింగినవాఁడు సైతము కుటుంబమును బోషింపఁ బాటుపడు.వాఁడాత్మవివేకము దెలిసికొన సమర్థుండు కాఁడు. మఱియు వీఁడు నావాఁడు,వీఁడుపరుఁడు నాఁబడు భేదబుద్ధి వహించువాఁడు మూఢుఁడును, నరకలోకగామియునగును. స్త్రీని వేఁటకాఁ డుంచిన దీముతోఁ బోల్పవచ్చు. ఆదీము

మృగాదులకు భ్రాంతి గల్గించి వలలోఁ జిక్కు నట్లు చేయును. అట్లె స్త్రీయు సంసారమను విహారస్థానమున స్వీయవిలాసములచేఁ బురుషు నాకర్షించి సంసారబద్ధునిఁ జేయుచుండును. ఎట్టి వాఁడయిన గృహమునం దభినివేశ ముంచినచో నేకాలమందైనను, నేప్రదేశమందయినను, నాసంసారబంధములఁ ద్రెంపుకొన శక్తుండు కానేరఁడు. కావున విషయాభిలాషముతో వర్తించునీదైత్యులసహవాసమును దూరముగాఁ బరిత్యజించి స్వయంప్రకాశుఁడై సృష్ట్యాదులకుఁ గారణుఁడయిన నారాయణుని భజింపుఁడు. అతని సేవ యెప్పుడును నిష్ఫలముగాదు. ముక్తసంగులగువారికి సకలమును సమకూర్చును. ఆపరమేశ్వరుని నాశ్రయించుట కష్టసాధ్యమేమో యని శంకింప నవసరము లేదు. అతఁడు సర్వభూతములకు నంతరాత్మయై యన్నిచోట్ల నిండియుండుటచేతను, లోకమం దంతటను బెన్నిధివలె సిద్ధుఁడై యుండుటచేతను దక్కిన దేవతల సంతసింపఁజేయుటకంటె నతని సంతసింపఁ జేయుట మిక్కిలి సులభము. ఆ మహనీయుఁడు ఘటపటాదివస్తువులందును, జరాచరములందును, బృథివ్యాది మహాభూతములందును, సత్త్వాదిగుణముల సామ్యావస్థయగు మూల ప్రకృతియందును, మహదహంకారములందును, బెక్కేల? తృణము మొదలుకొని బ్రహ్మవఱకును గల ప్రతిపదార్థమునందును, జీవశరీరకుఁ డగుటచేతను, నచేతనశరీరుఁడగుటచేతను, సాటిలేనివాఁడై లోపలిభాగములఁ బ్రవేశించి నియమించువాఁడై శరీరమగు జీవులందుఁగల దోషముల నంటనివాఁడై సకలదోషముల నిరసించువాఁడై వ్యాప్యములగువస్తువులందు వ్యాపకుఁడని నిర్దేశింపఁబడువాఁడై జాతిగుణాదులు

లేనివాఁడై ప్రకాశించుచున్నాఁడు. ఇట్లింతటను నిండియుండు పరమాత్మ నాశ్రయించుటలోఁ గష్టమేమిగలదు? కేవల మానందస్వరూపుఁడును, జ్ఞానస్వరూపుఁడును నగు పరమేశ్వరుఁడు, మోహాదిగుణములఁ గల్గించు మాయచేఁ గప్పఁబడిన మహిమ గలవాఁ డగుటంజేసి యాచార్యోపదేశ మనుసాధనముచేఁ దక్క వేఱొక్కదానిచే సంసారులకుఁ దెలియఁబడఁడు. ఓబాలకులారా ! పరమేశ్వరుఁడు సర్వాంతరాత్మ యగుటంబట్టి యే భూతమునకు ద్రోహము చేసినను నతనియందే పర్యవసితమగును. కావున మీరు దైత్యులకుఁ బ్రధానగుణమైన భూతద్రోహమును విడిచి సర్వభూతములందును దయాళు రై స్నేహముతోఁ బ్రవర్తింపుఁడు. అట్లు చేయుటవలనఁ బరమేశ్వరుండు తప్పక సంతసించును. జగంబునకుఁ గారణభూతుఁడును, ననంతుండు నగునీశ్వరుఁడు సంతసించినచో నలభ్య మగువస్తు వేది యుండు? ఏదియును లేదు.మావంటివారికి ధర్మార్థకామాదులు కరతలామలకము లయినను వానిఁ దృణములవలెఁ జూతుము. పరమేశ్వరుని పాదపద్మములందలి యమృతసారమును సేవించుచు, నాతని సద్గుణంబుల నుతించుచు, మనస్సుచేఁ దన్నామస్మరణ మనెడునమృతమనుభవించుచు,వర్తించుమావంటివారికి సత్త్వాదిగుణరహితమగు మోక్షముతో నేమి ప్రయోజనము? అట్టి మోక్షమే మాకుఁ బురుషార్థము కానప్పుడు, ధర్మాదులు పురుషార్థములు కావని వేఱ చెప్పవలయునా ? మనగురువులుపదేశించిన ధర్మార్థకామమఃలమార్గములును సాధనములును నాకుఁ జక్కఁగాఁ దెలియును. ఆన్వీక్షికీవిద్యను కర్మప్రవర్తకమగు వేదపూర్వభాగమును, దండనీతిని దెలుపుశాస్త్రమును,

వార్తయను శాస్త్రమును, సర్వమును గురువు లుపదేశింపకుండ
గనే నాకుఁ దెలియును. అయిన నివియన్నియుఁ బురుషార్థసాధ
నములు కావు. "నిష్కపటహితుఁ డయినపరమపురుషునకు మన
యాత్మను నివేదింపవలయు నని తెలుపు నుపనిషద్వాక్యనిచయ
ముమాత్రమే నిత్యమగు పురుషార్థమును సాధించును. కావు
న నే వాని నన్నింటిని విడిచి,యీ పరమసాధనమును మాత్రమె
కోరుచుందును. ఈవిషయమై మన గురువరు లెఱుంగని యంశ
ములు పెక్కులు నాకుఁ దెలియును. గురువరులకుఁగూడఁ దెలి
యనిది బాలుఁడ వగునీ కెట్లు తెలిసె నని యందురేని చెప్పెద
వినుఁడు. సామాన్యులకు దుర్లభ మగునీజ్ఞానమును బూర్వము
బదరికాశ్రమమున నారాయణుండు నారదున కుపదేశించె.
ఆ దుర్లభజ్ఞానము ప్రయోజనాపేక్ష లేక నిరతమును బరమేశ్వ
రుని పాదపద్మపరాగమున మునిఁగిన భగవద్భక్తుల కందఱకును
సులభముగా లభ్య మగును. వివేకజన్య మగుజ్ఞానము చేతను, శా
స్త్రజన్యజ్ఞానము చేతను సంయుతమైన భాగవతధర్మమును బూర్వ
మునారదుండుపదేశింపనేర్చుకొంటిని." అనినవిని దైత్యబాలకులు
ప్రహ్లాదున కిట్లనిరి. "ఓ ప్రహ్లాదా! నీవును మేమును సతత మీ
గురువులయొద్దనే పఠించుచుంటిమి. వీరికంటె నితర గురువుల
నెఱుఁగముగదా! అక్షరాభ్యాసమునుండియు మనకు వీరేగురు
వులుగదా? అంతకుఁ బూర్వము నీవు పసివాఁడవై తల్లియంతః
పురమున వర్ధిలుచుంటివిగదా ! అట్లుండ నీకు మహాత్ముఁడ
యిన నారదునిస్నేహ మెట్లుగలిగె? అది మిక్కిలి దుర్ఘటమని
సందియము వొడముచున్నది. ఆసందియమును దొలఁగించు హేతు
వేదయిన నున్న యెడల సాకల్యముగాఁ జెప్పుము. మా సంశయ

ముసు వదల్పుము.'' అని యిట్లు దైత్యబాలుకులు తన్నడుగఁ బరమభాగవతోత్తముఁ డగుప్రహ్లాదుండు వారింజూచి మందహాసముఁ జేయుచుఁ బూర్వము నేను జెప్పిన వచనంబుల స్మరించుకొని యిట్లనియె. ఇది యాఱవయధ్యాయము.

---

## ప్రహ్లాదుఁడు తనజ్ఞానమూలముఁ దెల్పుట.

ఓసహపాఠులారా! మాతండ్రియగు హిరణ్యకశిపుఁడు తపంబొనర్ప మందరాచలమున కరిగినప్పుడు దేవేంద్రాదులు పోయిన ధైర్యమునుమగిడించుకొనియనాథులయినదైత్యులతోఁ బోరొనర్ప నిశ్చయించి "లోకములకు దుఃఖకారియగుపాపాత్ముఁడుచలిచీమలచే సర్పమువడువునఁ దనపాపముచేతనే మ్రింగఁబడును. కావునమనలబాధించిన రక్కసులందఱును స్వీయపాపముచేతనే మ్రింగఁబడియుందురు. కాన యిప్పుడు దాడివెడలి జగమును రాక్షసశూన్యముగాఁ జేయుటతగు''ననితలంచి యుద్ధసన్నద్ధులయి వెడలిరి. అంత దైత్యనాథులు దేవతలప్రయత్నములవిని మిక్కిలి భయమంది భార్యలను బుత్త్రులను, ధనములను, మిత్త్రులను, పశువులను, భోగోపకరణములను విడిచి, తమప్రాణములను మాత్రమె రక్షింప నెంచికొని సరభసముగ నలుదిక్కులకుఁ బర్విడఁ జొచ్చిరి. అప్పుడు జయశాలురయిన దేవతలు నిరాటంకముగా మనపురమునఁ జొరఁబడి సమస్తవస్తువులను నశింపఁ జేసిరి. ఆసమయమున నింద్రుఁడు రాక్షసేంద్రుని మందిరమును బ్రవేశించి నాతల్లి నపహరించి స్వర్గమునకుఁ గొనిపోవుచుండెను. ఇంద్రుఁడు గొనిపోవుచుండ నాతల్లి భయకంపితయై యాఁడు లేడి

వలె మిక్కిలి వాపోవఁజొచ్చెను. అంత నింద్రునకు మార్గమధ్య మున నారదుఁడు తారసిల్లి యిట్లనియె. "ఓసురపతీ! నిరపరాధురా లయిన యీమెను దీసికొనిపోవుట నీ కెంతమాత్రమునుదగదు. ఓ మహాభాగా! ఈమె పతివ్రత, పరదార. ఈమెను స్వీకరింప నర్హముకాదు. విడువు విడువు" మని పలుక నింద్రుఁడతనిఁజూచి "ఓమునీంద్రా! ఈమెను నే స్వీకరింపను. ఈమె కెట్టిద్రోహమును జేయను. మాకందఱకును మిక్కిలి భయంకరుఁడగు హిరణ్యకశిపుని దుస్సహవీర్య మీమెగర్భమున వర్ధిల్లుచున్నది. ప్రసవమగు నంతవఱకును దీనినాచెంత నుంచుకొందు. పిమ్మటఁబుట్టినపుత్త్రుని సంహరించి నిరపాయముగా నీమెను వదలెదను" అని వచించెను. "ఓ యింద్రా ! ఈమె గర్భగోళముననున్న శిశువు పరమభాగవతుఁడు. ఇతఁడు భగవద్భక్తిచే సమస్తపాపములను నశింపఁజేసికొనె. ఇతనికిమరణముగల్గించుపాపమెద్దియును లేదు. ఇతఁడుమహాగుణములకు నిధి. పరమేశ్వరుని సేవకుఁడు. మహాబలసంపన్నుఁడు. కావున నీ వితనిఁ జంపలే" వని పలికిన నారదునివచనములను మన్నించి యింద్రుఁ డారాజమహిషి నచ్చట విడిచి భక్తుఁడనగు నాయందలి భక్తిచే నాతల్లికిఁ బ్రదక్షిణ నమస్కారములు గావించి స్వర్గమునకరిగె. అప్పుడు నారదుండు నాతల్లిని దనయాశ్రమంబునకుఁగొనిపోయి యామెదుఃఖము శమించునట్లుయుక్తవచనంబులాడి "తల్లీ ! నీభర్త తపమునుండి మరలి వచ్చునంతదాఁక నాతపోవనంబున నుండుము. నేను నీ కెట్టియాపదయుఁ దొడరకుండునట్లు చేసెదను" అని పలుక నాతల్లి యందులకు సమ్మతించి నిర్భయచిత్తంబుతో నారదుని యాశ్రమంబున నివసించి తనభర్తయుగ్రతపం బాచరించి వచ్చునంతవఱకుఁ

దనగర్భమును గాపాడుటకును, దనభర్త గమనానంతరమందె ప్రసవమగుటకును; బరమభక్తితో నారదునికిఁ బరిచర్యసలుపుచుండెను. ఆసమయమున సమర్థుఁడయినయమ్ముని తన్నుసేవించుచున్నమాతల్లికిని దదీయగర్భమందున్ననాకును భక్తియోగలక్షణముల యాథాత్మ్యమును, బ్రకృతివివిక్తమగునాత్మజ్ఞానమును నుపదేశించెను.అట్లుపదేశించుట చిరకాలమగుటచేతను స్త్రీయగుటచేతను, నాతల్లి మఱచిపోయెను. కాని యమ్మునియనుగ్రహమునకుఁ బాత్రుఁడనైన న న్నాయుపదేశ మిప్పటికిని వదలలేదు. నావచనంబులను మీరు శ్రద్ధాయుక్తులై విన్నచో నారదుఁడు నాకుపదేశించినదియు, ధర్మతత్త్వము జ్ఞానము నాఁబడు నుభయమును సులభముగా నుపదేశింతును. మిక్కిలి శ్రద్ధ వహింపనిచో బాలురకును స్త్రీలకును జ్ఞానము లభింపనేరదు. మాతల్లి శ్రద్ధలేనిదగుటచేతనే నారదోపదేశమును నిలుపుకొనలేకపోయెను. నేను శ్రద్ధాళుఁడనగుటచేతనే యాయుపదేశమును వృద్ధిపొందింపఁ గలిగితిని. కావున మీరందఱును శ్రద్ధవహించి యుండుఁడు. ఓ మిత్రులారా! గుణపరిణామమును జేయఁసమర్థమైనకాలము చేవృక్షమందున్నప్పుడే ఫలమునకు జన్మాదివికారములుఁ గానవచ్చుచున్నవి. కానివృక్షమునకుఁగాదు. అట్లై పుట్టుకయు స్థితియు, వృద్ధియు, మార్పుఁజెందుటయుఁ, దగ్గిపోవుటయు, నదృశ్యమగుటయు నాఁబడు వికారము లాఱును దేహధర్మములుగాని యాత్మధర్మములు గావు. ఆత్మనిత్యము. అతని కుత్పత్తి వినాశాదులు లేవు. అతనికపక్షయము లేదు.కాలనిమిత్తకము లగుమార్పులు లేవు.అతఁడు ప్రాకృతము లగురాగద్వేషాదిగుణములు లేక జ్ఞానముచే నేకా

కారుఁడగుటవలన నన్ని దేహములందును వర్తించువాఁడు. ఇది నాశరీరమని దేహమును దెలియఁజాలినవాఁడు. అతఁడు స్వయముగాఁ జూడఁగలవాఁడు. అతఁడు దేహేంద్రియాదుల కాధారుఁడై వానిచే నాయావ్యాపారములను జేయించువాఁడు. అతఁడు స్వభావముచేతను స్వరూపముచేతను గాని, దిరోహితుఁడుకాఁడు. అతఁ డణుస్వరూపుఁ డగుటచే మఱియొక జీవునితో సంబంధములేనివాఁడు. విద్వాంసుఁడు. పైని జెప్పఁబడినవియు దేహాదుల కలవడనివియు నగు నాత్మలక్షణముల పండ్రెండింటిచేతను, శరీరమందుఁగాని, శరీరానుబంధుల/సపుత్రాదులందుఁగాని మోహమువలన జనితములగు నహంకారమమకారములను విడిచి స్వస్వరూపము నవలోకింప నాసక్తుఁడగుచుండును. స్వర్ణకారుఁడు ముందుగా భూమియందంతటను వెదకి యుపాయములచేత బంగారమునకుఁ గారణములగు ఱాలను సంపాదించు. పిమ్మట నగ్నిసంపర్కముచేఁ గరఁగించి యాఱాల నుండి బంగారును బొందును. అట్లె దేహముకంటె వేఱయిన యాత్మతత్త్వమును దెలిసినవారాత్మలక్షణములచేసమస్తదేహములందును నాత్మను బరిశీలించి యనంతరము స్వరూపముచేతను గుణములచేతను నిరతిశయమయిన బ్రహ్మజ్ఞానమును బొందుదురు. పృథివియు, సలిలంబు, నగ్నియు వాయువును, గగనమును, మనస్సు, బుద్ధియు, నహంకారమును బ్రకృతులందురు. సత్త్వరజస్తమములను మూఁడింటిని బ్రకృతిగుణము లందురు. జ్ఞానేంద్రియములైదును, గర్మేంద్రియములైదును, ప్రాణాపానములు,వ్యానోదానములు,సమానము నాఁబడు ప్రాణములైదును,జిత్తంబును షోడశవికారము లని చెప్పుదురు.కాని ప్రతి

శరీరమందును నియమముగా బద్ధుఁడనియో, ముక్తుఁడనియో, శిష్యుఁడనియో, యాచార్యుఁడనియో వ్యవస్థ చేయుట కనువుగా నుంటచే నొక్కశరీరమున కొక్కజీవుఁడున్నాఁడని తత్త్వజ్ఞులగు నాచార్యులు చెప్పుదురు. దేహము ప్రకృతు లగుపృథివ్యాదుల తోను, వికృతులగు నింద్రియాదులతోను, గూడికొని యున్నది. అదియె స్థావరమనియు జంగమమనియు రెండువిధము లయ్యె. అట్టి దేహమునం గల పృథివ్యాదులను గంధాదిగుణములమూల మున విభజించి, యాపదార్థము లాత్మగాదని విడిచిపుచ్చి, దేహ విలక్షణ మగునాత్మపదార్థమును వెదుకవలయును. "నేనాపనిని జేయు చున్నా" ననెడి యహంకారమును, "ఆవస్తువు నా యది" యనెడి మమకారమును విడిచిపుచ్చి, దేహాదులకు వ్యతిరిక్తమైన యహంప్రతీతిచేతను, సృష్టిస్థిత్యాదులను దెలుపు వేదాంతార్థములచేతను, బరమాత్మను బరిశీలించుశాంతచి త్తులు మాత్రమే యాత్మపదార్థమును వెదకి తెలిసికొనఁగల్గు దురు. ఆత్మ యున్నదని తెలిసికోఁగల్గుట కహంప్రతీతియేకాక, మఱికొన్ని యుపాయములుగూడఁ గలవు. బుద్ధికి జాగరణము, స్వప్నము, సుషుప్తి యనెడి మూఁడువృత్తులు గలవు. అవి సత్త్వా దిగుణము లాధారముగాఁ గలవై యస్థిరములై పుణ్యాపాపకర్మ ములవలన విభక్తము లగుచున్నవి. ఆవృత్తుల నెవఁ డనుభవిం చునో, వాఁడే దేహేంద్రియాదులకంటె వే అయిన యాత్మ. ఆవృత్తులు కేవలము బుద్ధివే యైనను నాత్మచే ననుభూతములగు టంజేసి,యవియాత్మవేయని యజ్ఞులు తలంతురు. కాని యదియెం తమాత్రము వాస్తవముకాదు.పుష్పాదులందున్న గంధాదులను వహించి ప్రసరించుచున్న వాయువును, వాయుగుణములుగాని

గంధాదులచేవానికంటెవేఱయినవానిఁగా దెలిసికొనుచున్నాము. అట్లె యాత్మ యనుభవించుచున్నను వాస్తవముగా బుద్ధివృత్తు లయినజాగరణాదులచేత నాత్మ దేహేంద్రియాదులకంటె వేఱ యినవాఁడని తెలిసికొనవలెను. * ఆత్మ కీబుద్ధిసంబంధమువలన నే సంసారము సంభవించుచున్నది. అది స్వప్నమువలె నల్పమై నది. అస్థిరమైనది. దాని కజ్ఞానము ప్రధానకారణము.అది పురు షార్థముకాదు. అది సత్త్వాది గుణపరిణామముల కనుగుణమైన కర్మఫలముల కధీనమైనది. ఈ సంసార మిట్టిదగుటంబట్టి మీరం దఱును గుణపరిణామములకు హేతువు లగుకర్మములకు మూల మైన దేహాత్మభ్రాంతిని పూర్తిగాఁ దొలఁగించుకొనెడి యు పాయ మాలోచింపవలెను.అట్టియుపాయములు వేలకొలఁది కల వు. కాని వానిలోనెల్ల భగవంతునిపై సులభముగా ననురాగము గల్గింపఁగాఁ జాలిన భక్తియోగమువంటి యుత్తమోపాయము వే ఱొకటి లేదు. ఆభక్తి యుదయించుట యెట్లని యందు రేని వినుఁడు. గురువులను బరిచరించుటచేతను, వారి నుపాసించుట చేతను, వారు కోరినవస్తువులలోఁ దనకు లభ్యమైనదెల్ల నర్పిం

---

* దీనివలన దెలియునదేమనఁగా—జీవులందఱును స్వభావసిద్ధముగా నిత్యులయినను, ననాదికర్మమును బురస్కరించుకొని సత్త్వాదిగుణములవలన సృజింపఁబడిరి.వారికి స్వీయకర్మానుసారముగా గుణపరిణామము పిమ్మట స్వపర తత్త్వ జ్ఞానము, తరువాత గుణకర్మానురూపమయిన దేహాదిసంబంధము, నావల దేహమునకును దేహానుబంధు లగు భార్యాదులకునుగల సంబంధమగు సంసారము, పిమ్మట దేహాత్మాభిమానము, దానివలనఁ గర్మాచరణము, దానివలన మగుడ గుణపరిణామమును గల్గుచుండును.ఇట్లె జీవులు మగుడమగుడఁ దిరుగు చుందు రని భావము.

చుటచేతను, భగవద్భక్తులసహవాసముచేతను, విగ్రహారాధనముచేతను, హరికథలను వినుటయందలి యాసక్తిచేతను,నతని గుణములను కీర్తించుటచేతను, నతనిపాదపద్మముల ధ్యానించుటచేతను, నతనిప్రతిమలను సర్వదా చూచుటచేతను, భగవంతుఁడు సర్వభూతములందు నంతరాత్మయై యున్నాఁడు. కావున భూతములన్నియు భగవత్స్వరూపము లనెడిబుద్ధిచేతను, యథార్థముగా భూతములకోర్కులను దీర్చి సన్మానించుటచేతను, భక్తియోగము సులభముగా లభ్యమగును. ఈ సాధనముల నవలంబించి యంతశ్శత్రువు లయిన కామమును క్రోధమును, మోహమును, లోభమును, మదమును, మాత్సర్యమును, జయించి, పరమేశ్వరుని నిరతమును ధ్యానింపవలెను. అట్లు చేసినచో భక్తి తప్పకయుద్భవించును. ఆభక్తియోగమనెడి యుత్తమోపాయము ననుసరించి భగవంతునియసాధారణగుణములను చేష్టలను విని, పురుషుఁ డధికహర్షముచే దేహంబునఁ బులకాంకురంబులు వెలయఁ, గన్నులనుండి యానందబాష్పములు స్రవింపఁ, గంఠస్వరము తగ్గుచుండ, భక్తిపరవశుఁడై యుచ్చైస్స్వనంబుతోఁ బాడుచు, ధ్వనిఁజేయుచు, నాడుచుండు. ఇట్లు భక్తి కధీనుఁడయి పురుషుఁడు గ్రహగ్రస్తునివలె నొకప్పుడు నవ్వుచు. నొకప్పు డేడ్చుచు, నొకమాఱు ధ్యానించుచు, మఱియొకపరి జనులందఱును భగవదాత్మకు లని తలంచి నమస్కరించుచు, మాటిమాటికి నిట్టూర్పువుచ్చుచు,సిగ్గువిడిచి "ఓనారాయణా ! ఓ జగత్పతీ ! ఓ శ్రీహరీ ! యని పలుకుచుండు. ఈవిధముగాఁ బురుషుఁ డెపుడు ప్రవర్తించునో, యప్పుడే సర్వోత్తమ మయినభక్తియోగముచే సకలబంధనములను

వదల్చుకొని సంసారమునకు మూలభూతమయిన కర్మవాసనలను బూర్తిగా నశింపఁజేసికొని భగవదాకారమును సంతతమును స్మరించుచు, దానివలనఁ దత్సమానరూపమును బొంది పరమేశ్వరునిఁ జేరును. భగవత్ప్రాప్తి నీలోకమునఁ దాపత్రయపీడితుఁడగు వాని కంతట సంసారరూపానర్థము దొలంగును. ఆభగవత్ప్రాప్తియే నిరతిశయానందరూప మగు మోక్ష మని బుధులందురు. కావున నో బాలురారా! మీ మీహృదయములందంతరాత్మరూపమున నున్న పరమేశ్వరుని భజింపుఁడు. భగవదుపాసనము సుస్థిరమగు ననంత ఫలము గల్గించు. దానినొనర్చుట మిక్కిలి సులభము. తమతమ హృదయములందు వర్తించుచు సత్యకామత్వము మొదలగు గుణములచే నొప్పుచు, సమస్త భూతములకును సఖుఁడయి పరఁగు హరి నుపాసించుటలో నాయాస మేమి కలదు? ఇట్లు సులభమయిన భగవదుపాసనము లభించుచుండఁగాఁ దుచ్ఛములయిన శబ్దాదివిషయములతో నేమి ప్రయోజనము? ధనము, పశువులు, దారసుతాది బంధువులు, గృహము, భూమి, గజశాలలు, సమస్తసంపదలు, మొదలగునవి యన్నియు, క్షణకాలమాత్రమే నిల్చునవి. కావుననే చంచలము లయినవి. అట్టి తుచ్ఛపదార్థములు మానవులకేమిసుఖము గల్గింపఁజాలును? ఈధనాదులవలెనే మనవారు యాగము లాచరించి సాధించినస్వర్గలోకాదులుగూడ నశ్వరములును, జంచలములును, దుఃఖమిళితంబులును నగుచున్నవి. కావున నట్టివానియం దాస్థమాని మీరందఱును, శ్రుతిస్మృత్యాదులచే నిందితుఁడు కాక ముఖ్యమయినభక్తిచే లభ్యుఁడయియుండు పరమాత్మను మీ లాభములనిమిత్తము సేవిం

పుఁడు. ఇంతియకాక మన కెంతమాత్రమును శబ్దాదివిషయ ములం దభిలాషము తగదు. మానవుఁ డెవఁడయినఁ దన్ను విద్వాంసునిఁగా నెంచుచువిషయసుఖముల నపేక్షించి యాగాది కర్మముల నొనర్చినచో, వానికి సుఖమునకు మాఱుగా దుఃఖా త్మకమగు విపరీతఫలమే యవశ్యమును లభించు. విషయసుఖా భిలాషమం దిట్టి యనర్థమున్నది. ఎప్పుడయిన నభిలాషమువలన దుఃఖము ప్రాప్తించుననియు, నిరభిలాషమువలన సుఖము గల్గు చున్నదనియు నిశ్చయముగా నమ్ముఁడు. మఱియు స్వర్గాది సుఖ ముల నపేక్షించి యాగాదుల నాచరించువాఁడు జీవితకాలమున ధనసంపాదనము నిమిత్తము మిక్కిలి ప్రయాసము చెందును. మరణానంతరమందు స్థిరములుగాని స్వర్గాదిఫలములను బడసి యవి క్షీణించినతోడనే నరకమునఁ గూలును. అన్యప్రయోజన మపేక్షింపక కేవలము భక్తియోగ మవలంబించి పరమేశ్వరు నారాధించినచో జీవితకాలమున భగవదనుభవరూపసుఖము గాంచు. మరణానంతరమందు నిత్యమును, నిరతిశయమును, నగు బ్రహ్మానందసుఖమున మగ్నుండగు. అపేక్ష యుండునప్పు డును, లేనప్పుడు నింత వ్యత్యాసమున్నది? ఈలోకమునఁ బురు షుఁ డేశరీరము నిమిత్తమై సాధనములచే శబ్దాదికామ్యవస్తు వులను సంపాదించుచుండెనో యది కేవలయు కుక్కలు మొద లగువానిచే భక్షింపఁదగినది. నశ్వరమైనది. ఒకప్పు డాత్మనంటి యుండును. వేఱొకప్పుడు విడిచి పోవుచుండు. తనశరీరమే తన్ను విడిచి పోవునని చెప్పవలసియుండఁగా నాశరీరమంతదగ్గఱ సం బంధములేని దారసుతాదులును, నిండ్లును, ధనాదులును, రాజ్య మును, వస్త్రాదులును, చతురంగసైన్యమును, మంత్రులును,

బరిచారకులును, మిత్రులును మొదలగు దేహానుబంధులు తన్ను విడిచి పోవుదురనియు; వేఱ చెప్పవలయునా నిత్యానంద సుఖమనెడిసముద్రమున మునిఁగియుండ నాత్మకీదేహముతో నేమి ప్రయోజనము?అనర్థదాయకములును, స్వల్పములునుక్షణభంగురములును బురుషార్థములవలెఁ గానవచ్చునవియునగు కామములతో నేమిలాభము, ప్రయోజనము? ఓ దైత్యులారా! సంసారకూపమునఁబడి ప్రాచీనకర్మములచే మిక్కిలి దుఃఖమునుజెందు దేహికి సంభోగాద్యవస్థలందు సంభూతమగుసుఖ మేపాటిది? సంసారమునదాననుభవించు దుఃఖములకంటె ననుభవించు సుఖములు మిక్కిలి తక్కువగదా! ఈసంసారమును దొలఁగించుకొనవలెనన్నచో ముందుగాఁ గర్మక్షయము గావించుకొనవలె. అది సాధారణముగా నెఱవేర్పఁబడదు. జీవుఁడు తన్ను నాశ్రయించియున్న దేహముచే దేహాంతరములు గల్గించు కర్మముల నాచరించును. ఆకర్మములను బురస్కరించుకొని దేహధారణము చేయును. ఆదేహముచే మగుడఁ గర్మము లాచరించుచుండు. కావునఁ గర్మములు నిశ్శేషముగా నివర్తించుట యెప్పుడును సంభవింపదు. ఆలోచింప దేహమువలనఁ గర్మములు, గర్మములవలన దేహములు గల్గుటయాత్మజ్ఞానము లేకపోవుటచేత నే. కర్మముల పరివర్తనమే మూలముగాఁగల సంసారము సాధనాంతరములచేఁ దొలఁగింపఁబడని దగుటచేఁ దన్నివృత్తికై త్రివర్గఫలమునుగూడ సులభముగా నీఁజాలినవాఁడును, శ్రితజనుల బంధముల ఛేదించువాఁడును, నగు నీశ్వరుని నిష్కామనతోఁ భజింపుఁడు. హరిసేవకు మే మర్హులమగుదుమా కామా యని శంకింపఁ బనిలేదు. తనచే సృజింపబడిన పృథివ్యాదులతోఁ జేసిన

భూతముల కన్నింటికిని భగవంతుఁడే ముఖ్యకారణము. నిరతిశయప్రియుఁడు. అతఁడే ఆత్మ. భగవంతుఁ డందఱకును సామాన్యుఁడే చుఁడీ! అతని సేవించుటవిషయమై దేవాదిజాతివిభాగ మనవసరము. దేవతలైనను, రాక్షసులైనను, మానవులైనను, యక్షులైనను, గంధర్వులయినను, ముకుందుని పాదముల సేవింపఁగల్గినచోఁ దప్పక సుఖవంతు లగుదురు.ఇందులకు నేనే నిదర్శనమను. బ్రాహ్మణత్వముగాని, దేవత్వముగాని,ఋషిత్వముగాని, దానముగాని, తపంబుగాని,యాగములుగాని స్నానాదులుగాని, శాస్త్రజన్యజ్ఞానముగాని, సద్వృత్తిగాని, ప్రాజాపత్యాది వ్రతములుగాని, పరమేశ్వరునికి సంతోషమును బుట్టింపఁజాలవు. విమలమయిన భక్తియొక్కటియే యతని సంతసింపఁ జేయఁజాలు. భక్తిదక్కఁ దక్కినభగవత్ప్రాప్తి సాధనములన్నియు విడంబనమాత్రము లని నమ్మెదు. కావున నో దానవులారా! మీరందఱు భూతదయ గలవారలై యాశ్రితబంధహారియు సర్వభూతముల కంతరాత్మయు నగునీశ్వరునియందు నిశ్చలమగుభక్తిని నిలుపుఁడు. అట్లు భక్తియుక్తులైనంతమాత్రమున ముక్తుల మగుదుమాయని సందేహింపఁబనిలేదు. బకుఁడు, కేశి మొదలగు రక్కసులును, బూతన మొదలగు స్త్రీలును, నందాదులగు గొల్లలును, జాంబారాదులగు శూద్రులును, జటాయువు మొదలగు పక్షులును, మాయామృగము మొదలగు మృగములును, పాపజీవులయినను భగవత్సంబంధముచేఁ దత్సరూపతను బొందిరి. అట్లుండ సర్వదా యతని భజించువారలు ముక్తులగుదురని వేఱ చెప్పవలయునా? గోవిందునియందు ఫలాభిసంధిరహిత మగు భక్తిని నిలిపినసమస్తమును

భగవదాత్మకమని తలంచుటయే యీలోకమున సర్వోత్కృష్ట మగు పురుషార్థము. ఇది యేడవయధ్యాయము.

---

(ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదము. నరసింహావతారావిర్భావము. బ్రహ్మాదులు నరసింహుని నుతించుట.)

అని యిట్లుపదేశించుచున్న ప్రహ్లాదుని యుపదేశమునువిని యది నిర్దుష్టముగా నుండుటచే దాని గ్రహించి తమగురువులు చెప్పెడి యుపదేశమును బరిత్యజించిరి. అంత శుక్రసూనుఁడు కొన్నికొన్ని లక్షణములచే బాలకులందఱును భగవదాసక్తులై యుండిరని నిశ్చయించి, మిక్కిలి భయపడి, ససంభ్రమగమనమున హిరణ్యకశిపునిఁ జేరి ప్రవర్తిల్లినవృత్తాంతమును సవిస్తరముగా విన్నవించెను. ఆదైత్యనాయకుఁడు గురుపుత్త్రుని వచనములు విని తనకుమారుని దుష్ప్రవర్తనమునకు మిక్కిలి క్రుద్ధుండై కోపాతిశయంబునఁ గంపితగాత్రుండై ప్రహ్లాదు నెట్లయినను జంపవలెనని నిశ్చయించి వినయావనతుఁడై దాంతుఁడై దోసిలి వట్టి యెదుటనిలిచియున్న కుమారుని వక్రదృష్టితోఁజూచుచుఁ, గాలఁద్రొక్కఁబడినసర్పమువలెరోఁజుచు, స్వభావసిద్ధమగుక్రూరత్వము ప్రకటితమగునట్టుగాఁ బరుషవాక్యములతోనిట్లనియె. "ఓరీదుర్వినీతా! ఓరీ మందబుద్ధీ! ఓరీ కులచ్ఛేదకా! ఓరీ యధమా! నేఁ గుపితుఁడనై యుండుటఁ జూచి లోకపాలురతోఁగూడ మూఁడులోకములును, భయముచే వడవడవడంకును. నీవు సుంతేనియు భయముఁజెందక నాయాజ్ఞను ధిక్కరించి వర్తించుచున్నావు. ఇదిగో,చూఁడు.ఇప్పుడే నిన్ను ఖండించి యమాలయం

బున కంపెదను. లోకపాలురకంటెను నీ వధికుఁడవా? వారి కంటెను నధికబలవంతుఁడ వా? ఏబలమును బురస్కరించుకొని త్రిలోకభయంకరుఁడనగునన్ను ధిక్కరించుచున్నా''వనిపల్కిన తండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె. 'ఓరాజా! నాకేకాక నీకును, లోకమునఁగల తక్కిన బలవంతులకును బలము భగవంతుఁడు సుమీ! అతఁడు బ్రహ్మాదిదేవతలను, జరాచరాత్మకములగు సర్వలోకములను దనవశము గావించుకొనియున్నాఁడు. అతఁ డందఱకును బలము నీఁజాలినవాఁడు. లోకములకు నియామకుఁడు. ముల్లోకముల నాక్రమింపఁజాలిన పాదములుగలవాఁడు. అతఁ డింద్రియశక్తికిని, నింద్రియములకును మనోబలమునకును ధైర్యమునకును, దేహబలమునకును, నాధారమయినవాఁడు. అతనికి సాటియగువాఁడుకాని యధికుఁడుగాని లేఁడు. అతఁడు సత్త్వాదిగుణములకు నియంత. అతఁడు కర్మముల కధీనుఁడు కాఁడు. అతఁడు తన కంశభూతములగు ప్రకృత్యాదిశక్తులచే సమస్త ప్రపంచమును సృజించి, పెంచి, సంహరించుచున్నాఁడు. భగవంతుఁడు నాకు శత్రువు శత్రువని పలుకుచున్నావు. నీవు ముందుగా రాక్షసభావమును విడిచి మనస్సును సమస్తభూతములందును సమభావముతో ననుసంధానముఁ జేయుము. అప్పుడు నీకెవ్వరును శత్రువు లుండరు. జయింపఁబడక పోవుటచే దుర్విషయములందు వర్తించు నంతఃకరణముకంటె నీకు వేఱొక శత్రువు లోకమున లేఁడు. నీవంతఃకరణమును జయించి యన్ని భూతములను సమభావముతోఁ జూచుటయే భగవదారాధనము. ఇంతియకాక ప్రతివానికి లోపల నార్వురుశత్రువులున్నారు. వారు జ్ఞానరూప మగుధనమును సర్వదా హరించుచుందురు.

ఇట్లు తమ లోపలనున్న శత్రువులను జయింపలేక నీవంటివారు గొందఱు "సర్వదిక్కులను జయించితి" మని యభిమానపడుచుందురు. ఇంద్రియజయమే గొప్పజయముగాని దిగ్జయ మట్టిది కాదుసుమా? జితేంద్రియులై యాత్మానాత్మవివేకము గలవారై భూతములకు సములై వర్తించు సజ్జనులకు దేహాత్మభ్రాంతివలన సంభవించు శత్రువులుగల్గు టెట్లు?" యని నిర్భయుండై నుడువుచున్న కుమారునిఁగాంచి హిరణ్యకశిపుఁడిట్లనియె. "ఓరీమందబుద్ధీ! నీవు నిక్కముగాఁ జావ సిద్ధుఁడవై యున్నట్టు తోఁచెడిని. లేనిచోఁ జావసిద్ధులైయున్నవారు నుడువునట్లు నీ నోటినుండి యిట్టి యసందర్భవచనములు వెడలనేల? ఓమందభాగ్యుఁడా! నీవు జగదీశ్వరుఁ డొకఁడున్నాఁడని యందువు. నాకంటె నన్యుఁడగు జగదీశ్వరుఁ డెచ్చట నుండెనో చూపుము. అతఁ డంతటను నిండియుండునని-యందువేని యెదుటనున్న యీ స్తంభమున నేల కన్పట్టఁడు? సమస్తమునకు నీశ్వరుఁడున్నాఁడని గర్వించి పలుకు నీశిరంబు నీఖడ్గముచే ఖండించెదను. నీవెవనిని రక్షకునిఁగా నెంచుకొనుచున్నావో,వాఁడిప్పుడువచ్చి రక్షించుఁగాక" అని యిట్లు కోపముచేతను, నిందావాక్యములచేతను, భాగవతోత్తముఁ డయిన ప్రహ్లాదుని మాటిమాటికిని బీడించుచు, హిరణ్యకశిపుఁడు ఖడ్గమును దీసికొని సింహాసనమునుండి క్రిందికుఱికి మిక్కిలి బలముగల పిడికిటితో నా స్తంభమును దాడించెను. అట్లు తట్టిన యనంతరక్షణమందే యా స్తంభమునుండి మిక్కిలి భయంకరమగు చప్పు డుప్పతిల్లెను. ఆ నినాదమునకు బ్రహ్మాండకర్పరము బ్రద్దలయ్యె. దానివిని స్థానములు విడిచివచ్చి బ్రహ్మాదులు తమతమ లోకములకుఁ బ్రళయకాల




2285. శ్రీనృసింహమూర్తి స్తంభమునుండి వెడలి హిరణ్యాకశిపుని జీల్చుట; ప్రహ్లాదుని కభయ మిచ్చుట.

ము సంభవించినట్లు నిశ్చయించుకొనిరి. ఇంతకుఁ బూర్వము స్వీయపరాక్రమముచేఁ గుమారునిఁ జంప నిశ్చయించి యతని సమీపించి గద్దించుచున్న హిరణ్యకశిపుఁ డిదివఱ కెన్నఁడునువిని యుండని యీయద్భుతనినాదమును విని భయముచే నాసభా మంటమునుండి పర్విడియె.తక్కిన దానవశ్రేష్ఠులుఁగూడ భయ మందిరి. అప్పుడు తనభక్తుఁడయిన ప్రహ్లాదుని వచనమును సత్య ముగాఁ జేయుటకై సమస్తచరాచరములందును నిండియుండిన భగవంతుఁడు చూచువారి కాశ్చర్యమును భయమును గల్గించు నరసింహరూపమును దాల్చి సభాస్తంభంబునఁ గానవచ్చెను. వైనుండి హిరణ్యకశిపుఁడు తన చుట్టునున్నవారి నందఱనుజూచి "యీస్తంభమధ్యమునుండి యిట్టియద్భుతరూప మెట్లువెలు వడినది? ఇది నరరూపము కాదు. మృగరూపముగాదు.ఇది నర సింహరూపము." అని యారూపమునుగూర్చి తలంచుచుండ నరసింహరూపధారి యగుహరి వానియెదుటఁ బ్రత్యక్షమయ్యె. ఆనరహరినేత్రములు తప్తకాంచనమువలెఁ బింగళములై యు గ్రములైయుండె.అతనిముఖము కేసరములచేతను జటలచేతను జూపఱకు వెఱపు గొల్పుచుండె. మఱియు నది భీకరమగు కోర పండ్లచేతను, ఖడ్గమునలెఁ జంచలమయి తీవ్రమయియున్న నాలుకచేతను, బొమముడిచేఁ గుటిల మయినఫాలముచేతను, వెలయుచుండెను. చెవులు మీఁదికి లేచియుండెను. నాసికా రంధ్రములును, నోరును పర్వతగుహలచందంబునఁ దెఱవఁబడి యుండె. కపోలప్రాంతంబులు మిక్కిలి భీషణములైయుండె. శరీర మత్యున్నతమై యాకసము నొరయుచుండె. మెడపొట్టిగా నుండక పొడుగుగానుండక మిక్కిలి స్థూలముగాక, మిక్కిలి

సన్నముగాక యందముగానుండె. వక్షస్స్థలము మిక్కిలి విశాలమై యుండె. నడుము మిక్కిలి సన్నముగా నుండె. రోమములు చంద్రకాంతులవలెఁ దెల్లగా నుండె. స్తంభసదృశము లయిన భుజములు నలుగడలకుఁ బ్రసరింపఁబడుచుండె. గోళ్లు తీవ్రములై యాయుధముల విధమున నుండె. ఇతరులకు దుర్లభములయిన చక్రాదిసాధనములు దైత్యులను దానవులను నలుదిక్కులకుఁ బలాయితులనుగా నొనర్చుచుండె. ఇట్టి భయంకరరూపముతో భగవంతుఁడు ప్రత్యక్షముకాఁగాఁ జూచి హిరణ్యకశిపుఁడు "మహామాయలు గలహరి నన్నుఁ జంపుటకై యిట్టి యుపాయము పన్నెను. అయిన నిందువలన నాకుఁ గల్గు నష్టమేమి?" అని పలుకుచు గదను జేతఁబూని, సింహమును మత్తగజము వలె, నరసింహునిఁ దార్కొనెను. కాని వాఁడు సాంద్రమగు నానరసింహుని దీప్తియందు నిప్పులోఁబడిన మిడుతవలెఁ గానరాక పోయెను. ఆలోచింప సృష్టికిఁ బూర్వమునఁ బ్రళయకాలసంబంధియగు తమస్సు నంతను నిమిషమాత్రమునఁ బానముచేసిన హరిసత్త్వమయ తేజంబునందుఁ దమోమయుఁడయిన యారక్కసుఁడు గానరాలేదనుట యేమియాశ్చర్యము? పిమ్మట నారక్కసుండు నరసింహున కభిముఖముగా నడిచి, కుపితుఁడై గదను గిరగిరఁ ద్రిప్పుచు, నరసింహునిఁ గొట్టఁ బ్రయత్నించె. ఇట్లు తన్ను గదతో మొత్తుట కరుదెంచుచున్నయా దైత్యుని గదతోఁగూడ గరుడుఁడు మహాసర్పమునువలె నొడసి పట్టెను. కాని నరసింహుఁడు విలాసముకై తనపట్టువదలఁగా నాదైత్యుఁడు క్రీడాసక్తుఁడయిన గరుత్మంతునివలనఁ గ్రూరమగు భుజంగమువలెఁ దప్పించుకొనియె. అదిచూచి నరసింహుఁ

డు క్రీడార్థము పట్టువదలుటచే వీఁడు తప్పించుకొనఁగలైనని యూహింపనేరక, బలముచేతనే తప్పించుకొనెనని యెంచి,లోకపాలురందఱును భయమున మేఘముల చాటున దాఁగి భగవంతునికంటె రక్కసుఁడే బలీయుఁడనియుఁ, దమకోర్కె నెఱవేఱుట దుర్ఘటమనియు విచారింపఁజొచ్చిరి. ఆ దైత్యుఁడును తాను స్వయముగానే హరినుండి తప్పించుకొంటినని యెంచి, హరికంటెఁ నేనే బలీయుఁడనను నభిమానము వహించి, యుద్ధమున రవంతేనియు శ్రమఁజెందక డాలును గత్తిని స్వీకరించి, నరసింహునిపైఁగవిసెను.అంత నరసింహుఁడు డాలును గత్తిని ధరించి, డేగపిట్టవలె లాఘవంబునఁ దన యెదుటఁ జరించుచున్న రక్కసునిఁ గాంచి పెద్దపెట్టున నవ్వి,గంభీరముగా సింహనాద మొనర్చిమహాజవంబున వర్తించుచుఁ దానొనర్చిన యట్టహాసముచేతను,సింహనాదముచేతను భయము పుట్టించుచు లీలగాఁ బట్టుకొనెను. ఇట్లు మహాసర్పమెలుకనువలెఁ దన్ను బట్టుకొనుటచే నాకులపడి సర్వేంద్రియంబులను బ్రసరింపఁజేయుచు, నింద్రుని వజ్రాయుధమున కయిన సాధ్యము గానిశరీరము గలయారక్కసుఁడు విడిపించుకొనలేక ధైర్యముడక్కియుండ భగవంతుఁడు వానిని, భూమియందునుగాక,. యాకసంబుననుగాక, తన తొడలందుఁ జేర్చి, లోపటను వెలుపటను గాని సభాద్వారమందు నిల్చి ప్రాణములున్నవియు లేనివియుఁగాని నఖముల నాయుధములనుగాఁ జేసికొని, లీలచేఁ జీల్చివైచె. ఆసమయమునఁ గోపంబున భీకరములయిన నేత్రములచేతను, దెఱవఁబడిననోటిచేతను దుర్నిరీక్ష్యుండయిన నరసింహుండు రక్తబిందువులచేఁ దన కేసరములు సిక్తను లగుచుండ, నాలుకను జాపి రక్తమును ద్రావుచుఁ,

బ్రేవులను మాలికలను ధరించి గజవధ నొనర్చినసింహమువలెఁ బొడసూపుచు, క్షణమాత్రమున నఖాగ్రములచే వాని హృదయముఁ జీల్చివైచి,యా కళేబరమును విసర్జించి యాయుధపాణులయి యారక్కసుని కనుచరులై యున్న దైత్యులను వెంబడించి వేలకొలందిని జంపెను. ఇట్లు దైత్యవధయందు సక్తుండై నప్పుడు చలించుచున్న యతని జడలు మేఘముల ఖండఖండములఁగా నొనర్చుచుండె. అతని దృష్టికాంతులచే సూర్యాదిగ్రహములు గాంతివిహీనత నొందుచుండె. అతని నిట్టూర్పు వాయువులచే సముద్రంబు క్షోభఁజెందెను. అతని సింహనాదమునకు దిగ్గజములు భీతిల్లి విచారాకులము లయ్యె. అతని సటాఘాతములచే నాకసమున సంచరించు విమానములు భగ్నములయ్యె. అతని పాదఘాతములకు భూమి చూర్ణమయ్యె. దుస్సహమయిన యతని వేగముచే సమస్తశైలములును బంతులవలెఁ దూలె. అతని తేజంబున భయాకులితము లగుదిక్కులును గగనమును బ్రకాశింపవయ్యె. అనంతరమున నరసింహుఁడు తానే సర్వలోకములకును నాథుఁ డనువిషయముఁ బ్రకటించుటకు సభాభవనము ప్రవేశించి,సింహాసనాసీనుండయి కృతకృత్యుండయ్యును దేజంబు విడువక, నిస్సపత్నుండై నను కోపమునువదలక,ఉగ్రసదనుండయి యుండె. ఆతని యుగ్రాకారమునకు భయకంపితులై యెవ్వరును నతని సమీపింపలేక పోయిరి. లోకత్రయమునకును దల నొప్పివలె దుస్సహుఁడయిన యారక్కసుఁడు నరసింహునిచేఁ జచ్చుటకు మిక్కిలి సంతసించి, వికసితవదనలై దేవస్త్రీలు పుష్పవర్షముఁ గురియించిరి. చూడవచ్చిన దేవతల విమానపంక్తులచే గగనతల మంతయు నిండె. దేవదుందుభులు మొరసె.గంధర్వులు

పాడిరి. అచ్చరలాడిరి. అనంతరము బ్రహ్మ, యింద్రుఁడు, శంకరుఁడు మొదలగు దేవతలును, ఋషులును, పితరులును, సిద్ధులును, విద్యాధరులును, భుజగులును, కిన్నరులునుఁ బ్రజాపతులును, గంధర్వులును, నచ్చరలును, జారణులును, యక్షులును, కింపురుషులును, విష్ణుపార్షదు లయినసునందాదులును, బద్ధాంజలులై క్రొంచెము సమీపించి మహాతేజంబుచే దుస్సహుండై కూర్చుండియున్న నరసింహునిఁ బ్రత్యేకముగా నిట్లు నుతించిరి. అందు ముందుగాఁ గమలాసనుం డిట్లనియె. "ఓ దేవా! నీవు స్వరూపము చేతనే త్రివిధపరిచ్ఛేదములు లేనివాఁడవు. నీశక్తు లనంతములై యమేయములై యొప్పుచున్నవి. నీవు సమస్తమును నియమించుచున్నను, సమస్తమును ధరించుచున్నను, వికారములఁ బొందనివాఁడవు. నీవు కర్మాధీనము కానిసృష్ట్యాది వ్యాపారములు గలవాఁడవు. స్వీయములగు సకలశక్తిత్వము, సర్వజ్ఞత్వము మొదలగు గుణములచేఁ బ్రపంచమునకు సృష్టిని, స్థితిని, లయమును గూర్చుచున్నవాఁడవు. నాశనరహితుఁడవు. అట్టినీకు నమస్కారము" అనియిట్లు చతుర్ముఖుండు నుతించిన పిమ్మట రుద్రుండు సమీపించి "ఓభక్తవత్సలా! నీకోపము బ్రళయకాలమున నుద్దీపింపఁదగినది కాని యిప్పుడుకాదు. స్వల్పబలుఁడయిన హిరణ్యకశిపునిఁ జంపుట కింత యాగ్రహమేల? శాంతింపుము. నీవెందులకీ యుగ్రాకారము ధరించితివో, యాపని నెఱవేఱె. కావున నికఁ గోపమువదలి నిన్ను సమీపించుచున్నవాని, భక్తుఁడగువానిఁ, బ్రహ్లాదుని సంరక్షింపు మని" మనవిచేసి యూరకుండె. పిమ్మట దేవేంద్రుండు బద్ధాంజలియై సమీపించి "ఓ పరమేశ్వరా! దురాత్ముఁడయిన హిరణ్యకశిపునిఁ జంపి యతనిచే నప

హృతములయిన యజ్ఞభాగములు మగుడ మాకు లభించునట్లు చేసితివి. నీకు నివాసభూతములగు మానిర్మల హృదయములు సంతసించినవి. ఓ నాథా ! నీ సేవాసక్తులగు భక్తులకు ముక్తి సైతము పరమప్రయోజనముగాదని చెప్పవలసియుండ నీ భక్తులమగు మాకీయజ్ఞభాగములు పునర్లభ్యము లగుటలో నేమివింత? నీదయవలనఁ గాలనశ్వరములుగాని మహాపురుషార్థములే లభింపఁదక్కినవానితో నేమిప్రయోజనము?'' అనినుతించె. తరువాత ఋషిపుంగవు లరుదెంచి, చేతులు జోడించి ''ఏది నీస్వరూపమును మాకుఁ దెలుపునో, దేని నాచరించి చతుర్ముఖుఁడు జగంబును సృజింపఁగల్గెనో యట్టిధ్యానరూపమగు తపమును మా కుపదేశించితివి. మేము దానినొనర్చి సుఖించుచుండ నీరక్కసుఁడు దాని నశింపఁజేసె. ఓ రక్షకా! నీవిప్పు డాతనిఁ జంపిసాధువుల రక్షింపఁ దాల్చిన యీనరసింహరూపమును సర్వదా ధ్యానించుకొందు''మని విన్నపమొనర్చిరి. ఆవలఁ బితృదేవతలు సమీపించి జోహారొనర్చి ''ఓజగదీశా! శ్రాద్ధములందు మమ్ముద్దేశించి మా పుత్త్రాదులొసంగెడిపిండములను, బుణ్యతీర్థములఁ స్నానమాడునప్పుడు సమర్పించెడి తిలోదకములను నీదైత్యుఁడు బలాత్కరించి తీసికొనుచుండె. అట్టిదుష్టరక్షసుని యుదరమును గోళ్లతోఁ జీరి చంపినవాఁడవును, సర్వధర్మముల రక్షించువాఁడవును నగు నీకు నమస్కారము లాచరింతు'' మని మ్రొక్కిరి. అనంతరము సిద్ధు లరుదెంచి ''ఓ సర్వరక్షకా! దుష్టుఁ డయినయీదానవుఁడు తన తపోబలముచే మాయణిమాది సిద్ధుల నపహరించెను. గర్వమునకు నిలయభూతుఁడయినవానిని గోళ్లతో విదారించి చంపి మావిద్యను మాకు దయచేసిన నీకు నమస్కారము'' లని పొగ

డి నమస్కరించిరి. ఆవెనుక విద్యాధరు లేగుదెంచి "ఓ మహానీయా! మనోధారణచే సంసిద్ధములయిన మా యంతర్ధానరూప విద్యలను, మూర్ఖుఁడును బలదర్పితుఁడు నగునీరాక్షసుఁడు హరించెను. మా కిట్టి యపకార మొనరించిన యీ దురాత్ముని యుద్ధరంగమునఁ బశువునువలెఁ జంపినమాయానృసింహుఁడ వగు నీకు నిత్యమును బ్రణతు లొనర్తుము" అని సాష్టాంగముగా మ్రొక్కిరి. అనంతరము నాగులు చనుదెంచి "ఓమహాప్రభూ! ఏపాపాత్ముఁడు మారత్నములను, స్త్రీరత్నములను దస్కరించెనో వాని గుండెలను జీల్చి మా కానందము గల్గించిన నీకు వందనంబు"లని యభినందించిరి. తదనంతరమున మనువు లేతెంచి "ఓదేవా! మేము భవదాజ్ఞానువర్తులమై, మనువులనెడి ప్రసిద్ధితో నున్నారము. దురాత్ముఁడయినయీరక్కసుఁడు మావర్ణాశ్రమ మర్యాదలను జెఱుచుటచే దుఃఖితులమయి యింతకాలమును మసలితిమి. ఇప్పుడు నీవా ఖలునిఁ జంపితివి. కాన మేము నిరంతరాయముగా నీవాజ్ఞాపించిన పనులు చేయువారము. ఆచరింపవలసిన దేదియో సెలవి"మ్మని సవినయముగాఁ బలికిరి. తరువాతఁ బ్రజాపతు లేగుదెంచి "యో పరమేశ్వరా! ప్రజలను సృజించుటకే మేము ప్రజాపతు లనుపేరితో నీచే సృజింపఁబడితిమి. మేము నీయానతిచొప్పునఁ గొంతకాల మట్లు చేసితిమి. ఈరాక్షసుఁడు వలదని నిషేధించుటచే మానితిమి. నీవిప్పుడు వానిఁ జీల్చి చంపితివి. కాన యిఁక మాపనిని నిరంతరాయముగాఁ జరుపుదుము. లోకములకు మంగళ మొనర్చు నవతారములు గల నీకు నతు లొనర్తుము" అని విన్నవించుకొనిరి. అనంతరము గంధర్వు లరుగుదెంచి "ఓమహాప్రభూ ! మేము నీకు నర్తకులమై నీ కథలను

గానము చేయువారలమై యుండ నీదురాత్ముఁడు స్వాధీనులఁగాఁ జేసికొనియె. వీర్యముచేతను, బలముచేతను, బరాక్రమము చేతను దర్పితుఁడయిన యీదుష్టుఁ డిప్పుడు చంపఁబడెను. మర్యాద నతిక్రమించివర్తించువానికి క్షేమము గల్గుట యసంగతముగదా! ఇఁక మే మెప్పటియట్లు నీ పవిత్ర చరిత్రములను సంతసమునఁ బాడుకొనుచుందుము" అని నమస్కరించిరి. పిమ్మటఁ జారణులు హరిని సమీపించి "ఓదేవా! యాశ్రితుల యార్తిని దొలఁగించి యపవర్గాదిసుఖముల నొనర్పఁజాలిన నీపాదపద్మములకు నిరత మును బరిచర్య చేయుచుండ మదాంధుఁడయిన వీఁడు నిషేధిం చెను. సజ్జనులకు మనోరోగమువంటివాఁ డగు నీదురాత్ముని నీవు చంపితివి కాన మేమధిక సంతుష్టితో నిఁకమీఁద నీపరిచర్య చేసి కొనుచు సుఖించుచుందుము" అని పలికిరి. తరువాత యక్షు లరుదెంచి "ఓపరమేశ్వరా! మేము మనోజ్ఞము లగుకర్మములచే నీకనుచరులమై యుండెడివారము. ఇట్లుండ మమ్మీనరకాసుఁడు స్వవశముగావించుకొని మాచే వాహనములనుమోయించుచుం డెడివాఁడు. భక్తుల కష్టముల నెఱింగిన నీ వీపాపాత్మునిఁ జంపితివి కాన యిఁక మేము నీకనుచరులమయి వర్తించెద"మని విన్నవిం చుకొనిరి. అటుతరువాతఁ గింపురుషు లరుదెంచి "ఓ మహనీయా! మేము కుత్సితపురుషులము. నీవు మహాపురుషుఁడవు. మఱియు సర్వాంతరాత్మవు. నీగుణములను వర్ణింప నెట్లు సరిపడుదుము? ఈ దైత్యుఁడు నీచేఁ జచ్చెనని చెప్పుట యొక వింతకాదు. వీఁడు మాకంటె నధికుఁడయినను నీకు గడ్డిపోఁచవంటివాఁడుగదా? మఱియు వీఁడు సజ్జనధిక్కారముచేతనే సగము చచ్చె. అట్టివానిఁ జంపుట యొక మహాగుణముగా వర్ణింపఁ దగదు." అని నుతిం

చిరి. పిమ్మట వైతాళికు లేతెంచి, "ఓలోకనాయకా! మేము స్వచ్ఛమగు నీకీర్తిని సభలలోను, సత్రయాగములందును బాడి గొప్పపూజలను బొందుచుంటిమి. అట్లుండ నీదానవుఁడు తనవశమును బొందించుకొని మాచేఁ దన కీర్తిని బాడించుకొనుచుండెను. ఇప్పుడు వీఁడు పీడాకరమైన రోగమువలె నీచే సంహరింపఁబడుట మాభాగ్యముగదా? ఇఁక నీ నీకీర్తినే పాడుకొనుచుందు మని" వినుతించిరి. అటుపిమ్మటఁ గిన్నరు లన్నరసింహుని సమీపించి "ఓయీశ్వరా ! మేము కిన్నరులమని ప్రసిద్ధిచెందినవారము. నీ యనుచరులము, సర్వదా నీపనుల నొనర్చుచుండెడివారము. అట్లుండ నీదురాత్ముఁడు మమ్ము నిర్బంధించి మాచే వెట్టిపనులు చేయించుకొన నారంభించెను. సేవకుల యార్తిఁదొలఁగింపఁ జాలిననీవారక్కసునిఁద్రుంచి మాకు సుఖమును వర్ధింపఁజేసితి"వని మ్రొక్కి విన్నవించుకొనిరి. తదనంతరమున విష్ణుపార్షదులగు సునందాదు లరుదెంచి "ఓభక్తప్రియా! నీభక్తులమగు మాచూపులకు సుఖమొసంగు నీయద్భుతరూప మిప్పుడు గానవచ్చెను. ఈచచ్చిన రక్కసుఁడు నీకింకరుఁడు. వీఁడు సనకాదులశాపముచే నిట్టి జన్మమొందెను. నీసేవారూప మగులాభము వానికిఁ గల్గించునిమిత్తమే నీవప్పుడు చంపితివని తలంతు"మని విన్నవించి విరమించిరి. ఇది యెనిమిదవయధ్యాయము.

---

ప్రహ్లాదుఁడు నరసింహమూర్తిని నుతించుట.

అనియిట్లు బ్రహ్మరుద్రాదులగు సురలందఱు నుతించిన నతని కోప సంరంభము తగ్గలేదు. అందుచే నెవ్వరును నరసింహుని

సమీపింప శక్తులుగాకపోయిరి. సర్వదా భగవంతునికిఁ బ్రియురాలయిన లక్ష్మియే దేవతలచేఁ బ్రార్థితయయ్యు నపూర్వమగు నరసింహరూపమునుగాంచి భయముచెంది యతని డాయవెఱచెను. తక్కినవారి సంగతి చెప్పనేల? అనంతరము బ్రహ్మ ప్రహ్లాదుని యొద్దకుఁబోయి "ఓవత్సా! నీతండ్రినిమిత్త మవతరించి క్రుద్ధుఁడయిన నరసింహమూర్తిని నుతించి శాంతింపఁజేయుమా" యని పలుక నతఁడు వల్లెయని బద్ధాంజలియై మందగమనమునఁబోయి సమీపించి దండప్రణామము లాచరించెను. అంత నరసింహుఁడు తనపాదమూలమునఁ బడియున్న పిల్లవానిఁ జూచి దయార్ద్రహృదయముతో లేవఁదీసి కాలమనెడి సర్పమునకు భయము చెందువారి కభయమునిచ్చు తనహస్తకమలము నతనిశిరంబున నుంచెను. అంతఁ బ్రహ్లాదుండు హరి కరస్పర్శముచే సమస్తబంధనములను నిరసించుకొని, బ్రహ్మసాక్షాత్కారమునొందినకనుక నే సుఖియై మేనఁబులకలువొడమఁ, గన్నుల నానందబాష్పకణము లురలఁ బరమేశ్వరుని పాదపద్మములను హృదయమున నిడికొని ధ్యానముచేసెను. అనంతరము బాలుఁడయినప్రహ్లాదుఁడు సమాహితచిత్తుఁడై తనమనస్సును జూపును, భగవంతునందుంచి గద్గదస్వరముతో నిట్లు నుతింప నారంభించె. "ఓపరమేశ్వరా! బ్రహ్మమొదలుగాఁగల దేవగణములును, మునులును, కేవలము సత్త్వప్రధానులయిన సిద్ధులును, మిక్కిలి శ్రద్ధాళులై స్తుత్యాది రూపమగు నారాధనముచే నిన్ను సంతసింపఁజేయ లేకుండఁగా నల్పబుద్ధిని, బాలుఁడను, దుష్టమగు నసురవంశమునఁ బుట్టినవాఁడను నగునేను స్తోత్రముచేసి యెట్లు సంతసింపఁజేయఁగలుగుదును ? అయినను నిన్ను సంతుష్టునిఁగాఁ జేయుటకు భక్తియే

ప్రధానము; కాని ధనము,సత్కులజన్మము, సౌందర్యము,తపము, పాండిత్యము. ఇంద్రియబలము, శరీరకాంతి, ప్రతాపము, దేహబలము, పౌరుషము, బుద్ధి, ప్రాణనిరోధము మొదలగునవి యెంతమాత్రమును గావు. అట్లుకానిచోఁ బశుజాతియందుఁ బుట్టిన గజేంద్రునకు నీవెట్లు ప్రసన్నుండవయితివి ? అతనికి భక్తిదక్క యేగుణము గలదు? ఓమహాత్మా! ధర్మము, సత్యము, దమము, శ్రుతము, నిర్మాత్సర్యము, లజ్జ, యసూయ, దానము, యజ్ఞము, ధైర్యము, శమము, వ్రతము నాఁబడు పండ్రెండు గుణములును గలవాఁడైనను, నీ పాదారవిందములకు విముఖుఁడయిన బ్రాహ్మణునికంటె, నీయందు మనంబును, వాక్కును, ప్రాణమును నర్పించి భజించెడి చండాలుఁడు శ్రేష్ఠుఁడని తలంచెదను. నీ భక్తివశంబునఁ జండాలుఁడు తన్నునుందన కులమును బవిత్రముగాఁ జేయఁగలఁడు. కాని బ్రాహ్మణుఁడు తన్నైనను బవిత్రునిఁగాఁ జేసికోఁజాలఁడు. ఓ దేవా ! నీవు సమస్తవాంఛల చేతను నిండినవాఁడవు, నీవు గోరఁదగిన దేదియును లేకుండ భక్తులొనర్చిన పూజలతో నీకుఁ బ్రయోజనమేమి? అయినను నీవు దయాళుఁడవు.కాన భక్తుల లాభమునిమిత్తమే వారలిచ్చు పూజలను స్వీకరింతువు. ఆలోచింప జనుఁడు నీకొనర్చుపూజలు తనయందే పర్యవసన్నము లగుచున్నవి.అది యెట్లంటేని యలంకృతమైన ముఖశోభయంతయుఁ బ్రతిబింబమునఁ గానవచ్చు. అట్లు నీకర్పించిన పూజలు నీఛాయవలె వర్తించు నారాధకులకు సంభవించును. ఈచెప్పుటచే భక్తుల సంతసింపఁజేయుటే నీకు ముఖ్యకార్యము. కావుననే నీచుఁడనైనను నీభక్తుఁడనగుటచే నిశ్శంకుండనై త్రికరణశుద్ధిగా నీమహిమను శక్తికొలఁది వర్ణించె

దను. అందువలనఁ బ్రకృతిగుణముల కార్యమయిన యీ శరీర
మును బ్రవేశించిన జీవాత్మ తప్పక పరిపూతమగును. ఓదేవా!
మేమునీకెట్లు కింకరులమో యట్లెబ్రహ్మాదిదేవతలునుగింకరులగు
చున్నారు. నీకింకరులయినబ్రహ్మాదులునీయుగ్రరూపమునుజూచి
యిప్పుడు మిక్కిలి భయముతో వర్తించుచున్నారు. నీకింకరుల
సుఖమునిమిత్తము నీ వీకోపము విడువవలయును. ఇంతియకాక
యీలోకమునకు క్షేమమును, వృద్ధిని, నాత్మానందానుభవము
వలనఁ గల్గిన సుఖమును గూర్చుటకే నీవు సుందరములయినసర
సింహాద్యవతారంబులు దాల్చి క్రీడించుచు నాతండ్రివంటి దుష్టు
లను జెండాడుచుంటివి. ప్రస్తుతమున నవతార ప్రయోజనంబు
ముగిసె. లోకములు సుఖించుచున్నవి. కోపముచే నిఁక నేమిప్ర
యోజనము? నీ విట్లింకను గోపముతోవర్తింతు వేని ప్రయోజ
నములేకపోవుటయె కాక, భయమును గల్గించి బ్రహ్మాదులను
లోకములను బాధించినవాఁడ వగుదువు. లోకసుఖార్థమెత్తిన
యవతారము భయార్థము గావలసి వచ్చును. వృశ్చికమువలెను,
సర్పమువలెను గ్రూరుఁడయిన మాతండ్రి నిహతుఁడగుటకు సా
ధువులందఱును సంతసించుచున్నారు. దీనిని హింసాకృత్యమును
గాఁబరిగణింపరు. లోకమునకును సాధువులకును గంటకుఁడయిన
రక్కసుఁడు చచ్చుటవలనవారి కామోదముకలుగును. నీవునర్చి
నపని మిక్కిలి యుచితమైనది. ఇఁక శాంతింపుము. భయపడు
చున్న బ్రహ్మాదులనిర్భయులనుగాఁ జేసివారివారి గృహములకుఁ
బంపుము. ఇఁకమీఁద నీరూప మభయముకొఱకగుగాక యని
కోరుచున్నారు. నీవువారికోర్కిఁ దీర్పుము. అతి భయంకరమయి
న ముఖమును, నాలుకను, సూర్యునితో సమానములయిననేత్ర

ములను,బొమముడియాటోపమును,భీకరదంష్ట్రయుఁ,బ్రేవులును మాలికలును, రక్తసిక్తము లయిన కేసరములును, నున్నతము లయిన కర్ణములును, గంభీరనినాదంబునకు భీతిల్లినదిగ్గజములఁ జీల్పఁజాలిన గోళ్లును గల్గి, యతిభయంకరమయిన నీ రూపము బ్రహ్మాదులకు భయంకరమగుచున్నదికాని నాకట్లుకాదు. నేనంతయు నీరూపమును జూచి భయమందలేదు. కాని యోదీనవత్సలా! స్వస్వరూపజ్ఞానమును గప్పిపుచ్చు దేహాత్మాభిమానము చేతను, స్వతంత్రాభిమానముచేతను,నహంకారమమకారముల చేతను దన్మూలకములయిన కర్మములచేతను,బద్ధుఁడనై భయంకరమును, దుస్సహమును నగుసంసారచక్రమునకు మిక్కిలి వెఱతును. ఓ పరమపురుషా! ఇట్లు సంసారమున కపారభయముచెందు నన్నును నిరతిశయ ప్రీతినిబుట్టించు నీ పాదపద్మము నీడ నెప్పుడు పొందింతువో? మఱియు నేను గర్మబద్ధుఁడను కావుననే యాకర్మములను బురస్కరించుకొని ప్రియవస్తువులతో వియోగము నప్రియవస్తువులతోఁ గూడికయు సంభవించు. వానివలన నగ్నివలె దుస్సహ మగుశోక ముప్పతిల్లును. ఆ శోకాగ్నిచేఁ బ్రతి జన్మమందును దహింపఁబడుచు దుఃఖముల నిలయమ నై తిరుగుచున్నాను. ఈ దుఃఖములను నివర్తించుకొనవలెనేని వానికిఁ గారణము లయినపాపకర్మముల ముందుగా నివర్తించుకొనవలె. ప్రాయశ్చిత్తాదులందులకు సమర్థంబులుగానోపవు. మీఁదు మిక్కిలి మఱింతదుఃఖము నేకల్గించునేమో! ఎట్లాలోచించినను దాదృశదురితములఁ దొలఁగించి దుఃఖములనశింపఁజేసి సుఖింపఁజేయునది నీసేవదక్క వేఱొక్కటిలేదు. కావున నాయందు దయయుంచి నీ సేవా

సంబంధము నాకొసంగుము. నీవట్లనుగ్రహించితేని నీదాస్యసంబంధముగల నేను నిరతిశయప్రియుఁడవును, దేవదేవుఁడవును నగునీయద్భుతవ్యాపారములను బ్రహ్మాదులతోఁ బాటుగాఁ బ్రస్తుతించుచు రాగద్వేషాదులను విడిచి నీ పదపద్మమునే సంతతము నాశ్రయించిన భక్తులతో స్నేహముచేసికొని మిక్కిలి సుఖవంతుఁడ నయ్యెద. సజ్జనసహవాసమువలన నిన్నే నుతించి విరక్తుండనై నీభక్తినూఁతగాఁ జేసికొని సంసారమును దరింపఁగలుగుదును. ఇందులకు నీవనుగ్రహింపుము. ఓ నరసింహా! నీ వుపేక్షించిన బాలుఁడు, దల్లిదండ్రులు రక్షించుచున్నను నిరపాయముగానుండ లేఁడు. నీ వుపేక్షించినచో రోగి యెన్నిమందులు దిన్నను రోగవిముక్తుండు కానేరఁడు. నీ వుపేక్షించినచో సముద్రమధ్యమున నున్నవాఁ డెన్నినావలుగలవాఁడైనను దీరముఁ జేరఁజాలఁడు. నీవుపేక్షించినచో దేహు లెన్నిసాధనముల నవలంబించియు నీచెంతఁ జేరలేరు. నీ యనుగ్రహములేక లోకమున నెద్దియును సుఖ మందఁజాలదు. కావున నన్ను నీయనుగ్రహపాత్రునిఁగాఁ జేయుము. మఱియుజగంబుల నేయధికరణమునం దే హేతువువలన నెప్పుడు దేనిని సాధనముగాఁ జేసికొని సంచోదితుఁడయిన యేకర్త యెవనిసంబంధి యగు దేని నే ప్రకారముగాఁ జేయునో యనునెడఁ గల సమస్తకారకశక్తులకును నాశ్రయమై విభక్తమైనస్వభావముగలదయి యుత్కృష్టమగునదియు, నపకృష్టమగు నదియునైన యేయే పదార్థ ముత్పత్తిచెందుచున్నదో వినాశముచెందుచున్నదో యా సమస్తమును నీ స్వరూపమే కాని భిన్నంబుగాదు. అట్లగుటం జేసి నిగ్రహించుటకును ననుగ్రహించుటకును నీవే సమర్థుండవు. కాన నాయందనుగ్రహముంచుము.

ఓదేవా! సంసారము చక్రమువలెఁ బరివర్తించును. నీ మాయ వలనఁ గల్గిన కర్మేంద్రియములును, జ్ఞానేంద్రియములును, పంచ ప్రాణంబులును మనస్సును నాఁబడుపదాఱువికారములును జేప లగుచుండఁగామనంబుసంసారచక్రమగుచున్నది. కాలవశంబున క్షుభితమయిన సత్త్వాదిగుణముల సహకారులనుగాఁ జేసికొని నీ మాయ యట్టిమనంబును సృజించుచున్నది. మనస్సు త్రిగు ణాత్మకమైన ప్రకృతివలనఁ గలుగుచున్నది. కాన రజోమయ మగుటంబట్టి పుణ్యాపాపరూపకర్మములఁ జేయుచున్నది. సత్త్వ మయమగుటచేశాస్త్రజన్యజ్ఞానమును దెలియఁగలసాధనములచే నొప్పుచున్నది.ఆమనస్సునకు సత్త్వప్రాచుర్యముగల్గినప్పుడేపురు షుఁడు సంసారమును దరింపఁగలుగు. సంసారమును దరింపఁజే యు సత్త్వాధిక్యము నీ యనుగ్రహమువలనమాత్రమే సంభ వించు. కాన నిన్నాశ్రయించి నీ యనుగ్రహమును బడయని వాఁడెట్లు సంసారమును దరింపఁగలఁడు? ఓ పరమపురుషా! సత్త్వాది గుణముల జయించినవాఁడ వగుటచేతను, స్వీయమగు తేజస్సుచేతనే జీవులను బలువిధములగా సృజించు మాయను స్వాధీనముగాఁ జేసికొన్నవాఁడ వగుటచేతను, గాలశరీరకుఁడ వగుటచేతను, నీవే సంసారబంధమునుండి విడిపింప సమర్థుఁడవు కాని తక్కినవారుకారు. నీ మాయ షోడశారమయిన సంసార చక్రమున నన్నుఁ బడవైచినది. నేనిందు మిక్కిలి పరితపించుచు నీ మఱువు సొచ్చితిని. నన్ననుగ్రహించి సంసారమునుండి యుద్ధ రింపుము. ఓదేవా! యింద్రాదిదేవతల యాయువును, సంపద లను, ప్రభుత్వములను జూచి మందబుద్ధి యగుసంసారి యపే క్షించి, వానికై ప్రయత్నించుచుండు; కాని నేనట్లు ప్రయత్నిం

పను. వానిని లెస్సగా నాలోచించితిని. ఆయింద్రాదుల సంప దాదులన్నియును దుచ్ఛములు, నశ్వరములు. నీచే సంహృతుఁ డయిన మాతండ్రి బొమముడి వేసినంతమాత్రముననే యవి యన్నియు విధ్వస్తము లయినవి. కావుననే నాయింద్రసంపదాదు లను గోరను. ఇంద్రియసుఖముల నపేక్షింపను. కాలరూపమయిన నీపాదవిక్షేపమాత్రముచే నశించు నని మహైశ్వర్యములను వేఁడను. పార్షదజన ముండుస్థలంబునుమాత్రము కోరుదును. నన్న ట్లు పొందింపుము. ఓ పరమేశ్వరా! ఎండమావులవంటి సుఖము లెక్కడ? సమస్తరోగముల కుప్పయైన యీదేహమెక్కడ? ఇట్టి దేహమునకును సుఖములకును సంఘటన మెప్పుడును లభింపదు. ఈయర్థమును జక్కఁగ నెఱిఁగినవాఁడయ్యుఁ బురు షుఁడు విషయసుఖలేశములం దాసక్తి మెండుగాఁ గలవాఁడగు టంబట్టి యెంతమాత్రమును విరక్తిఁబొందఁజాలఁడు. ఓ యీ శ్వరా! రజోగుణకార్యము లయిన కామక్రోధాదులకును, తమోగుణకార్యము లయిన మోహాదులకును, నిలయమయిన రాక్షసకులమునఁబుట్టిన నే నెక్కడ? నీ దయ యెక్కడ? అయి నను, బ్రహ్మశిరంబునకుఁగాని, శంకరుని శిరంబునకుఁగాని, లక్ష్మిశి రంబునకుఁగాని లభింపని, నీహస్తకమలమును బ్రసాదసూచక ముగా, నాశిరంబునఁ జేర్చితివి. అలభ్యవస్తువయిన నీకరస్పర్శము వలనఁ గృతార్థుఁడనైతిని. బ్రహ్మాదులందు లేని ప్రసాదము నా యందుఁ జూపినంతమాత్రమున నీవు విషమబుద్ధివి కావు. ఓ దేవా! నీవు సమస్తప్రపంచమునకును హితుండవు. నీకుఁ గొం దఱు ప్రియులును, గొందఱప్రియులును లేరు. అందఱును సమా నులే? నీవిట్టివాఁడవయినను సేవించినసేవ కనురూప మగుఫల

ము నొసంగుచుందువు. అంతమాత్రమున నీకు వైషమ్యబుద్ధి లేదు. కల్పవృక్షము కొలిచినవారి కొలువునకుఁ దగువిధమున నిచ్చుటచే వైషమ్యము గలదగుచున్నదా? ఓ పరమేశ్వరా! నేనిప్పుడే నీయనుగ్రహమునకుఁ బాత్రుఁడనుగాలేను. తల్లిగర్భములో నున్నప్పుడె నారదుని ముఖమున నాకుఁ దత్త్వజ్ఞాన ముపదేశించి యనుగ్రహపాత్రునిఁజేసితివి. శబ్దాదివిషయసుఖములను గోరుచు సర్పసహితమయిన నూతివలె నున్నసంసారమునఁ బడుచున్న నన్ను రక్షించిన నీయనుగ్రహము వందనీయమైనదిగదా! ఇట్టి దయచూపిన నీదాస్యము నెట్లు విడువఁగలుగుదును? ఓయనంతా! నీభృత్యు లయినసనకాదుల వాక్యమును సత్యము గావించుటకును, "నాకంటె నీశ్వరుఁడు నీ కున్నచో నిన్నిప్పుడు రక్షించుఁగాక. ఇప్పుడె యీఖడ్గమున నీ శిరంబును ఖండింతు" నని నాతండ్రిపలికినవచనంబులను సత్యముచేయుటకునుఁదలంచి నాతండ్రిప్రాణము గొని నాప్రాణమును రక్షించితివి. ఇట్లుపలువిధముల ననుగ్రహముఁజూపిన నీదాస్యమును సర్వదా కోరుచుందును. ఓ పరమేశ్వరా! మంటికిఁ గారణావస్థయందు నామవిభాగములు గాని రూపవిభాగములు గాని లేవు. ఆమృత్పిండము కార్యావస్థయందు రూపవిభాగములను బొంది, మూఁకుడనియు గుండయనియు నామములను దాల్చుచున్నది. అది రూపభేదమును నామభేదమును బొందినను,గారణావస్థయం దున్నదానికి వే ఱయినదికాదు. అట్లే కారణావస్థయందు సూక్ష్మచిదచిత్తులు శరీరముగాఁ గలనీకు నామరూపవిభాగము లేదు. అట్టి నీవే కార్యావస్థయందు నామరూపములవిభాగింపఁదగిన స్థూలచిదచిత్తులు శరీరముగాఁ గలుగునట్లు పరిణమించుచు నామభేదమును

రూపభేదమును బొందుచున్నావు. అయినను దేవమనుష్యాది భేదము గలదియుఁ, జిదచిదాత్మకమయినదియు నగుప్రపంచము కంటె నీ వన్యుండవుగాక, సర్వావస్థలందును నొక్కఁడవై వఱలు చున్నావు. సృష్టికిఁ బూర్వమందును, సృష్టికాలమందును, సృష్ట్యంతమందును బ్రకాశించుచున్నాఁడవు. సత్త్వాదిగుణముల పరిణామ మగునీజగంబును సంకల్పరూపజ్ఞానంబున సృజించి యంతరాత్మరూపమున దానిలోఁ బ్రవేశించి, నీను శరీరభూతు లును, జిదచిదాత్మకులును నగు దేవాదిశరీరములచే నానాభేద ములను బొందినట్లు గానవచ్చుచుందువు. అంతియకాని వాస్తవ ముగా జగంబు ప్రకృతిపురుషశరీరుండ వయిననీకంటె నతిరిక్తము కాదుసుమా? మఱియుఁ జిదచిదాత్మక మయినజగం బంతయు ను నీవే! దానికంటె వేఱుకాని యీశ్వరుండవును నీవే! జీవునిఁ జూచి యీశ్వరుఁడనుకొనుట యజ్ఞానమూలమగు భ్రాంతికాని మఱియొకటికాదు. నాకును జగంబునకు భేదముండఁగా లేదను టెట్లని యనవలనుపడదు. పృథివీమయమైన బీజము వృక్షముగాఁ బరిణమించినను వృక్షము దానికంటె భిన్నము గానట్లె, నీవలన సృష్టిస్థితిలయములఁ జెందెడిలోకము నీకంటె వ్యతిరిక్తముకాదు. ఓ లోకనాథా! కానవచ్చు చున్నచరాచరప్రపంచమును నీ యం దుపసంహరించుకొని శయనించి యుపాధిరహిత మైన నిజ సుఖానుభవము గలవాఁడవై, వ్యాపారమును విడిచి, సంకల్ప రూపమయిన జ్ఞానమునుండి మఱలినవాఁడ వగుటం జేసి కన్నుల మూసియయినను నిద్దురఁజెందక వేఱొకయాధారము నపేక్షింపక, తురీయావస్థయందుండి ప్రకృతిగుణము లగుసత్త్వాదుల నంటవు. స్వకీయమగు కాలశక్తిచే క్షుభితము లయిన సత్త్వాదిగుణ

ములు గల ప్రకృతి శరీరముగాఁ గలవాఁడవై యోగనిద్రను జాలించి శేషశయనమునుండి లేచి నీవు మగుడ సృష్టి కున్ముఖుఁడ వయియుండఁగా మొదట నీయందుపసంహృతమై సూక్ష్మరూపమై యున్న ప్రపంచము నీ నాభినుండి కమలాకారమై యుద్భవించె ఆ నీనాభికమలమువలన బ్రహ్మ యుదయించి తనకుఁ గారణభూత మయిన పద్మముకంటె నితరమును గానక తనయందంతరాత్మవై వ్యాపించి యాపద్మమునకుఁ గారణమయిన నిన్నును వెలుపటఁ గనుఁగొనలేక నూఱుసంవత్సరములకాలము నీళ్లలో మునుఁగుచుఁ దేలుచు వెదకినను నీవు మొలకమొలచినపిమ్మట బీజము నట్లు గానరానై తివి. అనంతరము బ్రహ్మ మిక్కిలియచ్చెరువొంది మగిడివచ్చి పద్మము నాశ్రయించి గాఢతపంబుచేసినిర్మలచిత్తుఁడై భూమియందు సూక్ష్మరూపముతో నున్న గంధమునువలెఁ దన యాత్మయందే వ్యాపించియున్న నిన్ను దర్శింపఁగలిగె. ఇట్లు వేయువదనములును, బాదములును, శిరస్సులును, జేతులును, దొడలును, నాసికలును, జెవులును, నేత్రములును గలిగి దీప్త ములయిన యలంకారములను, నాయుధములను ధరించి యాశ్చ ర్యమును గల్గించుచు నిత్యుఁడవయి మహాపురుషుఁడవై యున్న నిన్నుఁగాంచి విరించి మిక్కిలి సంతసంబునొందె. ఇట్లు తీవ్ర తపమున నిన్నుఁగాంచిన బ్రహ్మకు హయగ్రీవరూపమునఁగా నవచ్చి సృష్టిక్రమమును దెలుపు వేదముల నొసంగితివి. నీవా రూపముతోనే రజస్తమోగుణప్రధానులయినమధుకైటభులను సంహరించితివి. నీ హయగ్రీవశరీరము కేవలమును సత్త్వ మయ మైనదని పండితులందురు. నీవిట్లు జగదుత్పత్తిని గావించి తివి. అనంతరమున నీవుచితకాలములందు శుద్ధసత్త్వమయము

లయిన రామకృష్ణాద్యవతారంబులను, మత్స్యాద్యవతారంబులను దాల్చి లోకవిరోధు లయినరావణాదిదుష్టులను జంపి, పరిపాలించు చుంటివి. మఱియు ధర్మములను స్థాపించుచుంటివి. ఇట్లు మూఁడుయుగంబులందును ప్రత్యక్షావతారముల చేతనే కార్యము నడపుదువుకాని కలియుగమున నట్లుచేయక గూఢవర్తనుఁడవయి దుష్టుల ఖండించి లోకమును గాచుచుందువు. ఓ దేవా! నామనస్సిప్పుడు విషయసుఖములకు వశ్యమై యవిలభింపక పోవుటచే విచారమగ్నమైయున్నది. ఇట్లుండ నీ తత్త్వము నెట్లు తెలిసికోఁగలుగుదును? కావున నో వైకుంఠా! పాపకృత్యములచే దుష్టమై, కామాదులందాసక్తమై, కావున నేదీనాతిదీనమై యున్న నామనము నీకథలందు మిక్కిలి యాసక్తి గల్గి యుండుఁగాక. ఓ యచ్యుతా! నాలుక మధురపదార్థములను గూర్చి న న్నాకర్షించుచున్నది. శిశ్నము సంభోగములవంక నాకర్షించుచున్నది. త్వగింద్రియము సుఖస్పర్శము గల్గించుపదార్థములవంకకు లాఁగుచున్నది. వీనులు మధురశబ్దములను గూర్చియు, ఘ్రాణము పరిమళవస్తువులను గూర్చియునాకర్షించుచున్నవి. అట్లె నేత్రములు, సుందరపదార్థముల నిమిత్తమును, బాణిపాదాదులు తమతమ పనులనిమిత్తమును లాగుకొనుచున్నవి. ఈ యింద్రియములు పెక్కురుభార్యలు గృహపతిని వలె నన్నుఁ దమతమవైపునకు లాగుకొనుచున్నవి. వానివశము గావించుకొన నాకు శక్తిలేదు. ఇట్లు నేనేమి నావారలేమి సంసారమనెడి వైతరణియందు స్వకీయములగు పుణ్యాపాపకర్మముల ప్రేరణచేఁబడి మాశత్రువుల యభివృద్ధిచే మేము భయమందుచు, మాయభివృద్ధిచే శత్రువులకు భయముగల్గించుచు,

మా స్వజనమందు మైత్రిని, శత్రువులందు వైరమును బూని మూఢుల మయినమమ్మీసంసారమునుండి వెలువరించి పరిపాలింపుమా ! ఓ లోకగురూ ! ఓ భగవంతా ! యీ ప్రపంచమును సంకల్పమాత్రముచేతనే సృజింపఁ, బాలింప, సంహరింప సమర్థుఁడ వయిన నీకు సంసారమునుండి, నన్నును నాజనమును రక్షించుటయేపాటి కష్టకార్యము.? ఓయార్తబంధూ! మేము కేవలము మూఢులము. అయినను నీసేవకులకు సేవకుల మై వర్తించుచున్నారము. కావున సంసారముచే నార్తుల మైనమమ్మును సంరక్షించుట యార్తబంధువ వైన నీకుఁ దగును. ఓపరమపురుషా ! నీపవిత్రచరిత్రములను సంతతమును గానముఁ జేయుచు దానివలనఁ బొడమునమృతమును ద్రావి మత్తుఁడనగుటచే నీ సంసారమునకు భయపడను. దుఃఖింపను. కాని నీకథాశ్రవణమునకు దూరులై కేవలమింద్రియసుఖంబులను గోరుచు వానికై కుటుంబభరమును వహించుచున్న యీమూఢుల నిమిత్తము మిక్కిలి దుఃఖించుచున్నాను. ఓదేవా ! మునీశ్వరులు పెక్కండ్రు విజనమగునరణ్యములంజేరి యితరపదార్థముల వేనిం గోరక తమకుమాత్రమే ముక్తినిసంపాదింపఁ బ్రయత్నింతురు. ప్రయత్నించి ముక్తులగుదురు; కాని నేనట్లు నా ముక్తికి మాత్రమే ప్రయత్నింపలేదు. సంసారరూపమునఁబడి దుఃఖించుచున్న నావారలను విడిచినే నొక్కఁడనెట్లు ముక్తినపేక్షింతును? దీనాతిదీను లయినవీరికి నీకంటె దిక్కులేదు. కావున నావారింగూడ సంసారమునుండి యుద్ధరింపుము. వారు కొంతకాలము కామ మనుభవించి పిమ్మట విరక్తులై ముక్తులగుదు రని తలంపనవకాశము లేదు. కామము దురదవలె దుస్సహమైనది. మోహ

వశమున సంప్రాప్తమయినచేతులందుండు దురదను దొలఁగించికొనఁ బరస్పరసంఘర్షణము చేయుటవలన మొదట సుఖమువలెఁ గానవచ్చును. కాని క్రమక్రమముగాఁ గోర్కెకొలఁది నది మఱింత హెచ్చి తుదకు దుస్సహదుఃఖమును సమకూర్చు. అట్లే గృహమేధికి మిథునాదికర్మములు మొదట సుఖకరములవలెఁ గన్పించును; గాని తరువాత మిక్కిలి దుఃఖములఁ గల్గించును. గృహస్థు లట్లు కాములై బహుదుఃఖములను బొందుచున్నను గామాసక్తి యొకమూల బాధించుటచే విరక్తి నొందఁజాలరు. అట్టివారు ముక్తులగుటయెట్లు ? కావునఁ బండితుఁడైనచో నీ యనుగ్రహమువలన జితేంద్రియుఁడై కామము సహింపవలెను. లేనిచో ముక్తుఁడగుట యసంభవము. మోక్షసాధనము లన్నిఁటి లోను జితేంద్రియత్వము మొదటిదిసుమా! మౌనము, వ్రతము, చదువు, కృచ్ఛ్రాదితపము, పాండిత్యము, వర్ణాశ్రమోచితధర్మములు చదివించుట, జపము, ధ్యానము, మొదలగు మోక్షోపాయములు. అజితేంద్రియున కట్లుకాక జీవనోపాయము లగుచున్నవి. ఇట్టి యింద్రియజయమెట్లు గల్గునని యందు రేని, యందులకై వేఱ ప్రయత్నింప నవసరములేదు. బీజాంకురములవలెఁ జిదచిత్తులు పరమేశ్వరుఁడవును గర్మరహితుఁడవు నయిన నీకు శరీరమై యున్నవనియు, నంతకంటె, వే ఱయిన పదార్థము లోకమున లేదనియు నిశ్చయించి, మథనాద్యుపాయములచే దారువులం దగ్నినివలెఁ జిదచిత్తులందున్న నిన్ను నుపాసనాత్మకమయిన యుపాయము నవలంబించి సాక్షాత్కారము చేసికొనుచున్నారు. ఇంతకుఁదప్ప నిన్ను సాక్షాత్కరింపఁజేసికొన వేఱొక సాధనము లేదు. ఓదేవా! వాయువు,

విప్పి, భూమి, గగనము, జలము, శబ్దాదితన్మాత్రలు, ప్రాణము లింద్రియములు, హృదయము, జ్ఞానోత్పత్తిని గల్గించుబుద్ధి, వెక్కేల? ప్రకృతి పరిణామాత్మకము లగునవియు, సత్త్వాది గుణరహితము లగునవియు, మనోవాక్కుల కవగతమగు పదార్థమంతయును, నీవేకాని నీకంటె నన్యము గానరాదు. సత్త్వాదిగుణములును, మహదాదులును, దేవతామనుష్యాదులును, మనస్సు మొదలగు సాధనములును, గర్మవశమున సంకుచిత జ్ఞాను లగుటంబట్టి తమ కంతరాత్మవై లోపల వెలయుచున్నను గనుంగొనలేరు. కాని నీస్వరూపమననమందు సమర్థులయిన మునులు సర్వము నీస్వరూపమే యని యోగసాధనమున విమర్శించి సాక్షాత్కరించుకొని శబ్దాదివిషయములనుండి స్వాయముగానే మఱలుదురు. ఇట్లు భక్తివలననే యింద్రియజయ మొనర్పవలెను గాని వేఱొక్క యుపాయము లేదు. ఆభక్తి యెట్లు లభించుననఁ జెప్పెద. ఓశ్రీహరీ! నీకు నమస్కరించుటయు, నిన్ను నుతించుటయు, నిన్నుఁ బూజించుటయు, నీపాదపద్మముల ధ్యానించుటయు, నీకుఁ బరిచర్యచేయుటయు, నీకథలను వినుటయు, నాఁబడు నాఱువిధము లగుసేవలచేతనే పరమహంసలకుఁ బ్రాప్యుఁడ వయిన నీయందు భక్తిని జనుఁడు సంపాదింపవచ్చును. దానిచే సమస్తము సమకూరు" నని యిట్లు భక్తుఁడయిన ప్రహ్లాదుఁడు భక్తితోఁ జేసిన గుణవర్ణనమును, విని హేయగుణరహితుఁ డయిన నరసింహుఁడు కోపమును విడిచి సంతుష్టుఁడై నమస్కరించిన ప్రహ్లాదుం గాంచి యిట్లనియె. "ఓవత్సా! ప్రహ్లాదా! నీకు భద్రమగుగాక! నేను నీకుఁ బ్రసన్నుండ నైతి. నేను మానవుల కోర్కులను బూరించువాఁ

డను. కావున నీకిష్టమగు వరంబువేఁడుమిచ్చెద. నన్ను సంతసింపఁజేయలేని మానవునకు నాసందర్శనము దుర్లభము. నన్ను సందర్శించినవాఁడు పూర్ణకాముఁడై యుండవలెనుగాని కోర్కులకై పరితపింపఁ దగదు. కావుననే జితేంద్రియులును, శ్రేయస్సు గోరువారును, వివేకవంతులును, నగు సాధువులు సర్వపురుషార్థముల నొసంగు నన్నును త్రికరణశుద్ధిగా భజించి సంతసింపఁజేయుదురు. ఓప్రహ్లాదా! కావున నన్నన్నివిధములచేతను సంతసింపఁజేసిన నీకు వలయువరంబు లిచ్చెద వేఁడు'' మని పలికెను. కాని ప్రయోజనాపేక్షలేక, భక్తియోగమునఁ బరమపురుషు నారాధించుప్రహ్లాదుఁడు విషయాసక్తుల మోహింపఁజేయు వరములచే మోహితుఁడు కాకుండెను. ఇది తొమ్మిదవయధ్యాయము.

---

## ప్రహ్లాదుఁడు వరములు గోరుట.

అనంతరమున బాలకుఁడయిన ప్రహ్లాదుఁ డావరములు తన భక్తియోగమున కంతరాయము గల్గించునని తలంచి మందహాసము చేయుచు హరి కిట్లనియె. 'ఓదేవా! నేను స్వభావముచేతనే కామములం దాసక్తుఁడనై యుంటి. అట్టి నన్నీవరములని యాశాపాశబద్ధునిం జేయకుము. నే నీసంసారానర్థములకు భీతిల్లి కామములకు విముఖుఁడనై నీసేవచే ముక్తుఁడను గాఁగోరి నిన్నాశ్రయించితిని. ఇట్లుండ "వరములు వేడుకొను" మని నా కాజ్ఞాపించితివి. నీభృత్యుఁడనైన నాకు నీయం దితరప్రయోజనము లేనిభక్తి గలదో లేదో తెలిసికొన నిశ్చయించి సర్వజ్ఞుఁడవైనను నాముఖముచేతనే నామనంబును బరీక్షించుటకే

యిట్లు చేసితివి. అట్లుకానిచో నిఖిలమునకును హిత ముపదేశించుచుఁ గరుణాకరుఁడ వయిన నీవు నీభక్తుని విడిపింపఁ దరము కాని జననమరణాదిరూప మయినసంసారబంధముచే బంధింపఁ జూతువా? సంసారరూపమయిన నరకకూపమునంబడి స్వస్వరూపమును మఱచియున్న మావంటిభక్తుల నుద్ధరింప సమర్థుండు నీకంటె వేఱొకండు లేఁడు. ఇట్లుండ నీవు భక్తుల నుద్ధరించుటకు మాఱుగా సంసారకూపమునఁ ద్రోయుదువా? ఓ దేవా! నీయందు నేను భక్తి నెఱపుచున్నాను. అందులకుఁ బ్రతిఫలముగా నీవలన నేమియు నపేక్షింపను. అట్లైకానిచో వస్తువులనిచ్చి ప్రతిఫలముగా మఱికొన్నివస్తువులను బుచ్చుకొను వర్తకునకును, నాకును గల యంతరమేమి? చిరకాలము కొలిచికొలిచి ప్రభువువలన వరములను బడసినవాఁడు భృత్యుఁడన నర్హుండు గాఁడు. భృత్యునివలన నేదేని బ్రయోజనముబొంది కోర్కులనొసంగువాఁడు ప్రభుశబ్దమున కర్హుండుకాఁడు. కావున నేను బ్రయోజనాంతర మపేక్షింపకుండ నీసేవనొనర్చు భక్తుఁడను. నీవు ప్రయోజన మపేక్షింపని ప్రభువవు. ఇట్టి మన మిప్పట్టునఁ బరస్పరమును బ్రయోజనము నపేక్షించితిమేని లోకమునఁగల సామాన్యరాజభృత్యులకును మనకును గల తారతమ్య మేమి? ఓ యీశ్వరా! ఓ వరదా ! నీవు నాకు వరము లీఁదలంచితివేని నామనంబున నెప్పుడును గోర్కు లుద్భవింపకుండునట్లు వరమొసంగుము. మనంబునఁ గోర్కు లుప్పతిల్లినఁజో గొన్నిజన్మములలో నింద్రియములు,మనస్సు, ప్రాణములు ఆత్మ, ధర్మము ధైర్యము, బుద్ధి, సిగ్గు, జ్ఞానసంపద, తేజస్సు, స్మృతి, సత్యము మొదలగునవి తప్పక నశించును. తనమనంబునఁగలకోర్కులను

విడిచిపెట్టెడు మానవుఁడు గుణాష్టకరూపమయినముక్తిని బొందఁ సమర్థుఁ డగుచున్నాఁడు. ఓపరమేశ్వరా! జ్ఞానాది షడ్గుణములతో నొప్పుచు, నాశ్రితార్తిహరుఁడ వై యద్భుతమగు నరసింహరూపమును దాల్చి, స్వరూప స్వభావములచే నిరతిశయుఁడవయిన నీకు వందనంబు' లని ప్రార్థించిన విని నరసింహుం డిట్లనియె. 'ఓవత్సా! నీవంటి యేకాంతభక్తులు, నన్ను సేవించుచు, నొకప్పుడైన నిహపరలోకములకు సంబంధించిన వరములు కోరరు. అయినప్పటికిని నీకు వరముల నిచ్చువాఁడ. నీ వీలోకమున రాక్షసుల కధిపతివై యొక మన్వంతరకాలము సుఖముల ననుభవింపుము. మఱియు నాకుఁ బ్రేమాస్పదుఁడ వయిననీ వెప్పుడు నాకథామృతమును బానముచేయుచు సర్వభూతములకు నంతరాత్మనై యజ్ఞాధిపతినై యున్ననన్ను భక్తియోగముచే సర్వదా యారాధించుచుండుము. పుణ్యపాపరూపమయిన కర్మముల నెంతమాత్రమును జేయకుము. నేర్పుచే ననుభవించి పుణ్యపాపములను, గాలబలముచే శరీరమును, వదలి సురలోకమునఁగూడ నిర్మలకీర్తిని విస్తరింపఁజేసి సంసారబంధముక్తుఁడవయిన నన్నుఁ జెందుదువు. ఓప్రహ్లాదా! ఎవఁడు నిన్నును, నన్నును స్మరించుచు, నీవొనర్చిన స్తవరాజముచే నన్ను నుతించునో, వాఁడు ప్రారబ్ధావసానకాలమునందుఁ, గర్మబంధముల వదలి ముక్తుఁడగును." అనిపల్కిన భగవంతునిఁగూర్చి ప్రహ్లాదుఁడు "ఓమహేశ్వరా! నాతండ్రి నీప్రభావమెఱుంగక సర్వలోకములకును హితమొనర్చు నిన్నును, భ్రాతృహంతయని నిందించుచు, దురభిమానవంతుఁడై క్రోధపూరితమయిన యంతఃకరణముతో నొప్పుచు నీభక్తుఁడనగు నాకు ద్రోహమొనర్చి

మహాపాతకము సంపాదించెను. నాతండ్రి యీపాపమునుండి ముక్తుఁడగునట్లు వర మొసంగుము. నీకడకంటి చూపునకుఁ బాత్రుఁడగుటచేతనే నాతండ్రి పాపరహితుఁడగును. అయినను నే మఱియొకపరి ప్రార్థించుచున్నాను. దయయుంచి యట్లొనర్పు"మని వేఁడ భగవంతుఁ డతని కిట్లనియె 'ఓవత్సా! సాధువర్తనుఁడ వైననీవు కులపావనుండవయి దితివంశమునఁ బుట్టినకారణమున నిరువదియొక్కతరమువారితోఁగూడ నీతండ్రి పవిత్రుఁ డగును. పరోపకారశీలురును, జితేంద్రియులును, సర్వభూతములను సమదృష్టితోఁ జూచువారును నగు నాభక్తు లెందెందుందురో, యాయాదేశములందుఁగలమ్లేచ్ఛులుగూడఁ బవిత్రు లగుదురు. ఓవత్సా! లోకమునఁగల నాభక్తులందఱును భక్తశ్రేష్ఠుఁడ వయిననిన్ననుసరించి వర్తింతురు. నీవు సర్వభక్తులకును దృష్టాంతమ వయి వర్తింపుము. తక్కిన భక్తులందఱును నీవలెనే సర్వభూతములందును సములై హింసాకృత్యముల నొనర్పక నాయందలి భక్తియోగముచే నిస్పృహులై వర్తింతురుగాక. ఓ బాలకా! అన్నివిధములచేతను బవిత్రుఁడయిన నీతండ్రి కిఁకఁ బ్రేతకార్యము లాచరింపుము. నీజనకుడు నాశరీరసంపర్కము సంభవించుటంజేసి పుణ్యలోకములఁ బడయును. నీతండ్రి సంపాదించి పాలించిన యింద్రలోకమును విడిచి కులక్రమాగత మైనరాజ్యము నధిష్ఠించి దానవాధిపత్యము వహింపుము. నాయందు సర్వదా నీమనంబును నిలిపి బ్రహ్మవాదుల యనుమతి చొప్పున నన్నారాధింపుము". అని భగవంతుఁ డాజ్ఞాపింపఁ బ్రహ్లాదుండు తండ్రికిఁ బ్రేతకృత్యము లాచరించి ద్విజు లుచ్చరించు మంత్రోదకములచేఁ బట్టాభిషిక్తుఁడయ్యె.

ఓ రాజా! అనంతరము బ్రహ్మ నరసింహుని కోపము తగ్గినదని తెలిసికొని దేవాదిపరివృతుఁడై సమీపించి చేతులుజోడించి పవిత్రవాక్కులచే నుతించి యిట్లనియె. 'ఓ దేవదేవా! ఓజగదీశా! పాపాత్ముఁడై లోకములకు సంతాపము గలిగించు నీరక్కసుఁడు మా యదృష్టవశమున నీచేఁ జచ్చె. ఈదురాత్ముఁడు ఘోరతపంబొనర్చి,నాచే సృజింపఁబడిన భూతములచేఁ జావకుండునట్లు వరముగాంచెను. వీఁడు గర్వోద్ధతుఁడై శాస్త్రీయధర్మముల నెల్ల నశింపఁజేసెను. అట్టి దుష్టుఁడు నీచేఁగూలుట మా యదృష్టము గాదే. ఈరక్కసుని కుమారుఁడగు నీప్రహ్లాదుం డర్భకుఁడయ్యు మహాభాగవతుఁడై సత్ప్రవర్తనుఁడై వఱలుచున్నాఁడు. వాని మృత్యువువలనఁ దప్పించినందుల కమితానంద మొందుచుంటిని. ఓపరమేశా ! ఈనీ నరసింహరూపమును ధ్యానముచేయు పురుషుఁడు నిర్భయుఁడయి చంపఁదలఁచిన మృత్యువునుండి సైతము విడువఁబడునుగదా!'అని పల్కిన బ్రహ్మంగాంచి హరియిట్లనియె. 'ఓసరసిజాసనా! దైత్యులు స్వభావముచేతనే క్రూరులు.నీ విఁక మీఁద నాదైత్యుల కిట్టివరంబుల నొసంగకుము.అది పాములకుఁ బాలుపోసి పెంచినట్లు మహానర్థకారి యగు'నని,బ్రహ్మను మందలించి యతనివలనఁ బూజలుగొని సర్వభూతములును జూచుచుండఁగనచ్చటనే యంతర్ధానము చెందెను.పిమ్మటఁ బ్రహ్లాదుండు భగవదంశసంభూతు లయినబ్రహ్మకును, రుద్రునకును, బ్రజాపతులకును దేవతలకును నమస్కరించి పూజించె. బ్రహ్మాదిసురలతనిపూజల స్వీకరించి మునులతోఁగూడ దైత్యాధిపతినిఁగా నొనర్చి యతని గుణగణములను వర్ణించుచుఁ దమతమనిలయంబుల కరిగిరి. ఓధర్మరాజా! విష్ణుపార్షదు లయిన జయవిజయు

లిద్ద్వురును దితికి హిరణ్యాక్షహిరణ్యకశిపులై యుదయించి తమ హృదయములం దున్న భగవంతునితో ద్వేషించి, వరాహనరసింహావతారంబుల నీగతిఁ జెల్లిరి. వారే మగుడ రావణకుంభకర్ణులై పుట్టి దశరథరాముని సాయకపంక్తులచేఁ జీల్పఁబడి తమమనస్సు నతనియందే యుంచి, దేహంబులుత్యజించిరి. వారిరువు రేశిశుపాలదంతవక్త్రులై యుద్భవించి కృష్ణునితో ద్వేషముపూని, యతనిచేఁ జంపఁబడి మనము చూచుచుండఁగనే ముక్తిఁజెందిరి. వారిరువు రే కాదు. కృష్ణునియందు బద్ధవైరము గలరాజు లందఱును సంతత మతనినే స్మరించుచు, భ్రమరకీటకన్యాయమునఁ దత్సమానరూపమును జెందిరి. ఓరాజా! అసాధారణ మయినభక్తిచే సాధువులు భగత్సామ్యమును బొందినట్లుగానే, శిశుపాలాది రాజులుగూడ సంరంభపూర్వక మగుచింతచే హరిసామ్యమును బొందిరి. ఓమహీపాలకా! విద్వేషు లగువా రెట్లు హరిసామ్యము నొందిరో చెప్పుమని యడిగిన నీప్రశ్నమున కుత్తరమిచ్చితిని. ఏకథయందు బ్రహ్మకులమునకు రక్షకుఁడును, సర్వాంతరాత్ముఁడును నగుకృష్ణుని యవతారమును, నాదిదైత్యుఁ డయినహిరణ్యకశిపుని చావును వర్ణింపఁబడెనో, దేనియందుఁ బరమభాగవతుఁడయిన ప్రహ్లాదుని చరిత్రమును, భక్తియు, జ్ఞానంబును, వైరాగ్యంబును, హరిమాహాత్మ్యంబును జక్కఁగా వర్ణితములయ్యెనో, దేనియందు సృష్టిస్థితిలయములకుఁ గారణుఁడయిన పరమేశ్వరుని యద్భుతచర్యలును, గాలవశమున దేవాసురుల స్థానములు వ్యత్యస్తము లగుటయు, భగవత్ప్రాప్తికి సాధనమయిన ధర్మంబును జెప్పఁబడినవో, యట్టి ప్రహ్లాదచరిత్రమును వర్ణించి నీకుఁ జెప్పితిని. భగవంతుని పరాక్రమాది గుణములచే

విస్తృతమైన యీపుణ్యకథను శ్రద్ధతోఁ గీర్తించువాఁడు కర్మ పాశములనుండి విడువఁబడుచున్నాఁడు. మఱియు నాదిపురుషుఁ డయిన పరమేశ్వరుఁడు నరసింహావతారము నెత్తుటయును, దితిజ నాయకుఁడయిన హిరణ్యకశిపునివధయుఁబరమభాగవతుఁడయిన ప్రహ్లాదుని ప్రభావమును,భక్తితోవిన్నపురుషుఁడు భయరహితుఁ డై వైకుంఠలోకమును బొందును. ఓధర్మరాజా! మీభాగ్యము నేమని నుతింతును? ఏ మీగృహములందు మాయామానుష చిహ్నములను దాల్చిన శ్రీకృష్ణరూపము వర్తించుచున్నదన్న కారణమున లోకములను బవిత్రింపఁజేయు మునీంద్రులు తఱు చుగా వచ్చుచున్నారో,యట్టిమీభాగ్యము సర్వోత్కృష్టమైనది కదా! మునీశ్వరులకు లభ్యుఁడయిన శ్రీకృష్ణపరబ్రహ్మము మీకు మేనబావయై,ప్రియుఁడై, స్నేహితుఁడై, యంతరాత్మయై, పూజ నీయుఁడై, సేవకుఁడై, హితోపదేశకుఁడై వర్తించుచుండె.అట్టి మీభాగ్యమిట్టిదని యెవ్వరు వర్ణింపఁగలరు?వాక్కులకును,మన స్సునకును గోచరుఁడు కాకపోవుటవలన నెవనిరూపమును బ్రహ్మ రుద్రాదులయినను దెలిసికొనఁజాలరో, ఎవఁడు శుభాశ్రయ మగు శీలముచేతను భక్తిచేతను,నింద్రియజయముచేతను,నారాధి తుఁడగునో,భక్తులకుఁ బతియైన యాపరమేశ్వరుఁడునాకుఁ బ్రస న్నుఁడగుఁగాక. ఓధర్మరాజా!జ్ఞానాది శక్తులకు నిలయుఁడయిన పరమేశ్వరుఁడు పూర్వకాలమున ననంతమాయలు గలమయుని వలన శంకరునికిఁ గీర్తివచ్చునట్లు చేసెఁజుమా!ఆలోచింప రుద్రా దులకుఁ గీర్త్యాదులనొసంగుపరబ్రహ్మము నెవఁడువర్ణింపఁగల్గునని చెప్ప విని ధర్మరాజు నారదునిఁగాంచి "మునీంద్రా!మయుఁడను వాఁ డెవఁడు? అతనివలన శంకరునికిఁ గీర్తియెట్లు గల్గినది? ఈశ్రీ

కృష్ణుఁడెట్లుశంకరునకుఁగీర్తినివర్ధించె? ఆవృత్తాంతము చెప్పు' మని యడుగఁగా నారదుండిట్లనియె, 'ఓయుధిష్ఠిరా! రాక్షసులకుమ యుఁడను శిల్పిగలఁడు. వాఁడు మాయావి. పూర్వము రక్కసులు దేవతలచే నిర్జితులై మాయల కాటపట్టయిన మయుని శరణుసొచ్చిరి. అంత మయుఁడు తనబుద్ధిచాతుర్యముచే బంగారుతోను, వెండితోను, నినుముతోను మూఁడుపురముల నిర్మించి యారాక్షసుల కిచ్చెను. ఆత్రిపురములు సమస్తపరికరములతో నిండియుండెను. అవి సామాన్యులకు గోచరములుగావు. అవి యిట్లుపోవుచున్నవనికాని యిచ్చటికివచ్చుచున్నవనికాని తెలియఁ దరముగాదు. అవి విమానములవలె దేశాంతరగమనములకు సమర్థములయినవి. దైత్యనాయకులాపురములందుండి దేవతలకుఁ గానరాక పూర్వవైరమును స్మరించుకొని లోకపాలురతోఁ గూడ ముల్లోకములను నశింపఁజేయఁదొడఁగిరి. అంత లోకపాలకులతోఁగూడ జనులు రుద్రుని సమీపించి నమస్కరించి "ఓ మహాదేవా! కొందఱు రక్కసులు త్రిపురముల నాలయముగాఁ గైకొని ముల్లోకములను నశింపఁజేయుచున్నారు. నీసేవకులమగు మమ్ము నారాక్షసులబారినుండి తప్పించి రక్షింపుము" అని ప్రార్థించిరి. రుద్రుండు వారిప్రార్థన మాలకించి "ఓసురలారా ! యాదైత్యుల మదంబడంచెదను. మీరెంతమాత్రమునుభయ మందకుఁ" డని పలికి వింటియం దమోఘబాణము నొకదానిఁ గూర్చి పురములపైఁ బ్రయోగించె. అంతట నా బాణములన్ని వర్ణములై యాకాశమార్గమునుండి నిర్గమించి యాపురంబులు గానరాకుండ నట్లావరించి లోపలికిఁ బ్రవేశించి యాదైత్యుల బాధించి నిర్జీవులనుగావించె. సమర్థుఁడయినమయుఁడట్లుచచ్చిన

రక్కసులను గొనివచ్చి యమృతమయమగు కూపమునఁ బడవైచెను. ఆదైత్యులు సిద్ధామృతరసముచే మరల జీవించి వజ్రమువలె దృఢమగుశరీరముగలవారై మహాబలసంపన్నులై మేఘచ్ఛేదమువలన వెలువడిన విద్యుద్దీపమగునగ్నివలెఁ బ్రకాశించిరి. అట్టి రక్కసులను బొడగాంచి శంకరుఁడు తనసంకల్పము విఫలమైనందులకు దుఃఖించి, నిరుత్సాహుఁడై యుండగా భగవంతుఁడగువిష్ణు వతనికిఁ బ్రసన్నుఁడై సిద్ధరసము నశింపఁ జేయు నొకయుపాయమాలోచించి తాను ధేనువై బ్రహ్మనువత్సనుగాఁ జేసి త్రిపురమును బ్రవేశించిమధ్యాహ్నసమయంబునఁగూపమును సమీపించి యందలి సిద్ధరసమును బూర్తిగాఁద్రావెను. ఆధేనువు సిద్ధరసమును ద్రావుచుండుట చూచియు, భగవన్మాయామోహితు లయినకారణమున దానవులు వారింపఁదలంపరైరి. మయుఁ డాకృత్యమును దెలిసికొని యచ్చటికివచ్చిశోకార్తులైన రసపాలకు లగునాదైత్యులంగాంచి విచారరహితుఁడై మందహాసము చేయుచు నిట్లనియె. 'ఓదైత్యులారా! దైవగతి యచింత్యమైనది. తనకుఁగాని యితరులకుఁగానిదైవవశమునసుఃఖమైననుదుఃఖమైనను సంప్రాప్తించును. వానిఁదప్పింప దేవుఁడుగాని, రాక్షసుఁడుగాని మనుష్యుఁడుగాని సమర్థుఁడు కానేరఁడు. ఎట్టివాఁడైన ననుభవించి తీఱవలె. నేనెంతమీకుఁదోడ్పడుచున్నను దైవము ప్రతికూలముగానున్నందునఁ గార్యముచెడెను. దైవప్రతికూలురయిన మీకిఁక సుఖ మబ్బుటయెట్లు'' అని పలికి యథేచ్ఛంజనియె. అనంతరము శ్రీకృష్ణుఁడు ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, వృద్ధి, తపము, విద్య మొదలగు స్వకీయశక్తులచేత రథమును, సూతుని, ధ్వజమును, గుఱ్ఱములను, ధనువును, గవచమును

శరములను మఱికొన్ని యుద్ధసాధనములను నిర్మించి శంకరున కొసంగెను. అంతట శంకరుఁడు భగవచ్ఛక్తిరూప మయినరథ మునెక్కి కవచమునుదాల్చి ధనుర్బాణముల స్వీకరించి శ్రీకృష్ణ శక్తిసముపేతుఁడై వింటబాణముసంధించియభిజిత్తనెడిముహూర్తమునందుఁ ద్రిపురంబుపైఁ బ్రయోగించి దహించెను. ఆసమయమున దేవదుందుభులు మ్రోసెను. దేవర్షులును, పితృదేవతలును, సిద్ధులును, దేవేంద్రాదులును, "జయజయ"యని పలుకుచు శివునిపైఁబుష్పవర్షములు గురియించిరి. అచ్చరలు సంతుష్టచిత్తలై నాట్యముచేసిరి. గంధర్వులు పాడిరి. ఇట్లు శివుఁడు పురములనుదహించి బ్రహ్మాదులు భక్తియుతులై నుతించునుతుల నాలకించుచు నిజనివాస మగు కైలాసమున కేఁగెను. ఓధర్మరాజా! తన సంకల్పముచేతను నరలోకమున విడంబించుచు, లోకమునకు హితము గూర్చుచునున్న శ్రీకృష్ణుని యద్భుతచేష్టలిట్టివెన్నియో గలవు. అవియన్నియు లోకములఁ బవిత్రీకరించునవియె. వానిని మావంటి మునులందఱును సర్వదా గానము చేయుచుందురు. వానిని బూర్తిగా వివరించి వర్ణింప నెవ్వరికిని శక్తి చాలదు. కొంచెముమాత్రమే వర్ణింపఁగలుగుదుము. నీ వేదయిన నడుగఁదలఁచిన యెడల నడుగుము. శక్తికొలఁది వర్ణించి చెప్పెదను. అనిపలికినవిని ధర్మరాజు సాధుజనపూజితుఁడయిన ప్రహ్లాదుని చరిత్రము విన్నందుల కధికముగా సంతసించి పూజ్యతములలో నగ్రగణ్యుఁడయినారదునిఁ గాంచి యిట్లనియె. ఇది పదవయధ్యాయము.

---

నారదుఁడు సనాతనధర్మముల నుపదేశించుట.

"ఓనారదమునీంద్రా! బ్రాహ్మణాదివర్ణములయు, బ్రహ్మచర్యాదు లగునాశ్రమములయు ధర్మములు భక్తియోగమును బుట్టించి పరమపురుషుని సాక్షాత్కరింపఁ జేయును. అవి యనాదులై వచ్చుచున్నవి. వానిని దెలియుట యెల్లరకును నావశ్యకము. ఆధర్మముల వినఁ గుతూహలినై యున్నాను. దయయుంచి వివరింపుమా. మఱియు నీవు కేవలము బ్రహ్మకుమారుఁడవు. కుమారులందఱిలోను నీవే యతనికిఁ బ్రియతముఁడవు; కావున బ్రహ్మ నీకుఁ బెక్కులు ధర్మరహస్యంబు లుపదేశించియుండును. నీకుఁ దెలిసినన్ని ధర్మరహస్యంబు లొరులకుఁ దెలియవనుట యతిశయోక్తి గాదు. ఇంతియకాక తపస్సుచేతను, సమాధిచేతను, నీవు నారాయణు నుపాసించినవాఁడవు. అట్టి మీవంటివారి కెల్ల ధర్మరహస్యములును దెలియు. వానినేర్చి చిరకాల మగుటచే మఱచితినని యందువేని, భక్తి కంగముగా వర్ణాశ్రమధర్మములను సంతతమును నడపుమీకు వానియందు విస్మృతికలుగుట యెట్లు? అది యసంభవము. కరుణాకరులై పరోపకారశీలురై శాంతాత్ములై యుండు మీవంటివారు, మావంటి గృహస్థుల కోర్కులఁ దీర్చుట సముచితముగదా!" యని యిట్లు ప్రార్థించుచున్న ధర్మరాజుం గాంచి నారదుండు కర్మరహితుఁడును, లోకధర్మములకు హేతుభూతుఁడును నగునారాయణునికి నమస్కరించియిట్లనియె. "ఓ యుధిష్ఠిరా! నారాయణుఁడు నాకుపదేశించినసనాతనధర్మముల వివరించెద. సావధానులరై యాలకింపుఁడు. నారాయణుఁడు తన కంశభూతుఁడయిన నరునితోఁగూడ దక్షకుమారికయగు మూర్తియందు ధర్మునివలన నుదయమంది లోకముల క్షేమము

నిమిత్తము బదరికావనమం దిప్పటికిని వర్తించుచున్నాఁడు. ఆ నారాయణుఁడు సకలవేదస్వరూపుఁడు. కావుననే వేదప్రవర్తితములగు ధర్మములన్నింటికి నతండే ప్రధానుఁడు. అట్లె వేదవిదులొనర్చిన స్మృతులుగూడ ధర్మములకుఁ బ్రమాపకములగుచున్నవి. ఆనారాయణుండు చెప్పినవియు స్మృతులవలనఁ దెలియఁబడునవియు నగుధర్మములను జెప్పెదను. ఆ సనాతనధర్మముల నాచరించినవారికి భగవంతుఁడు ప్రసన్నుండగుట నిక్కము. మునుపా! సత్యము, దయ, శౌచము, తపస్సు, తితిక్ష, వివేకము, శమము, బాహ్యేంద్రియజయము, పరుల హింసింపకుండుట, బ్రహ్మచర్యము, త్యాగము, జపము, ఋజుత్వము, లభించిన దానివలననే సంతసించుట, మహాత్ములసేవించుట, ప్రవృత్తికర్మముల నొనర్పకుండుట, నిష్ఫలమగు చేష్టల నవలంబింపకుండుట, మితముగా సంభాషించుట, యాత్మతత్త్వమును బరిశీలించుట, భూతములకుయథాయోగ్యముగా నన్నాదులనుబంచియిచ్చుట, సమస్తభూతములను దన్నుఁగాఁ జూచుకొనుట, నరులందఱియందును దేవతాబుద్ధినుంచుట, పరమేశ్వరుని గుణగణనమును వినుట, యతని నామములను గీర్తించుట, యతని విభూతులను స్మరించుట,యతనికి నమస్కరించుట,యతనినిసేవించుట,యతనిదాస్యమొనర్చుట, యతనియందు స్నేహమును జూపుట, యతనికిఁ దన్ను సమర్పించుకొనుట. మొదలగునవి యెల్లవారికి నాచరణీయములు. ఇవియె పరమధర్మములు. ముప్పదిలక్షణములుగల యీధర్మమువలననే పరమాత్మ సంతసించును. బ్రాహ్మణక్షత్త్రియ వైశ్యులు ద్విజులని చెప్పఁబడుదురు. ఆమూఁడుజాతులవారికిని గర్భాదానాదులగు పదునాఱుసంస్కారము లవిచ్ఛి

న్నములై ప్రవర్తించును. పదునాలుసంస్కారములు గలవారే ద్విజులని బ్రహ్మ వక్కాణించెను. శూద్రులకు వివాహరూపసంస్కారముమాత్రమే గలుగుటంజేసి ద్విజత్వములేదు. జన్మముచేతను, కర్మములచేతను, బరిశుద్ధులగు ద్విజులకు, యాగములు అధ్యయనము, దానము, మొదలగునవి హితములైనవి. మఱియుఁ దమతమ యాశ్రమాదులకు నుచితములగు కర్మములుగూడ విహితము లయినవి. అందు బ్రాహ్మణునకు యాగ మొనర్చుటయు, యాగములఁ జేయించుటయుఁ, జదువుటయుఁ, జదివించుటయుఁ,బరుల కొసంగుటయుఁ, బరులనుండి స్వీకరించుటయు, నాఁబడు నాలుధర్మములు గలవు. క్షత్త్రియునకుఁ బ్రతిగ్రహముదక్కఁ దక్కిన యైదుధర్మములును గలవు. అయినను యాజనము, నధ్యాపనమును, బ్రతిగ్రహమును బ్రాహ్మణునకు జీవనోపాయములగుటంజేసి క్షత్త్రియుఁ డందులకుఁగడఁగరాదు. అట్లయినరాజులకు జీవనోపాయములెవ్వియని యందు రేనిఁజెప్పెదవినుఁడు.క్షత్త్రియులలోఁబ్రజాపరిపాలనాధికారము గలవారు, బ్రాహ్మణేతరులనుండి పన్నులను స్వీకరించి జీవింపవలయును. అదియే వారికి జీవికోపాయము. వైశ్యుఁడెల్లప్పుడును బ్రాహ్మణకులములననుసరించుచు,వ్యవసాయము,వర్తకము మొదలగువానివలన జీవింపఁదగు. శూద్రుఁడు పై మూఁడు జాతులవారిని గొలుచుచు వారలొసంగు వస్తుజాతముచే జీవింపవలె. ఓధర్మరాజా! ఇట్లు నాల్గుజాతులవారికిని జీవికోపాయములువిహితములయినవి. ఒకవేళ నవిలంభింపనిచో వృత్త్యంతరములు కల్పింపఁబడినవి. అందు విప్రునకుఁ గృషి గోరక్షణాదికమును, వినయపూర్వకముగా యాచించుకొనుటయు, దేశములఁ ద్రిమ్మరుచు యాజ్ఞా

పూర్వకముగా నడుగుకొనుటయు, నుంఛవృత్తియు ముఖ్యములయినవి. వానిలో నుత్తరోత్తరముగా నొకదానికంటె నొకటి శ్రేష్ఠమయినది.తమకు విహితములగు వృత్తులచే జీవనము సలుపనవకాశముగల్గినప్పుడు వానినే యాచరింపవలయును. అట్టి యవకాశము లేనప్పుడు రాజులుతప్పఁ దక్కినవారందఱు నేవృత్తినవలంబించినను దోషములేదు. అట్టి సమయమందు విహితధర్మముల నతిక్రమించుట ప్రత్యవాయజనకముకాదు. క్షత్త్రియునకుఁ బ్రజాపాలనాధికారవృత్తియు, బ్రాహ్మణునకు యాజనాదికవృత్తియు,లభింపనప్పుడు వారికి వేఱొక కొన్నివృత్తులు నియమింపఁబడినవి. అవి ఋతమనియు, నమృతమనియు, మృతమనియు, ప్రమృతమనియు, సత్యానృతమనియు, శ్వవృత్తియనియుఁ బిలువఁబడు.అందు నచ్చటచ్చటఁ బడిన ధాన్యాదుల నేరితెచ్చుకొనుటకు ఋతమనియు, యాచింపకుండ లభ్యమైనదానికి నమృతమనియు, నిత్యయాజ్ఞవలనఁ బ్రాప్త మగుదానికి మృతమనియు, కృషిచేగల్గుదానికిఁ బ్రమృతమనియు,వాణిజ్యమునకు సత్యానృతమనియు, నీచసేవనమునకు శ్వవృత్తియనియుఁ బెద్దలందురు. ఆవృత్తు లన్నింటిలోను నీచసేవన మధమాధమమైనది. బ్రాహ్మణుఁడు సర్వవేదమయుఁ డగుటవలనను, క్షత్త్రియుఁడు సర్వదేవమయుఁ డగుటవలనను, నిందనీయమయిన నీచసేవను సర్వదా విసర్జింపవలయును. ఈనాలుగు వర్ణములవారికిని బ్రత్యేకముగా గొన్నికొన్ని లక్షణములు గలవు. అందు, శమము, దమము, తపము, శౌచము, సంతోషము, క్షమయు, నార్జవము, జ్ఞానము, దయ, సత్యము,భగవదాసక్తియు బ్రాహ్మణచిహ్నములు. శౌర్యము, వీర్యము, ధైర్యము, స్నేహము

త్యాగము, దేహధర్మముల నిరసించుట, సహనము, బ్రహ్మకులము ననుసరించుట, ప్రసాదము, ప్రజాపరిపాలనము, క్షత్రియ చిహ్నములు. దేవతలను, గురువులను, జ్ఞానవృద్ధులను, గోవులను భక్తితోఁ జూచుటయు, ధర్మార్థకామములచేఁ బరితుష్టిఁ జెందుటయుఁ, బరలోకము గల దనుబుద్ధి గల్గుటయు, నిత్యము ధనముసంపాదింపఁ బ్రయత్నించుటయు దానంగల నేర్పరితనమును వైశ్యుని లక్షణములు. పూర్వవర్ణములయెడ వినయముఁ జూపుటయు, స్నానాదులచేఁ బరిశుద్ధుఁడై యుండుటయుఁ, దనస్వామిని నిష్కపటభావమునఁ గొల్చుటయు, నమస్కారముచేత నే క్రతువుల నొనర్చుటయు, దొంగగా నుండకుండుటయు, సత్యము చెప్పుటయు, గోవిప్రులను రక్షించుటయు, శూద్రుని చిహ్నములు. పతినే దైవముగా నెంచుకొనుటయు, భర్తకుఁ బరిచర్యాదుల నొనర్చుటయు, భర్తబంధువులందు స్నేహ మవలంబించుటయు, భర్తకై నియమము పూనుటయుఁ బతివ్రతకు ముఖ్యలక్షణములు. మఱియు సాధ్వీమణి గృహమును జక్కఁగాఁ దుడిచి సుధాదులను బూసి, ముగ్గులచే నలంకరించి సర్వదా గృహమందే నివసించుచుఁ, బాత్రములను, వస్త్రములను, భూషణములను శుభ్రపఱిచి, తాను నలంకరించుకొని, భర్త యభిలషించు నానావిధములగు కోర్కులను దీర్చుచు, వినయముచేతను, దమముచేతను, సత్యములయిన ప్రియవచనములచేతను, ప్రేమముచేతను, బతిని సంతసింపఁజేయుచు నుండుటయేకాక తానును సంతుష్టయై భోగములం దధికాసక్తురాలుకాక, సమురార్తై ధర్మమును గుర్తెఱిఁగి, ప్రియవచనయై జాగరూకతతో వర్తించుచు, నిర్మలచిత్తముతోఁ బ్రవర్తించుచు, భర్తయందను

రక్తయై పాపకృత్యముల నొనర్పక భర్తను సేవింపవలెను.ఏసాధ్వి యిట్లు స్వధర్మమతియై శ్రీహరిని లక్ష్మివలెఁ దనపతిని బరదైవతముగా నెంచుకొని సేవించునో, యామె భర్తతోఁగూడ ముక్తిఁజెందును.సంకరజాతులవారు కులక్రమాగతమైన వృత్తులనే చేకొనవలయును. కాని యొకవేళఁ జౌర్యమును బాపకృత్యములును గులవృత్తులయినను దప్పక విసర్జింపవలయు. ఓధర్మరాజా! ప్రతియుగమునందుఁ బ్రతిజాతివారికిని దఱుచుగా స్వభావసిద్ధమగు ధర్మమే విహితమగుచుండు. ఆధర్మ మీలోకమున నాచరింపఁబడినచో మరణానంతరమున నది పరలోకమున సుఖకారియగునని వేదవిదులు చెప్పుచున్నారు. మానవుఁడు తనకు విహితములగువృత్తులచే జీవించుచుఁ, దనకు విహితములగు ధర్మముల నాచరించుచుఁ, గ్రమక్రమముగాఁ బుణ్యపాపాది రూపకర్మమును విడిచి సులభముగా ముక్తి నొందవచ్చుఁ జుమా! ఓరాజా! మాటిమాటికిని సస్యములను బండుక్షేత్రము బలరహితమై కొంతకాలమునకు సస్యాభివృద్ధికి సమర్థము కాకుండుట చూచుచున్నాము. అట్లే కామముల కాశ్రయమగు చిత్తము విశేషముగాఁ గామముల ననుభవించినచో విరక్తిఁజెందును. అంతియకాని ఘృతబిందువులచే నగ్నిశాంతినొందనట్లు చిత్తము కామావేశములచే నెప్పుడును శమింపదు సుమా! ఓరాజా! బ్రాహ్మణాదులకు శమదమాదులగు గుణములే ముఖ్యములు కాని జాతి ముఖ్యముకాదు.ఒకప్పుడొక జాతివారి లక్షణములు వేఱొక జాతివారియందుఁ గనఁబడవచ్చు. అట్టియెడ లక్షణములను బట్టియే వర్ణాదుల నిర్ణయింపవలసినదికాని జాతినిబట్టి కా దని యెఱుంగుము. ఇది పదునొకండవ యధ్యాయము.

నారదుఁ డాశ్రమధర్మాదులను దెల్పుట.

ఓరాజా ! వెనుక వర్ణధర్మముల వివరించితిని. ఇఁక నాశ్రమధర్మములఁ జెప్పెదను. ఆశ్రమధర్మములలో బ్రహ్మచర్యము మొదటిది. బ్రహ్మచారి సర్వదా గురుకులమున నివసించుచు, శాంతుఁడై గురువునకు హితకార్యము లొనర్చుచు, దృఢమగు సౌహార్దమును జూపుచు దాసుండుఁబోలె సేవ లొనర్పవలయు. సాయంసమయమునను ప్రాతఃకాలములందును, గురువులను, నగ్నిని, సూర్యుని, దేవతోత్తముల నుపాసింపవలె. అట్లు సమాహితచిత్తుఁడై యుభయసంధ్యలందును గాయత్రిని జపింపవలె. ఉచితకాలమున గురువును సమీపించి వినయపూర్వకముగా నధ్యయనము చేయవలె. అధ్యయనప్రారంభమందును, నంతమందును, గురువునకు నమస్కరింపవలె. మఱియు బ్రహ్మచారి, మేఖలను, నజినమును, జటలను, దండమును, గమండలువును, యజ్ఞోపవీతమును, దర్భపవిత్రమును సర్వదా ధరించియుండవలె. సాయంప్రాతస్సమయములందు భిక్షకై పోయి తెచ్చినయన్నమును గురువునకు నివేదింపవలెను. గురువనుజ్ఞయిచ్చిన భుజించి లేనిచో నుపవాసము చేయవలె. అతఁడు మితముగా భుజించుచు, సదాచారము గలవాఁడై సమర్థుఁడై గురువుచెప్పిన యర్థములందు శ్రద్ధవహించి యింద్రియముల జయించి యవసర మున్నంతవఱకే స్త్రీలోలురతో సంభావింపవలెను. స్త్రీలనుగూర్చి చెప్పెడి గాథలను విడువవలయు. తాను గృహస్థుఁడు గాక బ్రహ్మచర్యమే యవలంబించి యుండును గాన స్త్రీసంగాదులఁ బరిహరింపవలె. అట్లుచేయనిచో నింద్రియములు మిక్కిలి

బలిష్ఠములు. కావున స్త్రీగాథలం దాసక్తిగలవై మనంబును దమవంక కాకర్షించుకొనును. మఱియు గురుపత్నులుగాని యువతులుగాని తనకేశములం బ్రసాధించుటకును, నభ్యంజనాది స్నానముం గావించుటకును, దొరకొన్నచో వలదని నిషేధింపవలెను. స్త్రీ యగ్నివంటిది. పురుషుఁడు ఘృతకుంభమువంటివాఁడు. పురుషుఁడు స్త్రీ సహవాసముచేఁ దప్పక ద్రవీభావముం జెందును. కావున ననవసరసమయములందుఁ గూఁతునైనను రహస్యస్థలమున నుంచికొనఁగూడదు. ఇట్లు స్త్రీసంగమును విడుచుట బ్రహ్మచారియే కాదు. బ్రహ్మోపాసనమందు నియతిగల యతియుఁ గూడ విసర్జింపవలయును. పరమేశ్వరుఁడు జీవున కీదృశ్యశరీరమును గల్పించుచున్నాఁడు. అతఁ డట్లు చేయునంతకాలమును దేవత్వ బ్రాహ్మణత్వాది భేదము సంభవింపక మానదు. ఈభేదమువలన దేహాత్మభ్రమ గలుగుచుండు. కావున భేదబుద్ధి గలుగునంతకాలమును స్వధర్మములను వదలరాదు. ఈ చెప్పిన నియమములు బ్రహ్మచారికిని యతికిని సమానములే. స్త్రీసంగరాహిత్యరూప మగు బ్రహ్మచర్యమువా రిరువురు నెల్లప్పుడును బాటింపవలయు. కాని గృహస్థుఁడు ఋతుకాలమునఁ బ్రమదాసంగతి గల్గియుండుకావున నతఁ డీ నియమముల సర్వదా పాటింపవలనుపడదు; అయినను గృహస్థుఁడు గోడలు మొదలగువానియందుఁ జిత్రప్రతిమలను వ్రాయింపరాదు. తైలాదులచే నభ్యంజనాదులఁ గావింపఁజనదు. మాంసమును, మద్యమును భక్షింపఁగూడదు. పుష్పమాలికలను, గంధలేపనములను, నలంకారములను విసర్జింపఁదగు. ఓనరేంద్రా! బ్రహ్మచారి యథోక్త నియమముల నాచరించుచు గురుకులమున వసించి వేదములను,

వేదాంగములను, నుపనిషత్తులను, నధ్యయనముచేసి బుద్ధిఁగొలం
దిని వానియర్థములను జక్కఁగాఁ దెలిసికొని, గురువునకు గోరి
నదాని నొసంగి యతని యనుమతివడసి, గృహస్థాశ్రమమును
గాని, సన్న్యాసమునుగాని స్వీకరింపవలెను. వాని స్వీకరింప
నిష్టములేనిచో బ్రహ్మచర్యాశ్రమమందే యుండవలయు. పురు
షుఁడేయాశ్రమమును స్వీకరించినను, గురువునందును, వహ్ని
యందును, దనయందును సర్వభూతములందునుం బ్రవేశించి
ధారకుఁడయియుండియు, నాయాభూతములం దున్నదోషముల
నంటక వర్తించుపరమేశ్వరుని సందర్శింపవలెను. బ్రహ్మచారిగాని,
వానప్రస్థుఁడుగాని, సన్న్యాసిగాని గృహస్థుఁడుగాని, తనకు విహి
తము లయిన యాశ్రమధర్మముల నాచరించుచు, స్వాత్మపర
మాత్మజ్ఞానము నొందినచోఁ దప్పక పరబ్రహ్మమును బొం
దును. ఓనరపాలా! మునులందఱును సమ్మతించిన వానప్రస్థుని
నియమములను వర్ణించెద వినుము. ఆధర్మములను జక్కఁగా
నాచరించినవాఁడు సుఖముగా మహర్లోకమునుగాని వైకుంఠ
మునుగాని పొందుటకు సందియము లేదుసుమా? వానప్రస్థుఁడు
దున్నుటవలనఁ బండెడి ధాన్యాదికమును దినరాదు. కృష్టపచ్య
ములుగాని, ఫలమూలాదులనైనను గాని,బరిపాకావస్థకుఁ బూర్వ
ముసంపాదించి తినరాదు. అగ్న్యాదిస్పర్శములవలనఁగాక కేవల
మును సూర్యకిరణప్రసారమువలనఁ బండినపండ్లను మాత్రమే
భక్షింపవలయు. వన్యము లయిననీవారధాన్యము మొదలగు
వానిచేతనే చరువును బురోడాశమును సిద్ధముచేయవలయు.
క్రొత్త వగునీవారాదులు సంప్రాప్తమయినచో మున్నున్నవి
విసర్జింపవలయు. అగ్నిహోత్రరక్షణమునిమిత్తము పర్ణశా

లనుగాని గిరికందరమునుగాని గృహముగాఁ జేకొనవలెను. తానందే వసించుచు, మంచునుఁ జలిగాలిని, నగ్నిని, వర్షములను, సూర్యాతపమును సహించుచుండవలెను. మఱియు వాఁడు జటలను దాల్చి, రోమములను గోళ్లను శ్మశ్రువును దేహమలమును విసర్జింపక, దండకమండలువులను నజినమును వల్కలములను దక్కినపరికరములను స్వీకరింపవలయు. తా నాక్లేశముల నోర్వఁగల్గునో లేదో ముందుగా యోజించి పిమ్మటఁదనశక్తికొలఁదిపండ్రెండు వత్సరంబులుగాని, యెనిమిదేండ్లుగాని, రెండుహాయనములుగాని, యొక్కసంవత్సరముగాని, వనమందుండి యీ నియమముల నవలంబింపవలెను. ఇట్లు చేసిన తరువాత వ్యాధులచేగాని ముదుసలితనముచేఁ గాని స్వధర్మాచరణమందును నాత్మజ్ఞానమందును దనయాశ్రమధర్మములందు శక్తి తఱిగినచో, వానప్రస్థుఁ డగ్నుల నాత్మయం దారోపించికొని యహంకారమమకారములవిడిచి తన శరీరమం దున్నభూతముల నింద్రియముల, వాని వానిఁ గారణవస్తువులందు లయింపఁజేయవలె. అది యెట్లందువేని శరీరమునం దున్నయవకాశముల నాకసమందును, ప్రాణాదులను వాయువునందును, శరీరగతమగునూష్మము నగ్నియందును, రుధిరము శ్లేష్మము,మూత్రము మొదలగువానిని జలమందును, మిగిలిన మాంసము మొదలయిన ఘనపదార్థములను భూమియందును, నిట్లుత్పత్తిక్రమము ననుసరించి కారణవస్తువులం దనుసంధానము గావింపవలె. అట్లె యింద్రియ వ్యాపారముల నింద్రియముల, నుత్పత్తిక్రమము ననుసరించి వాక్కులతోఁగూడిన వాగింద్రియమును దదధిదేవతయగు నగ్నియందును, శిల్పాది వ్యాపారములతోఁగూడిన పాణీంద్రియమును దద

ధిదేవతయగు నింద్రునియందును, గత్యాదియుక్తమగు పాదేంద్రియమును దదధిదేవతయగువిష్ణువునందును, రత్యాదివ్యాపారయుతమగు నుపస్థేంద్రియమును దదధిదేవతయగుప్రజాపతియందును, బురీషోత్సర్గాది సంయుతమగుపాయ్వింద్రియమును దదధిదేవత యగుమృత్యువునందును,లయానుసంధానము చేయవలయు. కర్మేంద్రియములవలె జ్ఞానేంద్రియములనుగూడ నుత్పత్తిక్రమము ననుసరించి శబ్దసహితమగు శ్రోత్రేంద్రియమును దిక్కులందును, స్పర్శసంయుతమగు త్వగింద్రియమును దదధిదేవత యగువాయువునందును, స్వవిషయమగు రూపముతోఁగూడఁ జక్షురింద్రియమును సూర్యునందును, స్వవిషయమగు రసాదులతోఁగూడ రసనేంద్రియమును దదధిదేవతయగువరుణునందును, స్వవిషయమగు గంధాదులతోఁగూడ ఘ్రాణేంద్రియమును దదధిదేవతయగు పృథివియందును, వ్యాపారాదులతోఁగూడ మనంబును దదధిదేవతయగు చంద్రునందును, సవ్యాపారమగుబుద్ధిని బ్రహ్మయందును, దేహాత్మాభిమానము మొదలగు కర్మములకుఁ గారణమగు నహంకారమమకారములను దదధిదేవతయగు రుద్రునియందును, నిర్మలవృత్తులతోఁగూడిన చిత్తమును దదధిదేవతయగుక్షేత్రజ్ఞునియందును,సాత్త్వికాహంకారమును స్వకార్యభూతములగు నింద్రియములతోఁగూడ మహత్తత్త్వమందును సంక్రమింపఁజేయవలయును. అట్లె పృథివిని జలమందును, జలమును దేజస్సునందును, దేజస్సును వాయువునందును, వాయువు నాకసమందును,దానిని దామసాహంకారమందును,దానిమహత్తత్త్వమందును, దానినవ్యక్తమందును,దానిం బరమాత్మకు శరీరభూతుఁడగు జీవునందును గూర్పవలయును.

ఇట్లు మిగిలినజీవాత్మ పరమాత్మకు శరీరమై యుండుట స్వభావసిద్ధమని తెలిసికొని జాతిగుణాదిభేదమును విడిచి, కట్టెలనుదహించిన యగ్నివలె వానప్రస్థుఁడు స్వయముగానే ధర్మాదులనుండి విరమించి ప్రాణత్యాగముకొఱకనశనవ్రతము నాచరింపవలయు.

ఇది పంద్రెండవయధ్యాయము.

## ప్రహ్లాదాజగర సంవాదము.

ఓ ధర్మరాజా! స్వధర్మాచరణమందును, దురీయాశ్రమధర్మముల నవలంబించుటయందును, వానప్రస్థుఁ డశక్తుఁడయినచోఁ జేయవలసినమార్గముపదేశించితిని. ఒకవేళవాఁడాశ్రమాంతరధర్మముల ననుష్ఠింప సమర్థుండయినచో, దేహానుబంధులగు సమస్తవస్తువులను వదలి యొక్కొక్కగ్రామమునం దొక్కొక రాత్రిచొప్పున నివసించుచు నపేక్షారహితుఁడై భూమండలము నందిరుగవలయును. అప్పుడువాఁడు కౌపీనమును నాచ్ఛాదనవస్త్రమునుమాత్రము దాల్పవలెను. తాపశైత్యాదులవలనఁ దన కపాయము సంభవింపనిచో దండకమండువులకంటె నన్యమును స్వీకరింపరాదు. అపాయము సంభవించున ట్లుండినచో శీతాతపాదిబాధల నివారించు వస్త్రాదుల స్వీకరింపవలయును. పరివ్రాజకుఁడు నియతముగా నెచ్చటను నిలువక యసహాయుఁడై భిక్షాన్నమువలన జీవించుచు నాత్మారాముఁడై సంచరింపవలయును. మఱియు వాఁడు సర్వభూతములకును హితుఁడై క్రోధమును విడిచి నారాయణునిఁ బ్రాప్యునిఁగాను బ్రాపకునిఁగానుదలంచుచుం జడచిత్తులకంటె విలక్షణుఁడయి, స్వరూపముచేతను, స్వభావము

చేతను నిర్వికారుఁడయిన పరమాత్మకే విశ్వమంతయును శరీర మైయున్నట్లు చూడవలెను అట్లె పరమాత్మను జిదచిదాత్మక మగు ప్రపంచమునం దంతటనంతరాత్మయై నియామకుఁడై యున్నట్లు దెలిసికోవలయును. ప్రత్యగాత్మస్వరూపమునుజక్కఁగా నరయుపురుషుఁడు సుషుప్తికిని జాగ్రద్దశకును సంధియగుస్వప్నావస్థయందుఁ బరమాత్మ యొనరించు సృష్ట్యాదికమును జూడవలయును. అట్లె బంధమోక్షములు పరమేశ్వర సంకల్పాధీనములు కాని, యాత్మస్వరూపప్రయుక్తములు కావనినిశ్చయింపవలయు. అస్థిరమయిన జీవితమునుగాని, నిశ్చితమయినమృత్యువును గాని సరకుగొనక, భూతముల యుత్పత్తిప్రళయములకు హేతువగు కాలగతిని బ్రతీక్షించుచుండవలెను. అప్పుడు వాఁడాధ్యాత్మిక ములు గానిశుష్కశాస్త్రములందు సక్తుఁడై యుండక జీవనోపాయమునువదలి వాదోపవాదభూయిష్ఠ మగుతర్కమును విసర్జించి, యేపక్షమును నాశ్రయింపక వర్తింపవలె. పరివ్రాజకుఁడు ధనలోభము లేనివాఁడు కావున శిష్యులఁ బెక్కండ్రఁ గూర్పరాదు. ఒకవేళఁగూర్చినను బెక్కు గ్రంథములఁ జదివింపరాదు. అట్లు చేసినచోఁ దనచిత్త మన్యాయత్తమగును. మఠాధిపత్యము మొదలగువాని నారంభింపరాదు. అట్లు చేసినచో నిగ్రహానుగ్రహాది వైషమ్యము కలుగకమానదు. కావున యత్యాశ్రమము ధర్మార్థ మైనప్పుడే శిష్యాదులను జేరఁదీయువలయును గాని యది కేవలము జ్ఞానప్రయోజక మైనచోఁ శిష్యాద్యనుబంధములను దూరముగాఁ బరిత్యజింపవలెను. జితేంద్రియుఁడై శబ్దాదివిషయసుఖముల నపేక్షింపక ధర్మాధర్మములందుసమచిత్తుఁడయి కేవలము జ్ఞాననిష్ఠుఁడై నవాని కథ్యాప

నాదిధర్మములతో నేమిప్రయోజనము ? శిష్యాదులు లేనిచోఁ దన జ్ఞానమహిమ లోకమునకు వెల్లడియగుటెట్లని శంకింపఁబని లేదు. అట్లు తెలుపకుండ నుండుటయె వానికిఁ దగినకార్యము. పరివ్రాజకుఁడు తన మాహాత్మ్యము నెప్పుడును వెల్లడిసేయక విద్వాంసుఁడయ్యు,నిపుణముగా మాటాడ సమర్థుండయ్యు,మూఁగవానిచందంబునను, నాశ్రయపరిశీలనమందు సమర్థుఁడయ్యు వెఱ్ఱివానివిధమునను గానవచ్చుచుఁ బరులకు దురూహముల యిన ప్రయోజనములు గలవాఁడై వర్తించుచుండవలయును. తన మాహాత్మ్య మొరులకుఁ దెలుపకుండ నుండవలయునన్నందులకుఁ బురాతనమగు నొక యితిహాసము గలదు.అది యాజగరవ్రతము నాచరించు నొకమునికిని బ్రహ్లాదునకును సంవాదరూప మయినది. దానిని వివరించెదను వినుము. పూర్వ మొకప్పుడు భగవద్భక్తుఁ డయిన ప్రహ్లాదుఁడు కతిపయపరివారసమేతుఁడై లోకుల తత్త్వమును దెలియఁగోరి భూమండలమునఁ దిరుగుచుఁ గావేరీతీరమున సహ్యపర్వతమునకుఁ గ్రిందనున్న భూమియందు శయనించి, ధూళిధూసరితమయిన దేహము గల్గి, ప్రచ్ఛన్నమగు నిర్మలకాంతితో నొప్పుచు, నాజగరవ్రత మవలంబించియున్న యొకమునిని గాంచెను. ఆకృతిచేతనుగాని, మాటలచేఁగాని, వర్ణాశ్రమాది చిహ్నములచేఁగాని,యతఁడెవఁడో యేయాశ్రమ మవలంబించినవాఁడో తెలియుటకు వీలులేదు. అంత మహాభాగవతుఁ డయినప్రహ్లాదుఁడు వంగి యతనికి యథావిధిగా నమస్కరించి యిట్లడిగెను. 'ఓమహనీయా! ప్రయత్నించి మహాభోగము లనుభవించు దేహపోషణతత్పరుఁ డగు నరునివలె బలిసిన దేహముఁ దాల్చుచున్నావు.ఆలోచింప లోకమున నుద్యోగి కే ధన

ములభించును. ధనికే సమస్తభోగములును సంభవించును.భోగి యే పీవరశరీరుఁడై యుండును. నీ వుద్యోగింపలేదు. ధనవంతుఁడవుకావు. భోగముల ననుభవింపలేదు. అట్లయినను నీదేహ మిట్లుండుటకు మిక్కిలి యాశ్చర్యము నొందుచున్నాను. నీ వెల్లప్పుడు నిరుద్యోగివై యుండియు ధనాదులఁబడసి భోగముల ననుభవింపకుండియుఁ బీవరదేహముఁ దాల్చుటకు హేతువేమియో తెలుప వేఁడెదను.మఱియునీవు విద్వాంసుండవు.దక్షుఁడవు. చిత్రములును ప్రియములును నగుకథలను దెలుప నిపుణుఁడవు. నీ విట్టివాఁడవయ్యు, నానాకర్మముల నాచరించు లోకములను జూచియు నుదాసీనుఁడవై యూరక శయనించుచున్నావు.దానికిఁ గారణము వివరింపుమా?''అని యిట్లు ప్రహ్లాదుని వాగమృతముచేఁ బ్రేరితుఁడై మందహాసముఁ జేయుచు నా మహాముని యతని కిట్లనియె. 'ఓ యసురనాయకా ! ప్రహ్లాదా? నీ వతీంద్రియము లగు పదార్థములను జూచువారలలో నగ్రేసరుఁడవు. కావున నీ వధ్యాత్మచక్షువుచే మానవులు ప్రవృత్తిధర్మముల నవలంబించుటకును, నివృత్తిధర్మములఁ జేకొనుటకునుఁ దగుకారణముల నెఱుంగుదువు. నీవు జ్ఞానాదిషడ్గుణములచే వెలయుచు స్వకీయ మగుతేజంబున దీపించుచు, నారాయణభక్తిచే నిత్యసంతుష్టుఁడవై యుందువు. అట్టి నీ నిర్మలచిత్తమందు నారాయణుండు ప్రవేశించి సూర్యుఁడు చీఁకట్లనుంబోలె నజ్ఞానమును నిరసించుచున్నాఁడు. నిరస్తాజ్ఞానుఁడవై సర్వజ్ఞుఁడవయి వర్తించు నీకుఁ దెలియనిది లోకమున నేదికలదు? ఓరాజా ! అట్లయినను నీవడిగిన ప్రశ్నమున కుత్తరముచెప్పెదను. ఆత్మశుద్ధిఁగోరుప్రతి మనుజుఁడును నీతితో సంభాషించి తీఱవలెఁగదా! కావున వివరిం

చెదను వినుము. యథార్థములైన కామములచేఁ బూరింపఁ దరముకానిదియు,జన్మపరంపరనుగల్గించునదియునగు విషయేచ్ఛ చే నేను బుణ్యపాపకార్యము లాచరించి నానాయోనులందును జన్మించితిని. ఆకర్మలచేతనే మనుష్యుఁడనై యీలోకమును బొందితిని. ఆలోచింప ధర్మాదులాచరించి స్వర్గమునొందుటకును, జ్ఞానమును సంపాదించి యపవర్గము నొందుటకును, నధర్మము నాచరించి పశుత్వాదికముఁ జెందుటకును,నీలోకము ద్వారము వంటిది. జీవులు తమపూర్వసుకృతమువలన నీలోకమున స్వర్గాపవర్గముల నీఁజాలిన మానవజన్మము నొందియు, మైథున సుఖము నిమిత్తమును, దుఃఖనివృత్తినిమిత్తమును గర్మము లాచరించుచుందురు ; కాని వారి ప్రయత్నములకు విపరీతఫలము సంప్రాప్తమగుచుండెను. వానిఁజూచి నేను విరక్తిఁజెందితిని.ఆత్మ సుఖస్వరూపముకాన మనము సుఖలాభమునిమిత్తము ప్రయత్నింప నవసరములేదు.మనము దేహగతవ్యాపారముల నన్నిటిని దొలఁగించుకొన్నఁ జాలును. అప్పుడు మనకుఁ గేవలమును సుఖమే లభ్యమగును. శబ్దాదివిషయసుఖములు నశ్వరములు ; కాని యీ యాత్మసుఖము నిత్యము. అందుచే వాని నట్టివిగాఁ దెలిసికొని కేవల మాత్మసుఖమునే యభిలషించుచుఁ బ్రారబ్ధకర్మావసానముకై యిట్లు పండుకొని యుంటిని. లోకములోనివా రందఱును నీవలె నాత్మసుఖము నేలకోరరని సందేహము పొడమవచ్చును. కాని లోకులందఱు నందులకై యత్నింపరు. వారాత్మ సుఖస్వరూపమనియు,నదియే తమకుఁ బురుషార్థమనియు మఱచి యాత్మయందు లేని దేవమనుష్యాది భేదముచే భయంకరమగు సంసారము నొందుదురు. జలమం దుదయించిన తృణశైవాలా

దులచేఁ బ్రచ్ఛన్నమగు జలమును విడిచి జలభ్రాంతిచే నెండమావులనుగూర్చి పర్విడునట్లు లోకులు సుఖస్వరూప మగు నాత్మస్వరూపమునుమఱచి విషయసుఖములనుబురుషార్థములని తలంచుచు నందులకై కడంగుదురు. అందులకు వారి యజ్ఞానమే కారణముకాని వేఱొకటిలేదు. మఱియునాయజ్ఞులు కర్మాయత్తములయిన దేహేంద్రియములచేఁ దమకు సుఖమును, దుఃఖనివృత్తిని సంపాదింపఁ దలంచి, యందులకు సమర్థులుగాక పూటిమాటికిని వ్యర్థములగు కార్యకలాపముల నాచరించుచుందురు. వారలాచరించుకర్మములుసుఖజనకములుగాకపోవుటయేకాక, మీఁదుమిక్కిలి దుఃఖంబులనుగూడఁ గూర్చుచుండును. ఆధ్యాత్మికాది దుఃఖములచే సంతతమును బీడితులగువారి కతికష్టమున నార్జితములగు ధనాదు లేమిసుఖముఁ గల్గింపఁజాలును? ఒకవేళ ధనాదులు సుఖలబ్ధము లయినను, సుఖముల గల్గింపఁజాలవు. ధనాదులెల్లప్పుడును దుఃఖమునే కల్గించును. ధనమార్జనమందు దుఃఖముల నొసంగును. ఆర్జిత మగునది వ్యయమగునని విచారమమితముగాఁ గల్గించును. ధనవంతు లందఱును భయపడుచుందురు. ఒకప్పుడైనను నిద్రాసుఖ మనుభవింపఁ జాలరు. ధనవంతులు రాజులవలనను, దొంగలవలనను, శత్రువులవలనను, బందుగులవలనను, బశుపక్ష్యాదులవలనన, యాచకులవలనను, గాలమువలనను భయ మందుదురు వారు ధనమును బ్రాణతుల్యముగా నెంచుకొనుటచే నది యనుభవమువలన నశించుచునేయు వగచుచుందురు ధనమువలననొక్క భయమేసంభవించుటకాదు. శోకము, మోహము, క్రోధము, రాగము, ద్వేషము, శ్రమము, మొదలగున వన్నియు ధనమువలననే సంభవించుచుండును. కా

వునఁ బండితుఁ డగువాఁడు ధనీషను బరిత్యజింపవలయును. ఇట్టి ధనమువలనసుఖముగల్గుననుట యసంభవముగదా? ఓ ప్రహ్లాదా! తేనెటీఁగయు, మహాసర్పమును నీరెండిటిని గురూత్తములనుగా భావింపఁదగు. తేనెటీఁగవైరాగ్యమొసంగిన ట్లెగురువును నాస్వంగఁజాలఁడు. మహాసర్పము పరితోషముపదేశించినట్లెంతటివాఁడును నుపదేశింపఁ జాలఁడు. నాకా రెండే గురుశ్రేష్ఠులుసుమా! అదియెట్లందువేని చెప్పెదను వినుము. తేనెటీఁగ ప్రతిదినముకష్టించి ప్రతిపుష్పమునుండియు మధులేశములను దెచ్చి కూడఁ బెట్టును. అట్లు కూర్చిన మధువ్రతములను జంపి యీమధువు నితరుఁ డపహరించుచున్నాఁడు. అట్లె కష్టపడి ధనము నొకఁ డార్జించుకొన మఱియొకఁడు వానిఁ జంపి యాధనమును స్వీకరించును. కావున ధనాదులందు విరక్తినిబూనుటయే యుచిత మనువిషయము తేనెటీఁగవలన నేర్చుకొంటిని. మహాసర్పము నిర్వ్యాపారమున నుండి దైవలబ్ధ మగుదానివలననే పరితోషమునొంది సుఖించు. అదియె సముచితమని తలంచి దైవప్రాప్తమగుదానినే భక్షించుచు సంతుష్టచిత్తుఁడనై చిరకాలమునుండి యిటనే శయనించి యున్నాను. ఒకప్పుడు స్వల్పముగాను, నొకప్పు డధికముగాను లభించును. ఒకమాఱు సమీచీన మగునాహారము లభించును. వేఱొకమాఱు మంచిది సంభవింపదు. ఒకపరి మధురమైనది లభించును. ఒకపరి రుచిలేనిపదార్థములు దొరకును. ఒకమాఱు శ్రద్ధతో జనులిచ్చినయన్నము సంప్రాప్తమగు. ఒకప్పుడు నిందాపూర్వకముగాఁ బ్రాప్తించును. ఏది లభించినను నక్తందివంబు భుజించి పరితుష్టుఁడనై యుందును. పట్టువస్త్రమయినను, సలమగు దుకూలమైనను, చర్మమైనను, నారచీరమైనను

లబ్ధమైనచో దానిని బూర్ణసంతోషముతో ధరింతును. నున్నని నేలయందును, దృణాదులందును, బండరాతియందును, భస్మమందును సౌధాంతరమందున్న హంసతూలికాతల్పమందును, సమసంతోషముతోనే శయనింతును. స్నాతుఁడనై చందనాదులఁ బూసికొన్నను, లేకపోయినను, శోభనవస్త్రములఁ దాల్చినను, దిగంబరుఁడనైనను, బుష్పమాలాదులఁదాల్చినను, దాల్పకపోయినను, రథాదులచే సంచరించినను, గాలితో నడచినను, నాకు సమానమేకాని భేదములేదు. స్వభావముచేత విషము లయినజనులు నన్ను నిందించినను స్తుతించినను వారిని నే నెంతమాత్రమును నిందింపను. స్తుతింపను. వారల కందఱకు ధర్మాదిరూపశ్రేయస్సు గలుటకును, భగవంతునియందు నిశ్చలచిత్తులై యుండుటకును గోరుచుందును. నేనిట్లు నిత్యసంతుష్టుఁడనై యుండుటచేతనే భోగాదులు లేకపోయినను నాశరీరము పీవరమై యున్నది. మఱియు జాతిరూపాది వికల్పమును జిత్తమందును, దానిని దేహాత్మభ్రమకు హేతువగు మనస్సునందును, మనస్సునుసాత్త్వికాహంకారమందును, దానినిమూలప్రకృతియందును; దాని నాత్మానుభవమందును లయానుసంధానముచేసి యాత్మశరీరకుఁ డయినపరమాత్మను గాంచుచు, నిశ్చేష్టుఁడై ప్రారబ్ధావసానమునఁ గళేబరమును విసర్జింపవలయును. ఓప్రహ్లాదా! నావృత్తము మిక్కిలి గూఢమైనది. లోకాచారమునకును, శాస్త్రములకునువిరుద్ధమైననుదత్త్వజ్ఞానమున కట్లు కాదు. నాచరిత్ర మొరులకుఁ దెలుపఁదగినదికాదు. అయినను నీవు పరమభాగవతుండవగుటవలన వర్ణించితిని" అని మునిపుంగవుఁడు చెప్పిన తుర్యాశ్రమధర్మముల విని మికి

సంతసించి ప్రద్యుం డతనిఁ బూజించి యతని యనుమతివడసి తన గృహమున కరిగెను. ఇది పదుమూఁడవయధ్యాయము.

---

నారదుఁడు ధర్మరాజునకు గృహాశ్రమ ధర్మములను జెప్పుట.

అని నారదుఁడు చెప్పినవచనంబులు విని ధర్మరా జతనిఁ జూచి "ఓ దేవమునీంద్రా! మేము సర్వదా గృహాసక్తచిత్తులమై యున్నారము. మావంటివారు ముక్తిపదవినిఁ జెందుటకుఁ దగిన సులభోపాయ మేదియో వివరింపుమా!" యని యడిగిన యన్నరేంద్రున కమ్మునీశ్వరుం డిట్లనియె. ఓధర్మనందనా! లోకము ననుగ్రహింపఁదలఁచి నీవడిగినప్రశ్నము మిక్కిలి సముచితమైనది. ఆగృహస్థధర్మములను నీకుఁ బూర్తిగా వివరించెదను. అవియే యందఱకును జ్ఞానలాభము నొసంగజాలు. ఓరాజా! గృహస్థుఁడు తన యాశ్రమమున కుచితములగుపంచమహాయజ్ఞములు మొదలయిన యావశ్యకకర్మముల భగవదర్పణముగా నాచరించుచు భగవద్గుణములను మననముచేయు మహాభాగవతుల సేవించుచుండవలయు. ఆభక్తులవలన వాసుదేవుని యవతారకథామృతమును శ్రవణపుటంబులచే యుక్తకాలములందు శ్రద్ధాళువై మాటిమాటికిని ద్రావుచుఁ, గ్రమక్రమముగా సత్సంగము నలవఱిచికొని, దేహమందును దారపుత్త్రాదులందును గల ప్రేమానుబంధమును మెల్లగా విడువవలయును. వారి యందు మమకారమును విసర్జింపవలయును. ఇట్లు దేహాదులం దభిమానమును విడిచినచో, స్వప్నమునుండి లేచినవాఁ

డాయవస్థయందుఁ గానవచ్చిన వస్తువులు తత్కాలమందుమాత్రమే యనుభూతములగుచున్నవి; కాని తదితరకాలములందట్లు కా లేదని తెలిసికొనుచందంబున, దేహి దేహమును గేహమును దారసుతాదులును నస్థిరులనియుఁ బురుషార్థములు గారనియుఁ దెలిసికొని విరక్తుఁడై మనుష్యత్వాదికము దేహగతమే కాని యాత్మగతము కాదని నిశ్చయింపఁగలుగును. అప్పుడు వాఁడు తనజ్ఞాతులును, దలిదండ్రులును, బుత్రులును సోదరులును, మిత్రులును, దక్కినవారును జెప్పినదానిని, గోరినదానిని మమకారరహితుఁడై యామోదింపవలయు. పిమ్మట వాఁడు తన కీశ్వరదయవలన సంభవించినధాన్యాదిధనమును, సువర్ణాదులను,సమస్తమును,తనవారినిమిత్త ముపయోగించుచు, స్వోదరపోషణకుఁ దగిన ధనమునుమాత్రమును మిగుల్చుకొనవలయును. ఓరాజా! పొట్టను బోషించుకొనఁజాలినంత ధనమునే స్వీకరించి దానియందే తనదను నభిమాన ముంపవలయును. కాని తదధికమం దట్లుంపరాదు. అట్లుంచినవాఁడు సంసారబంధవిముక్తుఁడైనట్టికిని గాఁడు సుమా! కావున నధికధనమం దభిలాషమునువదలి తన ధాన్యాదులను, దక్కిన తనవస్తువులను, లేళ్లు, కుక్కలు, పిల్లులు, కోఁతులు, మూషికములు,సరీసృపములు, మక్షికములు మొదలగునవి భక్షించుచుండుటను జూచి వానిని దనపుత్రులవలెనే చూడవలెనుగాని యింతేనియుఁ దారతమ్యముంపరాదు. తాను గృహస్థుఁడయ్యు నతిప్రయాసముచే ధర్మార్థకామములను సేవింపక దైవప్రాప్త మగుదానివలననే దేశానుగుణముగను, గాలానుగుణముగను సంతృప్తిఁ జెందుచుండవలయును. కుక్క మొదలు చండాలునివఱకుఁ గలసమస్తజీవుల

కును యథార్థముగా నపేక్షితము లగువన్నాదుల నొసంగుచుం
డవలయును. దారసుతాదులందు మమకారమును విడువవలయు.
ఆలోచింప భార్యయం దున్నయభిమానమును బరిహరింప మి
క్కిలి కష్టము. మానవుఁడు తనభార్యనిమిత్తము ప్రాణముల
నైన సర్పించును. తల్లిదండ్రులనైనను జంపును. గురువునైనను
ధిక్కరించును. అట్టి భార్యయం దున్నప్రేమానుబంధమును
ఛేదించుట సులభము కాదుగదా! అది యెట్టిదైనను బురుషుఁ
డెవ్వఁడు దానివిడువఁగలుగునో, వాఁడు పరమాత్మను సులభము
గా సాక్షాత్కరించుకొనఁగలఁడు? ఓయీ! భార్య దేహికమిత
సుఖము గల్గించుచుండ, దానియందలి యభిమానము విడుచుట
కష్టముగదా యని యడుగవచ్చును. పురువులతోను మల
మూత్రాదులతోను నిండియున్న యీశరీర మెక్కడ? భార్య
గల్గించు స్వల్పమగు రతిసుఖ మెక్కడ? ఆకాశమువలె నిర్లేపుఁ
డయిన యాత్మ యాసుఖ మనుభవించు టెక్కడ? ఆలోచింప
నిది మిక్కిలి యసంగతముగదా? అని యిట్లు తత్త్వవిచార
ము జేసి భార్యయం దభిమానము నెట్లయినను విడువవలయును.
ఇట్లు గృహస్థుఁడు దైవలబ్ధములను, బంచమహాయజ్ఞాదు
లొనర్పగా మిగిలినవియునగు వస్తువులచేతనే జీవధారణమును
జేయుచుఁ, దదతిరిక్తవస్తువులందు స్వాత్మాభిమానము విడిచిన
చోఁ గ్రమముగా జ్ఞానసంతుఁడై తుదకు మహాత్ములు పొందు
చున్న ముక్తిపదవిని బొందఁగలఁడు. మఱియు గేస్తు యాజనా
ధ్యాపనాదులచే సంపాదితమగు ధనముచేతనే దేవతలను, బితృ
దేవతలను, ఋషులను, మానవులను, భూతములను బ్రత్యహ
మును బూజించుచు దనకంతరాత్మ యగుపరమపురుషునిఁ

ప్రత్యేకముగా నారాధింపవలయు. ఇట్లు వర్తించుచు సర్వ యజ్ఞములును జేయఁదగిన యధికారము తనకు లభించినతోడనే యథావిధిగాయాగములాచరించి పరమపురుషు నర్చింపవలయు. ఓధర్మరాజా! బ్రాహ్మణముఖమున హుతములగు నన్నాదులచే సర్వయజ్ఞభోక్త యగుహరికి సంతసము జనించున ట్లగ్నిముఖ హుతము లయినవానివలన సంతోషముజన్మింపనేరదు. కావున బ్రాహ్మణుల యథాయోగ్యముగా నన్నాదులచే నారాధించి బ్రాహ్మణముఖుఁ డయినపరమాత్మను సంతసింపఁ జేయవల యును. బ్రాహ్మణుల నారాధించినపిమ్మటఁ దక్కినమానవుల నా రాధింపవలయు. మూఁడువర్ణములవారును ధనవంతులై యున్న చో, నిజవిత్తానుసారముగాఁ దల్లిదండ్రులకును, దద్బంధువుల కును భాద్రపద కృష్ణపక్షమునందు మహాలయమను శ్రాద్ధ మును జేయవలయు. ఇంతియకాక గేస్తు దక్షిణోత్తరాయణ ముల ప్రారంభదినములందును, వ్యతీపాతయందును, దినక్షయ మందును, చంద్రగ్రహణమునందును, సూర్యోపరాగమునం దును, ద్వాదశియందును, దర్శయందును బితృశ్రాద్ధము నొనరిం పవలయును. మఱియుఁగార్తికశుద్ధనవమియందును, నక్షతృతీయ యందును, శిశిరహేమంతముల కృష్ణపక్షాష్టములందును,నందు మాఘశుద్ధసప్తమియందును,మాఘపూర్ణిమయందును మాస నామములకుఁ బ్రవృత్తినిమిత్తము లగు నక్షత్రములందును. ననూరాధతోఁగాని, శ్రవణముతోఁగాని, యుత్తరతోఁగాని యుత్తరాషాఢతోఁగాని, యుత్తరాభాద్రతోఁగాని యుక్త మగు ద్వాదశియందును, నుత్తరాత్రితయముతోఁగూడిన యే కాదశియందును, జన్మనక్షత్రముతోఁగాని శ్రవణనక్షత్రముతోఁ

గాని యుక్తమగు దినమునందును, పితృశ్రాద్ధము నొనర్పవల యును. ఈదినములు కేవలము శ్రాద్ధాదులకేకాక శ్రేయస్సాధనములగు ధర్మముల ననుష్ఠింపఁగూడఁదగినవి సుమా! కావున నీపుణ్యదినములందుఁ త్రికరణశుద్ధిగా, స్నానమును జపమును హోమమును, దపమును, దేవతార్చనమును, బ్రాహ్మణపూజను, భక్తియుక్తుండై యొనర్చి శ్రేయస్సును, నాయువును, వర్ధించుకొనవలయును. ఆదినములందుఁ బితృదేవతలకును, దేవతలకును, మానవులకును, భూతములకును నొసంగిన దానాదికమక్షయ ఫల సాధనమగును. అది కర్మముల నొనర్చునపుడును, తనపుత్త్రులకు జాతకర్మాదులు చేయునపుడును, దాను యజ్ఞాదిదీక్షనవలంబించినపుడును, ప్రేతలను దహనాదు లొనర్చినదినమందును, మృతాహమందును, దక్షిణ యభ్యుదయ కర్మములందును నొనర్చిన స్నానాదికము లనశ్వరఫలదాయకము లగుటకు సందియము లేదు. ఓ జనపాలా! కాలమునందు శ్రేయస్కర దివసములు వలె దేశములందును శ్రేయస్కర స్థలంబులు గలవు. ఏ దేశమున సత్పాత్రము లభించునో యది మిక్కిలి యుత్కృష్టమయినది. సమస్త చరాచరప్రపంచమును శరీరముగాఁదాల్చు భగవంతుని ప్రతిబింబముండుచోటును, దపంబుతోను విద్యతోను దయతోను గూడిన ప్రదేశంబును, బ్రాహ్మణకుల మున్నస్థలంబును, భగవదర్చాదు లొనర్పఁబడు దేశంబును, బుణ్యతమములైనవి. మఱియుఁ బురాణప్రసిద్ధము లగు గంగాదినదులును, బుష్కరము మొదలగు సరస్సులును, మహాత్ములు గలక్షేత్రము లన్నియునుఁ బుణ్యస్థలంబులు. వానిలోఁ బ్రధానములను వివరించెదను. వినుము. కురుక్షేత్రంబును, గయయు, గంగా యమునా

సంగమస్థలంబగు ప్రయాగయు, సాలగ్రామక్షేత్రంబును, నైమిశారణ్యంబును, ఫల్గునీనది ప్రవహించు స్థలంబును, శ్రీరామసేతువును, బ్రభాసతీర్థమ్మును, ద్వారవతియుఁ, బంపాతటంబును, గర్దమాశ్రమంబును, గాశీపురంబును, మధురాపురియు, బదరికాశ్రమంబును, నలకనందాతీరంబునుఁ జిత్రకూటంబును, మానవులకుఁ బుణ్యంబు లొసఁగూర్చు నుత్తమస్థలంబులు. ఓరాజా! మహేంద్రము, మలయము మొదలగు కులగిరులప్రాంత దేశములును, దేవతాప్రతిమలతో నొప్పియున్న తిరుపతి మొదలగునెలవులును, బరమపవిత్రములయినవి. కావున శ్రేయస్కాముఁడగు పురుషుఁడు పైని బేర్కొన్న స్థలములకు మాటిమాటికిఁ బోయి యచ్చట ధర్మముల నాచరింపవలయును. ఈస్థలములం దొనర్పంబడినదానాదులు వేయిరెట్లధిక ఫలమును గల్గించును. ఓ నరపాలా! దేశకాలములను ముఖ్యములగువాని వర్ణించితిని. ఇఁకఁ బాత్రమును గూర్చి తెలిపెదను. పాత్రతత్త్వమును దెలిసిన పండితు లెట్టిది సత్పాత్రమో నిర్వచించి యున్నారు. చరాచర ప్రపంచరూపుఁడయిన హరి సత్పాత్రము లన్నింటిలోను శ్రేష్ఠుఁడు. కావుననే దేవతలును, ఋషులును, సిద్ధులును, సనకాదియోగులును నుండినను, రాజసూయమందు ముందుగాఁ గృష్ణుఁడే నీచేఁ బూజితుఁడయ్యె. వృక్షమూలమునఁ బోసినజలము సమస్తవృక్షావయవములకును దృప్తిఁ గొలిపినట్లు సమస్తజీవరాసులకును మూలమగు శ్రీహరి కర్పించినపూజ సమస్తజీవులను సంతుష్టులనుగాఁ జేయఁగలుగు. కావుననే కృష్ణుఁడు సర్వోత్తమపాత్రమని నిర్ణయించిరి. పరమేశ్వరునిచే సృజింపఁబడిన దేవతిర్యఙ్మనుష్యశరీరములన్నియుఁ బురము లనఁబడును. వానియందు భగవంతుఁడు

జీవాఖ్యమగు శరీరముచే శయనించియుండుటంబట్టి పురుషుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఆజీవులం దీశ్వరుఁడు స్వకీయమగు జ్ఞాన శక్త్యాదులఁ బ్రకటించుచుండును. అతని జ్ఞానశక్త్యాదులచే సుప్రసిద్ధులగువారుఁగూడ సత్పాత్రములేచుమా! మొట్టమొదట సర్వము బ్రహ్మమేయని భావించి హరి నుపాసించుచుండిరి; కాని తిరస్కారబుద్ధి గలమానవులచిత్తమును బరిశీలించి, పండితులు త్రేతాదియుగములందు హరిప్రతిమలను సంస్థాపించి పూజింప నారంభించిరి.కొందఱాభగవత్ప్రతిమలందే హరిభావన మునిచి శ్రద్ధాపూర్వకముగా నుపాసించుచున్నారు. వారి కవి పురుషార్థ దాయకము లగుచున్నవి. ఆదేవతాప్రతిమలుఁగూడ నుత్తమ పాత్రములని పరిగణింపఁబడినవి.అవి యొకవేళ నర్చితములయ్యు హరిభక్తులతో విరోధించువారికిఁ బురుషార్థము నీయఁజాలకపో యినను నుత్తమపాత్రత్వమునకు భంగములేదు. ఓ రాజేంద్రా! యనశనాదివ్రతములచేతను, నాత్మయాథాత్మ్యజ్ఞానముచేతను, దైవప్రాప్తమగుదానివలనఁ బొందు సంతుష్టిచేతను, బ్రవర్తించుచు శ్రీహరికి శరీరభూతమగు వేదమును గ్రహించినవారగు టంబట్టి బ్రాహ్మణులు పురుషులందఱిలో నుత్తమపాత్రము లని గణింపఁబడిరి. ముల్లోకములను బాదపరాగముచేతనే పవిత్రీ కరించు శ్రీకృష్ణుఁడే "బ్రాహ్మణులు నాకుదేవత" లని వక్కాణించెను. అట్లుండ లోకమున బ్రాహ్మణులను మించిన యధికు లెవ్వరు? వారికంటె నుత్తమపాత్రము లెక్కడఁగలవు. ఓరాజా! దేశకాలపాత్రములను జక్కఁగా వివరించి చెప్పితిని. ఇది పదు నాల్గవయధ్యాయము.

—•••••—★—•••••—

ఓరాజా! ద్విజులలోఁ గొందఱు తమవర్ణాశ్రమముల కుచితములగు ధర్మముల నాచరింప నియమముగలవారు. కొంద అనశనాది తపోనిష్ఠులై యుందురు. కొందఱు స్వాధ్యాయము నందు నిపుణులై యుందురు. మఱికొంద అధ్యాపనమందుఁ బరినిష్ఠితులగువారలు. వేఱొకకొందఱు జ్ఞానయోగ కర్మయోగములందు దక్షులై యుందురు. అందుఁ బితృదేవతల నుద్దేశించి జ్ఞానయోగనిష్ఠున కిచ్చిన శ్రాద్ధాన్నాదులనంత ఫలము నొసంగు అట్టివాఁడు లభింపనిచో యథార్హముగాఁ దదితరుల కర్పింపవలయు. శ్రాద్ధాదులందు విశ్వేదేవస్థానమున నిర్వురును, బితృస్థానమున ముువ్వురును నియమితులు కావలయును. అయినను శ్రాద్ధాదులను విస్తరించి చేయరాదు. కాన యధికధనసంపన్నుఁడయ్యు రెండుస్థానములందు నిర్వరనుమాత్రమే భుజింపఁ జేయవలయును. విస్తరించి చేయుటవల్ల నష్టమేమని యందువేని చెప్పెదను వినుము. శ్రాద్ధమునకు దేశకాలపాత్రములు యథోక్తములై యుండవలయు. అందులకుఁ దగినశ్రద్ధయు, ద్రవ్యంబును, పూజాసాధనంబులును గావలయును. అందు దౌహిత్రాదులే నియమితులు గావలయు. ఆలోచింప స్వజనమును దక్షిణ వస్తువులను సమకూర్చుకొనుట మిక్కిలి దుస్తరము. కావున శ్రాద్ధమునువిస్తరించుటవలనఁ జెఱుపేకానిలాభము లేదు. శ్రాద్ధాదులందు విష్ణుస్థానమునుగూడ నుంపవలయును. యుక్తములగు దేశకాలములు లభించినప్పుడు విష్ణువు నుద్దేశించి సత్పాత్రమందు వినియోగించిన స్వల్పపదార్థములయ్యును నక్షయ్యఫలసాధనములును ముక్తిదాయకంబులును నగును. దేవతలకును, ఋషు

లకును, బితృదేవతలకును, భూతములకును, నాత్మకును, దనబంధువులకును, శ్రాద్ధాదులం దన్నమును విభజించి యొసంగుచును దేవాదిప్రాణిజాత మంతయు భగవదాత్మక మని భావింపవలయును. శ్రాద్ధములందు మాంసమును బెట్టరాదు. ధర్మయాథాత్మ్యమును దెలిసినవారు మాంసమును భుజింపరాదు. ఆలోచింప నన్నాదులచేఁ బితృదేవతలకుఁ బరమతృప్తి సంభవించినట్లు మాంసాదులచేఁ గాదు, పశుహింస యెన్నఁడును శ్రేయస్కరము గాదు. ప్రతివారికిని భూతద్రోహము చేయకుండుటయే పరమధర్మము. కావున మనోవాక్కర్మములచే నెవ్వాండును భూతద్రోహమునకై ప్రయత్నింపరాదు. యజ్ఞములందుఁ గొందఱు పశుహింసను జేయుదురు. అట్లు పశుపురోడాశాదులచే యజ్ఞము చేయుపురుషునిఁ గాంచి భూతములన్నియు భయమంది "యీ యాజకుఁడు నిర్దయుఁడు. మన ప్రాణములతోఁ దృప్తిచెందు దుష్టుఁ"డని నిందించునని తలంచి యజ్ఞతత్త్వము నెఱింగినవారును,జ్ఞానవంతులును నగు పెద్దలు కొందఱు నిష్కాములై జ్ఞానమయములగు యోగంబులనే యొనర్చుచుందురు. కావునఁ బురుషులు భూతహితులై నిత్యసంతుష్టులై దైవమువలన సంప్రాప్తములగు నన్నాదులచేతనే నిత్యనైమిత్తికక్రియలొనర్పవలయును,గాని మాంసాదులచే నట్లొనర్పరాదు.విధర్మమనియుఁ, బరధర్మమనియు, నుపధర్మమనియు,దాంభికధర్మమనియు, నాభాసమనియు నైదుధర్మములు గలవు. అందు ధర్మబుద్ధిచేఁ జేయబడినక్రియ స్వధర్మమునకు హానిఁగలిగించినచో విధర్మమనఁబడును. క్షత్త్రియాదులచేఁ జోదితమగు బ్రాహ్మణుల ధర్మము పరధర్మ మనఁబడును. వేదవిరుద్ధమగునది యుప

ధర్మమనియుఁ బాషండమనియుఁ జెప్పఁబడును. పరవంచనార్థ మవలంబించినది దాంభిక ధర్మ మనఁబడును. నాల్గాశ్రమముల కంటెను వేఱయినది యాభాస మనిపించుకొను. ఈ యైదుధర్మములును నధర్మవృక్షమునకు శాఖలవంటివి. కావున ధర్మజ్ఞుఁడగువాఁడు వానినిఁ దప్పక విసర్జింపవలయు. బ్రాహ్మణాదుల స్వభావమున కనుగుణముగా విహితము లయిన యాగాదులే మనశ్శాంతిని గల్గించును గాని పరధర్మము లెంతమాత్రము నట్లు చేయఁజాలవు. నిర్ధనుఁ డగుపురుషుఁడు సద్ధర్మాచరణము నిమిత్తమైనను ధన మపేక్షింపరాదు. కాశ్యాది తీర్థయాత్రల నిమిత్తమైనను ధనమును గోరరాదు. దైవప్రాప్తమగుదానిని మాత్రమే భక్షించి సంతుష్టిం జెందు మహాసర్పంబువలె, దైవలబ్ధమగుదానివలననే ప్రాణములఁదాల్చి వర్తించువానికి నిష్కామనయె మిక్కిలి సుఖకరమగు వృత్తిసుమా! నిష్కాముఁడును, నిత్యసంతుష్టుఁడును, నాత్మారాముఁడును, నగువానికిఁ గల్గినంత సుఖము శబ్దాదివిషయసుఖముల కాశపడి తత్సంపాదనముకై దిక్కులందుఁ బరిభ్రమించువానికిఁ గలుగనేరదుగదా! పాదరక్షలను దాల్చినవానికీభూమియంతయుఁ జర్మమయమై కానవచ్చినట్లు, నిత్యసంతోషవంతున కన్నిదిక్కులును సుఖమయములయి యుండు. సంతుష్టుఁడగు మానవుఁడు కేవలము జలముతోనే జీవనము పుచ్చుచు, యాత్రను జేసి సుఖముగా రాఁగలఁడు. కావున నందులకై ధనాదులను యాచింపరాదు. అసంతుష్టిగలవాఁడు విషయసుఖలాభమునకై సర్వదా ప్రయత్నించుచు వానిఁ బొందలేక, దీనుఁడై కుక్కవలె నందఱచే నిందితుఁడై వర్తించును. బ్రాహ్మణుఁ డసంతుష్టుఁడైనచో వాని బ్రహ్మవర్చసము, శాస్త్ర

జ్ఞానము, దపము, ప్రఖ్యాతియు, నింద్రియార్థాసక్తిచే జ్ఞానము వలెఁ, బూర్తిగా నశించును.లోభ మెట్టివానికినిఁ దగదు. లోభమునుమించిన దుర్గుణము వేఱొకటిలేదు. క్షుత్పిపాసలు నివర్తించినచోఁ గామము నివర్తించును. పరపీడనాదిరూప మయిన ఫలము లభించినతోడనే క్రోధముగూడ నశించును; కాని భూమండలమును, దిక్కులను జయించి భుజించినను లోభ ముపశమింపదు. ఓ ధరణీశా! పెక్కురుజనులు శాస్త్రజ్ఞానవంతులయ్యు, బహువిధము లగు లౌకికవైదికన్యాయము లెఱిఁగినవారయ్యు, సభాపతు లయ్యు, నసంతుష్టివలననే నరకకూపమునఁ బడిరి. కావున నేవిధముచేతనైనను గామాదులను జయించుట బుద్ధిమంతున కుచితము. భోగాదుల ననుభవింపవలెనన్నయిచ్ఛ లేనిచో శబ్దాదివిషయమగు కామమును సులభముగా జయింపవచ్చును. కామవిసర్జనమువలనఁ గ్రోధమును నిర్జింపవచ్చును. ధన మనర్థకారి యన్నతలంపుచే లోభమును విడువవచ్చు.చిదచిదీశ్వర యాథాత్మ్యజ్ఞానమువలన భయమును వదలవచ్చు. పుట్టినదెల్లఁ గిట్టునన్న యాలోచనమువలన శోకమోహములను, మహాత్ములసేవవలన దంభమును, మౌనముచే యోగమున కంతరాయభూతములగు లోకవార్తాదులను, దేహాదులందలి నిస్స్పృహచేత హింసను విసర్జింపవచ్చు. ఆధిభౌతికదుఃఖంబును గారుణ్యముచేతను, నాధిదైవికతాపమును మనస్సమాధానముచేతను, నాధ్యాత్మికదుఃఖమును యోగబలముచేతను, నిద్రను సాత్త్వికాహారముచేతను,రజస్తమస్సులనుసత్త్వగుణముచేతను, సత్త్వగుణమగునంతఃకరణమును నుపశమముచేతను,గామాది రూపమగు సమస్తదుర్గుణములను గురుభక్తిచేతను, సులభము

గా జయింపవచ్చు. జ్ఞానప్రదీపము నొసంగి యజ్ఞానతిమిరమును దొలఁగించు భగవంతునియందు మానవుఁ డనుబుద్ధి నెవ్వఁడుంచునో, యాపురుషుని యధ్యయనము కామాదిజయము, గజస్నానాదులవలె నిష్ఫలము లగును. ఈ శ్రీకృష్ణుఁడు ప్రకృతిపురుషుల కధిపతియై యోగీశ్వరులచే మృగ్యములగు పాదారవిందములు గలవాఁడై యుండఁగా, నది తెలియక లోకులు వెక్కండ్రు నరుండని తలంచుచున్నారు. మఱియు నింద్రియజయమే ముఖ్యప్రయోజనముగాఁ గల్గుధర్మములు మనస్సుతోఁగూడిన యింద్రియముల నియమింపఁజాలినవయినను, ధారణను ధ్యానమును సమాధిని సాధింపలేనిచోఁ గేవలము శ్రమావహములే సుమా ? అట్లే యజనాదివృత్తి ధర్మంబులు గూడఁ గేవలము యోగానుష్ఠానము నిమిత్తమే యగుజీవనమును బోషింపఁజాలనిచో,నవి నఫలములగుటయేకాక యనర్థకారు లగును. యోగమునే ముఖ్యముగాఁ దలంపని పురుషుని స్మార్తాదికర్మములును యాగాదికర్మములును ననర్థదాయకములే యగును. ఎవఁడు మనంబును జయింప సమర్థుఁ డగునో,వాఁడు దారసుతాదుల సంగమమును విడిచి తనశరీరమునుమాత్రమునే మిగుల్చుకొని భిక్షువై యసహాయుఁడై నిర్జనప్రదేశమున నివసించుచు,భిక్షవలన లబ్ధమగు నన్నమును మితముగా భక్షించుచుఁ బవిత్రమగు సమప్రదేశమునఁ జాంచల్యరహితుఁడయి సుఖోపవిష్టుండై శరీరమును దిటగాఁజేసి ప్రణవమును జపింపవలయును. పిమ్మటవాఁడు,పూరకము కుంభకము, రేచకము నాఁబడు ప్రాణాయామములచేఁ బ్రాణాపానముల నిరోధించి మనస్సు శబ్దాదివిషయములనుండి మరలి నిశ్చల మగునంతవఱకును

నాసాగ్రమున దృష్టినుంపవలెను. మఱియు బుధుఁడు శబ్దాది విషయములచే మన ముపహతమై సంచరించుచు నేయేవిషయ మునుగూర్చి పర్విడునో, యాయావిషయములనుండి బలాత్కార మున దాని మరలించి శుభాశ్రయమగు హృదయస్థానమున నిరోధింపవలయు. ఇట్లు ప్రతిదినమును జిత్తనిరోధమును జేయు చుండినచో, స్వల్పకాలములో నది జ్వాలాదులులేని యగ్నివలె వెలుపటికిఁ బ్రసరింపఁజాలదు. కామాదులచే నాక్రాంతము గాక పోవుటంజేసి నిఖిలవ్యాపారములను వదలియున్న చిత్తము బ్రహ్మానుభవసుఖమం దాసక్తమైనచో నిఁక నెప్పటికి నందుండి మగిడి రాఁజాలదు. ఎవఁడు సన్న్యసించియు ధర్మార్థకామరూప మగు త్రివర్గమును సేవించునో, త్రపాహీనుఁడగు నాపురుషుఁడు గ్రక్కఁబడిన యన్నమువలె నిందనీయుఁడని తెలిసికొమ్ము. కొం దఱు తమతమ దేహ మాత్మ గాదనియుఁ, గొంతకాలమునకు దేహము పురువులుపట్టి భస్మీభూతమై నశించునుగాని స్థిరముగా నుండదనియు మొట్టమొదటనే యెఱిఁగియుఁ బరివ్రాజకులయి పిమ్మట దేహమునే యాత్మనుగా భావించి శ్లాఘించుచున్నారు. అకటా! వారు కేవల మవివేకులుగదా! వర్ణాశ్రమోచితములగు క్రియలను వదలిన గృహస్థుండును, గురుకులవాసాదిరూపమగు వ్రతమును విడిచిన బ్రహ్మచారియు, గ్రామములందు నివసించు వానప్రస్థుండును, నింద్రియలోలత్వమును వదలనేరని సన్న్యా సియు, నధమాధము లని యెఱుఁగుము. ఇట్లు దంభమునకై యా శ్రమముల విడంబించుచున్న యానికృష్టుల కాశ్రమసిద్ధియెంత మాత్రమును లభింపనేరదు. అక్కటా! భగవన్మాయామోహి తులగు నామూఢులు మిక్కిలి శోచనీయులు గదా! అట్టి

మూఢులకే యింద్రియలోలత్వము సంభవించునుగాని జ్ఞానముచేఁ బరిశుద్ధమగు నంతఃకరణముగల్గి ప్రకృతిపురుషవిలక్షణుఁడయినయాత్మను విమర్శించువాని కెంతమాత్రమును సంభవింపదు. అట్టివాఁడు నిరతిశయమగు బ్రహ్మానందసుఖమునకే యత్నించునుగాని హీనమగు దేహమును బోషించి, దానివలన సుఖ మనుభవింపవలయు నని కోరఁడు. ఓధర్మరాజా ! పండితులు శరీరము రథమనియు,నింద్రియములు తురంగములనియు, నింద్రియాధిపతి యగుమనస్సు త్రాడనియు, బుద్ధిసూతుఁడనియు, శబ్దాదివిషయములు మార్గము లనియు, బలము రథకూబరమనియుఁ, బ్రాణాపాన వ్యానోదాన సమానములును, నాగము కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము నాఁబడు ప్రాణదశకము నిరుసునుగాను, బుణ్యాపాపములను జక్రములనుగాను, దేహాభిమానముగల జీవుని రథినిఁగాను, బ్రణవమును విల్లునమ్ములుగాను, బరమాత్మను లక్ష్యమునుగాను, జెప్పుచున్నారు. రాగము, ద్వేషము, లోభము. శోకము, మోహము, భయము, మదము, మానము, తిరస్కారము, అసూయ. వంచనము, భూతద్రోహము, మచ్చరము, క్రోధము, ప్రమాదము, క్షుత్తు, నిద్ర మొదలగువానిని శత్రువు లందురు. వారిలోఁ గొందఱు తమఃప్రకృతులు, కొందఱురజఃప్రకృతులు, కొందఱుసత్వప్రకృతులు గలరు. శరీరరూప మగురథము తనకధీనమై వర్తించినపుడే పురుషుఁడు మహాత్మసేవవలన లబ్ధమగు జ్ఞానఖడ్గమును దాల్చి, రాగద్వేషాదిశత్రువులనుగూల్చి, భగవంతుఁడను బలమునుబొంది నిర్మలచిత్తుఁడై ముక్తిసంపద నొంది సంతుష్టుఁడై శరీరరథమును బరిత్యజించుచున్నాఁడు. దేహి మదించి యట్లు

చేయలేనివాఁడుబుద్ధియను సూతుఁడును, నింద్రియాశ్వములును వానిని బ్రవృత్తిమార్గమునఁ గొనిపోయి దొంగవలెఁ బొంచి యున్న విషయములపాలు సేయుదురు. అప్పుడు విషయముల నెడి, యాచోరులు హయములతోను,సూతునితోను వానిఁగొని పోఁగు యంధతామిస్రమను నరకకూపమువంటి సంసారమునఁ ద్రోయుదురు. ఓధర్మరాజా ! వేదవిహిత మగుకర్మము రెండు విధములు. అందొకటి ప్రవృత్తికర్మము. రెండవది నివృత్తికర్మము.ప్రవృత్తికర్మము లోకాంతరములను బొందించి యచ్చట స్వీయకర్మానుభవములను గల్గించు. నివృత్తి శాశ్వతమగుముక్తిని గల్గించు. వానిని విభజించి చెప్పెదను విను. అగ్నిహోత్రాది కర్మములును, దర్శపూర్ణమాసములం దొనర్చు క్రియలును, జాతుర్మాస్యమును, బశుయాగమ్మును, సోమయాగంబును, వైశ్వదేవంబును, బలిహరణంబును, మొదలగు కామ్యకర్మములును దేవాలయనిర్మాణము,వనప్రతిష్ఠ,కూపతటాకాదిప్రతిష్ఠ మొదలగునవియుఁ బ్రవృత్తికర్మములు. ఇవియే నిష్కామనతో నాచరింపఁబడినపుడు నివృత్తికర్మము,లగును. ప్రవృత్తి ధర్మపరాయణుఁ డగువాఁడు సూక్ష్మావస్థను బొందిన పృథివ్యాదిభూతములతోఁగూడి, మొదట ధూమమునుబొంది పిమ్మట రాత్రిని, కృష్ణపక్షమును, దక్షిణాయనమును, బితృలోకమును, నాకాశమును గ్రమముగా నతిక్రమించి, చంద్రలోకమును బొంది, తానొనర్చిన యిష్టాపూర్తాది కర్మఫలమనుభవించి, చంద్రకళాక్షయమయినతోడనే యటనుండి కదలి యాకాశమును, వాయువును, ధూమమును, మేఘమును, వర్షమును, నోషధులను, నన్నమును, రేతస్సును, గ్రమముగాఁజెంది మగుడ నీలోకమునకు

దిగివచ్చి పుట్టి గర్భాధానము మొదలు శ్మశానాంతముదాఁకఁ గల్గు సంస్కారములచే సంస్కృతుఁడై ద్విజుఁడగుచున్నాఁడు. ఇట్లు పోయివచ్చుటకే పితృయానమందురు. ఇఁక నివృత్తికర్మములవారిగతిని జెప్పెద నాలింపుము. నివృత్తిధర్మపరాయణుఁడు,జ్ఞానప్రదీపకములగు చక్షురాదీంద్రియములందుఁ గర్మేంద్రియవ్యాపారములను,నాజ్ఞానేంద్రియములను సంకల్పవికల్పాత్మకమగు మనస్సునందును, దానిని శాస్త్రాత్మికమగు వాక్కునందును, దానిని వర్ణసమామ్నాయమందును, దాని నోంకారమందును, దానిని బిందునాదమందును, దానిఁ బ్రాణమందును దానినిఁ దత్సహచారియగు జీవునందును, జీవునిఁ బరమాత్మయందును సమర్పింపవలయును. అట్టివాఁడు ముందుగా నగ్నినిఁ బిమ్మటఁ బగటిని శుక్లపక్షమును, నుత్తరాయణమును, సంవత్సరమును, సూర్యునిఁ, జంద్రుని,విద్యుత్తును, వరుణుని, నింద్రుని, విరాట్టును గ్రమముగాఁ బొందును.ముముక్షు వీచెప్పిన యర్చిరాదిగమనముచే ముక్తిచెందును. దీనికే దేవయానమనియు నామముగలదు. పరమాత్మోపాసకుఁడు క్రమముగా నీ యర్చిరాదులను బొంది పూర్తిగాఁ బ్రకృతి నతిక్రమించి యపహతపాప్మత్వాదు లగు నష్టగుణములనుజెంది మగుడ జన్మమరణాదిరూపమగు సంసారమునకు రాఁడు. ఓధర్మనందనా ! వేదబోధితము లగు నీదేవయానపితృయానములను జక్కఁగా శాస్త్రదృష్టిచేఁ దెలిసికొనువాఁ డెప్పుడును మోహమునందఁడు. భగవంతునిఁ బొందు మార్గము నుపదేశించితిని. ఇఁకఁ బ్రాప్యుఁ డగుపరమేశ్వరస్వరూపమును జెప్పెదను వినుము. భగవంతుఁడు సృష్టికాదియందును, ప్రళయమందును, మధ్యభాగముననున్న జనుల

యంతర్బహిర్భాగములందును, వర్తించుచున్నాఁడు. స్వల్ప వస్తువుగాని పెద్దవస్తువుగాని జ్ఞానాత్మక మగుజీవస్వరూపము గాని యచిద్వస్తువుగాని పెక్కేల నామరూపాత్మకమగు సర్వ వస్తువులును, మూలప్రకృతియు, సమష్టిజీవుఁడును, బరమాత్మ స్వరూపమేకాని వేఱుకాదు.దృశ్యమగు దేహాదికమును, శబ్దాది గ్రహణార్హ మగునింద్రియజాతమును, మొదట నిత్యములగు చున్నట్లు గానవచ్చుచున్నను, జ్ఞానావస్థయందలి యపురుషార్థ ములనియు, నాత్మధర్మాదులగు నిత్యత్వాదులందుఁ గానరాక పోవుటచే నశ్వరము లనియు నిశ్చయింపఁబడుచున్నవి. ఓధర్మ రాజా! పృథివీపరిణామరూపము లగువృక్షములకును వానినీడ కును గలసంబంధ మేమి? ఆనీడ వృక్షశాఖసమూహంబును గాదు. ఆవృక్షవికారమునుగాదు. ఆవృక్షమును విడిచి ప్రత్యేక ముగా నుండునదియునుగాదు. అది కేవల మనిత్యమైనది. అట్లె యీ శరీర మాత్మనీడవంటిది. ఈశరీరమాత్మసంఘాతంబును గాదు. ఆత్మవికారంబునుగాదు. ఆత్మను విడిచియుండునదియుఁ గాదు. ఇది యనిత్యమగుటవలన నాత్మయుండునంతకాల ముం డునదియుఁగాదు.మఱియొకటి వినుము.గంధాదితన్మాత్ర లవయవ ములు.వానిచే నేర్పడినపృథివ్యాదులవయవులు.అవయవములగు తన్మాత్రలు నశించినచో నవయవులు పృథివ్యాదులును నశించు చున్నవి.దీనివలనఁ బృథివ్యాదు లనిత్యములయినట్టు దృఢపడియెఁ గదా! అట్లె పంచభూతముల భాగములచే నేర్పడిన శరీర మవయవి యగుటచే ననిత్యమని తెలిసికొనుము. ఇట్లనిత్య మగు నిది నిత్యమగు నాత్మయెట్లగును? శరీర మాత్మకానిచో నేను స్థూలుఁడననెడిప్రతీతి యెట్లు కలుగుచున్నది యని యడుగ

వచ్చును. అది కేవలము భ్రాంతియే కాని వేఱు కాదు. ఒకఁడు స్వప్నావస్థయందె నిద్రించినట్టును మేల్కనినట్లును గలలోఁ గాంచుచున్నాఁడు. వాస్తవముగా మేల్కన్నపిమ్మట వెనుకటి బోధలు నిద్రలు భ్రాంతిమూలకము లని తెలిసికొనుచున్నాఁడు. అట్లె శరీరాత్మలు సర్వదా కలిసియున్నందున నాత్మయందలి జ్ఞానాదిగుణముల దేహమం దారోపించి దేహాత్మలొక్కటియేయని తలంచును; కాని యాత్మజ్ఞానము లభించినపిమ్మట నాప్రతీతి భ్రాంతిమూలకమని తెలిసికొనక మానఁడు. ఓయీ! దేహాత్మల కభేదమని తోఁపించు "నేను స్థూలుఁడ" ననెడి ప్రతీతియే భ్రాంతిజనకమయిన నీకుఁ బ్రమాణవిషయకమగున దేదియని యందువేని శాస్త్రానుమతమగు నద్వైతమే విశ్వసింపఁ దగినదికాని ప్రతీతివలన వచ్చునదియట్లుకాదు. భావాద్వైతము, క్రియాద్వైతము, ద్రవ్యాద్వైతమనునవి శాస్త్రానుమతములయినవి. కార్యకారణములగు పటతంతువులకుఁబలె జగమునకు సూక్ష్మచిదచిద్విశిష్ట మగుబ్రహ్మమునకు నైక్యదర్శనము భావాద్వైతమనఁబడు. తానొనర్చిన సత్కార్యములనెల్లఁ ద్రికరణశుద్ధిగా భగవంతునికి సమర్పించుటయే ముఖ్యఫలమనుకొనుట కర్మాద్వైతమనఁబడు. ధనము, భోగసాధనములు భోగస్థానములును స్వీయభార్యాదులును, సమస్తభోక్తలకు సామాన్యములేయని తలంచుట ద్రవ్యాద్వైతమనఁబడును. శాస్త్రానుమతములగు నీ యద్వైతములను మనంబునఁ బాటించి పరమాత్మోపాసకుఁ డగుపండితుఁడు జగదుపాదానభూత మగుచిదచిద్విశిష్ట మగుబ్రహ్మముకంటె నన్యవస్తువు కలదనెడిభ్రాంతిని, కర్మములకు భగవత్ప్రీతిగాక మఱియొక స్వతంత్ర ఫలము గలదనెడి

భ్రాంతిని, స్వీయధనగృహాదు లాత్మజాయాదుల కందఱకుం గాక తనకొక్కనికే యనుభవింపఁదగిన వనుకొనెడి భ్రాంతిని, స్వాత్మయాథాత్మ్యానుభవముచే నిరసించుచున్నాఁడు. కాన భావాద్వైతాది భ్రాంతులవలె దేహాత్మలభిన్నము లయినవను భ్రాంతియు నిరసింపఁదగినది. ఓధర్మరాజా! ఈ యద్వైతత్రయము నే కాదు. ఏపురుషున కేవస్తువునకును, నేశాస్త్రముచే నేవస్తువు సకాశమువలన నే యద్వైత మనుమతింపఁబడుచున్నదో, దాని ననుసంధానము చేసికొనియే కర్తవ్యము లగుకర్మముల నాచరింపవలెను.అంతియ కాని జ్ఞానదశయందు వర్తించువాఁడు శాస్త్రానుమతముకాని యద్వైతము ననుసంధానము చేసికొని కార్యముఁ లాచరింపఁ జనదు. ఓధర్మరాజా! వేదోక్తములగు నీభావాద్వైతాదుల ననుసంధానముచేయుటచేతను, దేహమునకును, జీవునకును,నీశ్వరునకును బరస్పరమును భేద మనుసంధానము చేయుటచేతను, దమతమ వర్ణాశ్రమములకు యుక్తము లగుకర్మముల నాచరించుటచేతను భగవంతునియందుభక్తిని నెలకొల్పుకొన్నచో గృహస్థుఁడైనను ముక్తినిఁ జెందును. ఓ రాజా! నీవు "మావంటి మూఢబుద్ధు లెట్లు తరింతు"రని యడిగితివి. నీ వట్లడుగవలసినపనిలేదు. సర్వశక్తియగు శ్రీకృష్ణుఁడు మాకుఁ బ్రాపకుఁడయి యున్నాఁడు. అతని దయవలననే మీరు సమస్తాపదలను సులభముగాఁ దరింపఁ గలిగితిరి. ఆభగవంతుని దయవలననే నీవుసకలదిక్కులను జయించితివి. మహర్షిసహాయుండవై దుష్కరమగుయాగముల నాచరించితివి.అట్లయిఁక మీఁద నతనిసేవవలననే ముక్తుఁడవు కాఁగలవు. నీకేమికొఱంత? నేను ... పిన కల్పమందుపబర్హణుఁడను గంధర్వుఁడనై పుట్టి గంధ

ర్వులకందఱకు ననుకూలుఁడనై వర్తించితిని. ఇట్లు పురుషులగు గంధర్వులకే గాదు. సౌందర్యముచేతను, సౌకుమార్యము చేతను, ధరించిన చందనాదులచేతను, స్త్రీలకుఁగూడఁ బ్రియతముఁడనై మిక్కిలి మదించి విషయాసక్తుఁడనై యుంటిని. ఇట్లుండ నొకప్పుడు ప్రజాపతులు బ్రహ్మసత్రము చేయుచుండత్స మయమున హరిచరిత్రములను బాడుటకై యచ్చరలనుబిలిచిరి. అది నేఁ దెలిసికొని స్త్రీపరివృతుఁడనై యచ్చటికేఁగి హరిచరిత్రములనుగాక తక్కినవానిఁ బాడితిని. ఆప్రజాపతులు నా చేయుచున్న హేళనమును దెలిసికొని, కినిసి "గంధర్వరూపము వదలి శూద్రుఁడవయి పుట్టుదువుగాక" యని తమ తపోబలంబున శపించిరి. ఆకారణమున నేను దాసీపుత్రుఁడనై పుట్టి యాజన్మ మందే మహాత్ములను సేవించి యీకల్పమునఁ బ్రహ్మకుమారుఁడనై జన్మించితి. ఇట్టి నావంటివాఁడే మహాత్ముల సేవవలన నింత వాఁడనై యుండఁగా భగవంతుఁడగు కృష్ణుని సర్వదా సేవించి యతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడ వగు నీవంటివాఁడు ముక్తిఁజెందుటలో సందియ మేమున్నది? ఓరాజా! ఏవి పాప నాశనమును జేయునో, వేని నాచరించి గృహస్థుఁడు ముక్తిని గాంచునో, యాగృహస్థధర్మములను నీ కుపదేశించితిని. ఓనరేంద్రా! లోకపావను లయినమునీంద్రులు నీగృహంబున కరుదెంచుచున్నారు. మాయామానుషవిగ్రహముఁ దాల్చిన పరమాత్మయే యగు శ్రీకృష్ణుఁడు నీయింట నివసించుచున్నాఁడు. బ్రహ్మాదులచే వెదకఁబడువాఁడును, నిర్వాణసుఖస్వరూపుఁడును, బరమేశ్వరుండును నగు శ్రీకృష్ణుఁడు, మీకుఁ బ్రియుఁడై స్నేహితుఁడై మేనమఱందివై పూజనీయుఁడై కార్యనిర్వాహకుఁ డై హి...



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B116 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 365 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | VI,1064B,1107,1156A,1228A,1252B |
| లేని పేజీలు | 1A0 1010 |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |

BLANKS=1260A,1284A